శ్రీరామచంద్రాయనమః.

# పంచరత్నములు.



సీ. ఘనులజీవితములు ♦ కల్పించు నెయ్యెది
యాంధ్రజాతికి విద్య ♦ యతిశయిల్లఁ
జిత్రకావ్యంబులు ♦ సృజియించు నెయ్యెది
యాంధ్రజాతికి విద్య ♦ యతిశయిల్ల
వాస్తుశాస్త్రంబులు ♦ ప్రచురించు నెయ్యెది
యాంధ్రజాతికి విద్య ♦ యతిశయిల్ల
ప్రకృతికళాంశముల్ ♦ ప్రకటించు నెయ్యెది
యాంధ్రజాతికి విద్య ♦ యతిశయిల్ల
అట్టి బహులవిద్యాప్రద♦మై తనర్చు
'నాంధ్రభాషాభివర్ధని' ♦ యనెడుసంఘ
మర్థి స్థాపించు నట్టికృ♦తార్థులు చిర
కీర్తులై మించుఁగాక మా♦కృష్ణుకరుణ.

ర్తించిన సంఘము పూర్వకార్యదర్శియు హైకోర్టువకీలు నగు వేమవరపు రామదాసుపంతులుగారికిని బడంపడి అతిశీఘ్రకాలములో నీగ్రంథమును చక్కఁగ నచ్చొత్తించిన మెసర్సు వావిళ్ల, రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారికిని భాషాభిమానులగు తక్కుఁగల బందరుసంఘకార్యనిర్వాహకులకును వినయపూర్వకముగాఁ గృతజ్ఞతాసూచకవందనము లర్పించుచున్నాను.

తే. ఇందుఁ గల్గినదోషంబు • లెల్ల మాని
గుణము లౌదలఁ గొనుఁడు మ్రొ • క్కుదును మీకు
లోకశంకరులార సు • శ్లోకులార
సరసమతులార విద్యాప్ర • చారులార.

తే. కలిని బంచసహస్రాబ్ద • ములు గడచిన
పిదప వచ్చుసాధారణఁ • బేర్మి నీప్ర
భావతీచిత్రకావ్యంబు • వ్రాసినాఁడు
గాదెకులజుండు శ్రీజగ • న్నాథమూర్తి.

బరంపురము
28-6-1911

బుధవిధేయుఁడు,
గాదె, శ్రీజగన్నాథస్వామి.

వెంటనే ముహూర్తముపెట్టి ♦ పెండ్లి చేస్న
పట్టణమునఁ గావింతము ♦ వైభవముగ.

క. కలవారియింటికంటెను
బలగము గలవారియింటఁ ♦ బడివేయుట నెం
దులకును మంచిది యని పె
ద్ద లంద్రు మీసంఘు మెట్లుఁ ♦ దగు మాసుతకున్.

ఉ. ఎంచగ మా ప్రభావతి య♦హీనగుణాకర సాధ్వియాటచేఁ
గొంచెముదిద్దనేర్చినను♦గోలయు బేలయుఁగాక యెందువ
ర్తించు సుశీలయై సకల♦ధీరజనస్తుతయై రహించు గ
ల్పించును జే ర్పృతిష్ఠ యొగిఁ ♦ బెంచెడువారికిఁ గాం
చువారికిన్.

గీ. 'ఆంధ్రభాషాభివర్ధని' ♦ యనెడుపేర
గాలుసంఘము కార్యని♦ర్వాహకులకు
రహి సమర్పించె నీపంచ♦రత్నములను
గాదెకులజుండు శ్రీజగన్నాథసుకవి.

మిత్రవిజ్ఞాపనము.

చ. నిరుపమదేశభక్తియును ♦ నిశ్చలబుద్ధియు ధర్మసక్తియున్
సరసవచోవిలాసతయు ♦ శాస్త్రవిధేయతఁ గీర్తిలోలతన్
గురుతరచాతురీగరిమఁ ♦ గోవిదభావముఁ గల్గి మించు వే
మ్వరకులరామదాసకృతి♦మామకప్రార్థనచిత్తగింపుఁడీ.

గీ. ఆర్య వెస మీరె సవరించి ♦ యస్మదీయ
పుస్తకము నచ్చువేయింపఁ ♦ బూనుకొందు
మంచు వాగ్దాన మాదిఁ గా♦వించుకతన
నెసఁగుచున్నాఁడ గ్రంథ మే ♦ నొప్పుదలను.

గీ. ఆడితప్పనిమీాబోటి • యార్యులకును
దిరుగఁ జెప్ప టంతగ నవ•సరమె లేదు
కాని ప్రస్తుత మీారలు • కార్యదర్శి
పదము వదలుట నిటు చెప్ప•వలసివచ్చె.

గీ. మనకు బృందావనపురి సం•ప్రాప్తమైన
స్నేహ మెన్నటి కిటువలె • స్థిరముగాఁగ
నుండవలె నని యేకోరు•చుంటి వేమ
వరపుకులరామదాస ధీ•వరవిధేయ.

ఆర్యులారా!

ప్రస్తుతకాలంబునఁ బండితాభిప్రాయములందును యోగ్యతాపత్రికలందు విలువ చాలఁదగ్గిపోయినదనుమాట నే నెఱుంగకపోలేదుకాని వానికిఁ దగినవిలువ వానికి నుండు ననియెంచి నమోనాకు (మచ్చుకు) గా నొకరిద్దఱియభిప్రాయములమాత్ర మిందు పొందుపఱచుచున్నాను.

పండితాభిప్రాయములు.

శ్రీగాదె జగన్నాథస్వామిపంతులుగారు రచించినప్రభావతి యనునీవచనప్రబంధమును జాలవఱకు నేనుజూచియుంటిని. వీరికి సనాతనాచారములం దభిమానము ననురాగము మెండు. అది సూచించుచు నీగ్రంథము వ్రాయఁబడిన ట్లూహింపనై యున్నది. నే వినినంతవఱకుఁ గథాసందర్భ మనుకూలముగా నేయున్నది. శైలియుఁ జేలవముగా లేక నాతికఠినమ్మృదుమధురముగా నున్నది. వీరికి వచనరచన కిది యే ప్రథమప్రయత్నమైనను, ప్రస్తు

తము బయలుదేరుచున్న నవలల కీనవల తీసిపోవునది కాదని నా యభిప్రాయము. భాషాభిమానులిట్టిగ్రంథములు వ్రాసినవారికిఁ బ్రోత్సాహము గల్గించి మఱికొన్నిగ్రంథములు వ్రాయింపఁ జేయఁగలరని నమ్ముచున్నాఁడను.

28-12-10<br>
రాజమంద్రి.

ఇట్లు,<br>
కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

---

The public has already had a specimen of Mr. Gade Jagannadhaswami Pantulu's Telugu scholarship in his lucid metrical translation of Mukundamala. He has now come forward with a Telugu novel and has chosen a page from Maharatta history for his plot. The author shows a close acquaintance with historical facts and has made few departures from them. The cause of differences between Sivaji and the Sultan of Bijapur and their consequent reconciliation is very skilfully explained. Certain passages in the work bear out a striking resemblance to the sentences of Ranade. In fact the author seems to have studied Ranade's Work on the subject and has kept throughout his own the spirit of that Great Indian. The novel is quite in accordance with modern taste. It is laid out on the lines of an English novel and is one of the few works where an attempt is made to be guided by western

canonsof criticism. The attempt, I am inclined to think, has been to a great extent successful. The several characters therein, especially those of Sivaji and Pujari incognito, have been happily developed. Sivaji is represented throughout as a patriot of a very high order, with no motive for his activity but the welfare of his country. The author followed Ranade in taking great pains to root out and dispel the popular notion that the Mahrattas are a set of freebooters with no aim other than plunder, that the greatest of them was only an audacions leader of a marauding host. The dialogues between Sivaji and his mother, between Sivaji and Panthoji, unravel to a great extent the patriotic nature of Sivaji's work. There are here and there a few touches of religious sentiment. The conversations of Ramados are a store house of wisdom. Tho author has sometimes shown an originality of thought in his descriptions. The strikingly beautiful description of sunset on the eve of Fazil's death may be cited as an instance. The plot, though long and complicated, is interesting to the end. The style too seems to be simple enough and the work easily intelligible even to a student of the High School standard. The novel deserves good encouragement from everyone that has at heart the progress and improvement of Telugu Literature.

BERHAMPORE, 18th Nov. 1910.

B. NARASIMHASWAMI, B.A.B.L.



శ్రీరస్తు.

శ్రీమతే రామకృష్ణాయనమః.

---

# ప్రభావతి.

## మొదటి ప్రకరణము.

శ్రీమద్భరతఖండంబునఁ జెలువొందు పశ్చిమసముద్రతీరమునఁ గోంకణదేశముగలదు. ఆజనాంతంబున నుత్తరంబునుండి దక్షిణంబుదనుక గొలుసువలె నల్లిబిల్లియై వ్యాపించిన గొప్పపర్వతపంక్తి యలరారుచుండును. ప్రతివర్షంబున సంభవించు బలవత్తరమైన తుపానులవలనఁ జెలరేగి మిక్కిలి యల్లకల్లోలముగానుండు యవనవనధిపొంగి పొర్లకుండఁజేయుటకై దైవనిర్మితంబైనచెలియలికట్టయోయన నాగట్టులమట్టువార్ధివఱకు వ్యాపించియుండును. ఆయద్రిపంక్తి యత్యున్నతంబైన శిఖరములవలనను గౌతమీ కృష్ణా వేణీ ముఖ్యమహానదులకు జన్మస్థలమగుటవలనను హిందూస్థానమున రెండవహిమవత్పర్వతశ్రేణిమాడ్కి నెంతయు విరాజిల్లుచుండు. కాని తదుపరిభాగము హిమాచలమువలె మంచుచేఁ గప్పఁబడక నానావిధవృక్షసందోహమునకు బహువిధపక్షిసంతానంబునకు నాటపట్టగుటయేకాక సమశీతోష్ణాదిస్థితులచేఁ బాలింపఁబడుటవలన నెటఁజూచినను నందనోపవనతుల్యంబగు నుద్యానవనంబులుగల్గి రమ్యంబై సకలజంతునివాసయోగ్యంబై చూపఱకుఁ గనుపండువుచేయుచుండును. ఈపర్వతపంక్తి దక్షిణభాగంబు మలయాభిఖ్యతోడను నుత్తరభాగము సహ్యానామంబుతోడ నొప్పుచుండు. ఆహా! అందీసహ్యాద్రిపంక్తిమహిమ యేమని నుతింపవచ్చును? హిందూరాజ్యలక్ష్మి బలాత్కారముగాఁ బరిగ్రహించిన ప్రచండమహమ్మ

దీయులతోఁ దలపడి యిన్నూరుసంవత్సరంబులు హోరాహోరిగాఁ బోరాడి భారతులకు సుఖజీవనముకల్పించిన శూరాగ్రేసరులగు మహారాష్ట్రకేసరులకు జన్మస్థానమై తదీయపాలనమున మిక్కిలి వైభవముగాంచెను. స్వభావసిద్ధముగా నీకనుమలచరియలలో నేర్పడిన శత్రుదుర్భేద్యంబులగు వేనవేల దుర్గంబులను జతురంగబలాదులచే మఱింత దిట్టపఱచుకొని మరాటధీరులు నిజరాజ్యరక్షణము గావించుకొనుచుండిరి.

ఇట్టి దుర్గంబులనే యాకాలమువారు పట్టణంబులుగాను బల్లెలుగాను జేసికొని స్వాతంత్ర్యశ్రీ ననుభవించుచుండిరి. సహ్యాద్రిశ్రేణికిని బ్రాగ్భాగంబునఁ దులజాపురమను నొకగ్రామముండెను. దాని కాపేరందుండు దేవతఁబట్టియే వచ్చియుండనోపు. ఒకనాటి ప్రాతఃకాలంబున నొకబ్రాహ్మణుండు రుద్రాక్షమాలలు తనకంఠ మలంకరింపఁగా మోకాలుదిగని మాసినయొకయంగవస్త్రము దాల్చుకొనియాతులజాదుర్గకోవిలయరుగుమీఁదనధివసించియుండెను. ఆతండు బక్కపలచని యెఱ్ఱనిమేనును ముడుతలుపడినమోమును గల్గియుంటచే వయస్సు నిజముగాఁ బరార్థముదాటనివాఁడయ్యు షష్టివర్ష వయస్కుండువోలెఁ జూపట్టుచుండెను. అప్పుడే నిద్దురనుండి లేచినవాఁడౌటచేతనో మఱేకారణముచేతనోకాని యాతనిముఖంబు దైన్యముద్ర వహించియుండెను. ప్రభాతకాలము సాత్త్వికకాలమౌటవలన నెల్లప్రాణులకు నుత్సాహదాయియై యేరికార్యములలో వారిని బ్రవేశపెట్టు మహోపకారియయ్యును నాటిదిన మాగ్రామస్థుల నట్లుచేయలేకుంటఁజేసి యాయూరేమియు సందడిలేక యత్తఱి నడురేయిగతి నిశ్శబ్దముగానుండెను. ఇట్లు పాడారుచుండిన యూరిమధ్యమునఁగల యాలయములోఁ గూర్చుండిన యాపాఱుండు తనలోఁ దా నొక్కింతసేపేమో గొణగుకొనుచుఁ బదంపడి యిట్లు విలపింపఁదొడంగెను. "హా! పుత్రమాత్రా! ఎంతచేసితే! యుపకారం బొనరించిననా కిట్టియిక్కట్టు రాఁజెల్లునే? పరభృతకుమారికఁ గాపాడిన దోషంబునకు నాకుశిక్షయైనందులకు విచారింపను. కాని యిన్నిరో! ఏపాపమెఱుంగని గ్రామస్థులేల హింసింపఁబడవలె! ఔరా! తురుష్కులదౌర్జన్య మేమనిచెప్పఁగలను. నాపుత్రకళత్రంబుల గొంపోవుటకుఁ

బోడు పౌరుల ద్రవ్యంబుల హరించిరి. అనేక ధేనువులను వధించిరి. మఱియుఁ గొందఱిని బలాత్కారముగా బానిసలఁ జేసికొనఁ దీసికొనిపోయిరి. గోసాధువుల సంరక్షింపఁ బ్రతిజ్ఞ వట్టిన శివాజిమహారాజు పాలించుసీమలోనుండియు మా కీసంకటంబులు తప్పినవి కావుకదా! ధర్మకర్తయు ధర్మరక్షకుండు నగు భగవంతుండే కలికధీనుండై ధర్మవిధ్వంసకులపట్ల నుపేక్షించుచుండఁగా శివాజిరా జేమిచేయఁగలఁడు? అక్కటా! నాదారతనూజులు దక్కుదురే! ఇంకను వారిసంయోగంబు సిద్ధించునే! మావారు పరులపాలైననుసరే రామోజి కుటుంబమైనను సురక్షితముగాఁ బోఁగలదో లేదో? హా! తులజామాతా! నీ విట్లు పరిభవింపఁబడుట కె ట్లొప్పుకొంటివోకదా? జగజ్జననియగు నిన్ను నీవే రక్షించుకోలేనితఱి మమ్ముగాపాడకుంటివన్న నేమిప్రయోజనము? మహిషాసురభండాసురాదులను నిర్మూలింపఁ జేసిననీ కీయావనబలం బెంత? శ్రీకృష్ణనిర్యాణానంతరమున నర్జునుండు ద్వారకావాసుల నెల్లఁ గిరాతులబారినుండి తప్పింపఁగలిగెనే? కాలము ప్రతికూలముగా నున్నసమయమున నెంతటిఘనులైనను నీచులచేతిలోఁజిక్కి చిక్కులువడుదురుకదా! తల్లీ! మావలెనే నీవు కూడ గాలాధీనురాలవౌట కరం బచ్చెరువుగానున్నది. ఇంతకు మాకర్మమిట్టు లుండ నెవ్వారి నేమన్న నేమి లాభము? భక్తిశ్రద్ధలతో నిన్ను జిరకాలంబునుండి పూజించుచు వచ్చినదానికి నిదియా ప్రతిఫలము? ఓహో! ఇంక నాభార్యాకుమారులకు దూరుండనై చచ్చినదాఁక నిట్లు కుందవలసినదేనా? అని యిట్లు శోకించుచుఁ బ్రక్కనున్న గోడపై జాఱఁబడి పెద్దనిట్టూర్పునిగిడించుతఱి నొక్కపాంథుఁ డయ్యరుగుదరికిఁ బ్రాపించి యిట్లు ప్రసంగింపఁ దొడంగెను.

బాటసారి—ఆర్యా! ఈ గ్రామము పేరేమి? తమ నామధేయమేమి? ఈ పాడుదేవళమువద్దనుంటకుఁ గతంబేమి?

పూజారి—ఈగ్రామమును దులజాపురమందురు. నే నీకోవెలపూజారిని. నా పేరు శంకరభట్టు.

బాటసారి—గుడిచూడఁ బాడుపడియున్నట్లున్నదే! దీనికి మీరు పూజారి ననుచున్నారు. నాకేమియు బోధపడకున్నది.

పూజారి—ఆర్యా! నిన్ననే యొకతురుష్క సేనాని తన యవన బలంబుతో వచ్చి యీ దేవళము నాశనముచేసి గ్రామస్థుల సర్వస్వము దోచుకొని పోయినాడు.

బాట—గోవిప్రకాంతాది సాధురక్షణ గావింప గంకణము కట్టుకొన్న శివాజిమహారాజు పాలించుచున్న దేశములోఁగూడ నిట్టియనర్థంబులు పుట్టుచున్నవికదా!

పూజారి—మాకర్మ మిట్టులుండఁగా నప్పహారా జేమి చేయఁగలఁడు? దేవళములు మాయించుచున్న పఠానులధాటికి గుడిలోనిదేవతలే భీతిల్లుచుండఁగా మనుష్యమాత్రుం డగు శివాజిప్రభు వేమిచేయఁగలఁడు? ఇంతకు నిది కలికాలముకదా!

బాట—అట్లనుట తగదు. అల్ల రామదాసు యోగీశ్వరునివలన శ్రీశివాజి ఛత్రపతి సాహసపరాక్రమంబులును ధైర్యస్థైర్యంబులు నాకర్ణించితిని. అదికాక సాక్షాచ్ఛివుఁడే సనాతనధర్మసంస్థాపనార్థమై శివాజిరూపముతో నవతరించినాఁడనియు నొకవదంతి పుట్టినది. దానికిఁ దార్కాణముగాఁ బిత్రార్జితంబగు పునహాజాగీ రొక్కటి తనహక్కులోనికిఁ దెచ్చుకొంటయేకాక రమారమి కోంకణసీమనెల్ల విజాపురిదొరతనమువారినోటిలో మన్నుగొట్టి స్వాధీనము చేసికొనెను. అప్పహానుభావునకు నీవర్తమానము దెలియఁ జేసిన చోఁ దప్పక మీబన్నంబు తీర్పఁగలండు.

పూజారి—అయ్యా! మీ రింకను బెరటిదారిలోనే యున్నట్లున్నది. ప్రతాపగడలోనున్న శ్రీవారిపై నాఫ్జను సేనాని దండు వెడలినాఁడు. ఏమగునో యని నాకు భయము పుట్టుచున్నది.

అని యిట్లుభయులు సంభాషించుచున్నవేళ నిర్వదేండ్లప్రాయముగల యొక్క చక్కనియావనపూరుషుండు తొట్రుపాటుతో వారిదెసకు వచ్చుచుండెను. కేతకీదలచ్ఛాయతోఁ బోల్పఁదగు దేహమును విశాలవక్షమును నూనూగుమీసములు నాతని తారుణ్యసంపదయు క్షత్రచిహ్నమును వయఃపరిమాణమును

జూచువారికి సులువుగాఁ దెల్పుచుండెను. ఆతురతతో నతండు వారివద్దకు వచ్చినపిమ్మట నమ్మువ్వురు నిట్లు ముచ్చటించిరి.

పూజారి—నాయనా! బాలాజీ! మనకార్యము సానుకూలపడెనా?

బాలాజి—భగవత్కృపను మనమనుకొన్నట్లు జరిగినది. ఇచ్చటి వర్తమానము ప్రభువునకుఁ దెలియఁజేయుమని జట్టాపురివద్దనున్న మాళిసూరికి నియోగించితిని. మీయొద్దనున్నయీతం డెవ్వఁడు?

పూజారి—ఈయన యొకబాటసారి. నీరాకకుఁ బావుగంటకు ముందు విచ్చేసినాఁడు. ఎవఁ డైనది యే నెఱుంగను.

బాలాజి—(బాటసారి నుద్దేశించి) అయ్యా! తమరెవ్వరు? రాకకుఁ గారణం బేమి?

బాట—పేష్వామారోపంతుల పురోహితుండను. నాపేరు గంగాధరుం డందురు. నన్నీప్రాంతపుగ్రామముల సమాచారము దెలిసికోరమ్మని పేష్వ పుత్తెంచినాఁడు. ప్రస్తుత మతండు పంధరాపురికడనున్నాఁడు. ఆపుర మునుగూడఁ దురకలు కొల్లగొట్టి తరుణులను జెఱగొంపోయినారు.

బాలాజి—హరహర! ఎంతపని జరిగినది. మాతండ్రిగా రప్పటిలో నచ్చట లేకుండిరో! వారుండఁగా నట్లు జరిగినదో?

పూజారి—మీతండ్రిగా రచ్చట లేకయేయుండును. మీయప్పగాని పేష్వగాని యున్నచో నట్టిపని జఱుగకపోయి యుండును. కావున నీవు భయపడవలసినపనిలేదు. ఇచ్చటనుండి నీవరిగినపిదప నాయవస్థఁ జెప్పెద నాలింపుము. రామోజి కుటుంబము నేనే నీవెంటఁ బంపితినని తెలిసికొని ఖాను నాపెండ్లాము బిడ్డలను బలిమిని గొంపోయినాడు. వెండియు గ్రామస్థుల ననేకులను బహువిధముల బాధపెట్టి వారిధనధాన్యాదులు దోచుకొనిపోయినాఁడు.

బాలాజి.—అప్పప్పా! ఎంతఘోరము వినవలసివచ్చినది. ఇంక నేమి చేయఁగలము. హా! దైవముకంటెకింత భారమైతిమే! నేమీకుటుంబమును యవ

నులను వంచించి తీసికోవత్తును. లేదా! ఆధూర్తసేనాని నెత్తైనను జంపి మీ సూడు దీర్తును. ఇదె పోయివచ్చెదను. సెలవొసంగుఁడు.

పూజారి.—బాలాజీ! నీవు బాలకుండవు తెలియక తొందరపడుచున్నావు. నామూలమున నీవు ప్రాణాలు గోలుపోవలసివచ్చును. ఇంతేకాని ప్రయోజనముండదు. పఠానులు సులభోపాయమున మోసపోవువారు కారు. మీతండ్రితోడను రాజుగారితోడను నాలోచించి వెండియు వారెట్లు చేయుమని చెప్పుదురో యట్లు చేయవచ్చు.

బాట.—పూజారి చెప్పుమాటలతో నే నేకీభవించుచున్నాఁడను. త్వరపడి యేకార్యమును జేయరాదు. నిదాన ముండవలెను. పెద్దలతో యోజింపక కార్యముదెసఁ బోవలదని నామతము—అన్నట్లు జ్ఞప్తివచ్చినది. ఆశ్వయుజము సమీపించుచున్నది. ప్రతాపగడకుఁబోదము.

ఇట్లు పేష్వాపురోహితుండు దేవీపూజలమాట జ్ఞాపకముచేయఁగా నేపాఱికనిల్చినను రావించి పూజారి 'ఖాను చేసిన దౌర్జన్యంబునకు మనయుసురు వారికిఁ దగులకుండునే' అని క్రోధావేశపరవశుండై ఖాను చావనిదే కులదేవతయగు తులజామాతకు సంప్రోక్షణాదులు గావింపనని ప్రతిజ్ఞపట్టి దేవీపూజలఁ జూచుటకుఁ దనతోఁ బ్రతాపగడకు రావలసినదని యచ్చటివారిని హెచ్చరించి వారిని దీసికొని ప్రయాణమాయెను. బాలాజి పూజారినియోగంబున రామోజికుటుంబమునుఁ బ్రతాపగడకుఁ జేర్చుటకు రాచూరికిని దరిలిపోయెను.

# రెండవ ప్రకరణము.



ప్రజలవలననుండి కరరూపంబున గ్రహించు విత్తంబు తదుపయోగార్థము వినియోగింపవలెనని భూపతులకు రాజధర్మంబు తానే ప్రతిసంవత్సరము నాచరించి బోధించుచున్నాఁడా యనునట్లుగా స్వార్థపరిత్యాగిశిరోమణియగు భాస్కరుండు సాగర సరిత్తటాకాదులనుండి నిజకరాకర్షణసంగతిఁ బరిగ్రహించువారలను గ్రీష్మఋ వర్షకాలంబు భూజనసౌఖ్యార్థమై విడిచిపెట్టుచుండెను. ఇట్లు చేయుటవలనఁగదా దినరాజగు సూర్యుని లోకబాంధవుఁడని బుధులు సన్నుతింతురు. అస్మహోపకారి శ్రావణ భాద్రపద మాసపర్యంతము ప్రచ్ఛన్నముగానుండియు శ్రీశివాజిరాజు చేయఁదలచుకొన్న నవరాత్రమహోత్సవము వీక్షింపఁగోరికాబోలు నాశ్వయుజముసరికిఁ బరిమితకిరణుండై స్వచ్ఛముగా నభోమండలమందుఁ గోంకణసీమవారికిఁ గన్పడసాగెను. గంధవాహనుం డుత్తరమునుండి దక్షిణమున జరుగు నీయుత్సవము సందర్శింప మెల్లమెల్లఁగా రాఁదొడంగెను. ఆసమయమందు నంతకుముందు కురిసినవర్షముచే నుప్పొంగిన సెలయేళ్లవంకఁ జూచినను నాకనుమల ప్రదేశమునఁ బ్రవహించుచు నచ్చటి మహారాష్ట్రదుర్గములకు నగడ్తలవలెఁ గాపాడుచుండెను. ఇట్టి దుర్గంబులలోఁజేరిన ప్రతాపగడ దుర్ఘటమైన యరణ్యప్రదేశమునందలి మిక్కిలి యున్నతమైన పీఠభూమియందుంటవలననే శివాజి యప్పటిలో దానినిఁ దనరాజధానిఁగాఁ జేసికొనెను. నవరాత్రములకై మహారాష్ట్రరాజశేఖరునిచే నాహూతులైన చుట్టపక్కములును జుట్టుప్రక్కలనున్న జనంబులును మఱియుఁ దత్సైనికులేకాక సహ్యాద్రిశ్రేణికిఁ బ్రాగ్దిశనున్న దేశస్థు లనేకులు యవనయాతనలకు సైపఁజాలక చాలదూరంబునుండి శివాజిని శరణుజొచ్చుటకై సంఘోపసంఘములుగాఁగూడి రాజధానికిఁ బోవుచుండిరి. ప్రభుసందర్శనకుతూహలంబునఁ బ్రయాణశ్రమ మించుకయు గణింపక పరమోత్సాహులై మార్గంబుపొడుగునను మాటలు చెప్పుకొంచు నవ్వుచుఁ గేరుచుఁ గేకలువేయుచుఁ గొమ్ములూఁదుచు నడువఁజొచ్చిరి.

ప్రతాపగడ మిక్కిలి యెత్తైనస్థలమునందు నున్నదనియు నచ్చటకుఁ బోవుటకు బహుకష్టతరమైనదనియు నిదివఱకే చెప్పియుంటిమికదా ! ఆపట్టణమునకు మంచిమార్గంబు లేవియు లేక యెక్కుడు క్రిక్కిఱిసియై జానెడు మూరెడు వెడల్పుగల వంకరటొంకరయైన త్రోవలు రెండు గల్గియుండెను. ఒకత్రోవనుండి సముద్రతీరవాస్తవ్యులగు తులుకోంకణస్థులును మఱొకబాట నుండి దేశస్థులును నేఁగుచుండిరి. వీరుకాక 'ఘాట్మాతా' అని పిల్వఁబడు సహ్యాద్రిపర్వతభూములందలి ఘాటీలలో నివసించు విశ్వాసపాత్రులగు మావళేలును హేతకారులును నాయుధపాణులై తొల్లి రామసాహాయ్యమునకై కిష్కింధాపురికి విచ్చేసిన వానరసేనలవలె దశదిశలనుండి గుంపులు గుంపులుగా బహులాఘువముగా దుర్ఘటమైన శైలంబుల నెగఁబ్రాకుచు సన్నిహితపదంబులుపట్టుచు రాజధానికిఁ దర్వరపడి పోవుచుండిరి.

ధర్మరాజు వాజిమేధయాగంబు నెఱవేర్చుటకై దండెత్తి ఖడిసిన సహదేవునకును దక్కను జయింప దాడి వెడలిన యల్లాయుద్దీను ఖిల్జీ చక్రవర్తికి స్వాధీనులుకాక తమ వాడిమగంటిమిఁజూపిన పరాక్రమనిధులును క్షత్రసంజాతులునగు మరాటులు పెక్కురు తత్కాలమునఁ గేవల కుక్షింభరత్వమే పరమపురుషార్థంబని భ్రాంతిని మున్గుచు విజాపురీనాథపదాశ్రితులై శివాజికి బలవద్విరోధులై యుండిరి. పైని పేర్కొనఁబడిన మావళేలు హేతకారులన్ననో తగిన నాగరికతయు రూపరేఖావిలాసాదులు లేకున్నను మరాటులకంటె వజ్రకాయులై పరాక్రమనిధులై ఛత్రపతికిఁ జేదోడును వాఁదోడునైయత్యంత సాహాయ్యంబుచేసి చిరకీర్తి సంపాదించుకొనిరి. వీరు శ్రీశివాజిరాజు సేవచేయుటకుఁ బూర్వము కడుబీదవారై యుంటవలన సత్ప్రతి మానసంరక్షణార్థమై గోచియుఁ జిన్ని తలగుడ్డయుమాత్రమే దాల్చి మన ప్రాంతపు కోయవారివలె బల్లెములును విల్లంబులును ధరించి వ్యాఘ్రాదిక్రూరమృగంబుల వలని భయములేకుండ గొండలలోఁ జరించుచుండువారు.

ఇట్టి యరచెంచులు శివాజి పోష్యులైన తఱువాతఁ దగినంత నాగరికత్వదము కల్గి యవ్విభుతిలకముచేఁ జాలినంత యుద్ధకౌశలము నేర్చుకొని సం

గరభీములై సుప్రసిద్ధి వహించిరి. వీరిలో హేతకారులు విల్లుయుద్ధమునందును మావళేలు దొమ్మియుద్ధమందును విశేషనైపుణ్యము గల్గియుండిరి. మఱియు మాయామర్మవిదూరులై ద్యూతస్త్రీ మధుపానాది దుర్వ్యసనవిముఖులై యుంటకుఁ దోడు దేవతాభక్తియందును సనాతనధర్మమందును నత్యంతానురాగులై నిరుపమానస్వామిభక్తిపరాయణులై విశ్వాసపాత్రులై తేజరిల్లిరి. వానరసాహాయ్యంబు చేకొని దుర్జయులగు నిర్జరవైరులఁ జక్కాడి సీతామహాలక్ష్మినిఁ బరిగ్రహించిన శ్రీరామచంద్రునిచందంబున సుగుణవిభూషణులును శత్రువిభీషణులు నగు మావళే హేతకారులను జేపట్టికదా? శివాజి ధర్మనాశకులగు నాపఠానులను జీల్చి చెండాడి నిరాఘాటముగా హిందూరాజ్యరమను వరింపఁగల్గెను.

ఇట్లు రాజధానినిఁగూర్చి ప్రయాణమై పోవుచున్న కోంకణస్థులును దేశస్థులును మావళేలును హేతకారులును మున్నగువారిలోఁ గొందఱు దగ్గఱదారులఁద్రొక్కియు మఱికొందఱు వక్రమైనకొండలనెగఁబ్రాకలేక సరియైనత్రోవనుండియు జనుచుండిరి. దారిపొడుగున నేవైపుచూచినను విలువయగు టేకుప్రాకులును నీడ నొసంగెడి విశాలంబైన వటవృక్షంబులును దట్టముగాఁ బెరిగిన వెదుళ్ళడొంకలును వెండియు నానాజాతిపాదపంబులును బరీక్షించుచు గైరికాది ధాతువులచే శోభితంబులైన తటంబులను సందర్శించుచు మేఘశకలమార్గంబునఁ బ్రవేశించిన భానుకిరణంబులవ్యాప్తిచే విచిత్రవర్ణంబులు దీపించెడు గిరిశిఖరంబులను బరికించుచు దాహమువైచినప్పు డచ్చటచ్చట నిల్చిన కొండవాగుల జలంబుల నుపయోగించుచుఁ బలువిధంబులైన పూలచే వాసించు పొదఱిల్లలో విశ్రమించుచు నొకొక్కచోట నెక్కుచు నొక్కొక్క తావున దిరుగుచు నొక్కొక్కెడ దాటుచు నొక్కొక్కతఱి దుముకుచుఁ బోవుచుండిరి. మఱియు వ్యాఘ్రభల్లూకాది ఘోరసత్వంబులవలని భయంబునను రాత్రిపడినప్పుడు మార్గమధ్యంబున నగపడిన కుగ్రామములలో నాగుచు నచ్చటివారిచే నతిథిసత్కారంబులు వడయుచుఁ దెల్లవాఱినపిదపఁ దిరుగఁ బ్రయాణంబు సాగించుచు దసరాపాడ్యమినాటికి నెట్లయినను రావునకుఁ జేరుకోవలెనని బహుత్వరితముగా నరుగుచుండిరి.

అటఁ బూజారినివీడ్కొనిపోయినబాలాజి యొకముప్వురుమరాటుల తోఁగలసి ప్రయాణికులతోఁబాటేకారణముననోకాని యత్యంతత్వరితముగా నేగుచుండెను. అత్తఱి నొక్కెడ నొక్కయార్తధ్వని వినఁబడుటయు నయ్యది యేమో పరిశీలించి మఱిపోవలె నని బాలాజితోడిచెలికాండ్రు వెంటరా నాధ్వనివచ్చినదిక్కునకు సూటిగా నడవఁజొచ్చెను. అట్లు కొంతదూరము నడిచినంతకుఁ బద్మినీజాతి స్త్రీరత్న మొకటి వారికంటికిఁ బొడఁగట్టెను. పోతపోసినపుత్తడిబొమ్మవలెనున్న యాకొమ్మనుఁజూచి వారామెను వనదేవత యని భ్రమపడి ముందునకు నడుచుటకు శంకించి వెనకకు మరలసాగిరి. కాని వారిలో బాలాజిమట్టుకు వెనుక కంజవేయఁడయ్యె. ఇంతలో మరల "ఆపన్నురాలను నన్నుఁబ్రోవుఁడా" అని యాకాంత కేకలువేయసాగెను. అంత బాలాజి మనసుదిట్టపఱచుకొని యాకన్యయున్న స్థలమునకు బోఁగడఁగెను. ఇది చూచితక్కినవారును బాలాజి ననుగమించిరి. ఆసుకుమారి పరభుకుమారు నానవాలుపట్టెనుగాని బాలాజి సమీపమునకు వచ్చినపిదపఁగూడ బాలికఁబోలిక పట్టలేకుండెను. ఇందులకు హేతువులేకపోలేదు. ఒంటరిపాటువలనఁగల్గిన భీతికిఁదోడు చండకరునిరశ్మితాకుడుచే నాతన్వీముఖంబువాడి నిత్యముచూచుచున్నవారికిసైతము పోల్చుకొన శక్యముకాకుండెను. అంత నాబాలాజి తరుణినిజూచి "జవ్వనీ! నీవెవ్వతవు? ఈనిర్జనస్థలమున కెట్లు రాఁగల్గితివి?" అని యడుగుటయు నావుడుఁ దాను రామోజిపరభుకుమారిక నని చెప్పి పదంపడి యేమోచెప్పఁబోయి తనకును దనవారికిని గల్గినదురవస్థ తలంపునకు రా నెక్కువెట్టునబోరున నేడ్వఁజొచ్చెను. బాలాజియు దరుణిని ప్రభావతిఁగాఁ గంఠధ్వనివలనఁ దెలిసికొని విస్మయానందమ్ములఁ గొంతతడువు దేలి పిమ్మట నాచంద్రముఖి నుద్దేశించి యిట్లుపల్కెను. "ఓసుందరీ! భాగ్యవశంబున నిన్ను బొడఁగంటిని. తులజాపురినుండి పూజారియాలోచనచొప్పున రహస్యముగా నిన్నును మీతల్లిని రాచూరికిఁజేర్చినసంగతి నీవెఱింగినదేకదా? క్రమ్మఱ నేఁ దిరిగివచ్చునంతలో నిన్ను నెవరో తస్కరులు రాత్రిరాత్రిఁ దీసికోపోయిరనివిని నాహృదయము నటుక్కుమనిపోయినది. అంతట నిన్ను వెదికి తెచ్చుటకుఁ దగినవారిని బంపి యీసమాచారము మీతండ్రికిని రాజుగారికిని దెల్పుటకై యీతెరవునఁ

బోవుచుంటిని. అచ్చట మీతల్లియుఁ దక్కటిచుట్టములును నిన్ను జూడమి నిద్రాహారములు మాని శోకించుచున్నారు.” అని తెల్పి యామెవృత్తాంతమడుగ నాయబల యిట్లనియె. “నన్ను నల్వురు చోరులు నే నిద్రించుచుండఁగా నా మంచముతో బాటు నెత్తికొనిపోవుచు దారిమధ్యమున నరుణోదయంబగుటయు జనులు కొందఱామార్గంబుననుండి వచ్చుచుంటయు వీక్షించి యీయడవిలోనికిఁ దీసికొనివచ్చిరి. పిదపఁ గొంత ప్రొద్దెక్కినతరువాత వారిలో నిద్దఱు చేరువున నున్న యూళ్లనుండి వంటకంబులుఁ గొని తెచ్చుటకుఁ గాబోలు నన్ను జాగ్రత్త గాఁజూడవలసిన దని తక్కినవారితోఁ జెప్పి యచ్చోటు వాసిపోయిరి. వా రట్లుచనిన కొంతసేపటికిఁ దక్కినవారిద్దరు కరవాలంబులఁ బక్కలనుంచుకొని కూర్చుండి యేవోమాటలు చెప్పుకొనుచు రేయెల్లనిద్రలేమిఁ గునుకఁజొచ్చిరి. సమీపముననుండి వారియవస్థనెల్ల నరయుచున్న నేను సాహసించి మెల్లమెల్లగా జరిగి యొక్కఖడ్గమందుకొని యొక్కవ్రేటున వారితలలఁ దెగవేసి యావెంటనే యచ్చటనిల్వక దొంగలు వెనుకనుండి తఱుముకొనవత్తురేమోయని బెగడి నాశక్తి కొలందిని నీదెసకుఁ బాఱివచ్చితిని. కాని నాదురదృష్టమున దారినడుమ నొక కంటకము కాలిలో విఱుగుటఁజేసి యటనుండి నడవఁజాలక ప్రాణంబులం దాస నీడొంకలఁజొచ్చి డాఁగికొనియుంటిని. నాపాలింటిభాగ్యదేవతలై మీరింతసేపటికైనను గనుపించుటయు నిటకు వచ్చుటయుఁ దటస్థించెను.” అనిచెప్పి గొంతుక తడియాఱుటచే మఱిమాటాడఁజాలక దప్పికవేయుచున్న దనియు నీరుకావలెననియు సంజ్ఞచేసెను. అంత నాపరభుకుమారుండు చేరువున నున్న యొక్కకొలనికిఁజని తనకడనున్న రాగిపాత్రమునిండుగ నుదకంబుదెచ్చి చేరుమాలుతడిపి యామె మొగమునెల్ల నద్ది తక్కిననీరు చేతికందిచ్చెను. ఆతరుణీ మణియు జలంబుద్రావి కొంత తెప్పిరిల్లి తనకును దమవారికిని నత్యంతోపకారము చేసినట్టి యాపూజారి కుశలంబుగానున్నాఁడా? యని యడుగుటయు నారా కొమరుం డచ్చటఁ బూజారికి సమకూడినయవస్థయు నిప్పు డాయన రాజధా నికిఁ బోవుచున్న తెఱం గెఱింగించి యాసుందరీమణిపాదంబునకు దగిన చికి త్సచేసి పదంపడి ప్రొద్దుక్రుంకుట గనిపెట్టి చెంతను గనఁబడుచున్న యొక్క పల్లెకు వారినందఱను దోడ్కొనిపోయెను. తరువాత నారేయి వారుపంకు

కొని భుజించినపిదప నెవరికిఁదోఁచినముచ్చట్లు వారుచెప్పుచుఁ గ్రమంబుగా నొకరివెనుకనొకరు నిద్రింపసాగిరి. కాని ప్రభావతిమాత్రము రెండుజాములైన వఱకు నిద్రింపక యొక్కింతసేపు తల్లిదండ్రుల నెట్లుకనుంగొందునోయని విచారించి పిదప రెండవమన్మథునిమాడ్కి వెల్గుచున్న పరభుకుమారుని నిరుపమాన సౌందర్యంబునకు నక్కజపడుచు నయ్యుదారుండు తనకుఁజేసిన యుపకారంబునకు నేమియొసంగిన దదృణంబు దీర్చుకోవచ్చునోయని వితర్కించుచు మఱియు నానడుమ వింతవింతకోర్కులు మదిలో నుద్భవించుచుండ నెట్టకేలకు. నిద్రింపఁజొచ్చెను.

# మూఁడవ ప్రకరణము.



ఒకనాఁటి సాయంకాలంబున నొకయిద్దఱు యౌవనపురుషులు వనవిహారంబు గావించి నివేశనాభిముఖులై చనుదెంచుచున్న సమయమున నం దొకండు సమీపముననున్న యొక్క కాసారంబుఁ బొడఁగాంచి రెండవవానితో నిట్లనియె. "ఆహా! మిత్రమా! ఇదిగో చూడుము. ఈజలాశయమనన్యజనసంచారంబై నిష్కలంకవారిపూరితంబై యెంతయు మనోజ్ఞంబై యొప్పారెడిని. ఇచ్చట ముహూర్తమాత్రంబు విశ్రమించి యవ్వల శిబిరంబునకుఁ బోవుదము" అని రెండవవాని హెచ్చరించి యతని తోడ్కొని యాసరోవరంబుఁ డాసి యందలినిర్మలోదకములు దృష్టిఁదీఱఁగ్రోలి యత్తీరముననున్న నొకచంద్రకాంతవేదికపై నధిష్ఠించెను. నవ్యకుసుమ పరిమళ మిళితంబైన మందమారుతము తమదెస వీచుచుండ భోగులవోలె నయ్యిరువురు ననుభవించుచు నప్పంకజాకరంబునఁ గలవిశేషంబు లరయుచుండిరి. అప్పుడు వారిలో నొక్కండు నిజసఖునకు నాహ్లాదంబు గల్పింపఁజూచి యస్సరసి నిట్లు వర్ణింపఁ దొడంగెను. "నెచ్చెలీ! దవ్వుననుండి చూచువారికి నిక్కమలాలయంబు పచ్చని లేఁతపచ్చికబయిళ్లచే నలుదెస లావరింపఁబడి మేలిమి పట్టుచీర ధరించిన వనదేవతవలెఁ గనఁబడుట కింతయు సంశయములేదు. ఆతట్టున గల సూర్యుని ప్రతిబింబము సిందూరతిలకంబువలె నిద్దానికి మఱింతవన్నె దెచ్చుచున్నది. బళిరా! ఇందుగల పద్మంబులు శతదళంబులుగల్గి రుచిరాకారము దాల్చి పద్మగంధులముఖంబులకు సాదృశ్యంబుగల్గి భాసిల్లెడిని. కల్హారంబులన్నియు కోమలాంగుల నేత్రంబులకుఁ దీటుగల్గి శోభించెడి. మఱియు బాపురే! ఈలావణ్యముతో సాటియగుచున్నవి—ఓహో! మిత్రమా! చూచితే! నిరంతరము సాగుచున్న యుదలితరంగంబులన్నియు మృదంగంబులవలె సరసముగా ఘోషించుచున్నవి. మధుపానమత్తచంచరీకంబులు వినోదంబుగా గాయకులవోలె గానముచేయుచున్నవి. ఔరా! ఈసరసు నాశ్రయించిన

కవిబృందము చిత్రవిచిత్రముగాఁ దాళంబులుమాడ్కి ధ్వని చేయుచున్నవి. వెండియుఁ దీరంబుననున్న సాలరసాలతాళవిటపాదివివిధపాదపజాతులు నిజపత్రంబులచే మెల్లమెల్లగా విసరుచున్నవి. ఇటనున్న సౌఖ్యంబు నిజంబుగా మనభవనంబులలోఁ జూపట్టదన్న నతిశయోక్తిగా నూహింతురేమో!" అని సరసోక్తులఁ బచరించి మందహాసంబుచేసిన నెచ్చెలి తియ్యనిపల్కుల కలరిపదంపడి రెండవవాఁ డిట్లనియె. "ఓయీ జంఝూరరాయా! నీయభివర్ణనంబు ప్రభావతిని స్మరణకుఁ దెచ్చుటఁజేసి నాచిత్తంబు తత్తరపాటు చెందుచున్నది. ఇందులకుఁ బ్రతిక్రియఁ జింతింపుము. లేనిచో నేజీవించుట దుర్లభంబు" అని నిజమనోవికారం బెఱింగించిన జంఝూరరావు కొంతతడవు విచారించి మృదుమధురవచనంబులతో నిట్లూరడిల్లఁ బల్కెను. "ఓయీ యవనకుమారా! తినఁబోవుచు రుచి యడిగెదవేల! నీయపేక్షఁ దీర్చుటకుఁగదా! మీతండ్రి యజ్జల్లా నీదండయాత్ర కల్పించినాడు. రేపో నేడో యాముద్దులగుమ్మ నీచెంతకు రాఁగలదు. వృథా యేలవేగిరించెదవు. రాచూరిగ్రామములో "బాలాజి పరభు" తత్కాంతారత్నమును దాఁచిన సంగతి చారులవలనఁ దెలిసికొని రహస్యముగా నచ్చోటికి నల్గురు సర్దారులను బంపినాఁడను. వారింకను మనతావునకు వచ్చిన జాడ తెలియకున్నది. మనము వేటతమకంబున నింత దూర మరుదెంచితిమి. భాస్వంతుండు చూడఁజూడ నంతకంతకుఁ దేజోహీనుఁడై ప్రాగ్దిశనుండి క్రమ్ముకొని వచ్చుచున్న తమోగ్రహంబునకు వెఱచి పశ్చిమాబ్ధిని డాఁగికోవలెనని పాఱుచున్నాఁడు. బహువిధపక్షిజాతులు నలుదిక్కుల నిండివచ్చి యిచ్చటి మహీరుహంబులకుఁ జేరుచున్నవి. జంబుకాదినీచమృగంబులు తమతమ బొరియలలోనుండి యాహారసంపాదనార్థమై యిదె బయలువెడలుచున్నవి. ఇయ్యది యరణ్యప్రదేశం బగుటవలనఁ గ్రూరసత్త్వంబులను భయంకరవ్యాలంబులు నిట సంచరింపక మానవు. కావున మన మిక్కడ నొక్కనిముసంబును నిల్వరాదని బోధించి ఖానుతనూజునిఁ దోడ్కొని తత్సఖుండు శిబిరమునకు నడిచెను. అట్లు వారిరువురు శిబిరమునకేఁగి యందొక్కయేకాంతస్థలంబున గూర్చుండిపోయినభటు లింకను మరలిరాకుంటకు హేతు వేమైయుండునో యని విచారించుచుండిరి. ఆసమయమున నిరువురు

ముష్కరు లచ్చోటికి కరుదెంచి తాము ప్రభావతి సగము దారివఱకు మోసి కొని వచ్చుటయు, మార్గమధ్యంబునఁ బ్రభాతంబగుడు, ప్రక్కనున్న కాననంబునకు నాకలకంఠినిఁ దీసికొనిపోవుటయు, భోజనపదార్థసంపాదనార్థంబై తా మిద్దఱు నారూపవతిని దక్కినవారిపరముచేసి సమీపమున నున్న యొక్కపల్లెకుఁ జనుటయు మరలి మగుడునంతలోఁ దమసఖులు కత్తివ్రేటున గతజీవులై పడియుంటయు, అట నాపె నెంత వెదకినను గానరాకుంటయు, లోనగు సంగతులెల్లఁ గ్రమంబుగా జెప్పిరి. అంతఁ "చేతికిఁ జిక్కినవస్తువు మాయమై పోయినట్టు లాయెనుగదా!" అని ఖానుపట్టి యతని ప్రియుండును గొంతసేపు బిట్టు వగవఁ జొచ్చిరి. అటుమీఁదట ఫజీలావచ్చిన భటులను గతినముగా జీవాట్లు పెట్టి "ఓరీ మీరు మాఱువేసంబులు వేసికొని యాసుందరాంగి నెల్లెనను వెదకి తీసికొని రాఁజూడుఁడు. లేనిచో మీప్రాణంబులు గోల్పోవ మెదరుచుండీ" అని యొత్తిపల్కి వారి నవలకుఁ బంపి క్రమ్మఱఁ దన చెలికానితో నిట్లు ముచ్చటింపఁ దొడంగెను. అయ్యో! నాదురదృష్టమున కేమనవచ్చును. ప్రభావతివంటి త్రిలోకసుందరి నాబోటి మందభాగ్యునకు లభించునే! అన్నాతి పదియవయేటఁ దనతండ్రితో మాగృహంబునకుఁ దఱచు విచ్చేయుచుండెడిది. నాఁటఁగోలె నామనం బాచంద్రముఖిపై నాటుకొని యున్నది. ఆభువనమోహిని నొక్కనాఁటిసంజవేళ రాజధాని వెలపలనున్న యొకయుపవనంబునఁ దనచెలులతో విహరించుచుండ నొకపనినెపంబున నటకేగి నాకోర్కి తెలిపితిని. కాని యవ్విలాసిని యిప్పటిలోఁ దగిన సమయము కాదనియు, తనజనకు లచ్చోటికి వేంచేయుదురనియు నదను చూచుకొని తానే తండ్రికి సమ్మతిపఱచికొనికాని లేనిచో రహస్యంబుగాఁ గాని వచ్చి కలసికొందుననియు వాగ్దానంబుచేసి నన్ను మరలించెను. ఇది జరిగిన కొలందిదినములలోఁగానే యాపెతండ్రి రామోజి నిజోద్యోగము వదలుకొని కుటుంబసహితంబుగాఁ బలాయితుండయ్యెను. ఇస్సీ! నేనెంతమందబుద్ధిని. ఆయుద్యానవనంబునఁ గలసికొన్ననాఁడే మగువను దోడ్కొనిపోకుంటవలననుగదా! యిట్టి యనర్థము చేకూరెను. గోరునఁబోవుచేతకు గొడ్డలి

కావలసివచ్చెనది. మిత్రమా మీహిందుకాంతలకంటె మామహమ్మదీయతరుణులు చక్కనిచుక్కలని కొంద అనుకొందురుకాని యది వట్టిభ్రమ. ఆర్యభామలలో రూపరేఖావిలాసాదులు నిరుపమానంబులు. వారి తనుచ్ఛాయ పచ్చని మొగలిరేకును బోలియుండును. మఱియు భారతస్త్రీల దేహమృదుత్వ సౌకుమార్యాదులును వారి వాఙ్మాధుర్యమును మాయింతులయందు వెదకినను గానరావు. వేయేల! అల్లాయుద్దీని మోహించిన పద్మినీసౌందర్యమును ముబారక్చక్రవర్తి చేపట్టినట్టి దేవులదేవి తనూవిలాసమును జగద్విదితంబులు కదా! ఇట్టుల యెన్నికకెక్కిన కమలనేత్రలు మాలో నేకాలమందైన నున్నట్లు వింటిమే? ఇప్పుడు నేవలచిన వాల్గంటిసౌందర్య మేమని వర్ణింతును. ఆమె శరీరచ్ఛాయ పదియారవవన్నె మేలిమిబంగారము న్యూనతచేయు. ఆ బంగారుబొమ్మ నేత్రములకు నిందాకఁ జూచినకొలనిజలజంబులు కొంతసాటి చెప్పవచ్చును. అవ్విలాసవతి విస్మితాననంబు కలంకంబు రానినాఁటి పూర్ణకళానిధిబింబము గొంత సరిచేయవచ్చును. పాదాక్రాంతంబైన యన్నీలవేణి కురులు చమరీవాలంబును నీసడించును. ఇంతేల! ఆహరిమధ్య కాలిగోరునకు సరివచ్చు లేమలు లేరనియే నాయెన్నిక. ఇట్టి భువనైకమోహిని జేపట్టి యెన్న డీవియోగసాగరంబు తరింతునో కదా అని నిట్టూర్పు నిగిడ్చి కొంతతడవూరకుండిన జంఝూరరావు ఖానుకుమారు నుద్దేశించి యిట్లు పల్కె "ఫజీలూ! నీమాటకు నడ్డమువచ్చితినని యనుకొనకుము. పారసీకభామల రూపవిలాసంబులముందట లోకములోని తక్కటిజాతి కోమలాంగుల సౌందర్యములు దివిటీయెదుట దీపంబులవోలెఁ గన్పట్టెడి. ఇందువలననుగదా ప్రభువులగువా రాదేశపు చంద్రముఖుల వ్యయప్రయాసలకు వెనుదీయక దెప్పించుకొని యుంచుకొంచున్నారు" అని నెచ్చెలి పల్కుటయు దానికి ఫజీలు తానీరీతిగాఁ బూర్వపక్షము చేయఁదొడంగెను. "నామనసు ప్రభావతినుండితొలగింపఁ జేయవలెనని యెంచి మీయయ్య పారసీకపద్మాస్యలను బెక్కురఁ దెప్పించి మనోరథం బీడేరదయ్యె. నాఁడు అక్బరుచక్రవర్తి మన హిందూమహమ్మదీయులకు సంబంధబాంధవ్యంబుల నెఱప నెంచి బహుప్రయాసంబు మీఁద రాజపుత్రుల నొడంబఱచి కొంతవట్టు దనప్రయత్నము కొనసాగించెను.

కాని తన్మరణానంతరంబునం దాయుద్యమంబు నభివృద్ధి చేయువారు లేరైరి. నేడు ప్రభావతిం బరిణయంబై చక్రవర్తి నాటిన ఘనోద్యమలతను మనదేశంబు నం బ్రాకించి తదభివృద్ధికై కరంబు యత్నంబు గావింతునుగాక'' అని గంభీర ముగా ఫజీలు వాక్రుచ్చి "యీవిషయంబున నీయభిప్రాయమే'' మని కూర్మి సఖుని నడుగుటయు నతండు లోకంబున నేదైనను దమ కక్కఱకు వచ్చు పని యెట్టిదైనను నట్లే ప్రకటింతురని లోన నవ్వుకొంచు నిట్లనియె. "ఓయీ! నీచెప్పుమాటల కడ్డము దూఱితినని నొచ్చుకొనవేని నామాటలను వినుము. బహి రంగముగా మాహిందువులు మీమహమ్మదీయులతోఁ జుట్టఱికంబు నెఱపుదు రనుమాట వట్టికల్ల. మావారిలో నొకజాతివారి కిట్టిపొత్తు హత్తనప్పుడు ఖం డాంతరులగు మీతో నెట్లు వియ్యమందుకో సమ్మతింతురు ? మాలోని కర్మ ఠులు మిమ్ముఁ బంచమతుల్యులనియు నికృష్టజాతీయులనియు, గర్హించుచు మిమ్ము దాఁకినవేళ సచేలస్నాన మాచరింతురు. మిమ్ముఁగొల్చు బ్రాహ్మణులను వెలివేసి వారిని గర్మభ్రష్టులని చాటుచున్నారు. ఇంక మీవారన్నో దేవళం బులఁ బడఁగొట్టుటయు గోవుల మెడఁగొట్టుటయు లోనగు ధూర్తకృత్యంబులు వేనవేలు నిరంకుశముగా సల్పుచున్నారు. ఇక్లెంతకాలంబు గోహింసాది దు ష్కార్యంబులు నిర్భయంబుగాఁ జేయఁజూతురో యంతకాలము నీ వనుకొను నేర్పాటు సాగకుంటయేకాక యుభయమతస్థులకు నిజంబైన స్నేహంబుకూడ నమకూడనేరదు. ఆర్యగర్హితంబులైన మీదుష్కార్యములను మొదలంట విడిచిపెట్టుదురేని యొకవేళ శూద్రాదులు మీసంబంధములు చేసికొన సమ్మ తింతురేమోకాని జందెముపోగు దాల్చు ద్విజులుమాత్రము మీరెంత తలక్రిం దులంబడి తపస్సుచేసినను నంగీకరింతురని నేనమ్మఁజాలను. నీవు స్నేహితుండ వని నేనేమియు నడ్డుచెప్పనైతినిగాని నిజముగా నిప్పటి నీప్రయత్నము నైత ము యుక్తమని నేనెన్నఁజాల'' నని పల్కి తనమాటలకు ఫజీలుమోము చి న్నపోవుట వీక్షించి 'సఖా ! నేనిట్లంటినని నీవు వేఱొకవిధంబుగా నన్నెంచ కుము' ఆర్యమ్లేచ్ఛులకు బహిరంగముగాఁ బరిణయంబులు జటిగింపనెంచు నీ యుద్యమము సాగనేరదని తెల్పుటకు నింతగాఁ దఱచి చెప్పితినిగాని వేఱొం డుకాదు. ఆసుదతీమణి నిన్నువలచినదౌటవలన నయ్యింతి నపేక్షించుట

దోసములోనిది కాదు. అని యేమో చెప్పఁబోవుచుండ నాయవనకుమారుండు తా నడ్డువచ్చి యిట్లనియె. "చాలుఁజాలు నింక నీయుపన్యాసంబు గట్టిపెట్టుము. తొల్లి ఢిల్లీపాదుషాపట్టినిఁ బండితరాయలు పాణిగృహీతిఁగాఁ జేకొనలేదా! ఇట్లే యుభయజాతులవారికిఁ బెక్కుమారులు చుట్టరికంబు కలిసినది. ఆ ముద్దులవెల్లిని నాకుఁ గూర్చుటలో సహకారివై మిత్రధర్మంబు నెఱపిన లెస్స లేకున్న లెస్సే. కాని యిట్టివెడఁగుయుక్తులు చెప్పి నామనసు నొప్పించుట నీకు యుక్తముకాదు" అని యొక్కింత తొందరపాటుతో మాటలాడ నిది కనిపెట్టి మరాఠకుమారుఁ డిట్లనియె. పండితరాయలంతటివాఁడుకూడ బహివెట్టఁబడి పలువిధములుగాఁ గులజులచే నిందింపఁబడె ననుమాట నీవెఱింగియుండవు కాబోలు. ఇంతకు నీవేమియన్నను నాకు విచారములేదు. నాయభిప్రాయం బడిగితివి కావున నే నింతగాఁదఱచి చెప్పితిని. నామాటలలో లోపమేమైనను గల్గెనేని నన్ను మన్నించుటొప్పు. త్రికరణశుద్ధిగా నాయోపిన తెఱంగున నీప్రస్తుతకార్యసిద్ధికై తగుశ్రద్ధ తీసికొని పనిచేయుదును." అని యిట్లుభయులు ప్రసంగించుచుండఁగా నొకభటుఁ డరుదెంచి "బాబులారా! మీయిరువురిని ఖానుగారు వేగిరమ వారిడేరవద్దకు రమ్మన్నా" రని తెల్ప వారచ్చోటువిడిచి వానితోఁగలిసి యరిగిరి.

## నాల్గవ ప్రకరణము.



హిందువులుచేయు నుత్సవములలో నవరాత్ర మహోత్సవమునకు సాటి యైనది మఱొండుకానము. మహమ్మదీయులకుఁ బీర్ల పండుగెట్లో భారతులకు నీయుత్సవ మట్టిదియు హిందువులలోఁజేరిన సకలజాతులవారును నీయుత్సవ ము మహాదీక్షతోను శ్రద్ధాళువులై చేయుచుందురు. ఆశ్వయుజమందు నవరా త్రములనగా దశమితిథిపర్యంతము చాతుర్వర్ణ్యములవారును దమతమ యిష్టదేవ తలను జక్రస్థాపనచేసిగాని విగ్రహస్థాపనచేసికాని పూజించి దశమినాడు హో మాదులుచేసి సమాప్తి చేసెదరు. వైష్ణవమతస్థులుదక్క దక్కినమతస్థులందఱు నందు శాక్తేయులు ముఖ్యముగా భండాసురాదులను వధించిన లలితాశక్తిని గూర్చి నవరాత్రములలోఁ బూజింతురు. కొందఱీశక్తిని లక్ష్మియనియు గొందఱు సరస్వతియనియుఁ గొందఱు పార్వతియనియుఁ గొందఱు కాళియనియుఁ గొం దఱు బ్రహ్మగాయత్రీమంత్రాధిదేవతయనియు నిట్లు బహుప్రకారంబులను భావనచేసెదరు. ఇట్టి శక్తిపూజాతత్పరులలో సమయాచారులనియు దక్షిణా చారులనియు వామాచారులనియు కౌళాచారులనియు నాల్గు తెగలువారు గలరు. ఇందు సమయాచారులును దక్షిణాచారులును బ్రాహ్మణులకు యోగ్యం బయిన తెఱంగు వర్తించువారు. శక్తికి మధుమాంసాదులు ప్రీతియని చెప్పి వామాచారు లయ్యవి స్వీకరించుచున్నారు. కౌలాచారులన్ననో శక్తిపూజ పేరిటఁ బ్రత్యక్ష యోనిపూజగావించి నరబలిగాని పశుబలిగాని చేయుచు, తత్పలలములను మెక్కుచుఁ దప్పత్రాగుచుఁ గ్రీడింతురట. ఛీఛీ ఇట్టినికృష్ట ధర్మము లాచరించు చండాలులుకూడ విప్రులమని చెప్పకొనుచు నీనాటికిని భరతఖండమున నచ్చటచ్చట నున్నవారని వ్రాయుటకు నాకు సిగ్గుపుట్టుచు న్నది. ఇట్లనే కొందఱు దురాత్ము లిటీవల మద్యమాంసస్వీకారము రామా నుజమత సంప్రదాయమని రహస్యముగా ననేకులకు బోధింపుచు నిర్భయులై

భువనవిఖ్యాతమైన తన్మతమునకుఁ గళంకము దెచ్చుచున్నారు. స్వజాతి పేరి టను మతము నెపమున నౌషధమిషను మద్యపానమును మాంసభక్షణమును వ్యభి చారాదులును గావించుదురాత్ము లేకాలమందైనను నిహపరంబులకు వెలియై నశింపకుందురే! ఇప్పటి మనవారివలెనే జాతి మతవైషమ్యాదులచేఁ బరస్పర ను కలహించుచు నరిషడ్వర్గవిధేయులై దుర్నీతిపాలై చెడిపోవుచు భారతుల నుద్ధరించు నుద్దేశముతో రామదాసు తులసీదాసు తుకారాము లోనగు మహాత్ములు శ్రీరామానుజ దేశికో త్తరునివలె దేవాంశావేశితులై దేశాటనము గావించుచు దురాచారముల ఖండించుచుఁ దగుబోధ లాదేశించుచు శివాజి తలయెత్తుకొను నాటికిఁ జాలవట్టుకు సంఘసంస్కరణము నెఱపఁగల్గిరి. వీరిబో ధలు శ్రుతిశాస్త్రవిధేయంబులును దేశకాలపాత్రోచితంబులుగా నుండెననుటకు సందియములేదు. దేశములోనున్న యెల్లజాతులవారును వారిని గౌరవించి పూజించుచుంటయే నా చెప్పుదానికి నిదర్శనము. 1 జాతివలనకంటె గుణము వలన నాధిక్యము గల్గునని వారు చెప్పిరికాని యన్ని జాతులవా రేకము కావల సినదని యిప్పటియే కొందఱి సంస్కర్తలవలె నుగ్గడింపలేదు. 2 మద్యమాంస భక్షణ వ్యభిచారాదులును గన్యాశుల్కాది నికృష్టధర్మములు ఖండించిరేకాని యిప్పటివారివలె నుపేక్షింపలేదు. 3 మఱియు నెవరి జాతిమతములలో వారు నిల్చి మనుధర్మమార్గానుగుణ్యముగా నడువుమని యుపదేశించిరేకాని యిప్పటి వారివలె జాతినీతులు వదలుకొని దురాచారముల నవలంబింపుమని యెన్నడు హెచ్చరింపలేదు. రెండియు మతసహనముఁగూర్చి చాలవఱకు బోధించి హిం దూమహమ్మదీయులకుఁ దగిన మైత్రి గల్పించుచుండిరి. "సంఘేశక్తిః కలౌ యుగే" అను వ్యాసోక్తి మహత్త్వంబు నిరాఘాటముగాఁ బ్రకటించుచు మహారాష్ట్రులనందఱ నొకనావలోఁ గూర్చుండఁబెట్టిరి. ఇప్పటి సంస్కర్తల మాటలు పాటింపకుంటకును వారిబోధల నెల్లరు నాచరణలోనికిఁ దెచ్చుటకును గారణము లేకపోలేదు. వా రీషణత్రయము వర్జించి జనులను బాగుచేయుట తమధర్మంబని నమ్మియుండిరి. ఇప్పటివారన్నో యీషణత్రయవిధేయులై యింద్రియలోలులై పేరు ప్రతిష్ఠలకై పరుగులాడుచున్నవారు. వారు బోధిం చు ధర్మములను వారే యాచరణలోనికిఁ దెచ్చుచు, బ్రజలకు మార్గదర్శకులై

యుండిరి. ఇప్పటివారన్నో చెప్పునదియొకటి చేయునదియొకటి చేయుచు, తమకుఁ బ్రతికూలురగు సాధువుల నిశ్శంకత నిందించుచున్నారు. పైఁజెప్పిన విధమున దైవప్రేరితులై రామదాసముఖ్యులు మరాటసీమను సనాతనధర్మములనెల్ల వెదజల్లుటఁజేసి మనశివాజికి స్వజనులందఱ నొక్కఛత్రముక్రిందఁ జేర్చుటకు సాధ్యమై యుండెను. శివాజిసేయు దేవపూజ పశుహింసతోఁ గూడుకొన్నదౌటఁజేసి కొంతవట్టుకు వామాచారము ననుసరించియున్నను దప్పద్రాగుట మొదలగు నవైదికాచారములు లేమి దక్షిణాచారము ననుసరించి యున్నదనుటకు నాయనపావనచారిత్రమే మనకు సాక్షి. విజయనగర రాజ్య మస్తమించినపిమ్మట శివాజి స్థాపితమైన కోంకణరాజ్య ముదయించిన దాఁక యనఁగా నొక్కశతాబ్దమువఱకు నీదేవీపూజలు దక్కనునందంత వైభవముగా జఱుగుచున్నట్లు తోఁపదు. దేవీపూజలుచేసి దశమినాఁడు చతురంగ బలంబులను దోడ్కొని దాడివెడలు నాంధ్రరాజుల యాచారంబు నవలంబింపఁ దలంచి కాబోలు శివాజియు నవరాత్రములలో నప్జల్లానుజోలిపెట్ట కూరకుండఁ జూచెనుగాని తురుష్కుల దౌర్జన్యము లీతనిదీక్షకు గొంతదనుక భంగము కల్గింపఁజొచ్చెను. ఈసంగతి మున్ముందుకుఁ జదువరులకుఁ దెలియవచ్చును. దేవీపూజను సందర్శింపఁగోరి బయలుదేరిన జనంబులు పాడ్యమినాఁటికిఁ బెక్కండ్రు ప్రతాపగడకుఁ జేరుకొనిరి. ఈజనం బెవ్వరు నచ్చోటికిఁ జేరుకొనక పూర్వమే శివాజిమంత్రులు ప్రతాపగడకుఁ జుట్టునున్న యడవిని గొట్టించి మిట్టపల్లంబులు సదనుచేసి పూరిండ్లును దాటాకుపాకలతోఁ జలవపందిళ్లను వేయించుటయేకాక చాలభాగము గుడారములుసైతము పఱపించిరి. అచ్చటికి వచ్చు జనులకు నేవిధమైన లోటుపాటులును జేయకుండ నెవరికిఁ దగిన మర్యాదలు వారికిఁ గావించి యన్నపానాదులను సకాలంబుగా నొసంగుచు నెంతయుఁ బ్రీతితో నరయుచుండిరి. నవరాత్రులలో హరికథలగునని యు శివాజి యెల్లగ్రామములకు వర్తమాన మంపుటఁజేసి దేవీపూజలును వానితోఁపాటు తమరాజులఁ నాతనితోఁపాటు కథలు నాటకములు దర్శింపవచ్చునని కుతూహలాయమానమానసులై లక్షలకొలందిజనంబులు ప్రతిపత్తిథినాఁటికిఁ బ్రతాపగడకుఁ జేరుకొనఁగల్గిరి.

ప్రతాపగడలో శివాజిభటులసాముకసరత్తులకు నుపయోగపడు విశాలమైన మైదానమొండుకలదు. దానిని రాజోద్యోగులు బాగుచేయించి యందు దగిన యేర్పాటులుకావించి కథలు జరుగుటకుగాను రంగస్థలమొకదానిని నిర్మింపఁజేసిరి. తమరాజుకొఱకు కందొకచోట నొక్క సైనపర్వ్వంటి కనకాంబరాచ్ఛాదితమైన యొక్క చిన్నిగద్దె యమర్చి దాని నటవీపుష్పములతోడను బచ్చ నియాకులతోడను నలంకరింపఁజేసిరి. సతారావాయిూపట్టణములనుండి కథకులను రావించిరి. వెండియు నిట్లు వారు తమకు రాజునియమించినకార్యములన్నియు నప్రమత్తులై జఱుపుచు వచ్చిరి.

పాడ్యమినాఁటియుదయమున నాసభాకూటమున బహుజనులు గుములుకూడి యిటునటు నడుచుచు మాటలుచెప్పుకొనుచు విహరించుచుండిరి. ఆ తఱి నొకవీరశిఖామణి కతిపయానుచరులతో నాసభాస్థలిదెసకుఁ బాదచారియై యరుగుదెంచుచుండెను. సాధారణమైన తెల్లమజిలీనుదుస్తు లాతనిచామనచాయమేనికిని విలువగల వజ్రాలతోఁగూడికొనిన కుచ్చుపాగా యాతనిశిరమునకును శోభదెచ్చుచుండెను. భుజములనిండ గప్పుకొనిన తేలికయైన యెఱ్ఱనిశాలువ మంచుగాలిసోకకుండ నతనిదేహము సంరక్షించుచుండెను. భవానిపేరిట విఖ్యాతమై భయంకరమైన యొక్క ఖడ్గమును ఖడ్గమృగచర్మముతోఁ జేయఁబడిన నల్లనిడాలును నడుమునకు వ్రేలాడుచుండెను. ముందునకుఁ జొచ్చిన యున్నతమైననాసికయు జెవులతో వియ్యమాడు విశాలమైనకన్నవయు, చక్కనిచిన్నినోరును సంకవులువంటిచెవులును నల్లదనమునఁ దుమ్మెదరెక్కలతోఁ దీటయి కొనలకు వంపులుదిరిగిన మీసములును నొకరీతిగాఁ జెవులక్రిందివఱకు వ్యాపించి కొంచెము వ్రేలాడుచుండిన చిన్నిగడ్డమును నాతనిమోమునకుం గలాకాంతులు దెల్పుచుండెను. ఆజానుబాహులును విశాలవక్షస్థలమును నతనిక్షత్రత్వము వెల్లడిచేయుచుండెను. ఆమహాపురుషుండు సమీపించినతోడనే శ్రీవారు విచ్చేయుచున్నారనియు మహారాజుగారు వేంచేయుచున్నారనియు నచ్చటిజనులు చెప్పుకొనిరి. ఆపల్కులు చెవులఁబడఁగానే తొట్రుపాటుతో నటనున్న కొత్వాలావచ్చుచున్న పురుషునిడాసి యతనికిఁ జేయూతయిచ్చి

మెల్లగా జనమధ్యముననుండి వసిలించుకొనుచుఁ దీసికొనిపోయి యటనున్న గద్దెపైఁగూర్చుండఁజేసి ప్రక్కన నిల్వఁబడెను. ఆస్ఫురద్రూపి గద్దియ మెట్టిన తోడనే యచ్చటిజనములు 'జే శివాజిమహారాజాకు జే' యనియొక్క పెట్టునఁ గేకలువేయసాగిరి. అంత శివాజిరాజు శీవితో వెనుకప్రక్కనున్న బంగారు పూలుగల మొకమలు బెక్కెముపైఁ జేరఁబడి నిలబడినవారినెల్లఁ జేసన్నలచేఁ గూర్చుండబంచినపిమ్మటను బెక్కుఱు తత్సభకు నొకరివెంబడి నొకరువచ్చుచునే యుండిరి. ఇట్లు వచ్చుచున్న వారిలో బ్రాహ్మణులుదక్క దక్కుంగలవారు ప్రీతిపూర్వకముగాఁ జేయుసలాములకు మాఱుసలాములును నమస్కారములకుఁ బ్రతినమస్కారములును జేయుచుంటఁజేసి శివాజి కెత్తినకే లెత్తియేయుం డును. ఆమహారాజుగూర్చున్న గంటసేపుపిదప నతనికెదురుగానున్న కొండ లక్రిందనుండి కొమ్ములధ్వనులు పల్మఱు వినఁబడసాగెను. దారికానిదారిలోఁ బుట్టిన యాధ్వనులేమోయని సభవారందఱు వెఱగంది యాదిక్కునకుఁ దమ దృక్పథము నిగుడ్చిరి. అంతలోఁ గొందఱు మనుష్యులు సభాస్థలమున కనతిదూరమున నున్న యాయేటవాల్పుగిరులపైకి నెగఁబ్రాకి త్వరగావచ్చుచుండిరి. చురుకైనవారి వాలుచూపులును సాముకసరత్తులచే దండలుతిరిగినవారి భుజములును సుమారైదున్నరయడుగులుగల వారిదేహప్రమాణమును నడుమ నడివి పూలకుచ్చులుగల మోటుపాగాలును బరీక్షించి వారిని సులువుగా మావళ్లేసైనికులనుగా సభ్యులెఱింగిరి. పెద్దతుపాకియు మందుదట్టించిన కొమ్ములును గుండ్లసంచియు నొకమూపుపైఁ బొరలోనిపామువోలె వరలోనిముడ్చఁబడిన పెద్దకత్తియు వేఱొకమూపుపై వ్రేలాడుచుండ, విచ్చుబల్లెమును జిన్నబాకులును నడ్డిపక్కల వ్రేలాడుచుండ నించుకయు భారమునకు వేగక తేలికగా వచ్చుచున్న యామావళ్లేలను జూచువారికి వారిదేహసత్త్వాదులు పొడగట్టక మానవు. అట్లు వారు తమనాయకుండగు సూర్యాజితోఁ దమస్వామి మ్రోల కరుగుఁదెంచి "జే శివాజిమహారాజా" అని చేతులెత్తి జోహారుచేసి యొక్కప్రక్కకుఁ నొదిగి నిలఁబడిరి. శివాజి సుర్యాజి నాలింగనముచేసికొని సమయోచితముగా బల్కరించెను. తదనంతరంబ సూర్యాజి శివాజి నుద్దేశించి "దేవా! విజాపురి నవాబుపనుపున నతనిసేనానియఫ్జలానను వాఁడు ప్రచండ

సైన్యముదీసికొని కొంకణసీమపై దండెత్తికొన వచ్చినాడు. మాయన్న తా నాజీ వాఁ డేదిక్కునుండివచ్చునో కనిపెట్టుటకై వాయీగ్రామమున నిల్చియు న్నాఁడు. నేడో రేపో మాయన్న రానైయున్నాఁడు". అని యెఱింగించి భోజనానంతరమునను దక్కుఁగలసంగతులు విన్నవింతుననిచెప్పి శివాజి యనుజ్ఞ దీసికొని తనసైన్యముతోఁ గోటదెసకు నడచెను.

భవానీపూజార్థమై బ్రాహ్మణులను రావించి యందులకుఁ దగినవస్తుసా మగ్రి తెప్పించి తనకు వారు నియమించినచొప్పున వర్తింపుచుండెను. ఆవిప్రు లిదివఱకే తయారుచేయించిన బంగారురేకును జలకములతో నభిషేకముచేసి యందు చిత్రముగా రచింపఁబడిన శ్రీచక్రమునకు మంత్రములచేఁ బ్రాణప్రతి ష్ఠచేసి పదంపడి లలితాసహస్రనామము లుచ్చరించుచుఁ బూలచేఁ బూజింప దొడంగిరి. ఇట్టీతంతు కొంతవఱకు మధ్యాహ్నమునకుఁ బూర్తియగాటయు, పిదప శివాజి బ్రాహ్మణులకు మ్రొక్కి వారియనుజ్ఞఁబడసి కోటకుఁబోయెను. శివాజి వెంబడినే పూజారులుతక్క యచ్చటిజనము భోజనార్థమై శిబిరము లకు వేంచేసిరి.

—oo:❀:oo—

# అయిదవ ప్రకరణము.

---

జిజాబాయి యహమ్మదనగరమేలు నిజామశాహి సేనానులలోఁ బ్రసిద్ధి కెక్కిన లుకాజీజాధవరాయనిపుత్రిక. భర్తయగు శహాజి తుకాబాయి యను నొర్తుఁ జేపట్టి తనపెద్దకుమారుఁడగు శంభోజినిదీసికొని తంజావూరుపోయిన పిమ్మటఁ బతియనుమతిఁ జొప్పునఁ బునహాపురిలోఁ జిన్నికొడుకగు శివాజిని బెట్టుకొని నివసింపఁజొచ్చెను. నిజజీవనోపాధికై శహాజి వ్రాసియిచ్చిన పునహాజాగీరు నిజాల బాగుచేయించుటయేకాక శివాజికిఁ దండ్రిదగ్గఱలేని లోటు లేకుండ సాముకసరత్తులందును విలువిద్యయందును నాఱితేరునట్లు గావించెను. మఱియు నతనిని సకలధర్మములతోఁబాటు శుక్రనీతిని సాంతముగాఁ జదువఁ జేసి లౌకికవ్యవహారములందుఁ బ్రౌఢతమునిఁగావించి రాజ్యస్థాపనచేయవలసిన దని ప్రేరేపించెను. కుమారాభ్యుదయముగోరి ప్రతినిత్యము భవానిని బూజించుట విధిగాఁ జేసికొనెను. ఇట్టిపూజావిశేషమువలననో లేక జాధవరావునందన యాటవలననోకాని జిజాబాయి యాజ్ఞానుగ్రహములు భీమకోమలములై యెంతధీరులను వశవర్తుల జేయుచుండెను. భర్తను విడిచియుంటవలనగల్గిన విరక్తిచేత నాభర్తరాలు విశేషాభరణంబులును జీనిచీనాంబరములును దాల్పక నియమితాహారములు పుచ్చుకొనుచు వేషభాషాదులందు గృహిణికిని యోగినికిని మధ్యస్థురాలుగానుండెను. కృశించిన పరిమితగాత్రముగలదయ్యు నుదుట ధరించెడు సిందూరతిలకముతోడను సదాలోచనలయందుఁ బరివర్తించు లోచనద్వయముతోడను ముక్కరనడ్డబొసనుదాల్చుటచేఁ గొంచెము ముందునకుఁ జొచ్చుకొనునట్టులుండు నాసికతోడను గన్నపూజుంకాలభారంబుచే నించుకజాఱిన కర్ణపాళితోడ నవ్వీరమాత లోకమాతను జాలమట్టుకుఁ బోలియుండెను. సాధారణముగా స్త్రీలకలవడిన మనోగాంభీర్యమును వాక్పారికల్భక్తిమును గల్గియుండుటయేకాక సాహసౌదార్యములందును గోవిప్రదేవతాది భక్తి

యందును శివాజినిజూచిన జిజాబాయిని జిజాబాయినిజూచిన శివాజిని జూడ నక్కఱలేదు. పట్టినపంతము నెగ్గించుకొంటయందన్నో యామె కామెయే సాటి. ఇంతేటికి నవ్వీరమాతను బాగుగాఁ బరిశీలించిన రెండవకుంతి యని చెప్పనొప్పును.

ప్రతాపగడకు సూర్యాజి వచ్చేసిన నాటిదినంబున నెప్పటియట్లు దేవీపూజలు గావించుకొని భోజనముచేయకయే తనగదిలోఁగూర్చుండి సూర్యాజి తెచ్చిన సమాచారములు వింటవలననో లేక మఱేకారణమువలననో కాని యాకసమువంకఁ జూచుచు దీర్ఘాలోచనలు సల్పుచుండెను.

శివాజి భోజనానంతరమున సూర్యాజిని గలసికొని పేష్వామోరోపంతు పింగళేజింజిరాదుర్గమును సాధింపఁబోయినాఁడనియు నతనిని వేగముగాఁదీసికొని రావలసినదనియు సూర్యాజిఁ బుత్తెంచి రాత్రిజరుగవలసిన కథలకుగాను దగినయేర్పాటులు చేయవలసినదని కృష్ణాజికి వర్తమానమంపి తాను దిన్నగాఁ దల్లియుండు మందిరంబునకు నడిచెను. అట జననికి సాష్టాంగనమస్కారములు చేసి యొదిగి నిలబడ నామె యాతనికిఁదగుమాడ్కి దీవించి శిరముమూర్కొని తనవద్దఁ గూర్చుండఁజేసి చేతులతోఁ గొడుకుమేనెల్ల నిమిరి శివాజిముఖ మెప్పటివలె వికాసముగా నుండమిఁ గనిపెట్టి కొంతసేపు తా నాందోళపడఁ జొచ్చెను. ఇట్లు తల్లివలనఁ దనువు బలుమాఱు నిమరఁబడినవాఁడై యదివఱకుఁ దనకుఁగల్గిన శిరోభారము చాలమట్టుకుఁ దగ్గుటవలన మదికిఁ గొంతయుత్సాహమును ముఖమునకుఁ గొంతవికాసముఁగల్గి తనరెను. ప్రేమగల్గిన జనయిత్రి హస్తస్పర్శమును ననుకూలవతియగు భార్యసంభాషణములును గడుపునఁబుట్టిన బిడ్డలచేష్టలును నెట్టియాపదలలో మునిఁగినవారికైనను గొంతవిశ్రాంతి గల్గింపక మానవుగదా! అంతట జిజాబాయి కుమారు నుద్దేశించి "నాయనా! యిందాక నీమోము నిర్వికాసముగానుండెను. దానికి హేతువేమైయుండునో తెలిసికోఁగోరుచున్నాను." అని యనుటయు సుల్తానునియోగంబున ఖానుడనువా డపరిమితబలంబుతోడ్కొని దాడివెడలినసంగతి దెలిసికొంటిననియు, తత్ప్రతీకారముపాలుపోక యట్లు విచారించుచుంటిననియు శివాజితల్లికి నెఱింగించి పదంపడి యిట్లు ప్రసంగింపఁ దొడంగిరి.

శివాజీ—అమ్మా! నీ వీదినము దేవితో నుంటివా? నే నెంతధ్యానించినను నా మె ప్రసన్నురాలు కాదయ్యె. మనమీద భవానీమాతకటాక్షము దప్పిపోయెనా యేమి?

జిజా—తండ్రీ! ఆమెయుద్దేశంబు లెవ్వ రెఱుంగ నోపుదురు. లోకేశ్వరియైన దేవిచేతిలోని గీలుబొమ్మలవలె మనమున్నారము. ఆయమ్మ యేమి చేసినను జేయంగలదు. నీవూరక యధైర్యమందకుము. మనలఁ గష్టపెట్టుటయే భవానితలంపైనయెడలఁ దప్పించుకొంటకు శక్తిగలదా!

శివాజీ—ఔను నిజమేకాని ప్రస్తుతము పైఁబడ్డగండ మెట్లు దాటగలమో తెలియకున్నది.

జిజా—మనల నిన్నాళ్లును గంటికి ఱెప్పవలెఁ గాచుచున్న పార్వతియే మనకుఁ దోడ్పడును.

శివాజీ—మనమాట కేమికాని మనయుద్యమము కొనసాగునో లేదో యని సంశయ మందవలసివచ్చుచున్నది.

జిజా—నీ వారంభించిన ఘనోద్యమము సాగునో సాగదో యనుశంక విడిచిపెట్టుము. ఆరంభించినకార్యము నడుమ విడిచిపెట్టుట యుత్తమపురుషుల లక్షణముకాదు. గోద్విజకాంతాది సాధుసంరక్షణమే నీకు విధ్యుక్తధర్మమని యెఱుంగుము. నీవు సంకల్పించినకార్య మేదినిర్విఘ్నముగా నెఱవేఱలేదు?

శివాజీ—ఔను. అందువలననే నిరుత్సాహము జెందక సాహసలక్ష్మిని విడనాడకుంటిని. ఖాను నెదిరించుట యిప్పటిలోఁ గష్టసాధ్యమని నాహితపురోహితులు బోధించుచున్నారు.

జిజా—మీ తండ్రిసంగతి జ్ఞాపకము తెచ్చుకొనుము. ఇట్లనుమానించుటచేత నే సుమీ తుదకు మీ నాయన భగ్నమనోరథుం డౌటయేకాక చెఱయును జరిమానయును జెంది యవమానము పొందవలసివచ్చెను. నీవుమాత్ర మాలాగు చెడిపోకుమా? సందేహించి వెనుదీయుటకంటెఁ దత్ప్రయత్నమున నీవును నీతోఁబాటు నేనును మృతిఁజెందినను మేలే?

శివాజీ—నీవు చెప్పినదంతయు నాకు సమ్మతమే కాని ఖానునితోఁ గయ్యము పెట్టుకొన్న విజాపురివారికిని మనకును దీరని వైరము రగులుకొని యుభయవినాశనమునకుఁ గారణమగును. మొగలాయిచక్రవర్తుల రాజ్యతృష్ణకు మఱింత యనుకూలంబగును. కావున నేమిచేయుటకుఁ బాలుపోకున్నది. మనము చేసికొన్న యేర్పాటులన్నియు గ్రహించినట్లు తోఁచుచున్నది. వేగులవాండ్రఁబంపి మనగుట్టుమట్టును దెలిసికొనుచున్నారఁట. సుల్తానుతోఁ గయ్యమునకుఁ బూనుకొనుట కొండతోఁ దగరు మార్కొనినయట్లగునని కొందఱు నన్ను భయపెట్టుచున్నారు. నిజముగా మనకువచ్చినభయ మేమియులేదు కాని మనయుద్యమము ఫలించునో లేదో యనువిషయమే యిప్పటి నావిషాదమునకు హేతువై యున్నది.

జిజా—కుమారకా! భయమును శంకనువిడిచి కార్యనిశ్చయుండవు కమ్ము. గోవిప్రసాధులకు నుపకార మొనర్చుటకంటెఁ బుణ్యంబుకలదే? మీ తండ్రివోలె గడియకు నొకరిమాటవిని చెడిపోకుము స్వతంత్రుండవై మెలంగుము నీకు జయంబును యశస్సు నవశ్యము సిద్ధించును.

శివాజీ—తల్లీ! నీహెచ్చరికమాటలవలన నాకుం గల్గిన మనోవిచారాదులు నిర్వర్తించినవి. నే నింతవఱకుఁ గథలో నీసంగతివేసి సభ్యుల యభిప్రాయము తెలిసికొన నిశ్చయించితిని. నీయుపదేశము విన్నపిమ్మట వారితో నీయంశము చర్చించుట యనవసరమని తెలిసికొంటిని.

జిజా—మనహిందువులమందఱము నైకమత్యముగల్గి వర్తించుట యుత్కృష్టధర్మమనియు నట్లు వర్తించితిమేని దుర్భరదాస్యదారిద్ర్యంబులు నిర్వర్తించుననియు వారికి బోధింపుము.

శివాజీ—అమ్మా! నీచెప్పినచొప్పున మనవారికి బోధించెదను. నామాటలు వారుపాటించిరేని మన మనుకొన్నట్లు స్వతంత్రరాజ్యము స్థాపించి కాని స్థాపింపకగాని దక్కనుసుల్తానులతోఁ గలసి మొగలులను సర్వ

దానది దాటకుండజేసి నీకొక్కిడీర్తును. ఈనాచెప్పుమాటలకు నెన్న టికి వ్యతిరిక్తముగా నడువనని త్రిశుద్ధిగాఁ జెప్పుచున్నాఁడను.

జిజా—పట్టీ! నీ వాడినదానికంటె నెక్కుడు చేయఁగల్గిన సమర్థుఁడవని యే నెఱుంగనే? ఐనను జెప్పవలసినదానను గాబట్టి యింతదూరము తరచి చెప్పితిని. నీవాక్యములందు నాకు విశ్వాసము మెండుగలదు. సాయం కాలము కావచ్చినది. కథకుఁ బొమ్ము. అచ్చటివారితో వారిసమయము వచ్చినది చెప్పుము. ఇంతకు నీవు సంకల్పసిద్ధుండవు. నీ కవశ్యము విజయము సిద్ధించునట్లు భవానిఁ బ్రార్థించెదనులే!

శివాజి—తల్లీ! 'నమాతుఃపరదేవతా' అనువచనార్థం బెఱుంగనివాఁడనే. నీ యానతియైనచో నెట్టికార్యము సాధించుటకు నిశ్చయించుకొని యు న్నాఁడను.

అని జననిచరణంబుల కెరఁగి యామెదీవనలు వడసి పోయివచ్చెద నని సెలవుతీసికొని శివాజి యచ్చోటువాసిపోయెను.



# ఆఱవ ప్రకరణము.

—oo:✽:oo—

అటఁ దనరాకకై యెదురుచూచుచున్న బంధుమిత్ర పురోహితముఖ్యు లతోఁ గలసికొని శివాజి యాసంజవేళ నిండువైభవముతో సభాప్రవేశమునకు నడువఁ జొచ్చెను. అత్తఱిఁ గొందఱు కొమ్ములూఁదిరి. కొందఱు సంకుపులు పూరించిరి. కొందఱు మృదంగములు మ్రోగించిరి. మఱియుఁ గొంద ఱడు గడుగునకు శివాజిబిరుదంబుల నుగ్గడించిరి. ఇట్లు వీరందఱితోఁ గూడుకొని శివాజి యాసభాకూటము ప్రవేశించి యెల్లరను వారివారి యథాస్థానములఁ గూర్చుండ నియోగించి తానుమాత్రము దేవీపూజలు జరుగుస్థలమునకు నేఁగి యట నొకభద్రపీఠమున నధిష్ఠించెను. భవానీప్రీత్యర్థము కొందఱు ద్విజేత రులు కొన్ని మేఁకలును గొఱ్ఱెలను దెచ్చి బలియిచ్చిరి. శేషించిన తంతుపూ జారులు రాత్రి పదులోగా సమాప్తము చేసినవెనుక శివాజి ప్రొద్దునఁ గూ ర్చున్న గద్దియపై యధివసించెను.

అంతఁ బ్రభాకరుండు పశ్చిమవార్ధికి నొరగుటఁ జూచి యాకొల్వు కూటము గాజుబుడ్డి దీపములచేతను దివిటీలచేతను గొందఱు పరిచారకులు వెల్గిం పఁ జేసిరి. ఇదిచూచి భానుమంతుం డాదినమున నస్తమించుట మానుకొని హరి కథావలోకనార్థమై బహుమూర్తులు దాల్చి విచ్చేసెనా యనునట్లు తత్ప్రదేశ మాదీపకలికలచే మిగులఁ బ్రకాశింపఁ జొచ్చెను. శివాజియానతిప్రకారము నాటకు లారేయి రామకథ ప్రదర్శింపఁ జొచ్చిరి. వారు కథాప్రారంభము గావించినతోడనే యంతవఱకుఁ జెలరేఁగుచున్న జనుల కోలాహలమెల్ల నడంగి నిశ్శబ్దముగా నుండెను. ఇందు స్త్రీలు లేకుంటవలన నా నిశ్శబ్దమునకుఁ గొంత సహకారియై యున్నను సభికులు పకపక మని నవ్వుచు చిటపటమని చప్పట్లు చరచుచుంటయేకాక బళిరే బాపురే సెబాసను నుత్సాహసూచకసూక్తులచే నారంగస్థలము నప్పుడప్పుడు ధ్వనింపఁ జేయుచుండిరి.

ఇట్లు వీరు నాటకమును వీక్షించుచుండఁగా సగమురాత్రిచెల్లెను; కాని యెంతరాత్రి గడచెనో కథావిశేషమునఁ బరవశదేహులౌటచే నందలివారి కెవ్వరికిఁ దెలియఁ దయ్యె. అత్తటి నొకమావళీ శూరశిఖామణి హయారూఢుండై యచ్చటికిఁ జనుదెంచుచుండెను. గుఱ్ఱపుగిట్టల చప్పుడువలనను దాని సకిలింపులవలనను నాజాడ సభవారు దెలిసికొని యీవచ్చువా డెవ్వఁడో యని పరిశీలించుచుండిరి. అత్తావునకు సమీపించిన పిమ్మట నశ్వమునుండి దిగి యావీరుఁడు పాదచారియై మెడక్రిందినుండి తలకుఁ గట్టుకొన్న రుమాలు విప్పుకొనుచుఁ ద్వరగా నాసభలోనికి విచ్చేయుచుండెను. అతండు మోముపై నున్నగుడ్డ సడలించినతరువాత నచ్చటివారిలో నొక్కఁడు మొట్టమొదటఁ దానాజి యని కేకలువేసెను. ఆపై నెల్లరు తానాజి తానాజి యని చెప్పుకొనసాగిరి. ఇంతలోనతండుక్రిక్కిఱిసియున్న జనమధ్యముననుండి యెట్లెట్లో దారిచేసికొనుచు శివాజియున్న దెసకు నరుగుచుండెను. శివాజి యదిచూచి మంత్రులతో లేచి యెదురుగా రెండడుగులు నడిచి యాలింగనంబుచేసికొని యిట్టి నిశీథకాలమునఁ దానాజి వచ్చినందులకు నేదో యొకవిడ్డూరము జరిగియుండు నని తానాతనితోనిట్టు లనియె. “మాలసూరే! ఏమివిశేషములు చెప్ప వచ్చితివి.” అనుడు నతండిట్లనియె. “దేవా! ఏమని విన్నవింతును. జట్టూగ్రామములో నిల్చియున్న నే నొకదుఃఖవార్త నాలించితిని. ఆవెంట నే గడితడవాగక మీకునుమనవారికి నెఱింగింప నిశ్చయించి యి ట్టీవేళకు నే తెంచితి” నని కొంతసేపాగి సభవారినుద్దేశించి యిట్లనియె. “ఓ నాదేశీయ సోదరులారా! నన్ను మన్నించి కొంచెముసేపు మీరెల్లరు నిల్వవలసినది. మీకొకవార్త దెల్పవచ్చితిని.” అనిపల్కఁగా నాసభవారెల్లరు సంభ్రమముతో దిగ్గనలేచి యయ్యది యాలించుటకై యాతురతతోఁ దానాజిదిక్కునకు మొగంబుదిప్పి నిల్వఁబడిరి. అటుమీఁదట నాతండు కంఠమెత్తి బిగ్గఱగా నిట్లు వాక్రుచ్చెను. హిందూమతాభిమానులారా! కార్యశూరులారా! మీరు సావధానచిత్తులరై నామాట లాలకింపుడు. మన దినంబులుచూడ నేమియు బాగుగానున్నట్లు తోఁపదు. అక్కటా! మనతులజామాత కడు నవమానింపఁబడెను. అది యెట్లంటిరేని యాదేవి నప్జల్లానుడు నేలఁ గూలఁదన్ని గోరక్తముతో గుడినెల్ల ముంచెత్తి గ్రామములోని సర్వద్రవ్య

ములను బలిమిని చేకొనిపోయెను. ఇంతకంటె దారుణ మేమున్నది. ఇంతకంటెఁ ఘోర మేమున్నది. స్వయముగాఁ బరిశీలింప దలంచితిరేని పోయి చూడ వచ్చును. నామాటలు మున్నాటికి నిజంబు లని నమ్మదుర కాక'' అని యను టయు నాసభయం దొక్క పెట్టున హాహారావంబులు నింగిముట్ట బయలు వెడలెను. అక్కడ కొందఱు గుండెలు బాదుకొనుచుఁ బెద్దపెట్టున రోదనము చేసిరి. కొందఱు నోరు నెత్తి కొట్టుకొనుచుఁ బొగలఁజొచ్చిరి. మఱికొందఱు తలగుడ్డలను నేలనువైచి కెవ్వున కేకలు పెట్టిరి. అత్తఱి శివాజి పట్టరానికోప మునఁ జెంగున గద్దెపై కెగసి నిజకరవాలంబు వరలోనుండి యూడఁబెఱికి యచ్చట వారు విన గట్టిగా నిట్లు వాకొనెను. "చూచితిరా ! యీ నా ఖడ్గము దీనిపేరు భవానియని మీ రెఱింగియేయున్నారు. మనతల్లిపేరు పెట్టు టకు మీకు వేఱె చెప్ప నక్కఱలేదుకదా? ఇదె చూడుడు. బహుదినంబులై రక్తపానము చేయమి నియ్యది కొంత త్రుప్పుపట్టి కాంతిహీనమై యున్నది. బాపురే ! మంచి యదనువచ్చినది. శత్రుదేహములపై సానపెట్టెదను. భవా నికిఁ దనివిదీఱునట్లు రుధిరపానము చేయనిత్తును. ఇదే కత్తి ముట్టి ప్రమాణము చేయుచున్నాను. మీ రేమిబదులుచెప్పెదురో చెప్పుఁడనిపల్కి పదంపడి 'హరహర మహాదేవ్' అని గొప్ప సింహనాదము సలుపుచు సభ్యులకన్నుల మిఱుమిట్లు గొల్పునట్లుగా నిజాసిపత్రంబు ఝుళిపించి యద్దానిని జిత్రవిచిత్ర ముగాఁ ద్రిప్పసాగెను. ప్రభువు గంభీరసూక్తులకును దత్సింహనాదంబునకుఁ గడు నుద్రేకించి పట్టరాని తమకంబున నాతత్‌క్షణమే 'హరహరమహాదేవ్' అనుచు దిక్కులు పిక్కటిల్ల సింహధ్వానములుచేయుచు నటఁ గత్తిపట్టినమగ వా రెల్లరు శివాజి ననుకరించి తమకరవాలంబుల నట్లె పదినిముసములు ద్రిప్ప జొచ్చిరి.

ఇట్లు యుద్ధభూమిలో విజృంభించినపగిది నచ్చటివారు చెలరేగుచుండ నంతలోఁ దానాజి ఖాను ప్రతాపగడకు వచ్చుచున్నాడనియు నాతనిని మార్కొంటకుఁ దగినప్రయత్నములు చేయవలసియుండుననియు రాజున కెఱిం గింప నతండు చేసన్నలచే నాసభాకోలాహలము నివారించి యిట్లనియె. "ఏమిది ! యిప్పడే యీలము తటస్థించినట్లు మీరు గమనించుచున్నారే ?

ఇంత తొందరపడవలసినపనిలేదు. ఇది సమయముకాదు మీరు నిశ్చయముగా మహమ్మదీయులపైఁ బగదీర్చుకోవలెననియుఁ దులజామాతకు నూడుదీర్పవలెననియు నొట్టుపెట్టుకొంటిరేని యీయమ్మయే మనకుఁదగినవేళ నిరూపించును. అట్లుచేసి వారిరక్తము కసిదీఱగ్రోలి కడుపునింపుకొనును. మీకు బెగడవలసినపనిలేదు. ఈవార్త ఘోరమైనదియు సహింపరానిదియునౌట నిక్కమేకాని తుదకు మే లాపాదించును. అది యెట్లంటిరేని వినుండు. మ్లేచ్ఛులు చేసిన యీదౌర్జన్యములకుఁ దదాశ్రితులగు హిందువులు మనలోఁ జేరకమానరు. అంత మనదేశస్థులమందఱ మొక్కమొగంబై నడిచినచో నఫ్జల్లానుఁడెంత ? వానినిబంపిన నవాబెంత ? ఒకవేళ ఢిల్లీచక్రవర్తి ప్రతిఘటించినను బగాభవమందక మానఁడు. గోభూదేవతాదులకు సౌఖ్యము గూర్పకున్నచో మనము కత్తిపట్టి యేమిసార్థకము ? కాని యీనవరాత్రములలో దేవీపూజలు మాను కొని మన మిష్టేకయ్యమునకుఁ బోనక్కఱలేదు. కావునఁ బ్రస్తుతము మీరు శాంతించి రామచంద్రకథను వీక్షింపుఁడు" అని యిట్లు సభవారి నెప్పటియట్ల కూర్చుండ నియోగించి తానును గద్దెపై నధిష్ఠించి మీసముమీఁద నెడమచేయివేసి నాటకులతో నిట్లనియె. "ఓరీ! మేము ఖానునకు జడిసి కథ మానుకొందుమా? మీ రెప్పటియట్ల జరిగింపుఁడు. నావుడు వారు నట్లుగావింపఁ జూచి యాసమయమున విశ్వామిత్రయాగసంరక్షణార్థమై రాముఁడు లక్ష్మణసహాయుండై ధనుర్బాణంబులధరించి యజ్ఞవాటికకు నేతెంచిన వేలకొలంది రక్కసుల నుక్కడంచుకథ విన్నాణంబుగాఁ బ్రదర్శింపఁ జొచ్చిరి.

నిజముగా నట్లు జఱుగుచున్నదని భ్రమించుటచేతనో రామచంద్రుని మీఁద భక్తివిశ్వాసములచేతనో లేక యిందాక తానాజీ తెలియఁజేసిన వార్తావిశేషముచేతనోకాని శివాజీ నైమఱచి గద్దియనుండి దుమికి యందఱు నివ్వెఱగందుచుండఁ జెంగుచెంగున రెండుగంతులువేసి రంగస్థలమున నిల్వఁబడి చేపట్టిన భవానిఖడ్గము జళిపింపసాగెను. ఇదియంతయుఁ గనిపెట్టుచున్న కృష్ణాజి భాస్కరుఁడును దానాజిమాలసూరేయును దోడ్తోఁబోయి శివాజీ రెండుచేతులును గట్టిగా నదిమిపట్టుకొని యది నాటకమని సమాధానపఱచి యంతలో

నాకథముగింప నుత్తరవుచేసి తమరాజుఁదోడ్కొని కోటలోనికరిగిరి. తక్కిన వారెల్లరు నచ్చోటువిడిచి శివాజి యొదలెఱుంగక కావించినచేతఁగూర్చి పలువిధములుగాఁ జెప్పుకొంచు నాటకుల యద్భుతప్రదర్శనముఁగూర్చి మెచ్చుకొనుచుఁ దమతమశిబిరములకు నేఁగి హాయిగా నిద్రింపఁజొచ్చిరి.



# ఏడవ ప్రకరణము.



అఫ్జల్ఖాను విజాపురిసుల్తాను ముఖ్యసేనాని. ఈతఁడు సుల్తాను నోడం బఱిచి శివాజిపై దండెత్తిపోయిన నాఁటికి రమారమి యరువదేండ్లవాఁడై యుండెను. కాని మైరంగుబట్టియు మేనుగట్టితనముబట్టియుఁ జూచినఁ బోఁత పోసిన రాగిప్రతిమవలె నుండియున్న వయస్సుకంటెఁ జాలదక్కువగాఁ గనుబడుచుండెను. పఠానులకు సహజమైన యొడ్డుపొడుగును బొడుగుగడ్డంబును గల్గి సంతతము కల్లుత్రాగుటచే నెఱ్ఱుపడిన మిడిగుడ్లతోడను మీనులవఱకు వ్యాపించిన గరిమీసాలతోడనుఁ జూపఱకు బెదురు పుట్టించుచుండెను. అట్టియాతఁడొక్కనాఁడు తనపరిచరు నొక్కని బిల్పించుకొని వానితో నిట్లు ప్రసంగింపఁదొడంగెను.

"ఓయీ! సయ్యదుబందా! నీవు నాకత్యంతబంధుఁడై మెలంగుట వలన నీతోఁ గొన్ని రహస్యములు చెప్పుచున్నాఁడను. రామోజి పరభుని నీవ యెఱింగియుందువుకదా! అతండు మొదట మన బిజాపురిలో నుండువాఁడు. ఆయనకుఁ బ్రభావతినా నొక్కరూపవతియగు కుమారిక గలదు. ఆసుందరిని మావాఁడు ఫజీలు మోహపడి యది యొకనాఁ డుపవనమునఁ దోడిచెలికత్తెలతో విహరించుచుండఁగాఁ బోయి యామెను దన్ను వరింపు మని నిర్బంధపెట్టెను. అచ్చటికిఁ దమతల్లిదండ్రు లప్పటిలో రా నైయున్నా రనియుఁ దగినసమయముచూచి తానే వత్తు ననియు నొడంబఱిచిన నాముద్దులగుమ్మ మాటలునమ్మికొని ఫజీ లామెనువిడిచి యెట్లో కష్టముమీఁద నింటికిఁ జేరుకొనెను. అటమీఁదట నామదవతి తనజనకులకు నీవర్తమాన మెఱింగించి యుండనోపు. వారు కూఁతును మావానికిచ్చుట కిష్టములేక కాబోలు నిజోద్యోగము కూడ వర్జించి యెవరికిఁ దెలియకుండ నదిజరగిన యొకటిరెండుదినాలలో రాజధానినివిడిచి కోంకణసీమకుఁ బాఱిపోయిరి. అట్లు రామోజి సకుటుంబముగాఁ

దరలిపోయినసంగతి మావాఁ డెట్లో నెలదినము లైనతరువాతఁ దెలిసికొని గూఢముగాఁ గొందఱు చారులఁబంపి రామోజికుటుంబము తులజాపురిలోనుంటఁ దెలిసికొని యచ్చటి పూజారికిఁ గొంతద్రవ్యము ముట్టచెప్పుదుననియుఁ దన కార్యము నెఱవేర్పుమనియు వానినెన్నోవిధములఁ బల్మఱు చారులంబంపి బలవంత పెట్టెను. కాని వాఁ డిదిగోయదుగోయని మాటలతోఁ బెద్దకాలము ప్రొద్దుపుచ్చుటఁజేసి విసిగి నిరాశుఁడై తన్మనోవ్యాధిచే మంచముపట్టి నానాటికిఁ గృశించుచువచ్చెను. మొట్టమొదట నదిరోగముగా భ్రమపడి యనేకౌషధములు ఫకీలునకు నిప్పించితినిగాని పిదప వానిసఖులవలన వానినిజావస్థ యెఱింగి "ప్రభావతి నెట్లైనను నీకుఁగూర్తును నీవంతమానుమని వానికిఁ దగుమాడ్కి బోధించి తత్కార్యసాధనమునకై బహుప్రయత్నములుచేసియు శివాజి సర్దారులమూలమున నిర్వహింపకునికి నేనీదండయాత్రగల్పించితిని. రాజద్రోహియగు శివాజిని గట్టితెత్తునని యదిల్షాహాకు నొప్పించి యామిషమున నేనీసైన్యమును దోడ్కొనివచ్చితిని. కాని యతఁ డొకవేళ లభింపకపోయినను సరే ప్రభావతి పట్టువడినచో మరాటీలతోఁ బోరాటము మాని రాజధానికిఁ బోనిశ్చయించితిని. కావలసినయెడల శివాజిని మఱొకప్పుడు పట్టుకోవచ్చును. ఇప్పుడతఁడు దుర్ఘటమైన ప్రతాపగడలో నున్నాఁడని తెలిసికొంటిని. అటకుఁ బోయి వానిఁబట్టుకోదలచుట గుహాలోని సింగమ్మునుబట్టుకొన యత్నించుట వంటిది. మన మొకవేళ సాహసించి ప్రతాపగడను ముట్టడించినను నతండు చిక్కనితోపదు. ప్రస్తుతము శివాజితో విరోధము పెట్టుకొన్నయెడలఁ బ్రభావతి మనకు వశమగుట దుర్లభమగును. శివాజి మనకుఁ బ్రభావతిని సమర్పించి విజాపురిసుల్తాను సామంతుండగుటకు సమ్మతించినచో నదియె నాకుఁజాలును. ఐనను నాయభిప్రాయముగోరి నాథునితో నెఱింగించి చూతుముగాక" అని కొంతతడవూరకుండి "నీయభిప్రాయమేమి?" అని యడుగుటయు వాఁడు మెల్లగా నిట్లనియె. స్వామీ! మీకు నే నాలోచన చెప్పువాఁడనే మీమాటకు నవాబుకూడ నడ్డుచెప్ప వెఱచును. షేరునకు నదల్షాహానవాబుగాని మీరేవిజాపురిరాజ్యమునకుఁ బ్రభువని ప్రజలెల్లరు భయ

భక్తులు గల్గియున్నారు. ఇట్టిచో మీ కెవ్వరెరుదుచెప్పవారు" అని యిరువురు. మాటలాడుచుండఁగా ఫజీల్లాను జంర్ఘూరరావును నచ్చోటికివచ్చెసిరి. అంత వారందఱు నీక్రియసంభాషించిరి.

అప్జలు—ఫజీల్! ప్రభావతిజాడ నీకేమైన దెలిసినదా?

ఫజీలు—తండ్రీ! మనజంర్ఘూరరావు ప్రేరితులై నల్గురుభటులు ప్రభావతిని రామారీగ్రామములోనున్నదని తెలిసికొనిపోయి గూఢముగాఁ దీసికొని వచ్చుచుండఁగా నింతలోఁ దెల్లవారెనట. అప్పుడు వారికేమియుఁ దోఁపక ప్రక్కనున్న నొక్కయడవికిం గొంపోయి తమలోనిద్దఱను నామదవతివద్దఁ గాపుంచి తక్కిన యిర్వురను భోజనపదార్థసంపాదన ముకై కదలి చేరువనున్న యూరికిఁబోయిరట. వంటకములకై కొని వారువచ్చునంతలోఁ గత్తివేటున నట నిద్దఱు చచ్చిపడియుండిరట. పిదప నారూపవతి యెందువెదికినను గానరామి వేసారి హతశేషులైన యిర్వురను నిన్న నేవచ్చి యది మాకెఱింగించినారు. ఇంతకుఁదప్ప నామానినిగూర్చి నే నేమియు నెఱుంగను.

అప్జల్—కుమారకా! అయ్యో! మన మెంతయదృష్టహీనులము. చేతికి లభించియు నక్కాంతామణి దక్కకుండెఁగదా! మనసేవకుల యజాగ్రత్తయే సుమా! యింతచేసినది. ఆతరుణియే వారిని వంచించి యెట్లో కడఁదేర్చి పాఱిపోయి యుండును. ఇంతకునైన దానికి విచారింప నేమిప్రయోజనము? ఎవ్వఁడురా యక్కడ?

భటుఁడు—(ప్రవేశించి) ఖాఁ౯ మహారాజ్! ఏమిమెుదల?

అప్జల్—ఓరీ నిన్నను మనవారుతీసికొవచ్చిన మరాటపురుషుల నిటకు సత్వరము తోడ్కొనిరమ్ము.

భటుఁడు—వల్లె (అని యచ్చోటువాసి నల్వురఁ దీసికొనివచ్చి ఖాను నెదుట నిలఁబెట్టెను).

అప్జల్—కుమారకా! చూచితే! ఈ నల్వురిలో రూపవంతులైన యీ యిర్వురలోఁ బెద్దవాఁడేచుమీ! బాజీపరభుపుత్రుండగు బాలాజి వీడె తుల

జాపురిలోనున్న ప్రభావతి నాపెత్తల్లిని బూజారి యాలోచనచొప్పున రాచూరిగ్రామమునకుఁ జేర్చిన టక్కరి.

ఫజీలు—ఔనౌను నేఁగూడ నిట్లే వింటిని.

అఫ్జలు—ఏమి బాలాజీ! నీవు ప్రభావతి యిప్పు డెటనున్నదో నిజముగా దాఁచక చెప్పుము. లేనిచో నీకీచెఱ దప్పుట యుండదు.

బాలాజి—ఖాన్సాహేబ్! మీరు తులజాపురికి రాకపూర్వమే నే రాచూరి కోటకుఁ బూజారి ప్రేరేపణఁ బ్రభావతిని గొంపోవుట నిజముకాని యావల నారూపవతిజాడ యెఱుంగను. ఎవ్వరో కొందఱు చోరులు మొన్న నే యయ్యంగనామణిని ముచ్చిలించినారనియు నామె జననియు బంధువులు తద్దయు బెంగపెట్టుకొని దుఃఖించుచున్నారనియుఁ గర్ణాకర్ణిగా వింటినేకాని మఱియొండేమియు నెఱుంగను. ఇంకపై మీచిత్తము నాభాగ్యము.

అఫ్జలు—ఓరీ! నీకీముగ్గురు నేమగుదురు? మీరెక్కడకు నేఁగుచున్నారు?

బాలాజి—శివాజిమహారాజుచేయు దేవీపూజను జూడఁగోరి ప్రతాపగడకుఁ బోవుచున్నారము. నాకు వీరుముగ్గురు బంధువులు.

అఫ్జలు—జంఝూఱరావూ! వీరిలో నేరినేని పోలికపట్టుదువే?

జంఝూఱ—ఖాౝసాహేబ్! బాలాజి నొకమాటు చూచినట్లు జ్ఞాపకమున్నది. కాని తక్కినవారి నెఱుంగను.

ఫజీలు—(ఆ పట్టువడిన నల్గురిలో లేఁబ్రాయమువాని నుద్దేశించి) అబ్బాయీ! నీకీబాలాజి యెట్టి చుట్టఱికము? నీపేరేమి? నీ వెవ్వరి చిన్నవాఁడవు?

అబ్బాయి—(వడంకి) అయ్యా! నాకు నితనికిఁ జుట్టఱికమేమియు లేదు. నేను బ్రాహ్మణకుమారుండను. నాపేరు దత్తు; మాతండ్రి నాచిన్ననాఁడే దేశాంతరమునకుఁ బోయినాఁడఁట.

ఫజీలు—పోని దానికేమికాని రామోజినిగాని యతనితనూజయౌ ప్రభావతినిగాని నీవెఱుంగుదువా? తెలిసినచో దాఁచక చెప్పుము.

దత్తు—(భయ మభినయించి) అయ్యా! నేను రామోజిని ప్రభావతి నొకటి రెండుసారులు చూచియుంటిని. వా రిప్పు డెచ్చటనున్నారో బాగుగా నెఱుంగను. సాహేబ్జీ మాతల్లికి నేనొక్కఁడనే కొమారుండను నన్ను విడిచియుండలేనని యామె నాతో నెంతచెప్పినను వినక యిట్లు పయనమైననాకుఁ దగినశిక్ష జరిగినది.

జంఝు—ర—ఓయీ దత్తూ! నిన్ను నీకోరినప్రకారము విడిచిపెట్టెదము. మాకు నేమైన నుపకారము చేయుదువా?

దత్తు—(వికాసముతో) నాబోటినిర్భాగ్యుఁడు మీకేమి యుపకారము చేయ గలఁడు? నాకు మాతల్లినిఁజూచుభాగ్య మికనుండునే? (అని వెక్కి వెక్కి యేడ్చును).

జంఝు—ర—నీవు మాకుఁజేయవలసినది విశేష మేమియులేదుకాని ప్రభావతి యిప్పు డెచ్చటనున్నదో వెదకి మాకుఁ దెలియఁజేయవలెను.

దత్తు—నామాటలయందుఁ దమకేమి నమ్మకముండు?

ఫజీలు—ప్రభావతి యెచ్చటనున్నది యెఱుంగుదువేని చెప్పుము. మాతండ్రి తోఁజెప్పి నీచెఱ విడిపించెదనులే?

అప్జలు—దత్తూ! నీమాటయందు మాకు నమ్మకము పూర్తిగాఁగలదు. నీవు కల్ల కపట మెఱుంగనిపిల్లవాఁడవని నీస్వరూపమే చాటుచున్నది. నీ కేమైనను సొమ్ము కావలసిన నిచ్చెదము చెప్పుము.

జంఝు—ర—ఓయీ! యేల బేలవై యూరకుండెదవు? మీతల్లిని జూడవలె నని నీకు లేదా? ఎఱింగెదవేని తెల్పి నీచెఱ విడిపించుకొనుము.

బాలాజి—దత్తూ! నీకుఁ దెలిసినచోఁ జెప్పుము నీమూలమున మాకు విముక్తి గల్గును.

సయ్యాదు—ఓరీదొంగా? నిన్నుమాత్రము విడిచిపెట్టుదుమే? నీవు దత్తుమొ గమువైపు చూచుచు వానిం గన్నులతోఁ జెప్పవలదనికాబోలు సైగ

చేయుచున్నావు. నీవూాలమునఁగదా ! యింత యదరినది. ఇస్సీ ! యింక నోరెత్తి మాటలాడిన నాక త్తిని నోటిలోనికి గ్రుచ్చెదనుజుమూ.

ఫజీలు—దత్తూ ! నీవెఱింగినమట్టుకుఁ జెప్పుము. నీవుఁదగిన బహుమానము చేసెదము. నిన్ను విడిచిపెట్టెదములే ?

దత్తు—మీయందఱికి నాపై నిర్హేతుకముగా నింతదయ గల్గుటకు నాపూర్వ పుణ్యమెట్టిదో? మీరందఱు నన్నిన్నిసారులు ప్రత్యర్థానముచేసి యడుగుచుండఁగా నాకుఁ దెలిసినది చెప్పక యనృతదోషము పొంద నేల ? ఓకృపాపింఢులారా ! నేనసత్యము చెప్పుటకు మదినొల్లను. బాగుగా నెఱుంగనని యిదివఱకే తెల్పియుంటినిగదా ! ఆ నామాటల తాత్ప ర్యము రసజ్ఞులగు మీరు గ్రహించినందులకే దైవమును వేయివిధములఁ బ్రార్థించుచున్నాను.

ఫజీలు—తక్కినవారిని విడిచి నిన్నింతదూరము తఱచియడుగుట కిదియే కార ణము. నిజము చెప్పిన దేవుఁడు సంతోషించును. ఏమీ ! బాలాజిని జూచి సంకోచించుచున్నావా ? అట్లైన వాని నిటనుండి యిప్పుడే తొలగించెదను.

దత్తు—నాకొక రేమిచేయగలరు? నిజము చెప్పఁదలచుకొన్న నేను వీరువారన్నా రని వెనుదీయుదునే ? నామాటలు విశ్వసించెదరేని తెలిసినమట్టుకుఁ జెప్పుచున్నాను. ప్రభావతి వాయీగ్రామములోనున్నట్లు మొన్న నెవరో మాయూరిలో ననుకొనుచుండ వింటిని.

ఫజీలు—(సంభ్రమముతో) ఏమేమీ ! వాయీగ్రామములోనా ! అది యెక్కడ ? ఇక్కడి కెంతదూరము ?

జంఝూర—(పకపకనవ్వుచు) వాయి యిటకు రెండురోజుల ప్రయాణములో నున్నది. అతం డింక నేమో చెప్పుచున్నాఁడు. ఇంత తొందరేల ?

దత్తు—వాయీగ్రామములోనే యుప్పాలుండవచ్చును. ఆమె నిటీకల నెవరో చోరు లింటనుండే యర్ధరాత్రివేళ మోసికొనిపోయినారనియు నా

యింతి యొట్లో తప్పించుకొని వాయీపల్లిఁ జేరుకొన్నదనియు నచ్చటకు రాచూరునుండి యామెతల్లి వచ్చినదనియు నాలకించితిని. కాబట్టి వాయిలోనో లేక రాచూరిలోనో ప్రభావతి యుండనోపు.

అప్జలు—దత్తూ! అట్లైన మా కాసుందరి చిక్కుటెట్లు!

దత్తు—సాహేబుగారూ? మీకు నే యోచనచెప్పనంతవాఁడనే? అయినను మీ రడిగినవారు కావున నాకుఁ దోఁచినది చెప్పకుంటతగదు. మీరు వేగులవాండ్ర నిర్వురను నావెంట నంపుఁడు. వారివలన మీ కాసుకుమారి యెచ్చటనున్నది తెలియఁజేసెదను. మీ రీఁదలచుకొన్న పారితోషిక ముకూడ వెనుకనుండి యీవచ్చును. కార్యము సమకూడినప్పుడు సామ్మనకేమిగాని నా కొకచిన్ని యుద్యోగ మిప్పించినఁజాలును, నేఁ గడుబీదవాఁడను.

అప్జలు—(పకపకనవ్వి) ఓయీ నీమూలమునఁ బ్రభావతి లభించెనేని నీవు కోరిన యుద్యోగమేకాదు. పదిబండ్లువచ్చు భూమిసైతము వ్రాసి యిచ్చెదను.

ఫజీలు—మాతండ్రిగా రాడితప్పనివారని యెఱుంగుము. చెప్పినదానికంటె నెక్కుడుచేయువారు. నిన్ను మాలోనొక్కనిగాఁ జూచుకొందుము. ఇదే కత్తిముట్టి చెప్పుచున్నాను.

దత్తు—బాబులారా! నా దొక్కమనవి వినుఁడు. వాయిలోనున్నచో వేగమే మీకు వర్తమానము చేసెదను. గాని రాచూరిలోనున్న చో మఱి నాల్గునాళ్ళు విళంబమగును. అందునకు మీరు క్షమింప వలెను.

అని యచ్చటి దొరలకు సలాముచేయుఁడు నప్జలాను వానికంటె వాని కొడుకును మిక్కిలి సంతోషించి యిర్వురివేగులవాండ్రను రప్పించి దత్తు వెంటనిచ్చి పంపించిరి. పిదప ఖాను జంఝూగరావు నుద్దేశించి "ఓయీ! నీ వీ బాలాజిని దక్కిన యీయిద్దఱి నెటబోకుండ జాగ్రత్తగా నరయవలయును

జుమా!" అని యతని కుత్తరువుచేసెను. అట్లు జంఝూరరావు ముగ్గురి ఖైదీలను వెంటఁబెట్టుకొని యేగినతరువాత ఖాను సయ్యదుబందుతో నిట్లు ప్రసంగింపఁదొడంగెను. "ఓయీ! మన మిందాక మాటలాడుకొన్న విషయము ప్రభావతిసంగతి చూచుకొని గోపినాథుతో మాటాడి నిశ్చయింతము.— దత్తు దగ్గిరనుండి వర్తమానమురాగానే మనము వాయిని ముట్టడింపవలసియుండును. అటనుండి ప్రతాపగడకు నవసరమున్నచోఁ బోవచ్చును. కావున నీలోఁగాఁ బ్రయాణసన్నాహము చేయవలెను. ఇప్పుడు చాలరాత్రియైనది భోజనమునకుఁ బోవలెను" అని చెప్పి యతఁడు లేచినపిమ్మటఁ దక్కటివారును లేచి వానితో బాటచ్చోటు వదిలిపోయిరి.



# ఎనిమిదవ ప్రకరణము.



ప్రతాపగడకు మాలసూరి వచ్చిన రెండుదినములతర్వాత నొకనాఁటి ప్రాతఃకాలమున శివాజి కృష్ణాజిభాస్కరుని దనగృహమునకు రప్పించుకొని యఫ్జల్లాను నెట్లు నిగ్రహింపవచ్చునో యని యడుగుటయు నతండును బ్రభుచిత్తము కనిపెట్టి యిట్లు ప్రసంగించెను. "రాజా! మనపేష్వామారోపంతు వచ్చినపిదప నతనితో నీవిషయము ముచ్చటింపవచ్చును. ఈలోపుగా మనము తగిన యుద్ధప్రయత్నంబులు చేయవలెను. మాలసూరిని బంపి యచ్చటచ్చటనున్న మావళీసైనికులను హేతకారులును బ్రతాపగడకు వచ్చునట్లు చేయవలెను. ఖాను డెంతసైన్యము దీసికొని దాడివెడలినాడో యది మనకుఁ దెలియదు కాన మనము వేగులనంపి యది తెలిసికోవలెను. ఖానుడు ప్రతాపగడకువచ్చి మనలనెదురించునని యెంతమాత్రము నాకుఁ దోఁపదు. కాని మన మూరకున్నచో కోంకణపాక్సీమ నాక్రమింపక మానఁడు. మననేతాజియు బాజీపరభు నెటనున్నారో తెలియరాకున్నది. చారులనుబంపి వారిని వేగ రప్పింపవలెను. ఖానుని దండయాత్ర కుద్దేశమేదో తెలిసికొంటకై తగిన రాయబారులను బంపవలెను. వాడెక్కుడుబలంబుతో నెత్తివచ్చిన సామదానములు నెఱపి వానిసమాధానము పఱుపవలెను. అందుల కొప్పనివేళ భేదదండంబుల వాని నుక్కడంపవలెను. బాహుబలంబుకంటెను బుద్ధిబలంబునఁ గార్యసాధనమగును. మనకంటె శత్రులు బలాఢ్యులైనప్పుడు మాయోపాయంబుల వారిని లోఁబఱచుకోవలెను. రాజనీతి విశారదులగు దేవగవారిముందర నామంత్రాంగము హనుమంతునకు గుప్పిగంతులు నేర్పునట్టిది యగును." అని యిట్లు సవినయముగాఁ గృష్ణాజి విన్నవించెను. శివాజియు "అయ్యా! మీవాక్యములు నీతియుక్తంబులు సమయోచితంబులని నేవేఱ నుడువ నక్కఱలేదు. మీబోటి నీతియుగంధరులు కార్యశూరులు నల్గురు జతకూడితిరేని

నామనోరథ మీడేరుటకు సందియ మేమున్నది? ” అనుచు నతనివీపుతట్టి నిజసంతోషము వెల్లడిచేసెను.

ఇంతలో నొకప్రతీహారి మాలసూరిరాక యెఱింగింప వెంటనే శివాజి యతని దోడ్కొని రమ్మని యాజ్ఞాపించి యతఁడు వచ్చి కపిదప నుచితాసన మొసంగి కోంకణప్రభువు తా నిట్లు ప్రసంగింపఁ దొడంగెను. “ఓయీ! మీతమ్ముని సూర్యాజిని మారోపంతు పేష్వాను దోడ్కొని రమ్మని నియోగించినాను. రఘునాథభల్లాలు నాబాజిసోనదేవును బునహావద్దనున్నారు. వారిని వేగ నిక్కడకు రావింపవలెను. నేతాజిపాల్కారును బాజీపరభు నెచ్చట నున్నారో యెఱుఁగరాదు. అన్నాజిదత్తు పంధరాపురమున నున్నవాఁడు. అతండు దేవీపూజలకు నిట కేతెంతునని చెప్పియు నేకారణమువలననో కానిరాఁడయ్యె. నాపేర్కొనిన వీరుకాక పేరుగల సర్దారులను రప్పింపవలెను. మావళేలను హేతకారులను నెక్కడెక్కడివాండ్రను బిల్పింపవలెను. మన కృష్ణాజిచే వలసినవారి కుత్తరములును దక్కటివారికిఁ జారుల నంపుము. ఈనాచెప్పుపనులన్నియుఁ జక్కపెట్టవలసినభారము మీయిద్దఱిమీద వేయుచున్నాడను. మనవారందఱు గూడనిదే యేమిచేయుటకు వీలులేదుకదా! కావున సత్వరముగా నవమినాఁటికైనను ముఖ్యుల నందఱఁ బ్రతాపగడకు రావింపవలెనుజుమీ? ” అనుచుఁ దా నింక నేదో చెప్పఁదలచుచుండగా రామోజి బాజీపరభులు స్వామిదర్శనార్థమునకై దేవిడివద్దనున్నవారని దౌవారికుండు వచ్చి యెఱింగింప వారి నిర్వురనుబిలిపించి వారితో నిట్లు రాజు ముచ్చటింప దొడంగెను.

శివాజి—ఓయీ! మీపుత్రకళత్రాదులకు క్షేమమే?

భాజి—బిడ్డలవలె మమ్మునరయుచుండ మాకు గొఱంత వాటిల్లునే? ఐనను గాల వైపరీత్యంబున మనకోంకణస్థులకుఁ దుచ్ఛమ్లేచ్ఛులవలన గొన్ని యిక్కట్టులు సంభవించెను.

శివాజి—అన్నన్నా! అవియేవో యెఱింగింపుము?

బాజీ—తులజామాతను బడగొట్టి యాగ్రామమెల్లను గొల్లగొట్టినారు. అచ్చటి పూజారికుటుంబమును మఱికొందఱను జెఱఁబెట్టి యుండిరి. ఇది కాక పంధరాపురిగూడఁ బాడుచేసినారు. అచ్చటిదేవళము చిందర వందరచేసి పాండురంగవిగ్రహము రూపుమాపిరి. మఱియు మానవతులను బెక్కుమందిని బలాత్కారముగా దీసికొపోయిరి. వారితల్లిదండ్రులయు నత్తమామలయు మగడుఁపిల్లలయు దుఃఖ మింతంతని చెప్పరాదు. ఇట్లు మనగ్రామములలోఁ దోచుకొన్నసొమ్మును యౌవనస్త్రీలను ఖాను మిత్రద్రోహియైన మీతండ్రిని జెఱపెట్టిన ఘోరపడెవెంట విజాపురి కంపుచుండఁగా సహస్రాక్షుం డనఁదగు మననేతాజి యెట్లో యాసం. గతి నెఱింగి తనయశ్వసైన్యముతో శత్రువులపైఁబడి యందు పెక్కుం డ్రను ఓలుకుమార్చి పరులపాలైన విరాటుని గోధనంబు మరల్చిన విజయునిచందంబునఁ బూజారికుటుంబముతోఁబాటు సుందరులను ధనము నెట్లో కష్టముపై వారివారినుండితప్పించి రామోజివెంటనిచ్చి పంపియున్నాఁడు. అతండు తులజాపురీయులఁ దోడితెచ్చుట కాపురి కేగినాఁడు. రేపో మాపో యతం డిక్కడకు రావచ్చును.

శివాజీ—రామోజీ! ఘోరపడే తప్పించుకొపోయెనా యేమి?

రామోజి—అట్లే జరిగినదిస్వామీ! పులిని జూచినతోడనే బెదరిపాఱిన లేడిచాడ్పున నేతాజిని జూచినవెంటనే కొందఱిఁ దోడ్కొని రివ్వు నఁ బలాయితుండయ్యె. లేనిచో మీతండ్రికి ద్రోహముచేసిన యా దురాత్ముని పెడ ఱెక్కలుకట్టి మీకట్టెదుటఁ బెట్టకుందుమే? దేవర కీసంగతులు తెలియఁజేయుమనియు దద్ధనమును బ్రజలను మీపరము చేయుమనియు జెప్పి పాల్కారు నన్నుఁ బుత్తెంచెను.

శివాజి—బాజీ! నీ వెచ్చటనుండి వచ్చుచుంటివి? రామోజి నెచ్చటఁ గలసి కొంటివి?

బాజి—పంధరాపురములో దోపిడియైనదని విని యక్కడకుఁబోయి తురక లను బెక్కు దునుమాడి మిగిలినవారిని బాఱఁదోలితిని. ఇంతలోఁ

పేష్వాయు నటకువచ్చి ప్రజలకుఁ దగినధైర్యముచెప్పి మీతోఁ గొన్ని యంశములు చెప్పమని నన్ను బంపినాఁడు. అట్టువచ్చుచున్న దారిలో నేను రామోజిని గలిసికొంటిని. పేష్వా తాను జింజిరాకోటమీఁదికిఁ బోవలెనని సేనలు కూర్చుకొనుచుండఁగాఁ బంధరాపురి దోపిడివిని య చ్చోటికిఁ బోతిననియు నిప్పటిలో జింజిరామీదికి దండెత్తి వెడలుట కంటె ఖానుని మనరాజధాని పొలిమేరకుఁ జేరనీకుండఁ జేయుట యుక్తమనియు నెఱింగి జావళీగ్రామమున కేగుచున్నాననియు నేలిన వారికిఁ దెలియఁజేయుమనెను.

శివాజి—ఓహో! పేష్వా యిక్కడనా యున్నాఁడు? బాజీ! నీవు త్వరఁ గాఁబోయి పేష్వాను దోడ్కొనిరమ్ము. జింజిరాకుబోకుండ నాగుట మంచిపనిచేసినాఁడు. అతనితో నగత్యముగాఁ గొన్ని సంగతులు మా టాడవలసియున్నది.

అని యిట్లు బాజీపరుభుఁ బుత్తెంచి రామోజి వెంటతెచ్చిన ద్రవ్య మును భద్రపెట్టుమనియు, తరుణులను నన్నపానాదులనిచ్చి యరయవలసిన దనియు వీరిక్షేమము పంథరాపురిలోని వారివారలకుఁ దెలియఁజేయవలసిన దనియుఁ దానాజీకృష్ణాజీలకు నియోగించి తాను భోజనమునకై చనెను. తద నంతరమునఁ గొండొకసేపు తల్లివద్దకు నేగి యేమేమో కొన్ని సంగతులు మా టాడి తనగదికి మరలివచ్చు సమయమున నేతాజీయుఁ బూజారియు నరు దెంచినారను వర్తమానమువిని వారిరాకకై యట నెదురుచూచుచుండెను. వా రును వారిభోజనానంతరమున నక్కడికేతెంచి తులజాపురిలో జరిగినదెల్ల రాజు తోఁ బూసగ్రుచ్చినట్లుచెప్పి ఆసమయమున రామోజి తనరాకదెల్పి ప్రభువు సమ్మతిపైన లోనికిఁ బ్రవేశించి రాజుపాదంబులపైఁబడి కారణముతెల్పకయే గోడుగోడున నేడువఁజొచ్చెను. అది యేమని యచ్చటివారు విస్మయవిచా రంబున మునింగిరి. రామోజిని మెల్లగా శివాజి లేవనెత్తి యతని తనవద్దఁ గూ ర్చుండఁబెట్టుకొని మెల్లగా నోదార్చుచు నిట్లడగఁ దొడంగెను.

శివాజి—రామోజీ! ఇప్పుడేకదా నీవు మాసన్నిధికివచ్చి వెళ్లినావు. ఇంత లో నీకేమి యుపద్రవము సంఘటించినది?

రామోజి—అయ్యో! ఏమని నాయవస్థ విన్నవింతు. నాప్రాణములకంటె నెక్కుడైన నాముద్దులపట్టిని చోరులు రాత్రిరాత్రివచ్చి తీసికొనిపోయినారని యిప్పుడే యొకసఖునివలనఁ దెలిసికొంటిని. హా! నే విజాపురిలోనున్న యిట్లగునేమోయని యుద్యోగముకూడఁ గాళ్లతోఁ దన్నుకొని పాఱివచ్చితిని.

పూజారి—రామోజీ! ప్రభావతీ సహితముగా మాకళత్రమును బాలాజి వెంటనిచ్చి రాచూరికిఁ బంపియుంటినిగదా!

రామోజి—అయ్యా! తమరు నాపాలిటికి దైవమై నాఁడు తులజాపురిలో బఠానులచేతిలోఁ బడకుండఁ గాచినారనియు బాలాజి రాచూరిలో భద్రముగా వారిని మాబంధుగుల కొప్పగించినాఁడనియు నాపిదప నెవ్వరో ముచ్చులు ప్రభావతిని దీసికొనిపోయినారనియు వింటిని.

శివాజి—అట్లైనచో నీవు వేగముపోయి నీ యిల్లాలిక్షేమ మరసి రమ్ము. ప్రభావతి నెట్లైనను వెదకించి నీవువచ్చులోగాఁ దెప్పించెదను. ఆపదలందు ధైర్యము చిక్కపట్టుట లెస్సగాని పరభువారింటఁబుట్టియు నీ కిట్టిబేలతనం బెట్లు లలవడెను? పోయిరమ్ము నీకు మేలొదగూడుగాత.

రామోజి—మహారాజా! ఆ ర్తరక్షామణులగు దేవరవారు ప్రభావతిని మా కండ్లయెదుట బెట్టి మమ్ము రక్షించుభారము మీయది. మీయానతిచొప్పున వర్తించెదను. పోయివచ్చెదను. ఇదే మీయందటివద్ద సెలవుతీసికొనుచున్నాను.

అని రామోజి యచ్చోటువాసినతరువాత కోంకణాధీశుండు నాబాజి పూజారులతోఁ గొంతతడవు విచారించి మ్లేచ్ఛులే యిట్లు ప్రభావతిని మాయోపాయంబునఁ దస్కరించి యుందురనియు నిర్ణయించి పూజారి నుద్దేశించి "అయ్యా! మీ రిన్నాళ్లనుండి కంటికి ఱెప్పవలెఁ గాచుచున్న ప్రభావతిని బరులపాలౌటఁజూచి సహింతురే? ఖానుఁడున్న గ్రామమునకుఁబోయి యచ్చట మనప్రభావతి యున్నది లేనిది కనుంగొని రావలెను. మీకు సాయము

గా నిరువురి మన వేగులవాండ్రను దోశ్కొనిపొండు'' అని యనుటయుఁ బూజారి దాని కీయకొని యిట్లనియె. "రాజా! తమరు చెప్పినచొప్పునఁ బ్రభావతిం గనుంగొనివచ్చెదను.'' అని సెలవుతీసికొని టక్కరులగు నిర్వురి వేగులవాండ్రను వెంటగొని యాదినమే ప్రతాపగడను విడిచి పెట్టెను.

ఆనాఁటిరాత్రి శివాజి తల్పగతుండై నేతాజి రాకకు ప్రమోదమంది తనలోఁ దానిట్లు వితర్కించెను. "మాలనూరి మావళేబలమును కార్చిచ్చునకు నేతాజి యశ్వసైన్యమను మహాజంఝూనిలము తోడైనది. ఇంక ఖాను చతురంగబలమను నరణ్యము ధ్వంసంబు గావించుట నాకెంతపని? ప్రభావతికొఱకై యీదండయాత్ర ఖాను కల్పించినట్లు పూజారిమాటలఁబట్టి తోఁచుచున్నది. అది యొకవేళ యధార్థమే యైయుండి యిచటకుఁ బ్రభావతి తప్పించికొని వచ్చెనేని ఖానునువంచించుట మఱింత సులభమగును. కృష్ణాజి చెప్పినట్లు వేగులవాండ్రఁబంపి ఖా నెటనుండి యేతెంచుచున్నాఁడో మఱియు నెంతబలముతో నెత్తి వచ్చుచున్నాఁడో తెలిసికొందునుగాక! గోభూదేవవనితాసాధుసంరక్షణార్థమై కడంగిననాయుద్యమమునకు రామచంద్రుఁడు తోడ్పడకుండునా? తక్కినతల్లులవలెఁగాక మాయష్ట శిష్టజనసంరక్షణమును దుష్టజననిగ్రహంబును జేయుమని వావిరి హెచ్చరించుచున్నది.

ఆమెకు భవానిదేవి ప్రత్యక్షమై నాచే నీయుద్యమము చేయింపుమని చెప్పియుండును. లేనిచోఁ దల్లులగువారు తమతనయుల కిట్టిసాహసోద్యోగంబులకుఁ బురికొల్పి నియోగింతురే? శ్రీయుతరామదాసు యోగిగారును నన్నిట్లె ప్రేరేపించుచున్నారుకదా! ఇంచుమించుగా నేఁ దలపెట్టుపనులన్నియు నిర్విఘ్నముగానే యింతదనుక గొనసాగుచున్నవి. దైవబలమే నాకు లేనిచో నింతవాఁడనౌటకుఁ దటస్థించునే? ఔరా! యరచెంచులవంటి మావళే హేతకారులఁ జూడంజూడ నెట్టిట్టిదుస్సాధ్యమైనకార్యములు నవలీలలోఁ జక్కపెట్టుచున్నారో నామట్టుకు నాకే యాశ్చర్యముగా నున్నది. హాహా! యేమి నామూఢత్వము? రామచంద్రపదంబులు పట్టువారి కిహపరంబులు కరతలామలకంబని నా కుపదేశించిన శ్రీరామదాసుయోగిగారివాక్యంబులను మఱచి

యింతదూరము వృథా తలపోయుచున్నాఁడను. ఈనవరాత్రములు గడచినపిదపఁ జూచుకొనవచ్చును" అని తనమనసు నిబ్బరముచేసికొని నిద్దురపట్టమికై నేతాజీతానాజులను బిల్పించి హరికథలు జరగుచున్న స్థలమునకుఁ బోయెను.

అప్పటి కప్పుడే చాలరాత్రి యగుటఁజేసి యానాఁటియాటలో మూఁడు పాళ్ళు జరిగినది. రాజు రా డనుకొని వేగముగా మిగిలినకథ యేదోవిధముగా నాటకులు పూర్తిగావింప నిశ్చయించిరి. కాని శివాజి యచ్చోటికి రాఁగానే యెప్పటికంటె విన్నాణముగా శేషించినకథ ప్రదర్శింపుచు సభ్యుల ననిమిషులఁగా జేయుచు నరుణోదయపర్యంత మట్లు కేళిగావించి పండిత పామర నాగరికానాగరికజనసంస్తుతియుఁ బ్రభుసన్మానమును జెందిరి.



# తొమ్మిదవ ప్రకరణము.



అట బాలాజి తాను దురకలచేతికిం జిక్కినను బ్రభావతిం దప్పించుకొన్నందులకు సంతోషించి క్రమ్మఱ నామె మీఁదఁగల మోహమున నిట్లు పొగలఁ దొడంగెను. "అయ్యో! నే నెంత దురదృష్టవంతుండను? ప్రభావతి సౌందర్యము చూచి సంతోషించు నీకన్నులకు నింక నట్టిభాగ్యము చిక్కదుకదా? ఆరూపవతి నాకిల్లాలగునని కొండంత యాశతో నుంటిని. తా నొకటి దలంచిన దైవ మొకటి తలచు ననుమాట నాయందు వర్తించినది. నాఁడు కాంతారమున జిక్కుపడిన యక్కాంతారత్నము నేఁ గాపాడిననాటఁగోలె నాపైఁ దఱచు గాఁదనవాల్చూపులు ప్రసరింపఁజేయుచు నర్థగాంభీర్యమైన చమత్కారసూక్తులచే నాహృదయము గరిగింపఁజేయుచు నెక్కుడుమక్కువతో మెలంగుచు వచ్చెను. చూడ నాప్రాఁబోడితోఁ గలిసియున్నది నాల్గుదినములే కాని యెన్నాళ్లో కలిసి మెలసి మెలంగినట్లు కల్పుకోల్దనంబు కల్గియుంటిమి. ఈమూన్నాళ్లవిశేషము నాకు మూఁడుయుగంబులవలెఁ దోపఁ జేయుచున్నది. ఈతురుష్కులు దయాహీనులై క్రూరులై నన్ననరానిమాటలాడి నొప్పించుటయేకాక తిండితిప్ప లెటామటిచేసి నన్ను గృశింపఁజేయుచున్నారు. ఛీ! ఛీ! బ్రతుకుపై నాసచేసి తిండిఘోష యెత్తుచున్నాఁడను. మృత్యుముఖంబునఁ బడియున్న నా సంగతి తెలిసికొని మాతల్లిదండ్రు లెంత విలపింతురోకదా! హా! ఈనాల్గునాళ్లలో నొడఁగూడిన ప్రభావతిమైత్రియే నన్నింత చింతలపాలు చేయుచుండ లేకలేక పుట్టినవాఁడనియు మాకొక్కఁడే కొడుకనియుఁ జెప్పి నన్నెంతో గారాబముగా నిన్నాళ్లు చూచుకొనుచున్న జనకులకు నామూలమునఁ జచ్చినదాక మఱపునకు రానిశోకము సంభవించునుగదా! హా! హా! హతవిధీ! నీకంటికి నే నెంతబరువైతినే! కటకటా! ఇంక మాతల్లిదండ్రుల జూచుభాగ్యము పొసగదుకదా! నాఁ డరణ్యవాసమునకు రాముఁడు వోయినతఱిఁ గౌసల్యకుఁ

గల్గినదుఃఖముకంటె నావలన మాయమ్మకు నొడఁగూడినవంతయే యధికముగా నుండుననుటకు సందియములేదు. రాముఁ డేనాటికేని రా గలఁడని యాశ కొంత ల్యకుఁ గల్గియుండెనుగాని యట్టియాసయు మాజననికిలేదుకదా! పుట్టి యిర్వది రెండేండ్లు కాలేదు. అట్టినాకుఁదక్కినవారివంటిభోగములు లేకపోయిన మానె. ఇట్టియకాలమృత్యువు రావలెనే! నిర్దయులగువీరు నేఁడో రేపో ప్రభావతి చిక్కలేదనుకోపమున నన్నుఁ గడదేర్పక మానరు. అక్కటా! ప్రభావతీ! నిన్ను దలంచుకొన్నంతనే నీవు నాయెదుటనే పొడఁగట్టుచుంటివి. నిన్ను జూచినదాది నామనంబున నెన్నెన్నో కోర్కు లుదయించెను. ఓచంద్రముఖీ! నీయాననాలోకనంబున మదీయదృక్చకోరంబుల కెంతయు వికాసము కల్గించుటజేసి బద్ధుండనయ్యును నిన్నటిదాక సంతోషించుచుంటి. ఇప్పుడు నీవు నాచెంతలేమిఁ జంద్రుఁడులేని రాత్రివలెను నామనసునకుఁ దోఁచుచున్నది.

అయ్యయో! కోర్కులు పంటవగు నోవాల్గంటీ! నిన్ను బుత్రవియోగంబునఁ గుందుచున్న మాతల్లిదండ్రులను వీక్షించునదృష్టము నాకింకను సంభవించునే! శివాజి రాజుతోపాటు దేశసేవచేసి చిరకీర్తినార్జించుకొనుభాగ్యమింక నీజన్మమునకుఁ దటస్థింపదు కదా? దేవీపూజలు చేయుచుఁగొందఱును జేయించుచుఁ గొందఱును జేయుచుండఁగాఁ జూచుచుఁ గొందఱును సంతోషించుదినములలో నే నీమ్లేచ్ఛులచే వృథా నిందింపఁబడియు నవమానింపఁబడియు బాధింపఁబడియు నుండవలసివచ్చినదికదా! పూర్వజన్మంబున నే నెవ్వరిఁ జెఱఁ బెట్టితినో యెవ్వరి నూఱక హింసించితినో లేకున్న నా కీయిక్కట్టు సంప్రాప్తించునే! హాజగన్మాతా! భవానీ! నీపూజలను జూచుటకై పోవు నీభక్తులకు నిట్టివిపత్తు రాఁజెల్లునే! నిన్ను నమ్మినవారికి నాశమెన్నటికిని లేదని పెద్దలు చెప్పుదురు. కాని నావిషయ మది వ్యతిరేకమైనదని తోఁచుచున్నది. ఏమీ! కాలవైపరీత్యము! అయ్యయో! యింక నాకు దిక్కెవ్వరు? ఇస్సీ మాతృసేవచేయుటకుగాని దేశసేవచేయుటకుఁగాని నే నోచుకోనైతిని. దుష్టజనచాలన శిష్టపాలనచేయ నవతరించిన శ్రీ శివాజి నాయవస్థ నరసి ప్రతిక్రియ నూహించెనో లేదో కదా? సయ్యదుబందు నన్ను దూటినప్పుడు నాపై నించుక జాలిచూపుల నిగుడ్చిన జంగ్ఘూరరావు స్వజాత్యభిమానమున నన్ను విడిచిపెట్టు-

మని ఖానుతో జెప్పెనో లేక జాతికిం జాతితెగు లని నన్నుపేక్షించునో? ఇంతకు నానుదుట నేమి వ్రాసియున్నదో యట్లు యెట్లును జరుగక మానదు. చావునకుఁ దెగించిన నా కీబెదురేల? చావఁ దలంచుకొనువారికి సముద్రము మోకాలుబంటి యగునఁగదా! ఈకడగండ్లమున్నీళ్లలో మునింగియున్న నన్ను దైవముతక్క మఱొకం డెవ్వం డుద్ధరింపఁగలండు. హా భగవంతుఁడా! హా మురారీ! కారావిముక్తి యొండో తనువిముక్తి యొండో నాకుఁ బ్రసాదింప రాదే! ఎంద ఱెందరి నాబోటిదీనులఁ గాచియుంటివో కదా! ఆర్తశరణ్యుండవనియు దీనరక్షకుండవనియు నిన్నుఁ జేపట్టి ప్రహ్లాదాదులు సౌఖ్యవంతులైరి మనలేదా?" అని యిట్లొక్కసారి ప్రభావతిని దలంచియు నొక్కమాఱు తల్లిదండ్రులఁ జింతించియు నొక్కపరి భగవంతుని స్మరించియు నెట్లో దిన మొకకల్పమువలె బాలాజి గడుపుచుండెను.

అటుఁ బ్రభావతిని గనుంగొని వర్తమానము పంపెదనని దత్తు తమ్మొద్దం బఱచిపోయినపిమ్మట ఖానును దదీయులును నాల్గైదునాళ్ళు నిరీక్షించి దత్తును వానివెంటఁబోయిన చారులును మఱుమాయ మగుటకు శంకించి ప్రభావతిని వెదికించుటకై జంఝూరరావువెంటఁ గొంతసైన్యము రాచూరికి నంపి తక్కిన సేనతోఁ దాము వాయికిఁబోయిరి. కాని యట నెంత పరిశోధించినను బ్రభావతిగాని యామెను గనుంగొనుటకై యేగినదత్తుగాని వానివెంటనేగిన పరిచారకులుకాని గానరామి నేమిచేయుటకుఁ దోపక విచారించుచుండిరి. ఇంతలో రాచూరి కరిగిన జంఝూరరావు పేష్వాసైనికులవలన దరుమబడి తనసైనికులలో ముప్పాతికమందిని గోల్పోయి ప్రాణములు దక్కించుకొని హతశేషులతో వాయివద్దనున్న తమవారిని జేరుకొనెను. దత్తుమోసమునకు జంఝూరరావు నపజయమునకును ఖాను తాళఁజాలక రెట్టించినకోపంబుతో నాగ్రామమును దనివితీఱ తురకలచే దోపిడి చేయించెను. నిజదౌర్జన్య మచ్చుపడ నచ్చటిదేవళంబులు పడఁగొట్టించెను; బలవంతముగా ననేకుల జాతిం జెఱిపి మహమ్మదీయులనుగాఁ జేసెను. పఠానులధాటి కాగఁజాలక గ్రామమునువిడిచి కొందఱు పాఱిపోయిరి. మఱికొందఱు మహమ్మదీయమతస్థు లగుటకు నిష్టపడక ప్రాణములు సమర్పించిరి. ఇట్లు ఖాను తనకోపాగ్నికి నాయూరు

నాహుతిజేసి పేష్వ ప్రతాపగడలో లేడని తెలిసికొని యాతరుణమున శివాజిని ముట్టడించిన సంధికి వచ్చునని తొల్దొల్తఁ దొందరపడి యోచనలు చేయఁ జొచ్చెను. కాని ప్రతాపగడ దుర్ఘటమైన కానన ప్రదేశమున నున్నదనుసంగతి నింతకు ముందు తా నాప్రాంతమునకుఁ దహసీల్దారుగా నున్నపుడు స్వయముగా నెఱింగినవాఁ డగుటవలన నది జ్ఞప్తికిఁ దెచ్చుకొని ముట్టడివలన విశేష నష్టము కల్గునని యెఱింగినవాఁడై యెట్టకేలకుఁ బంతోజిగోపీనాథుని సయ్యాదు బందును ఫజీలును బిల్పించి వారితోఁ గొంతసేపు కార్యాలోచనలు సల్పి పంతోజిని రాయబారిగా శివాజికడకుఁ బొమ్మని నియమించి యతనితో నిట్లనియె. "ఓయీ! నీవు పోయి నామాటగా మరాటప్రభువుతో నిట్లనుము. మీతండ్రి నాకు మిత్రపక్షములోఁ జేరినవాఁడు. అందువలన నీపై నాకును శత్రుత్వములేదు. నీవు నవాబునకు సామంతుండవై యేఁటేట నొకలక్షరూప్యంబులు చెల్లించుట కొప్పుకొంటివేని యిపుడే నేను విజాపురికిఁ బోవుచున్నాఁడను. రామోజిపుత్రికయగు ప్రభావతిపై నాకుమారునకు మనసు హత్తియున్నది. కావున మిత్రధర్మము నెఱపి దెప్పించి యామెను నా కొప్పగింపవలయును. ఇట్లు నయమున భయమున శివాజి నొప్పించి లోబఱచుకొనిరమ్ము. వీలుకొలంది శివాజిని దీసికోపోవుటయో విడిచిపోవుటయో మీఁదఁ జూచుకోవచ్చును." అని గోపీనాథు నంపి ప్రభావతి లభించు టెట్లో యని పరిపరి విధమ్ముల నూహలుచేసి కొందఱఁ దదన్వేషణార్థమై పంపి సుతునికంటె తానే యెక్కుడు వగవఁ జొచ్చెను. అత్తఱి నొకపకీ రాఖానుదర్శనమునకు వేంచేసి తనకు మక్కాకుఁ బోవలెనని యున్నదనియు నందులకై ద్రవ్యసహాయము చేయవలసినదనియు నర్థింప ఖాను దండులకీయకొని యిట్లనియె. "పకీర్జీ! పూజనీయులైన తమరు మావద్ద గొన్నాళ్ళు నిల్చి మాచేయు సత్కారములు వడసి పిమ్మట యథేచ్ఛగాఁ జనవచ్చును. నాకుఁ దోఁచిన సాయముచేయుటకు సంసిద్ధుఁడనై యున్నాఁడను." అనిన నట్లుకాక యని యాయవనసన్న్యాసి యట ఖాను శిబిరములో నిల్చి సర్వోపచారము లచ్చటివారు చేయుచుండ సుఖియై మెలఁగఁ జొచ్చెను.

ఇట్లుండ నొకనాఁడు ఖాను లేని సమయము కనిపెట్టి ఫజీలుని మెల్లగాఁ జేరి "కుమారకా! నీముఖము వికాసము తప్పియున్నది. నీమేను కృశించుచున్నది. ఇది చూడఁగా నింత చిన్నవయస్సులో నీకేదో మనోవ్యాధి తటస్థించినట్లు కాన్పించుచున్నది. ఇట్టింటిదని నీమనసులో మఱొకలా గెంచకుమా? సర్వభూతములందు సమత్వమును దయయు మాబోంట్లకు సహజమని తెలిసికొనుము. అది యటుండ నీవుత్తమమహమ్మదీయుండైన సున్నీవు కావున నీవిషయ మింత చనువును బేర్మియుఁ దీసికొంటిని." నావుడు ఫజీ లిట్లనియె. మహాత్మా! పూజనీయులైన తమరు నాయందు నిర్హేతుక కృపగల్గి యిట్లు కుశలప్రశ్నము చేసినందులకు నేను మఱొకవిధమునఁ దలంచుటకు మూర్ఖుండనే? మీబోంట్లదర్శనమాత్రమున సర్వపాపపరిహారమును స్పర్శమాత్రమున సర్వకార్యసిద్ధియుఁ జేకూఱునని పెద్దలు చెప్పుచుందురు. పూర్వపుణ్యకర్మవశంబున నా రెండును నాకు మీవలన సిద్ధించెను. ఇంక నే ధన్యుండనైతి. సర్వజ్ఞులైన మీ రెఱుంగని దేమున్నది. మీరు చెప్పినప్రకారము మనోవ్యధచే నేఁ బీడింపఁబడుట నిశ్చయము. దీనికిఁ గారణము మీరే యూహించుకొవచ్చును. అని యించుక లజ్జాన్వితుఁడై యూరకుండెను. అంత నాఫకీరు మందహాసముచేసి "ఓకుమారా! యౌవనావస్థలోనున్నవా రెల్లరకుఁ గల్గిన యవస్థయే నీకునుగల్గినది అని మాకు నీరూపమే చెప్పుచున్నది. ఇది చెప్పుటకే యింత లజ్జింపవలయునా? రోగము రట్టు సంసారము గుట్టు చేయవలెనని వినలేదా? చితి చచ్చినవారిఁ గాల్చునుగాని చింత బ్రతికినవారిని దగలపెట్టును అని యొక్కింతసేపు భగవద్ధ్యానము చేసినట్లు మీదికిఁ దలయెత్తి యేమో పఠించునట్లు గొణిగి మద్గురుప్రసాదమున సంప్రాప్తమైన దివ్యదృష్టివలన నీసంగతి కొంచెము మే మెఱింగితిమి. నీవలచిన పరభుకుమారిక కొలదికాలములో దానే వచ్చి నిన్ను వరించును." అని పకీరు చెప్పిన తియ్యానిపల్కులకు ఫజీ లచ్చెరువంది నిజముగా నతండు మహానుభావుండని నెమ్మదినమ్మి, జరిగిన కొన్ని యాత్మవిషయములను శోధనకై వాని నడిగి యతండు సమముగా నుత్తరమిచ్చుటను దన నమ్మకము మఱింత దృఢము చేసికొని తిరుగఁ బకీరుతో నిట్లనియె. "ఓమహాత్మా! మీరు సామాన్యులుకారు.

మీకడఁ జనువు తీసికొని పరీక్షించినందులకు నన్ను క్షమింపవలెను." అని పకీరుపాదములపై ఖానుకొడుకు పడుటయు నతండు వానిని లేవనెత్తి "వత్సా! నీవు గావించినదోష మేమియున్నది. ప్రాజ్ఞులగువారు పరీక్షించిగాని కేవల వేషభాషలను జూచి యేరినైనను బెద్దచేయరు. కావున నీవు ప్రాజ్ఞుల మతం బనుకరించి నన్ను దెలిసికొంటివి. దీన దోషమేమియున్నదో యెఱుంగ జాలకున్నాడను. అని యిట్లు యథోచితముగా బల్కి ఫజీలును బుజ్జగించెను. ఫజీలును దొంటికంటె పకీరుని గౌరవసత్కారంబుల దృష్టిచేయుచుఁ దన మనోభీష్టసిద్ధి యెన్నడగునో యని యెదురు చూచుచుండెను. కాని యా సుందరి యెచ్చట డాగియున్నదో పకీరునడిగి వాఁడు తెలిసికొనఁడయ్యె. ఇందులకు హేతువు ప్రభావతియే స్వయముగా సత్వరమ వచ్చి కలిసికొనునని పకీరుచెప్పుమాటలంబట్టియే యని చదువరు లూహించుకొందురుగాక.

ఇట్లు వీరు సంభాషించుచుండఁగా నిరువురుభటు లటకువిచ్చేసి రామోజిని గుటుంబసహితంబుగా జంఝూరరావు చెఱబట్టి తీసికోవచ్చినాడని తెల్పి పదంపడి యిట్లనిరి. "బాబులారా! అటకు మీరురావలసినదని ఖాను సెలవిచ్చినారు. అనవుడు నాపలుకులు తనచెవులకు విందొనరించుటఁజేసి ఫజీలు వారికిఁ దగిన బహుమానముచేసి "ఇదె వచ్చుచున్నాను" అని వారిసనిపెను. రామోజితోఁబాటు ప్రభావతియుఁ బట్టువడియుండునని పట్టరాని సంతోషముతో ఫజీలును నీమాటలు వినుచున్నప్పటినుండి కలవరపడిన చిత్తముతోఁ బకీరును నాస్థలమువిడిచి ఖానుశిబిరమునకు వెంటనే నడిచిరి.



## పదియవ ప్రకరణము.



ఒకనాఁడు మిట్టమధ్యాహ్నమున ధవళాశ్వనిరూఢుండై యాతపంబుతో సమానమైన దేహకాంతిగల యొకతరుణుండు ప్రతాపగడ కరుదెంచి తద్రాజమార్గమునుండి పోవుచుండెను. ఆసమయమున ఘోటకఖురపుటధ్వని విని గృహంబులలోనిజనులు వీథిలోని కరుదెంచి యాపోవుచున్న గోమలాంగు నిగూర్చి యిట్లు ముచ్చటించిరి. "ఓహో! ఈకుమారునకుఁ బదియాఱువర్షంబులకన్న నెక్కుడున్నట్లు తోఁపదు. వీనిమొగముమీఁది చెమటబిందువుల వైఖరిఁ జూచినను నశ్వముఖంబుననుండి కారుచున్న నుఱుగుచందముచూచినను నరమన్మథుండనదగు నీమోహనాంగుడు చాలదూరమునుండి వచ్చుచున్నట్లు కానవచ్చుచున్నదే! అమ్మక్కా! ఇట్టి సౌందర్యనిధినిగన్నట్టి జనకు లెట్టిపుణ్యాత్ములై యుండురో కదా! ఇట్టిరుచిరాకారుని మనము కన్నది విన్నదెన్నడును లేదు. ఇదిచూడ వీడు దివ్యపురుషుండు కాడుకదా! దివ్యపురుషుండేయైనచో వీనిమోము నిర్వికాసంబై యేలయుండును? ఇది మార్గాయాసమున జనించినదో లేక యాపత్తులచే సంఘటిల్లినదో యెఱుంగఁబడదు."

ఇట్లనుచుఁ బురిజను లాసుకుమారునాకకుఁ గారణం బేమియైయుండునో యతండే సదనమునకై యరుగనున్నాఁడో యని యరయుచుండిరి. అంతట నాకుమారుండు "పూజారి బస యెచ్చటఁ జేసియున్నాఁ" డని యాతురతతో నందొక్కని నడుగుటయు వాఁడున్ను బూజారి వసించినకుటీరంబు నాకుమారునకుఁ జూపి తనదారినిఁబోయెను. తనకుఁ బూజారిని వేళనంబు చూపినవాని చేతిలో నొకకాసుపెట్టి యాయింటిముంగలఁ దేజినుండిదిగి యఁట దాని నొక కంబమునకుఁ గట్టి లోనికరిగెను. ఆయింటియిల్లాలు వచ్చిన యకుమారుని జూచి విస్మయమంది యతం డెవ్వఁడో తెలిసికొనకయే పాదప్రక్షాలననిమిత్త

ము జలములు తెచ్చియిచ్చెను. వాఁడును కరచరణంబులు కడుగుకొని మజ్జిగ తేట నడిగిపుచ్చుకొని తనకై యమర్చఁబడినపీఁటపై నధివసించి విశ్రాంతిదీసి కొనుచుండెను. అత్తఱి వారిరువురు నిట్లు సంభాషించిరి.

గృహిణి—అబ్బాయీ! నీవెవ్వఁడవో యెఱుంగకుంటిని నీపేరును నీకులము పేరును జెప్పుము.

కుమారు—అమ్మా! నన్ను నీవెఱుంగవేమోకాని నిన్ను ను మీభర్తగారి నెఱుంగుదును. నే నెవ్వఁడ నైననేమి? పూజారిగా రిప్పు డెచ్చటనున్నారు? వారితో మాటలాడవచ్చినాఁడను.

గృహిణి—నాయనా! ప్రస్తుతము వా రీయూరలేరు ప్రభావతిని వెదకుటకుఁగా నెచ్చటికో యేగినారు.

కుమారు—అట్లైనఁ దల్లీ! రామోజి యిప్పు డెచ్చటనున్నాఁడో యెఱుంగుదురా?

గృహిణి—ఆయనగూడ గ్రామాంతరమేఁగినారు. పాప మాయనపట్టి ప్రభావతి నెవరో ముచ్చులు ముచ్చిరని విని దుఃఖించి రాచూరిలోనున్న భార్యను దెచ్చుకొంటకు మొన్న నే యరిగినాఁడనివింటిని. అక్కటా ప్రభావతి యిప్పు డెక్కడనుండి యెన్నియిక్కట్టులపాలౌచున్నదో కదా?

కుమారు—ప్రభావతి ప్రస్తుత మీపట్టణముననే వచ్చినదట. అది కనుంగొనుటకే యిచ్చటికి వచ్చితిని.

గృహిణి—ఏమేమీ! ప్రభావతి యిచ్చటికి నిజముగా వచ్చినదా! వచ్చినచో నెచ్చటనున్నది? ఆబంగారుబొమ్మ నిత్య మాటపాటలకై వచ్చుచుఁ దఱుచు మాయింటనే మెలంగుచుండెడిది. మఱియు దొడ్డమ్మ యని నన్నును దమ్ములు చెల్లెండ్రని నాపిల్లల నిట్లు పేర్వేరువరుసలతోఁ బిల్చుచు నెంతోకల్పుకోలునంబుతో నాపిల్లలో నొకపిల్లవలె నుంటవలన నేను నా పెయెడఁ బాపువలన తద్దయు వంతఁ జెందుచున్నాను. ఎచ్చట నున్నదో చెప్పుము పోయి చూచివచ్చెదను.

కుమార—అబ్బో దొడ్డమ్మా! నీవెఱుఁగనట్లు నన్నడుగుచున్నావు. నావద్దనా యీ దాపరికము? నేనుమాత్రము పెరవాఁడనాయేమి? నాకుఁ బ్రభావతి యేమగు ననుకొన్నావు? అది మాపినతండ్రికూఁతురు కాదా?

గృహిణి—ఓయీ! నీమాటలు వినఁగా వినఁగా నం దెంత నిజమున్నదో కూడ దెలియకున్నది. నీ కామె చెల్లెలౌట నీరూపముబట్టిచూడ నిజమే కావచ్చునుగాని యామె యీగ్రామములో నున్నదన్న నే నమ్మజాలను. ఆ యింతిని వెదకి తెచ్చుటకై యేతెంచినమావారే యింకను రానప్పుడా ముద్దులగుమ్మ యిచ్చటికి వచ్చినదన్న నెవ్వరొప్పుకొందురు? ఇంతకు నిజముగా నాకన్యవచ్చుటయే తటస్థించెనేని నాకుఁ దెలియకుండునా?

కుమార—తెలియకేమి! రహస్యముగా నిచ్చటనే యున్నది.

గృహిణి—ఇచ్చట ననఁగా నెచ్చట?

కుమార—ఎచ్చటనో యున్న యిచ్చటి కేలవత్తును?

గృహిణి—బాపురే! మాయింటను దాచియుంటిమనియా నీయభిప్రాయము?

కుమార—అందులకు సందియమేమి? రూఢిగా నిక్కడనే మీయింటనే యున్నది. ఇటుఁజూపట్టిన నాకేమిత్తువు?

గృహిణి—నీకు నేనును నాకు నీవు నేమి యీనక్కఱలేదుకాని యనుమానమున్నచో మాయింటనున్న నాల్గుగదులును జూచుకొనుము అందుల కభ్యంతరములేదు.

ఇట్టు లింటియిల్లాలు పల్కినతోడనే కుమారుఁ డొక్కగదిలోనికిఁ జని పదినిముసము లైనపిమ్మట నదేమిమాయయోకాని యటనుండి ప్రభావతి తనకు నైజమైన నగుమోముతో వెలువడి యాయిల్లాలునకు మ్రొక్కి నిల్వఁబడిన నామె యొక్కింతసేపు విభ్రాంతిని మున్గి యావలవిస్మయానందములకు లోనై ప్రభావతిని బిగియఁ గౌఁగిలించుకొని యింతవఱకుఁ దనతో సంభాషించిన టక్కరి యీపెయేయని తెలిసికొని పదంపడి యామెమూర్ధమును మూర్కొని సంతోషబాష్పములు జాఱవిడిచెను.

అటుపిమ్మట నాయిల్లాలు "తల్లీ నీవిన్నాళ్లెచ్చట మెలంగితివి? ఎట్లు దొంగలం దప్పించుకొనివచ్చితివి? నీచరిత్ర మద్భుతముగానున్నది" అని ప్రభా

వతి నడుగుటయు నాపె యేమేమోతనవృత్తాంతమంతయుఁ దెలియఁజేసి జన కులుకాని పూజారికాని యచ్చటకు వచ్చినదాఁక దా నచ్చటకుఁ జేరుకొన్న సం గతి యొక్కింత గోప్యముగా నుంచవలసినదని గృహిణికి నొక్కి చెప్పెను.

తన కత్యంతము సహకారిణియై సహవాసియై మెలంగి నిజచిత్తముగొన్న సౌందర్యశాలియగు బాలాజి వియోగమువలనఁ బ్రతాపగడకు వచ్చియుఁ బ్ర భావతి రానట్లే చింతించుచుండెను. అంతఁ బ్రతాపగడకు వచ్చిన నాల్గునాళ్ళ పిదప నొకనాఁడు బంధువులవలన జననీజనకులు మ్లేచ్ఛులచేతిలోఁ జిక్కిరని తెలిసికొని మఱింత చింతాక్రాంతురాలై కొంతతడవునకు ధైర్య మవలంబించి యేమిచేయుటకును బాల్పోక యానాడు నిద్రాహారములుమాని విచారించుచుం డెను. గోరుచుట్టుపై రోఁకలిపోటువలె బాలాజివియోగమునకు గుందుచున్న య తరుణికి జనకులయవస్థ మఱింత వంతగల్గించుటఁజేసి తనబన్నంబులు జీజా తో విన్నవించి యమ్మహోదారునికటాక్షమున దు స్తరదుఃఖవార్ధి దరింపవచ్చు నను నాసతోఁ బ్రాణాలపై నాసనిల్పి తగినసమయము చూచుచుండెను.

మొట్టమొదటఁ దనయవస్థ స్వయముగా శివాజిరాజుతో మొఱపెట్టు కోఁజూచెను కాని మానవతులకుఁ బరపురుషులకంటఁబడుట యుక్తముకాదని యెంచి యపరంభవాని యని పేరందిన జీజాభాయినిదర్శించినఁ గార్యసిద్ధికాగల దని నిశ్చయించి మఱుసటిదినమునఁ బూజారి భార్యను వెంటఁదీసికొని జీజాభాయి మందిరమున కేగెను. శివాజిజననియు వారిని దగినట్లు గౌరవించి యొకతివాసిపైన యిరువురఁ గూర్చుండఁజేసి వారితో నిట్లు ప్రసంగింపఁ దొడంగెను.

జీజా—పూజారిపెండ్లాము నుద్దేశించి అమ్మా! మీరాకకుఁ గతంబేమి? మీతో వచ్చినయీసుకుమారి యేరికుమారిక?

గృహిణి—దేవీ! మాయాగమమునకుఁ గారణంబు ముందుముందు మీకు విశద మగును. ఈకుమారికయే రామోజిపుత్రికయగు ప్రభావతి.

జీజా—ఏమేమీ! ప్రభావతి యీయూరిలోనే యున్నదా? ఈమెను వెదకి తెచ్చుటకుగాదె నీభర్తయగు శంకరభట్టును మఱికొందఱను మీరాజు

నియోగించినాఁడు. ఈకన్యకను జోరులు తీసికొపోయిరనికదా విం
టిమి. అట్టి యీయబల యెట్లు ప్రతాపగడకు రాఁగలైను? ఇప్పు డిది
మనయూరికి వచ్చి యెన్నాళ్లైనది? మావాని కింకను బ్రభావతి విచ్చే
సినసంగతియే తెలిసినట్లు తోఁపదు.

గృహిణి—చిత్తము. ప్రభావతి ప్రతాపగడకుఁ జనుదెంచి నాలైదుదినాలైన
ది. చోరులీపెను మోసికొనిపోవుట నిశ్చయమేకాని తల్లిదండ్రుల కడు
పుచెలవవలన నెన్నియోయుపద్రవములనుండి తప్పించుకొని ప్రభావతి
కష్టనుమీఁద నిచ్చటికి రాఁగల్గినది. పాప మీతరుణిజనకులను మొన్న
ను యవను లూఱక చెఱఁగొనిపోయిరట. ఈసంగతి మీతో విన్నవించు
టకునై యేతెంచితిమి.

జిజా—అక్కటా! ప్రభావతీ! నీవు మమ్ము గలసికొంటివని యుప్పొంగుచుం
డఁగా నింతలో నీతలిదండ్రులకు నింతటివంత సమకూడెనే? మావాని
కీసంగతిఁ దెలియఁజేసి నీజనకులను జెఱనుండి విడిపింతును గాక. నీకు
భయంబులేదు. నీ విన్నాళ్లైవచ్చియు నింతగోప్యముగా నీరాకసంగతి
యుంచుటకుఁ గారణమేమి? నీ వేరీతిఁ జోరులబారినుండి తప్పించుకొని
యీవలబడితివి? నీకథ చాల నద్భుతముగానున్నది నీవృత్తాంతమెల్ల
సాంతముగా వినిపింపుము.

అని యిట్లు జిజాభాయియనుటయు దానికిఁ బ్రభావతి తాను జోరుల
నుండి తప్పించుకొని బాలాజితో గలసికొన్నసంగతియు, మగవేసముదాల్చి
బాలాజి ముఖ్యులతోఁ బ్రతాపగడకు వచ్చుచుండ దారిలోఁ దురకలు తమ్ముప
ట్టుకొన్న విషయమును బ్రభావతిని వెదికితెత్తునని ఖానులను మోసపుచ్చిన
యంశమును, తనవెంటవచ్చిన ఖాను వేగులవానిని రాచూరికోటలో ఖైదుచే
యించిన వృత్తాంతమును గ్రమముగాదెల్పి క్రమ్మఱ నిట్లనియె.

ప్రభావతి— దేవీ! మీయౌదార్యసౌలభ్యాదిగుణంబులు ద మొదటనుండియు
వినుచున్నదానను గావున నింతచనువుతీసికొని నాయవస్థ మొఱ్ఱవెట్టు
కొంటకుఁ దమసన్నిధికి నేతెంచినాను.

జిజాభాయి—అమ్మాయీ ! ప్రభావతీ! నీవు చెప్పిన దంతయు విని నాహృదయంబు నీరైనది. మారాష్ట్రములోనికి వచ్చినపిమ్మటఁగూడ నీ విట్టి దుర్దశపాలైతివని విని నాకధికసంతాపము గల్గుచున్నది. నాయోపినంతవఱకు నీకుఁ దోడ్పడెదను. నాకుమారునితోఁ జెప్పి బాలాజిని మీ జనకులను నెట్లైనను బంధవిముక్తులం గావించెద. నీవృత్తాంత మీనడుమ మావాఁడు నాకెఱింగించి నీ వెచ్చటనుంటివో యని చాల విచారించి నాఁడు. నీ విచ్చట సురక్షితము గాఁ జేరినది యిప్పటికైనను వానికిఁ దెలిసినట్లు తోఁపదు. నీవు మీవారు వచ్చునంతవఱకు మావద్దనే యుండవచ్చు. మీయన్న శివాజిరాజు నిన్నేమరక రక్షించి నీబన్నంబులు చక్కఁజేయఁగలఁడు.

ప్రభావతి—అమ్మా! మీకు నాపైని నిర్హేతుకకృప యంకురించుటం జేసి నేనింక దుఃఖసముద్రమును దరించి కృతార్థురాల నగుదునని నమ్ముచున్నాను. ఈపూజారిపత్ని నాకుఁ గన్నతల్లికంటె నెక్కుడుగా రాబముతో నిన్నాళ్లరయుచుంటఁ జేసి యామెతోఁగలసియే మీకడనుంటకు నిచ్చగించుచున్నాను. ఈనామనవి నంగీకరింపఁ బ్రార్థితులు.

జిజా.—దీని కింత యర్థింపవలెనా? ప్రజలందఱు మాబిడ్డలు. బిడ్డలకోర్కులు దీర్చుటకదా తలిదండ్రులకు విధ్యుక్తధర్మము. పూజారి యాగ్రామమునకు విచ్చేసినదనుక నీ వీబిడతో మావద్దనుండుము.

అని యద్దేవి యానతిచ్చినప్రకారము ప్రభావతి పూజారికుటుంబముతోపాటు నాటనుండియు రాజభవనములో నుండ జొచ్చెను.



# పదునొకొండవ ప్రకరణము.



ఇట శివాజి పూజారివెంటఁబోయినవారిలో నొకఁడగు భేతాళుని వలన బాజికుమారుఁడు పట్టువడుటయు, తల్లివలనఁ బ్రభావతివృత్తాంతమును దిజ్జనకులపాటును దెలిసికొని యిట్లు తనలోఁ దా వితర్కింపఁజొచ్చెను. "భవానికృపవలనఁ బ్రభావతి ప్రతాపగడకు సురక్షితముగా రాఁగల్గెను. బాజి మోరోపంతు పేష్వా మొదలగు ప్రధానులందఱు నద్దెసలనుండి విచ్చేసిరి. ప్రభావతి చిక్కుటవలన ఖానును సుకరముగా వంచింపవచ్చును. ప్రధానులు వచ్చుటఁ జేసి శత్రువుల సులువుగా నిర్జింపవచ్చును. ఇంక నాప్రయత్నములతో నేనుండవలెను. అని తలపోసి ప్రధానుల నెల్లర రావించి యొకసభచేసి యందు ఖానునెట్లు లోఁబఱచుకోవలెనో కార్యాలోచనలు సేయఁ దొడంగి ముందుగాఁ దాను ఖాను దండెత్తివచ్చుటకుఁ గారణము తత్కుమారునకు మనప్రభావతిపై గల మక్కువయే యైయుండనోపునని సూచనచేసెను. అందు, ఒకరు సామదానములవలనఁ గార్యము సానుకూలపడునని నుడివిరి. మఱియొకరు భేదదండంబులు కర్తవ్యమనిరి. అంతఁ బేష్వాలేచి రాయబారిని బంపి ఖాను తలం పెఱింగినమీఁదట నెట్లుచేయుట లెస్సయో యోచింపవచ్చును. తురుష్కసేనానిహృదయ మెఱుంగకమున్న తొందఱపడ నవసరములేదని నొక్కి చెప్పెను. పేష్వామాటలకుఁ గృష్ణాజి తనయంగీకారమును దెల్పుడుచేసెను. శివాజి పేష్వా యాలోచనచొప్పున నడచుట మేలని యెఱిఁగి యెవ్వని రాయబారిగాఁ బంపుట యుక్తమో విచారించుచుండెను. అత్తఱి నొక ప్రతీహారి వచ్చి ఖానుపనుపున నొకరాయబారి వచ్చుచున్నాఁడని యెఱింగింపఁగా శివాజియు నతని దోడితెచ్చుటకుఁ గృష్ణాజిని బుత్తెంచి యింకపై ఖానుని వంచించి జయించుట మఱింత సులభమయ్యెనని లో నుప్పొంగుచుండెను.

మరాటకేసరి మనోభిప్రాయము పూర్తిగాఁ గృష్ణాజికిఁ దక్క మఱొండొక యమాత్యునకుఁ దెలిసినట్లు తోఁపదు. కాని గొప్ప యుద్ధము

తటస్థించుననిమాత్రము కోంకణప్రభువు నాంతరంగికులందఱు నెఱింగియుం డిరి. భవానిమాత యెట్లు నడిపించిన నట్లే నేను నడచుకొందునని ప్రభువు సచెప్ప నర్థగంభీరమైన సూక్తులచే ప్రధానులు యుద్ధము సిద్ధాంతమని నమ్మి సమరసన్నాహంబు చేయుచుండిరి.

ఖాను వకీలుని విశేషగౌరవముతోఁ గృష్ణాజి పట్టణమునకుఁ దోడ్కొని వచ్చి యతనికి నతనితో వచ్చినవారికిని దగినబస లేర్పఱచి యన్నపానాదు లలో వారి కేవిధమైన లోటుపాట్లు కలుగకుండఁ దానే యరయుచు వచ్చె ను. ప్రయాణపుబడలికవలన గోపినాథుడు వచ్చినదినమే కలసికొంటకు నిష్టప డక యామఱునాఁడు శివాజిదర్శనమునకు వత్తునని వర్తమానమంపి యాదిన మెల్ల సుఖముగాఁ గాలము గడపఁజొచ్చెను.

శివాజి నవరాత్రపూజలు యథావిధిగా జటిపినతరువాతనే గోపినాథు డు వచ్చుట తటస్థించినందున నతని కేజంఝాటము లేమి యవ్వకీలు నెట్లు లోఁ బఱచుకోవచ్చునో యని యానాఁటిరాత్రి యెల్ల వేగించెను. మఱునాఁటి ప్రభాతంబున లేచి సుస్నాతుండై యిష్టదేవతారాధనాదివిధులు నిర్వర్తించి బంధుమిత్రపరివారసహితముగా నెప్పటియట్లు సభ నలంకరించిన గోపినాథుఁడు ను ద్విజులకు విధాయకంబైన స్నానసంధ్యావందనాదికృత్యంబులు తీర్చుకొని పచ్చలు దాపిన యొకదంతపుపల్లకీ నెక్కి కతిపయానుచరులతో సభాకూట ద్వారసమీపమునకు వేంచేసి తనయాగమనము కోంకణప్రభువునకు నెఱిం గించి తదనుమతిఁ బాదచారియై సభామంటపమునకు మెల్లగా నడువసాగెను. అత్తఱి శివాజియానతిచొప్పున పంతోజి గౌరవసూచనార్థమై కొన్నిఫిరం గులు కాల్పఁబడెను. పెద్దమద్దెలలు మ్రోగింపఁబడెను. సంకువులును కొమ్ములు నూదఁబడెను. వెండియు విజాపురిసుల్తాను బిరుదంబులు వరుసగా నుగ్గడింపఁ బడెను. అట్లు వచ్చినవకీలు శివాజికి సలాముచేసిన నంతటఁ బ్రధానియొక్కఁం డు లేచి యెదురుగాఁబోయి వకీలునకు నర్ఘ్యపాద్యాదులొసంగి యతని నుచితా సనమున నాసీనుని జేసెను.

అట్లు పఠానుసర్కారులదర్బారువైభవము తలఁచు చూచుచున్న యా గోపీనాథుడు ఇట్లు తనకుఁ జేసినసత్కారంబులకుఁ దద్దయు సంతసించి మఱి

లీను చొక్కాలుదాల్చి సామాన్యునివలెఁ గన్పట్టు రాజును దదీయసభను గలియఁజూచి తనలోదా నిట్లనుకొనసాగెను. ఓహో! యీగద్దియపై నిరలంకృతుండై యున్నవాఁడేకాబోలు శివాజి. ఇతఁడా! భారతధర్మసంస్థాపనముచేసి హిందువుల నుద్ధరింపఁ గంకణము కట్టుకొన్నది. ఔరా! యిట్టివానిఁగూర్చి నే మున్ను విన్నవిధంబునకుఁ గన్నసంగతికిఁ జాలవ్యత్యాసము చూపట్టుచున్నదే? ఏమి! యీలోకుల యవివేకము. ఈకొండదొర నవతారపురుషుండని వీరు నమ్మకొంటఁజూడ జనులలో ముప్పాలువంతు మూర్ఖులుందు రనుదానికి సాక్షిగాదె! నాల్గుడబ్బులు ముట్టినచోఁ గవులెంతకొలందివానినైనను నింద్రుడంతవానిగాను జంద్రుడంతవానిగానుఁ గొనియాడుచుంటఁ దత్సంప్రదాయమై యున్నది. లోకు లనుకొనుమాటలకు బెదరి ఖానునన్ను దూతఁగాఁ బనుచుట యెంతయు వింతగా నున్నది. బాపురే! యితఁడా! హిందూమతములఁ గాపాడి వైదికాచారము ప్రవర్తింపఁజేయునది. ఇతఁడా! గోబ్రాహ్మణుల నుద్ధరించి విద్యలఁ బోషించి దేవాలయముల సంరక్షించునది? మజ్జారే! యితఁడా! బిజాపురి భూరిసైన్యములోఁ జేరిన పరభీకరులైన యబిసీనియనులను జిచ్చఱపిడుగులైన పఠానులను నెదిర్చి గెల్చునది? సాంపరాయ సన్నాహంబులా కనఁబడవు. తగినంతమంది సైనికులా లేరు. సిబ్బందియా లేదు. ఇట్టిచో వీరి నెదిరించుటయు నీదుర్గము పట్టుకొంటయుఁ దలచిరేని యవనుల కొక లెక్కయా? అని యిటువలె లోలోన వితర్కించుచు బహుస్థూలకాయుండౌటవలన నొక్కింత సేపు వెనక కమర్చబడిన టెక్కెముపైఁ జారఁబడి నడకబడలికఁ దీర్చుకొనుచుండెను.

గోపినాథుని దేహస్థూలత్వమునకుఁ దోడతనితలయు నొక్కింత పెద్దదిగానుంట నిక్కమేకాని యతఁ డప్పటిలోఁ జుట్టిన తెల్లనికాశ్మీరపుశాలువ వలన నది మఱింత పెద్దదియై కనఁబడుటవలన నచ్చటిసభ్యు లెల్లరు నొకవింత మనుష్యునిమాడ్కి నతనిని జూచుచుండిరి. పద్మరేఖలువోలు నాతనిదీర్ఘలోచనములు తేనెరంగువంటి యందలి యెఱ్ఱని కొనగీరలును గోపినాథుఁడు లక్ష్మీసరస్వతీకటాక్షపాత్రుండని జూపరులకు నెఱుంగఁజేయుచుండెను. నిజకులమునకు సహజమైన స్ఫురద్రూపము ముఖమునకు మఱింత మెఱుంగు పెట్టుచుండెను.

లౌకికశిరోమణులకు నుండవలసిన ధీశక్త్యాదు లతనివద్ద లేకపోలేదుకాని యున్నదానికంటె నెక్కుడు ప్రజ్ఞగలదని భావించుటలో నితండు తనప్రభువగు ఖానునకుఁ దీసిపోఁడు. ఇదియే మనశివాజికి ముందునకుఁ జాలఁ బనికివచ్చినదని యుత్తరకథవలనఁ జదువరులకుఁ దెలియంగలదు. ఇట్లు నాల్గునిముసములు గోపినాథుఁడు సేదదీర్చుకొనిలేచి శివాజిదిక్కు మొగంబై మాటలాడ గమకించునంతలో ఱేఁడు తనచూడ్కు లతనిపైఁ బ్రసరింపఁజేసెను. అంత నెన్నడెఱుంగని యొకవింతజంకుఁ దనమదిని సందడింప వకీలు వెఱంగంది తనలోఁ దా నిట్లనుకొనెను.

ఓహో! నే నింతవఱకు నేమో యనుకొంటిని. పుట్టి బుద్ధియెఱింగి యెన్నడు నిట్టిపురుషుని జూడలేదు. ఔరా! ఈరాజు సాధారణుండని యెన్నరాదు. ఈయనవీక్షణంబులు బాణంబులవలె నాహృదయంబులోఁ జొచ్చి నన్నుఁ గలవరపెట్టుచున్నవి. నిగురుకప్పిన నిప్పువోలెనున్నాఁడు. ఏపుట్టలో నేపాముండునో యేజనునివద్ద నేమహత్త్వముండునో స్థూలదృష్టిచేఁ బరిశీలించుట దుస్సాధ్యమని యిప్పు డిన్నాళ్ళ కెఱింగితిని. పైయాకారమును నమ్మి చులకనగా సంభాషించినచో మోసపోయి యుందునుగదా!

అని యిట్లు రెండునిముసంబులు తాళి చెదరిపోయిన ధైర్యమును జిక్కబెట్టుకొని గోపినాథుఁడు చంద్రరావుని జంపుట కళ్యాణదుర్గాదులను స్వాధీనపఱచుకొంట మున్నగు శివాజి దుండుడుకుచర్యలు గుక్కలిడకుండ నేకరవుపెట్టెను. తరువాత సుల్తానుయొక్కయు ఖానుయొక్కయు దయౌదార్యాదిగుణంబులు లెక్కించి సుల్తానుపైఁ గత్తికట్టుట మౌఢ్యమనియు నాత్మనాశకరమనియు నొక్కి వక్కాణించి నమ్రభావము తెల్లముగా శరణుజొచ్చుట శ్రేయస్కరమని రాజునకు బోధింపఁ జొచ్చెను. ఇట్లుపన్యసించుతఱి ఱేఁడు తెప్పవాల్పక యెగాదిగ నతని బరికించుటంజేసి పంతోజి తనభావమెల్ల శివాజి కెఱుంగనాయెనని శంకించి సంభ్రమముతోఁ దాఁజెప్పదలఁచుకొన్నదంతయు నాల్గుమాటలతోఁ జెప్పి ముగించెను. తదనంతరంబ కృష్ణాజిభాస్కరుఁడు లేచి శివాజిమనోభిప్రాయమెఱింగి తదనుగుణ్యముగా సమర్యాదగా నిట్లు

ప్రత్యుత్తర మీదొడంగెను. "పంతోజీ! ఈకోంకణస్థులుచేసిన దోష మెద్ది! సుల్తాను చిన్నవాఁడౌటవలననో మంత్రులకు విధేయుఁడౌటవలననో కాని తదుద్యోగస్థులు వీరిని రాయిడి పెట్టుచుండఁగా జూచియుఁ జూడనట్లు వారింపకుంట యటుండఁ బై పెచ్చు వీరువిన్నవించుకొంటకుఁ బోయినను న్యాయమిప్పింపక వీరిపట్ల విముఖుండై యున్నాఁడు. ఇందువలననే యిచ్చటిజనులు తమ్ముఁ దాము కాపాడుకొనఁగోరు మార్గ మన్వేషించుచున్నారు కాని తిరుగబాటు చేయవలెనని యెంతమాత్రము వీరికి లేదు. ఇంతకు నియ్యది కొండదేశముకదా? వీరిలో నొకగ్రామమువారు వే ఱొకగ్రామమువారితోఁ దలపడునాచారము కలదు. ఇటువంటి సంగతులు నగ్గురిలో మాటలాడుకొంటదగదు. రహస్యస్థలమునఁ జర్చించుకొనుట లెస్స. ఖానుసాహేబుగారి యెదుటఁ బరిష్కరించుట యుక్త మని మారాజుగారి యభిప్రాయము. ఐదువేల గుఱ్ఱపుదళముతోడను నేడువేల కాల్బలముతోడను దండెత్తివచ్చిన ఖాను నెదిరించుటకు మావద్ద నేమి సామగ్రియున్నది? కావలసినంతమంది సైనికులా లేరు. పెద్దఫిరంగులా లేవు. ఇంక నేసాయముచూచుకొని యంత వానితో మావారు మార్కొని పోరాడుట." అని కృష్ణాజి పల్కుసమయమున శివాజి మందహాసముచేసి యి ట్లనియె. "ఔను కృష్ణాజి చెప్పినదెల్ల వాస్తవమే. ఇయ్యది మీకుఁ బ్రత్యక్షప్రమాణము. చీమలబారణంచుటకు నేనుగులమంద కావలెనా? పిచ్చుకల నడంచుటకు బ్రహ్మాస్త్ర మెత్తవలెనా? నాపాలిటియీదేశము తిరుగా ఖాను గావలెనని కోరెనేని యిప్పుడే సంతోషముతో నారాష్ట్రమొప్పగించి నేటినుండి యతనిభృత్యుండనై మెలంగెద. ఈ నామాట లాయనతో నెఱింగించి సంధి కుదిర్చెదవేని యింతమంది ప్రాణములఁ గాపాడెడి పుణ్యంబు మీకబ్బు. నావుడు నాబ్రాహ్మణుఁడు నట్లుగాక యని తనసమ్మతిఁ దెలియఁజేసి వెండియు ని ట్లనియె.

"ఓరాజా! నీవు మనుమార్గం బెఱింగిన వినీతుండవు. లేనిచో నిట్టి సదసద్వివేకమును వినయవిధేయతలు వేఱొక్కని కలవడునే? కోంకణప్రభూ! మాఖానుని యౌదార్యము నీ వెఱుంగనిదే? అయినను మీకం

శైను బీజపూరులోనున్న మా కెవ్వఁడునిశదము. ఎట్లంటి వేని నాఁడు మీ తండ్రిని సుల్తానుతండ్రి చెఱలోనుంచునప్పుడు ఖానుఁ డన్నపానాదుల నరయుటేకాక యన్నివిధముల నతని గనిపెట్టుచుండెడువాఁడు. మఱియు నా సేనానిదయవలననే సుమీ! మీతండ్రి యింతవఱకు జీవించుట తటస్థించెను. నిక్కముగా నతనికంటె భూతదయాళువును నుదారుఁడును మహాత్ములలో నెక్కరిని గానము. ఇంతకు నతనికి మీపైఁ బ్రత్యేకద్వేషమేమియున్నది? అనివవిని రాజిట్లనియె. "యీమాటలలోఁగల సత్యము స్వయముగా మేము పరీక్షింపకయే మాకు నమ్మకముపుట్టదు. మే మేవిధమైన యుద్ధసన్నాహము చేయలేదనుటకు మీరే సాక్షి. ఇప్పుడు ఖాను హిందూమతద్వేషము నవలంబించి విగ్రహములు పడఁగొట్టించుట లోనగు దుష్కార్యములు సల్పుచున్నట్లు వినుచున్నారము. అయ్యవికఁ గట్టిపెట్టి యిచ్చోట మాకొండమూక చేయు నాతిథ్యంబు పరిగ్రహించినచో దాన నుభయులకు మేలగును" అని సామవాక్యంబులను వకీలునెడం బలికి యప్పటికిఁ జాలఁ బ్రొద్దెక్కుటవలన సభ చాలించి శివాజి భోజనార్థము స్వగృహమునకు నడిచెను.

శివాజి యెప్పటియట్ల మృష్టాన్నంబు భుజించి జననిసన్నిధికేగి యామెతో నిట్లనియె. అమ్మా! నీవు ఖానువద్దనుండి మాతవచ్చినసంగతి యెఱింగియేయుందువు. నేను మొదటిలోవచ్చిన రాయబారి దురహంకారియైన ముష్కరతురుష్కుండై యుండు నని యెంచితిని; కాని యతండు భూసురుం డౌటవలన నా పన్నుగడ కొక్కింత యనుకూలమాయెను. నావుఁడు జీజీభాయి—నాయనా! మనకు మేలుచేయఁబూని భవానియే యీబ్రాహ్మణతిలకము నిచ్చోటికిఁ బంపెను. ఈలౌకికుని మూలమున మనయభీష్టములు నెఱవేఱవచ్చును. నీ కతం డనుకూలుం డగునట్లుచేయుమని పార్వతినే స్వయముగాఁ బ్రార్థింతును. ఇంక నీకు వచ్చిన భయమేమియు లేదని యెఱుంగుము. అని తల్లి తెల్పినతఱువాత శివాజి రాయబారికిని దనకును జఱిగిన సంభాషణమంతయు శ్రుతపఱచి పదంపడి తనలోఁ దా నిట్లు వితర్కింపఁజొచ్చెను. "ఖాను నిటకు రావించి చెఱ పెట్టఁగల్గితి నేని నా చెప్పినచొప్పున నతనిని వినుకొనఁజేయవచ్చునుగదా! ఇట్టి

పనికి వకీలు సమ్మతిపడి నాకు సాయముచేయునా? 'బాపనయ్యకు బండెడి యాస' అని లోకులందురు. అది కావున నాతని కొక పెద్దయాశచూపి నా పనికిఁ దోడ్పడఁజేసెదను గాక. నామాటప్రకారము వకీలొకయుత్తరము వ్రాసి ఖానునిచ్చోటికిఁ దెప్పించెనేని యవల నాయనుకొనునట్లు చేయవచ్చును. అప్పటిలో ఖానుడును వానితోఁబాటు వానిబలమును నాకరుణ కధీనులై యుందురు. అని యిట్లు యోచించి తనయుద్దేశము తల్లి కెఱింగించి యద్దాని సమ్మతి నొంది తానే చని పంతోజితో మాటలాడ సమకట్టెను.

—oo:※:oo—

# పండ్రెండవ ప్రకరణము.



సమస్తశాస్త్రములకును విద్యలకును బుట్టినిల్లగు మనభరతఖండమునందుఁ బ్రాచ్యులు విస్తారశ్రమదీసికొని కృషిచేసినవిద్యలలో జ్యోతిష మొకటిగానై యున్నది. పరాశర జైమిని ముఖ్యమహర్షులచేతను వరరుచి సత్యాచార్యప్రముఖ విద్వాంసులచేతను బెద్దచేయఁబడి నానాసీమలకు వ్యాపకమై బహురాజశిఖామణుల యవలంబనముచెంది విరాజిల్లిన జ్యోతిషవిద్యయందు శివాజియు నభిరుచికల్గినవాఁడై యాకాలములోఁ బ్రసిద్ధికెక్కిన పండిత భాస్కరసిద్ధాంతి యను నొక్కజోస్యుని దనసంస్థానమున నుంచుకొనియుండెను. ఇతఁడు జాతకములు వ్రాయుటయందును శుభముహూర్తములు నిర్ణయించుటయందును నారితేరుటయేకాక ప్రశ్నలు చూచుటయందును విశేషనిపుణత వహించియుండెను. ఇదెఱింగి శివాజి తానేకార్యము చేయఁబూనినప్పుడైన నీతనితో నాలోచించియే మఱి చేయుచుండెడువాఁడు.

ఈజోస్యుఁడు వాసము చేయుచున్నయిల్లు కోటకుఁ దూర్పుదిక్కునఁగల వీథిలోనుండునది. ఈయింటికిఁ ద్రికాలముల నెవ్వరో యొకరు వచ్చుచునే యుంటఁబట్టి గృహమేధి రాత్రి చాలసేపు మేలుకొనువాడుకగలదు. తత్సదనముననే యొకభాగములోఁ బంతోజి గోపీనాథునకు శివాజి బస యేర్పాటు చేయించియుండెను. పంతోజి శివాజులు కలిసి పలుకరించుకొన్న యానాఁటి రాత్రి కొంతచెల్లినపిదప నిద్దఱుపురుషు లతిసత్వరముగా జోస్యునివీథిలోనికి వచ్చుచుండిరి. అం దొకండు మొగమున విభూతి యలందుకొని గడ్డముక్రిందనుండి యొక రుమాలు తలకుఁగట్టికొని కంబళియొకటి కప్పుకొనియుండెను. రెండవవాఁడు విలువగల యొకశాలువ కప్పుకొని చేతి నొకకరవాలము దాల్చియుండెను. ఇట్లాయిరువురు జోస్యునియింటివద్దకుఁ జేరినపిమ్మట నందు ఖడ్గధారియగువాఁడు “జోస్సీ! జోస్సీ!” అని తలుపుతట్టెను. వెంటనే లోపల

నుండి జోస్యుఁడరుదెంచి యాయిరువురుని లోనికిఁదీసికొనిపోయి తల్పు చేరవేసెను. అంత విభూతిధరుండు జోస్యునుద్దేశించి "ఆర్యా! యిప్పుడు వర్జ్యములు లేవుకదా! అనుటయు నతఁడు ప్రస్తుతము వర్జ్యములు లేవని యెఱింగించి ఖడ్గధరు నట నుండుమని చెప్పి విభూతికలితుం దోడ్కొని వకీలు పరుండు గది లోనికిఁ దీసికొనిపోయెను. పంతోజి వారిం జూచి దిగ్గనలేచి కూర్చుండెను. విభూతిధారి తోడనే నమస్కారముచేసి వకీలుపక్క నిల్చియుండ నదిచూచి పంతోజి యతనిని దనదగ్గరనే కూర్చుండఁజేసెను. ఇట్లు జోస్యుండు వీరి నిద్దఱఁగలపి తా నెప్పటితావునకుఁ బోయెను. తరువాత వారిద్దఱు నిట్లు ప్రసంగింపఁదొడంగిరి.

వకీలు—అయ్యా! మీరాకకు గతంబేమి? భోన్సలేకుల తిలకము నావలన నేమి యుపకార మర్థించి మిమ్మిటకుఁ బుత్తెంచెను. రాజు బ్రాహ్మణకులబాంధవుండు కావుననే నాతనిపై పయి మెట్టి యుపకారమైనను జేయ సిద్ధముగా నున్నాను.

విభూతి—ఆర్యా! మీరుచెప్పినది ముమ్మాటికి యథార్థము. అప్పహానుభావుండు ద్విజులశ్రేయోభివృద్ధి కోరియే తద్విరోధులగు యవనులతోఁ బోరాడ సమకట్టియున్నాడు. ఓహో! విప్రులయెడ నతనికిఁ గల గౌరవ మింతింతని చెప్ప నలవికాదు. భూదేవులను సర్వదా యారాధించుటేకాక వారి యోగక్షేమములు తఱచు గనుంగొనుచుండును. ఇదికాక విశేషించి భూదేవతలను దొంటియుగములవలె గౌరవాధిక్యసంపన్నులఁగాఁ జేయ గంకణము కట్టుకొనియున్నాఁడు. ఇట్టి ఘనోద్యమంబులకు మీబోంట్లు తోడ్పడరాదే?

వకీలు—నే నెట్లు సాయముచేయఁగలను? బ్రాహ్మణులు సాయము పొందువారుకాని చేయువారు కారుకదా? ఇంతకు నే మహమ్మదీయుల సేవకుండను.

అని వకీలు పెద్దనిట్టూర్పునిగిడ్చి తనయవస్థకు విచారించుకొని కొంతసే పేమి బదులు చెప్పుటకుఁ దోచక యూరకుండెను.

విభూతి—మీ రిట్లనుట పాడికాదు. మీవిద్యాగంధము దశదిశలు వ్యాపించి యున్నది. ఘనులకు నైచ్యానుసంధానము సహజము. మీస్నేహము మా రా జపేక్షించియున్నాఁడు. ఇది తెల్పుటకే నే నిచ్చోటి కంపఁబడితిని.

వకీలు—నావలన నేమియగును ? మి మ్మాసంగతులు నాతో మాటలాడ మని నిజముగా శివాజి మిమ్ము బుత్తెంచినందులకు గుర్తేమి ? మీ రెవ్వరో నే నెఱుంగనిదే మీమాటలకుఁ బ్రత్యుత్తర మీఁజాలను.

విభూతి—నే నెవ్వఁడనైన నేమి? శివాజి నన్ను బంపెనో లేదో యను దానికి నిదిగో! తదంగులీయకము. తమరు భూసురు లని యెఱింగి నప్పటినుండి శివాజిమహారాజు విచారించుచున్న దింతింతని చెప్ప రాదు. "హాహా! ఏమీ కాలమహిమ ? లోకపవిత్రులైన విప్రులు మ్లేచ్ఛులకు దాసులైయుంటఁ దటస్థించెఁగదా !" అని రాజుగారు వారే తత్కాలనిరసనము గావించి మిమ్ముగూర్చి పరిపరివిధముల విచారించి చాలమట్టుకుఁ బ్రసంగించిరి.

వకీలు—అయ్యా ! నే నొక్కండనే తురకలఁ గొల్చి బ్రతికియుండలేదు. నాతోఁబాటు పెక్కండ్రు సుల్తానుదర్బారులో నుద్యోగము చేయుచున్నారు.

విభూతి—ఇస్సిరో ! మీమాటలు విన నాకు సిగ్గుపుట్టుచున్నది. ఉద్యోగములు చేయుచుంటిమంటిరి. ఉద్యోగలక్షణమే మీ రెఱుంగరు కాబోలు. కాని వాండ్రడకాళ్లుపట్టుట యెంత వేతనము ముట్టుచున్నను దాస్య మనిపించుకొనుగాని యుద్యోగ మగునే? నిరంతరము గోబ్రాహ్మణహింస గావించుటయే కాక లోకమాత యగు తులుజామాతను బాండురంగవిభుని బరిభవించి తదీయదేవాలయములు నాశనము చేయు ధూర్తతురుష్కులను గొల్చి పొట్ట పోషించుకొనుటకంటె బ్రాహ్మణు లగువారికి హైన్య మేమున్నది ? కటకటా ! తురకల గులాపువార మని చెప్పకొనుటకంటె బాఁపలకు మరణమే మేలని

నాయెన్నిక. ఛీ జానెడుపొట్టను బోషించుటకు బఠానులనౌకరియే చేయవలెనా ? లోకములో వేఱొక్కవృత్తిలేదా ?

వకీలు—మీరు వాక్రుచ్చునదెల్లయు సత్యమేకాని ప్రస్తుతము మహమ్మదీయులు భూనాథులౌటవలన నెట్టివారును వారికి విధేయులై యుండవలసివచ్చినది. వారికొల్వువిడిచినచో మాబోంట్లు పెక్కుమందికి గుటుంబములు సాగుటయేకష్టము. అయ్యో ! తులుజామాతను బాండురంగవిఠలుని బరిభవించునప్పుడు నే నయ్యెడల లేకుంటిని జూడీ !

విభూతి—చాలుంజాలు లోకులందఱు యవనుల గులాములై జీవించుచున్నారా? పూర్వము విప్రు లెట్టి యుచ్చపదవిలోనుండిరో జ్ఞాపకము తెచ్చుకొనుండు. నిజతపస్సులచే నెల్ల జగములంబాలించు మహీదేవతల సంతతిలోబుట్టిన మీకిట్టితామసం బెట్టులలవడెనో నా కచ్చెరువగుచున్నది. భార్యాపుత్రులఁ బోషించుటయే పరమపురుషార్థముగా గణించితిరేమో ! రాజద్వారములఁ బడిగాపులుగాచియా తొంటిమహాత్ములు కీర్తి మహిమలుగనుట ? తుక్కారాము రామదాసు తులసీదాసు లోనగు మహాత్ము లేతురకలకాళ్లుపట్టి యింతవారైరి ? రామదాసు యోడి శివాజిమహారాజున కుపదేశించిన నవరత్నపద్యములో నొక్కడు చదివెద నాలింపుము.

ఉ. పూరుషజన్మమెత్తి యొకముద్దులగుమ్మను బెండ్లియాడినన్
బౌరుష మౌనె? ముక్తి సతిఁబట్టుట యుత్తమ మట్లు కాననా
డారయఁ గీర్తి భామినిని నైనఁ గరగ్రహణం బొనర్ప నా
బౌరుషవంతులై మననివారలజన్మ మదొక్కజన్మమే ?

వకీలు—మీ చెప్పిన చొప్పున నడచుకొంటకు సిద్ధముగా నున్నాను. మీకోరికప్రకారము విజాపురి దొరతనమును గొల్చుట మానివేసెదను. నాకేదైనఁ దగిన యుద్యోగము నిప్పించికాని యింక వేఱొకవిధమున గాని జీవనోపాధి గల్పింపఁగలరా ?

విభూతి—త్రికరణశుద్ధిగా మీ కిట్టియభిప్రాయ మున్నచోఁ దగిన జీవనో పాధి దానియంతట నదియే చేకూఱును. ఇందులకు సందేహింపఁ బని లేదు. కాని తగినంత నమ్మకము గనఁబఱచెడిభారము మీయం దున్నది. మహారాజుగారి యభిప్రాయము మీ కెఱుంగుదురా?

వకీలు—మహారాజు ప్రొద్దున నాపైఁబఱపిన చూపులువలననే యాయనయభి ప్రాయము కొంతమట్టుకు గ్రహించితిని. కాని యొరులకు నాహృద యము మొదట నెఱింగించుటకు నిచ్ఛగింపను. మహారాజుతో గలిసి కొని మఱొక్కసారి ప్రసంగించిన పిదప నన్నిసంగతులు తేలఁగలవు. మీరాజుదర్శనము తెఱుగ జేయింపుఁడు.

విభూతి—ఆర్యా? మీకీ లేనిపోని సంశయమేల? మహారాజుగా రంప కున్నచో మీతో నింతసేపు ముచ్చటించుటకు నాకేమి చాద స్తమా? నీరు మహారాజున కెఱింగింపు మన్నసంగతు లన్నియుఁ దప్పక యెఱింగింతును.జంకువిడిచి మీమనోభిప్రాయము తెలియఁజేయుఁడు.

వకీలు—(కొంతసే పాలోచించి) అయ్యా! ఇట్టిసంగతులు మధ్యస్థులవలన శివాజి కెఱింగించుటకు నే నెంతమాత్రము సమ్మతింపను. ఇవి మీయు భయులలోనే యుండవలెను లేనిచోఁ బ్రమాదములు తటస్థించును. ఇట్లంటి నని మీరు మఱొకలాగు తలంపవలదు.

అనవుఁడు విభూతిదారి వకీలు నుద్దేశించి "లౌకికచంద్రమా? నే నెవడ నో తమ కెఱుంగుదురా?" అని తనమోమునకు నడ్డుగానున్న రుమాలువిప్పి విబూది తుడుచుకొని "ఇప్పుడైనను నన్ను నానవాలుపట్టితిరా?" అని దిగ్గున లేచి వకీలు పాదములకు శిరస్సు దగిలించి సాష్టాంగనమస్కారములు సల్పెను. తోడనే వకీలును భయసంభ్రమములతో లేచి ప్రతినమస్కారముచేయ నుం కించువేళ నొడ్డుకొనుచు శివాజి యిట్లనియె. "మీరు బ్రాహ్మణవంశస్థులు నేను శూద్రుండను. ఇ దెఱింగి ప్రతినమస్కారముచేసి యేల సనాతనపద్ధతి నతిక్రమింపఁ జూచెదరు. దాన నుభయులకు శ్రేయోహాని యగునని పెద్దలు చెప్పుదురు.!" అని యుచితముగా వాక్రుచ్చెను.

వకీలు—మహారాజా! నేను మహమ్మదీయుల కొల్వులో నిన్నాళ్ళనుండి వారికి సాయముచేసి యపచారపడితిని. ఇప్పుడు నే మిక్కిలి పశ్చాత్తాపము నొందుచున్నాను. నాపల్కులు పాటిచేసి నన్ను మన్నించు టొప్పు. మీయాజ్ఞ యెట్లో యట్లే నడచుకొనుచున్నాను.

శివాజీ—మంచిది. నే ననుకొన్నట్లే జరిగినది. ఈకలికాలములోఁ దమవంటి నిజమరివిప్రోత్తము లుంటవలననేకదా! ధరలో నంతగా ననావృష్ట్యాదిదోషములులేక యచ్చటచ్చటనైనను ధర్మములు కనఁబడుచున్నవి. ఇంతపై మీరేమియాలోచన చెప్పెదరో చెప్పుడు.

వకీలు—ఖాను నిచ్చోటికి రప్పించి సమ్మతమయ్యెనేని యట్ల కావింతును. ఈచొప్పునఁ జేసిన నాకేమి బహుమానము చేసెదరు.

శివాజీ—నే నింతకుముందే యేర్పాటుచేసికొనియే యున్నాను. అదియెట్లుంగఁ గోరదరేని వినుఁడు. ఒకజాగీరు గొప్పయుద్యోగము. తగిన బిరుదము. ఇది మీ కీయ నిశ్చయించుకొంటిని.

అనిచెప్పి శివాజి పంతోజికడకు గొంచెము జరిగి యతనిక త్తిపైఁ దన మోకాలు నదిమిపట్టి మొలలో దాఁచుకొన్న కరవాలము పైకిలాగి యిట్లనియె. "ఓ పండితప్రవరా! చూడుము నీప్రాణములు నాచేతిలోనున్నవి - కాని నీకు భయపడవలసినఁ బనిలేదు. మననిర్ణయము గుప్తముగా దాఁచిపెట్టి నా చెప్పినట్లు నడుచుకొందు నని భూమిముట్టి ప్రమాణముచేయుము. దాన నుభయులకు మేలుగల్గును." ఆపల్కులు విని వకీలు గడగడవడంకుచు ముచ్చెమటలు మేన గ్రమ్మరింప నేమిచేయుటకుఁ దోపక భీతాత్ముండై యెట్టకేలకు మెలంకువగల్గి శివాజిమనోభిప్రాయ మెఱింగి యతం డట్లు ప్రమాణము చేసెను. దానికి శివాజి సంతసించి యిట్లనియె.

శివాజీ—ఆర్యా! భయపడవలదు. మీకు శివాజి వాగ్దానము చేసినదానికంటె నెక్కుడుచేయు నని నమ్ముడు. ఖాను నెట్లైనను వంచించి యిచ్చోటికిఁ దేఁ జూడుఁడు. ఈమాత్ర ముపకారముచేసి యస్మదుద్యోగమునకు సహకారులైతిరేని చిరకీర్తి తప్పక మీ కలవడును.

వకీలు—మీరు గోరినప్రకారము చే పత్త్రము వ్రాసి పంపెదను లెండి.

శివాజి—ఆవ్రాసెడి దేదో యిప్పుడే నాయెదుటఁ గానిండు. కాని చేపటి వఱ కీపని నిల్పుటకు వలనుపడదు. కమ్మ గొనిపోవుటకు ముప్వుర నీ సమీపముననే యాయత్తపఱచియున్నాను.

వకీలు—వా రెవ్వరు ?

శివా—ఈదినము నాకు మాఱుగా సభలో మీకుఁ బ్రత్యుత్తరమిచ్చిన బ్రాహ్మణుండు మఱి యిద్దఱురౌతులు.

వకీలు—ఖానునిమాత్రము మీరు హింసింపరాదు సుడీ ?

శివాజి—వానికిని వానికుమారునకు నేయుపద్రవము రాకుండ నే నరసెదను. తక్కినవారినిమట్టుకు మాయిష్టమునకు వదలివేయుడు. తండ్రికొడుకు లను సంధినిబంధనములు సరిపడీనదాక మావద్దనే యుంచుకొని అతిథులవోలె గౌరవముతో చూచుచుందుము. వారివిషయములో మీ కనుమానింప నవసరము లేదు. ఇంకఁ గలము కాగితములు తెప్పించనా?

అని కృష్ణాజిని బిల్చి జోస్యునివద్దనుండి కలము కాగితములు తెప్పించి పంతోజి కిప్పించుటయు నతండును వాని నందుకొని నీ దిగువ తెలుంగున వ్రాయఁజొచ్చెను.

"ఖాను సాహేబుగారికి మీయిష్టుండును విజాపురిసుల్తాను సేవకుండు నగు పంతోజి గోపినాథు వ్రాసికొన్న విజ్ఞాపన మేమన ?

మ్లేచ్ఛకులదీపకా ! నే మీరు చెప్పినచొప్పునఁ బ్రతాపగడకుఁ బోయి యక్కడ శివాజిని దర్శించి యాయనతోఁ దగురీతిని సంభాషించినాడను. అతనికోటను బ్రజలను జూచినాడను. యుద్ధప్రయత్నము లెవ్వియుఁ గానరావు. తమరు తగినంతసైన్యము గైకొని బయలుదేఱి వచ్చితిరేని శివాజి తప్పక బెగడొంది మీరు నిర్ణయించిన నిబంధనల చొప్పున నొప్పుకొనును. రాజుకార్యదర్శినే మీసన్నిధికిఁ బుత్తెంచుటఁజేసి నే విశేషించి యేమియు వ్రాయలేదు. మీకు గావలసిన వృత్తాంతమంతయు నతని నడిగి తెలిసికోవచ్చును. సేనానులును మంత్రులును నగు మీకు శరణుజొచ్చి క్షమాపణకోరుకొంట

మంచిదని శివాజికి నొడంబఱచుచున్నాను. ప్రభావతి యిచ్చటనే యున్న దని వినుచున్నాను. ఇక్కడ నా కేవిధమైన లోటుపాట్లు చేయక రాజును బదీయులును ననుకూలురై మెలంగుచున్నారు. కావున మీ రేవిధమైన సంశయ ముంచుకొనక నా వ్రాతలను బాటించి యిచ్చటకు విచ్చేయఁ బ్రార్థితులు. విశేషములు మీరు వచ్చినపిమ్మటఁ దెలియఁజేసెదను.

ప్రతాపగడ | విధేయుఁడు,
పంతోజి గోపీనాథుఁడు.

ఇట్లు పంతోజి వ్రాసిన యుత్తరము కృష్ణాజిచేఁ జదివి వినిపించుకొని తగినట్లు వ్రాసినందులకుఁ బంతోజిని శ్లాఘించి యనుకొనునట్లు జఱిగినందులకు లోలోన సంతోషించి కృష్ణాజిచేతి కుత్తరమిచ్చి "ఆర్యా! త్వరితముగా మీరుపోయి కార్యము సఫలముచేసికోరండు" అని యతని నానఁడు రేయిఁ బుత్తెంచెను. పిదప నప్జల్లాను దండయాత్రకు హేతవు ఫజీలునకుఁ బ్రభావతిపై మోహమేయనియు వీలుచిక్కినయెడలఁ దన్ను బ్రాణములతోఁగొంపోవ ఖాను సమకట్టినసంగతియు ఖానునకు దర్బారులోనున్న పల్కుఁబడియు లోన సంగతులు పంతోజివలనఁ గ్రమముగా నడిగి తెలిసికొని జోస్యునటకుఁబిల్చి యతనితో నిట్లనియె. "జోస్సీ! వకీలుగారి కేవిధమైన లోటు జఱగకుండఁ జూడ వలసినది." అని యానతిచ్చి తనకు గోపీనాథుచేసిన మేలునకు నతనిని వేవిధంబుల గొనియాడి వెండియు నిట్లనియె. "భూసురరత్నమా! ఈనాటగోలె మనమిద్దఱము ప్రాణమిత్రులమై మెలంగవలెఁజుండీ" అని మైత్రి దొల్లముగాఁ గోపీనాథుని గౌఁగిలించుకొని "చాలరాత్రియైనది పోయివచ్చెద" నని చెప్పి యతనిని వీడ్కొని మెల్లగా జననిసదనమునకు జేరుకొనెను.

అటఁ దనరాకకై నిద్రమానుకొని వేచియుంటఁ గనిపెట్టి యామెతోఁ దనకును వకీలునకు జఱిగినసంభాషణవై ఖరియు, వకీలుని సమ్మతిపఱచి యుత్తరము వ్రాసిన తెఱంగును, ఆజాబును గృష్ణాజికిచ్చి పంపినసంగతియుఁ బేరిమితో నెఱింగించి కంటికి నిర్భరమైన నిద్రవచ్చుటంజేసి యారేయి నచ్చటనే తన గదికిఁబోక పండుకొనసాగెను.

# పదుమూడవ ప్రకరణము.



వాయీగ్రామము ముట్టడించి కొల్లగొట్టినయవనులు ముందునకుఁ బోజాలక యీగ్రామసమీపముననే గుడారములు పెక్కులు వేసికొనియున్న సంగతి చదువరు లెఱింగియేయుందురు. అట్టిగుడారములలో నొక్కటి తక్కటివానికంటె మిక్కిలి నేర్పైన దుప్పట్లతోఁ దయారుచేయఁబడుటవలనఁ జుక్కలలోఁ జందమామమాడ్కి వాసికెక్కియుండెను. అందముచేత నేమి యెత్తరముచేత నేమి తనరారుటేకాక తగినవిరివియుగల్గి యందుండువారికి నాగుడారంబు పెద్దబిడారంబై యొప్పెను. అందు తివాసులు జంపకానాలు నేల గానరాకుండఁ బరచఁబడియుండెను. అయ్యది పరదాలచే రెండుగదులుగాఁ జేయఁబడియుండె. వెనుకగది జనానా బీబీలకు విడువఁబడి ముందుగదిమట్టుకు సాహేబుల వాడుకక్రిందనుండెను. ఆముందుగదిలో నారుమూరల కవాచి మంచముండెను. దానికి సరిపడ ఖానుఁడుపరుండి యొకచేతితో హుక్కాపీల్చుచు మఱొకచేతితో సవరమువంటి బిడుసుగడ్డము నులుముచు దగ్గిరనున్న సయ్యాదు జంజారుల కప్పుడప్పుడు దమ్ముకొట్టుమని హుక్కాగొట్టము చేతికందిచ్చుచు వారితో నేమో ముచ్చటలాడుచుండెను. అత్తతి రూపునకేమి గుణములకేమి తండ్రినోటిలోనుండి యూడిపడినట్లుండు ఫజీలు పకీరుతోఁగూడి యచ్చోటికి విచ్చేసెను. తోడనే పరుండియున్న ఖాను కూర్చుండి పకీరునకు నొకపీట వేయించి కొడుకును దనమంచముమీదఁ గూర్చుండఁబెట్టుకొని పట్టువడిన పరభు దంపతుల నక్కడకు రావింపఁజేసెను. పాపము ప్రభావతి పట్టువడినదని కొండంతపొంగివచ్చిన ఫజీలు తానువలచిన ముద్దుగుమ్మకాక యాపె తలిదండ్రులుమాత్రమే పట్టువడుటకు మదిలోఁ గించపడి యొక్కింత తడవు వితాకు చెందెను.

అటుతరువాతఁ దండ్రికొడుకులు పరభు దంపతుల నిద్దఱను గ్రుచ్చి గ్రుచ్చి యడిగి పెక్కుసంగతులు తెలిసికొనిరి. మఱియుఁ బ్రభావతి విషయ మడుగుటయు దంపతులు కంటఁ దడిపెట్టుకొని యీసుకుమారిజాడ తామెఱుంగమని యెంతచెప్పినను నమ్మక వారు వారిని బాలాజిపరభునకువలె బందెలో నుండఁజేసిరి. పకీరు దంపతుల దురవస్థఁజూచి తనకుఁగల్గిన యాపరాని దుఃఖమును బయటబుచ్చిన మోసమువచ్చునని లోలోన దిగమ్రింగుచు వారిని దగినంత యాదరముతోఁ జూచుచుంట యుక్తమని ఖానునకు బోధించి వారికి నన్నపానాదులలో నేకొఱంత గలుగకుండఁ గనిపెట్టుచుండెను.

బాలాజియుఁ బత్నీసహితముగా రామోజీ పట్టువడుట తెలిసికొని తాఁ బట్టువడుదానికంటెఁ బదిరెట్లువగచి వారితో నదను చిక్కినప్పుడు మాటలాడి ప్రభావతివృత్తాంతము నెఱుంగ నెదురుచూచుచుండెను. స్వజాతీయుఁడైన జంఝూరరావుతో నప్పుడప్పుడు తనదుస్థితి విన్నవించుకొనుచు మాటలపేర్మి నతనిహృదయము మెత్తబఱచుచుండెను. పకీరు తనవిషయము కరుణగలవాఁడుగా నున్నవాఁడని యతనిమాటల పోడిమిని గ్రహించి తనవృత్తాంతము జంకువిడిచి పకీరునకు నెఱింగింపుచుండెను. ఇట్లు ముక్తికై పలుతెఱంగులఁ బ్రయత్నించుచుఁ బ్రభావతి విశ్లేషమున నానాటికి దిగనారుచు బోనులోఁ జిక్కిన సింగమువలె శత్రులమధ్యమున దిన మొకయుగమువోలెఁ గడుపుచుండెను.

అట్లు బయలుదేరిన కృష్ణాజి భాస్కరుఁడు ఖానుశిబిరమునకుఁ జేరికొని తాను విచ్చేసినసంగతి యవనసేనాని కెఱింగించెను. ఖానుడు నాతని సగౌరవముగాఁ దనగుడారమునకు రావించి పంతోజి పంపినజాబును స్వీకరించి యందలివిషయములు మొదటఁ దనలోఁ దా మెల్లగాఁ జదువుకొనెను. కాని యటనున్నవారందఱు తనకాంతరంగికు లౌటఁజూచి పట్టరానిసంతోషముతో లేఖలోని సంగతులెల్ల వారి కెఱింగించెను. వారును ఖానునకువలె నొక్కింత సంశయింపక యావార్తలు నిజమనినమ్మి కృష్ణాజిని గొన్నిసంగతు లడుగఁజొచ్చిరి. శివాజి కార్యదర్శి వారికి మఱింత నమ్మకముపుట్టునట్లు తగినట్లు సమా

ధానము చెప్పి బీజపూరువారి సామర్థ్యాదులును శివాజి దుర్బలత్వాదులు నేర్పు మెయి నిరూపించి యఫ్జల్లాను నౌదార్యాదిగుణంబులు కలవానిగా వర్ణింపం దొడంగెను. ఏ పేరును గృష్ణాజిమాటలకు దాళము వేయుచు హెచ్చరించు టను ఖానుడుం దదీయులుం బంతోజి యుత్తరముచొప్పునం బ్రతాపగడకుం బోవుటకు నిశ్చయించి ప్రభావతిజనకులం దక్క దక్కంగల బాలాజి ముఖ్యు లను మరాటవారి కోటలలో దోచుకొన్న ద్రవ్యమునుం దమరాజధానికిం గొంపొమ్మని ఘోరపురే బధీలుఖానులకు నియోగించి తాము కృష్ణాజితోం గలిసి ప్రయాణము సాగించిరి.

ఏకారణమువలననో కాని యాయున్న నాల్గునాళ్లలోం బకీరునకు బా లాజిపైం బ్రేముడి చాలం గల్గియుండెను. బాలాజిని బీజపూరునకుం దీసికొని పోకుండం జేయవలెనని ప్రయత్నింపంజూచెను. కాని యది తనకు సాధ్యపడ దని పిమ్మట నెఱింగి తాను మక్కాకుం బోవుదునని చెప్పి వారివద్ద కొంత రొక్కము చిక్కపట్టుకొని ఖాను ప్రయాణము సాగించిన దినముననే యల్ల పకీరు యథేచ్ఛగా మఱియొకమార్గము వట్టిపోయెను.

అట్లు పయనమయిన యఫ్జలు ఫజీలు ఖానులు శివాజి పట్టువడుననియుం బ్రభావతి లభించుననియు నూహించి తమకోరిక లీడేరినపుడు పడవలసిన సం తోష మయ్యైరివురు నప్పుడే పొందుచు తాము సంధికై పోవుచుంటిమని తమ సైనికులతోంజెప్పి యమితోత్సాహముతో దగ్గఱ మజిలీలుచేయుచు దారిపొడు గున శివాజిప్రజలుచేయు నాతిథ్యసత్కారములకుం బ్రీతినొందుచుం బెండ్లికిం దరలిపోవువారివలెం దమ గమ్యస్థానమునకుం బోవుచుండిరి. వారివెంటవచ్చిన హయవేదండాదిసత్వంబులకుం గావలసినంతయాహారసామగ్రి కొన్నిచోట్ల నుచి తముగాను గొన్నిచోట్లం దక్కువవెలలకు దొరకుట యటుండ నానావిధమ్ములు ఫలరసాయనాదులు చుట్టుపక్కలనున్న కొండవారు కానుకగా వారికి నొసం గుటవలన శివాజి యుద్ధవిముఖుండై యున్నాండని యాతండ్రీ కొడుకులతో బా టెల్లరు నమ్ముచు నొక్కింత సందేహింపక యనేకశైలభూములు గడిచి వార ములదినములలోం బ్రతాపగడకు ననతిదూరంబున జావలీగ్రామ సమీపమునకు

నేతెంచి యచ్చటఁ జతురంగబలాదులతో విడిదిచేసిరి. నవరాత్ర మహోత్సవ మునకు సమకూర్చిన వస్తుసామగ్రిలో నెక్కుడుభాగము కర్చుగామి నయ్యాది యవనులకొఱకు వినియోగింపవలసినదని శివాజి యాజ్ఞాపించెను. మఱియుఁ దదనుమతి గైకొని మహమ్మదీయుల శిబిరములచుట్టును గోటనుండి సాహుకారులు పెక్కుఱు చిన్నచిన్ని గుడారములు వేసికొని నానావిధపదార్థములు విక్రయింపఁ జొచ్చిరి. ఇందువలన బావలీగ్రామమెల్ల నొక పెద్దపట్టణమై యొప్పఁ దొడంగెను.

ఖానుఁ డచ్చోటికి వచ్చుటవలన శివాజియు నెవ్వరిచేత నెదిరింపఁబడకుండ సురక్షితముగా జావలిగ్రామముచేరి నందులకు ఖానుఁడును నొకరికంటె నొకరు కడుసమ్మోదించుచుండిరి. ఖానుఁడు జావలీగ్రామమునకు విచ్చేసిన పిదప సంధిసంబంధనములకై యతనికి శివాజికిఁ బెక్కురాయబారములు జఱిగెనుగాని నాటిదినము పంతోజిమాత్రము ప్రతాపగడలోనే ప్రొద్దు పుచ్చుచుండెను. సాయంకాలమైన తరువాత శివాజియనుమతిఁ బడసి కృష్ణాజి వెంటరాగా ఖాను శిబిరమునకుఁ బయనము సాగించెను. ఇట ఖాను తానను కొన్నచొప్పున సర్వము జఱుగుచున్నందులకు సంతోషించి పంతోజి విలంబమునకు నొక్కింత సంభ్రమించి యాతనిరాకకై యెదురుచూచుచుండెను. సాయంకాలమైన కొంతసేపటికిఁ బంతోజి కృష్ణాజి సమేతుండై ఖానువద్దకు వచ్చి యెల్లవారలు వినుచుండ ఖాను నుద్దేశించి యిట్లు పల్కఁదొడంగెను. "ఖానుజీ! మనము వాయిగ్రామములో ననుకొనుదానికంటె నెక్కుడు లాభకరముగా సంధిషరతులు కుదురుననుటకు సందియములేదు. తమరాక శివాజికి సింహస్వప్నమువలె నున్నది. ఈదినమురాత్రి మనసైనికులకెల్ల విందుగావింప రాజు నిర్ణయించుకొన్నవాఁడు. రేపుదయమున శివాజితోఁ దమరు కలిసికొని మాటలాడవచ్చును. ప్రభావతిని మీరు స్వయముగావచ్చి యడుగనిదే రాజు విడిచిపెట్టనని యనుచున్నాఁడు. కావున మీరు ప్రతాపగడ దగ్గఱ నేర్పాటుగాఁబడిన సంకేతస్థలమునకుఁబోయినచో నెల్ల సంగతులు పరిష్కరింపఁబడును. పిదపఁ దక్కినసంగతులు శివాజి రాకడఁజూచి యోజింపవచ్చును. ఇందులకుఁ దమరు సమ్మతింతురేని మీసమ్మతి కొంకణప్రభు

వున కెఱింగించివత్తును". అని వకీలు వ్రాసిచ్చినపిదపఁ గొంతతడవు ఖాను తదీయులను మాటలాడుకొని పంతోజి చెప్పినచొప్పున వర్తించుట లెస్స యని నిశ్చయించి తమసమ్మతి దెల్పుటకై యతనిని శివాజివద్దకుఁ బుత్తెంచిరి.

పంతోజి కృష్ణాజులు ప్రతాపగడకుఁబోయి ఖానుని యొప్పుఁదల నెఱింగించిన శివాజి పెల్లుబ్బి తా ననుకొన్నవిధమున నాటిరాత్రిరి మ్లేచ్ఛ సైనికులకు విందునెపంబున బలువిధంబులైన సారాయీలు మాంసహారములును బానల కొలంది దెప్పించి యిప్పించెను. వారు తమసీమల నెన్నండును జవిచూడని క్రొత్తమాంసములును వింతకల్లులు కొన్ని లభించుటంజేసి శివాజి యౌదార్యమును వేనోళ్లఁ గొనియాడుచు నమ్మహారాజంపిన మాంసభక్ష్యములను మెక్కి యన్ని బానలకల్లును వంచుకొని మనసుదీఱునట్లు గ్రోలి పదంపడి యిట్లు విహరింపఁజొచ్చిరి. కొందఱు హిందీపారసీపదంబులను మనోహరముగాఁ బాడుచుండిరి. కొందఱు వింతవింత శృంగారపు మాటలతోను బాటలతోను వెఱ్ఱి వికారముగా నాడుచుండిరి. మఱికొందఱు నవ్వుచు దుముకుచుఁ బ్రేలుచుండిరి. ఇట్లు తురుష్కులెల్లరు తప్ప త్రాగినవారి కనుగుణ్యంబైన వికారచేష్టలం గొంత తడవుపుచ్చి పయనంపు బడలికవలననుఁ బదంపడి నిశిరాత్రి యాట వలనను నెచ్చట మెలంగుచున్నవా రచ్చటనే మైమఱచి తెల్లవాఱినపిదప నీరీతిని దీర్ఘనిద్రఁ జెందుదు రనుదానికి సూచకముగా గాఢనిద్రఁ బోవుచుండిరి.

అఫ్జలాను ఫజీలును మఱికొందఱు మాత్రము రేపు శివాజితోఁ గలిసికోవలసియుండు నని మెలంకువగల్గి మత్తపదార్థములు పుచ్చుకొనక లఘువుగా భుజించి తమ సైనికులచేష్టల నవలోకింపకయే కూర్కుఁ జెందిరి. కాని ఖానుకుమారుఁడా రేయెల్లఁ బ్రభావతి తనవద్దకు వచ్చినట్లు కౌఁగలించినట్లు ముచ్చట లాడినట్లు కలలు కనుటను గలవరించుచుఁ బలవరించుచు నొకవిధముగా నిద్రించెను. పాపము కాలాసన్న మగుటవలనఁ గాబోలు వారిలో నొకరికైనను మఱునాఁడు జఱుగఁబోవు ఘోరకృత్యము గూర్చి యించుకంతయు ననుమానము పడకుంటయే కాక తలంపనైనఁ దలంపరైరి. ఆహా! విధి నిర్ణయ మెంతబలవంతమైనదో ముందు కథవలన జదువరులు గ్రహింతురుగాక.



# పదునాల్గవ ప్రకరణము.



అట్టు కోటలో శివాజి యానిశిరాత్రివేళఁ దన కచేరిచావిడిలో నెంటరిగాఁ గూర్చుండి మఱుసటి దినచర్యగూర్చి దీర్ఘాలోచనలు చేయుచుండెను. అత్తటి నాతాజి తానాజి ప్రముఖు లచ్చోటికి విచ్చేసి తమప్రభువుతో నేమేమో మాటలాడ గమకించి యతం డన్యథాయత్తచిత్తుం డౌట నెఱింగి తత్సన్నిధి నొండొకచోటఁ గూర్చుండిరి. వీరిరాక కొంతసేపటికి గుర్తెఱింగి వారితో నిట్లు ప్రసంగింపఁ దొడంగెను.

శివాజి—తానాజీ సర్వము సిద్ధముచేసితివా?

తానాజి—దేవా! దేవర సెలవిచ్చినతీరున సిద్ధముచేసి వచ్చితిని. పేష్వాయు బాజీరావును మన మారోతిరమలును దక్కుఁగల యోధులును వారి వారి సైన్యముతో నప్రమత్తులై జావలీగ్రామమునకుఁ జుట్టుపక్కలనున్న డొంకలలోఁ గాచికొని యున్నారు. మన మనుకొన్నట్లు మీరు కోటనుండి యైదుఫిరంగులు పేల్చినతోడనే యచ్చటి యవనబలమును జీల్చి చెండాడెదము. మీకు జయంబు నవశ్యంబు గల్పింతుము.

శివాజి—అట్లైన నాతాజీ! నీమాట యేమి చెప్పుము.

నాతాజి—స్వామీ! మీయాజ్ఞ శిరసావహించి దుర్గమునకుఁ బ్రాగ్భాగమున నైదువేలమంది గుఱ్ఱపురౌతు లాయత్తపఱచియున్నాను. బిజాపురి సైనికులు కోటకు సమీపించుతఱి వారి వెనువెంబడివచ్చి హఠాత్తుగా వారిపైఁబడి యొక్కండైనను బ్రాణంబులు దక్కించుకొనకుండఁ జేసెదను. ఇదె చూడుఁడు. అని తనమీసముపైఁ జేవేసి "నాప్రేటుతప్పించుకొనువాఁడు లేఁ డనిపించెదను గాక. మృత్యుముఖంబునఁ బడి తప్పించుకొనువాఁ డెవ్వఁడుండు"? అని మీసములు త్రిప్పుచు శివాజికి స్థైర్యోత్సాహము లినుమడింపఁజేసెను.

శివాజి—సఖులారా! చూచితిరా! బిజాపురి సైనికుల గ్రుడ్డినమ్మకము. వారికిఁ గనుటకుఁ గన్నులును వినుటకు వీనులు లేనట్లు తోఁచెడిని. లేనిచో మనపోక లెటుంగకుందురే?

తానాజి—మన భవానిమాతమాయ నిట్లు కానోపు.

శివాజి—ఔనౌను నీవు వ్రాయుచున్నట్లు మాతల్లి మొన్న నాతో నట్లే సెల విచ్చినది. కాకున్న వా రీప్రదేశమునకే రాకపోయి యుందురుకదా!

తానాజి—అప్పుగా రిప్పు డెచ్చటనున్నారు. దీవనలుపొంది మటి పోవలెనని వచ్చినారము.

శివాజి—అట్లైన నా వెంటరండు మాయప్ప దేవళములో నున్నట్లు వింటిని.

అని యాయిరువురుని దోడ్కొని యటనుండి తిన్నఁగా గుడికి నడిచెను. ఆగుడిలోనికి వారు పోవునప్పటికి రెండుదీపములు చూపఱ కన్నులు మిఱుమిట్లు కొల్పునట్లుగా మిక్కిలి ప్రకాశించుచుండెను. అందలి విగ్రహము స్వల్పపరిమాణము గలదయ్యును సన్నిధిని వెల్గుచున్న యాజ్యోతులవలన స్ఫుటముగాఁ గనఁబడుచుండెను. ఆదేవతకు నెడమతట్టున జీజీభాయి కన్నవ మూసికొని పెదవులుమాత్రము విదలించుచుఁ గూర్చుండెను. ఆసమయమున నర్చకుం డొక్కఁడు మంత్రము లెవ్వియో యుచ్చరించుచు, పుష్పములతో డను నక్షతలతోడను లోకమాతను బూజ చేయుచుండెను.

ఇట్లు వచ్చిన వీరు ముప్వురును భక్తియే మూడురూపములుగా మూర్తీభవించినట్లు గర్భాలయమునకు సమీపమున నొకవైపు చేతులు జోడించుకొని వినమ్రులై యొదిగి నిలఁబడిరి. కాని యవ్వీరమాత నత్తఱిఁ బల్కరించుటకు సాహసింప రైరి. అంతఁ గొంత సేపటికి జీజీభాయి దిగ్గనలేచి తలఁ ద్రిప్పుచుఁ జేతులు విదలించుచు గుడిచుట్టునుఁ దిరుగుచు గొణఁగ నారంభించెను. అది చూచి తానాజి యాయమ్మను బట్టుకోఁ జూచెనుగాని శివాజి యతనికరంబు పట్టుకొని నివారించి "ఓయీ! మాతకు దేవతావేశము పూనియున్నది. ఇప్పుడు మన మేలుకోరి యేమేమో చెప్ప నున్నది. విను" మని చెవిలో మెల్లగా నూఁదెను. మొట్టమొదటఁ గొంత దనుక నాదేవతాసన్నిభురాలు వాక్కులు

వ్యక్తపడినవికావు. కాని పిదప నయ్యవి క్రమముగా నీ దిగువవిధమున వినఁబడి భీతి గొల్పఁజేసెను. నాభక్తులు తులజాపురీయు లనేకులు చంపఁబడిరి. వారికి నెవ్వరును సూడిద దీర్పలేదు. పెద్దనాక చిన్ననాక శత్రువులనెల్లరఁ బరిమార్పఁడు. ఎవ్వారు నన్ను త్రికరణశుద్ధిగాఁ బ్రేమించుచున్నారో వారినాకోర్కె నెఱవేర్పుదు రని తలంతును" అని యిట్లు జీజీభాయి యుచ్చరించి పదంపడి మాట లుడిగి యచ్చో గుబాలునఁ జదికిలఁబడెను. వెంటనే పూజారి కొంచెము తీర్థము తీసికొనివచ్చి యాయమ్మమోముపై మెల్లఁగాఁ జల్లెను. అంతట దెల్వివచ్చి యున్ను రనుచుఁ బెద్దనిట్టూర్పులు నిగుడ్చుచు నాబిడ చాలసేపు దనక యాయాసపడి యనంతరమునఁ జేసైగచేసి నీరు కొంచెము తెమ్మనెను. ఆసైగ దగ్గఱనుండి కనిపెట్టుచున్న శివాజి మంచితీర్థము తెచ్చి యిచ్చుటయు నది త్రావి కొంచెము తెప్పిఱిల్లి కన్నులు తెఱచి శివాజిఁ గలయంజూచి "కుమారకా నీ విచ్చటనుంటివే? నే నేమైనను మాటలాడితినే? నీ వెప్పుడువచ్చితివో యెఱుంగ నని వేఱె చెప్పనేల? ఎంతసే పిట్లుపడియుంటినో నన్ను నేనే యెఱుంగను. నామొదలు చితకకొట్టిన ట్లున్నది." అని పెద్దనిట్టూర్పు నిగిడ్చి కన్నులు నులుముకొనఁ జొచ్చెను. చిన్ననాటఁగోలె భయ మన్నది యెట్టిదో యెఱుంగనివా రయ్యును దేవతావేశముపూనియున్న తతి జీజీభాయినెదుట నిల్వఁజాలక గుడివెలికి జని తానాజి నాతాజీవీసు లామెకుఁ దెల్వివచ్చిన పిమ్మట గుడిలోనికి వచ్చి నిల్చిరి. ఇంతలో శివాజి పూజారిసాయమునఁ దల్లిని మెల్లఁగా లేవనెత్తి ప్రక్కనున్న గదిలోనికిఁ గొంపోయి యటనున్న నొక్కమంచముపైఁ బరుండఁబెట్టి "అమ్మా! నీకుఁ గడు నాయాసముగా నున్న ట్లున్నది. ఒక్కింతసేపు విశ్రమింపుము." అని తల్లిని హెచ్చరించి తాను మాతృపాదసేవ జేయఁ జొచ్చెను. అటుపిమ్మటఁ గొంతసేపటికి నాయమ్మ లేచి కూర్చుండి కుమారునితో నిట్లు ప్రసంగింపఁ జొచ్చెను.

జీజీభాయి—నాయనా! నాకీ యాయాసము నీచేయు పరిచర్యలవలనఁ బోవు నదికాదు. ఇంచాక నేనేమిపల్కితిని! ఇదిగో నా కెదుటనున్న యా

పొలంబులు వైరిజనరక్తమాంసచ్ఛన్నమై గోచరించుచున్నవి. కాన యుద్ధము జఱుగుట సిద్ధాంతము. అందు జయంబు గల్గు ననుటకు సందియము లేదు. అని కుమారుని కేలు బిగియఁబట్టుకొని యతని ముఖము దెసఁ జేరి పొఱఁజూచుచు "శత్రుకులవిధ్వంసకా! స్వతంత్రరాజ్యస్థాపనోద్ధారకా! నీవు యుద్ధమునకు సిద్ధముగానున్నావా? సమరాంతంబున జయసూచకమగు సింహనాదంబులు చేయ సమకట్టియున్నావా?

శివాజీ—అమ్మా! నీ చెప్పినట్లు చేయుటకు సిద్ధముగా నున్నాడను. మఱియొకలాగువర్తించునని యనుమానింపకుము. మా సైనికులు నియమితస్థానంబుల నిల్చియున్నారు. వారు వైరుల నుక్కడంచుట కెదురు చూచుచున్నారు. ఇంక నొక్కండును బ్రాణంబులు దక్కించుకొని పోఁజాలఁడు.

జీజీ—అట్లే జఱిగింపవలెను. నీ వనునట్టు లొక్కనిగూడ విడువఁగూడదు. ఖానునినైతము పోనీవలదు.

శివాజీ—హాహా! అమ్మా! నీ విట్లానతియ్యవలదు. ఖానుని గాపాడుదునని యింతకుముందు వకీలువద్ద బాసచేసినాను. అట్టి నేను ఖానునిజంపి యాడినమాట తప్పుదునెట్లు? ఇట్లు చేయుటవలన నిహపరంబులకు వెలినైపోనా? కావున ఖానుని విడిచిపెట్టి కావలసినచోఁ దక్కిన తురుష్కసైనికులనెల్ల మర్దించెదను.

జీజీ—చాలుఁజాలుఁ. ఖానుని గాపాడుదు ననుచున్నావు. వాని నెంతమాత్రం బోవవలదు. వానినివిడిచి తక్కినవారి నెల్లర నుక్కడంచినను నీవుచేయ సమకట్టిన జన్నంబు పూర్తికానేరదని తెలిసికొనుము. దాన నేలాభము లేదు. ఒకవేళ వానినిగూల్చి తక్కటివారిని విడిచినచో ఫలముండు నేమోకాని వానిని విడిచిపెట్టితేని నీకష్టమెల్ల వమ్మగునని నమ్ముము. ఇస్సిరో! వీనివలనఁగదా మనతులజామాతకును దత్పరియులకు నెగ్గు వాటిల్లినది. ధర్మహాత్ముఁడవు నీవెఱుంగమి నిట్లుమాటలాడుచున్నావు. "శత్రుశేషం న శేషయేత్త" ని యార్యోక్తి వినలేదా! శుక్రనీతి

సాంతముగాఁ జూచియుండవు కాబోలు. కానిచో నీ వీవెడగుధర్మం బులు తీయుదువే? ఎంతమాత్రము ఖానుని విడువవలదు. నాయందు భక్తివిశ్వాసంబులు మతముసం దభిమానమును బూర్తిగా నీకుఁగలవేని నాచెప్పినచొప్పున వర్తింపుము. దాన నీకు శ్రేయస్సును శాశ్వతకీర్తి యుఁ బొల్పడును మనకు జయంబు ముమ్మాటికి గల్గునని నాకన్నుల కుఁ బొడకట్టుచున్నది. నామాటలు పాటించితేని "జే శివాజిమహా రాజాకు జే" అని నీనామ మాసేతుహిమాచలపర్యంతమునుగల భార తులముఖంబునఁబడి ఘోషించును. తొల్లి యర్జునుండు భారతసమరాది నాశాపాతులగు జ్ఞాతులఁజూచి దయదలచి యాజివిముఖుం డైనట్లు నీ విట్టితరుణమున వెనుదీయుదువే? ఇత్తఱి మాతండ్రి ననుకరింతువా యేమి?

శివాజి—అమ్మా! నన్నిట్లు నిర్బంధింపవలదు. ఖానుని దత్కుటుంబమును వధింపనని గోపినాథునకు మాటయిచ్చినాను. ఇప్పు డెట్లు తప్పఁగలను?

జీజీ—భాంస్లేకులతిలకమా! నామాటవినవలసినది. ఖానుచేసిన దౌర్జన్యములఁ జూచిచూచి యెట్లోర్చితివి? కులజామాతను బడగొట్టి తద్భక్తులఁ జా వఁగొట్టి గోరుధిరమాంసంబులతో నాదేవళము ముంచియెత్తినట్టి యా కట్టడిని విడుచుటకు నీమన సెట్లొప్పుచున్నది? ఇంతకు మనపూజారి ప్రతిన వినలేదా? నీ వెన్ని చెప్పినను వానిఁబ్రోచుట నామతముకాదు. ఓహో! నీవివేక మేమైపోయినది? జగదంబకును నీప్రజలకును మిక్కిలి యిష్టమైనయీకార్యము చేయుటకంటె శ్రేయోభివృద్ధిగోరు నీబోంట్లకు వేఱొండుండునా? చెప్పవలసినదంతయుఁ జెప్పితిని. ఎట్లు చేయుట నీకుఁ గీర్తికరమో విమర్శించి యట్లు చేయుము? మీయయ్యచెఱకును అన్నమరణమునకుఁ గారకులెవ్వరో యాలోచిం చుకొనుము. ఇంక నీచిత్తము.

అని మఱొక్కదిక్కునకు మొగంబుద్రిప్పి యూరకుండెను. అంతట జననిముఖముననుండి వచ్చిన పల్కులెల్ల జగజ్జననిపల్కులే యైయుండవచ్చు

వని నమ్మినవాఁడౌటవలనను జిన్ననాటనుండియుఁ దల్లిమాటల నతిక్రమింపని గుణశాలి యగుటవలన నమ్మహానుభావుం డెట్టకేలకు మెత్తబడిలేచి జనయిత్రికి మ్రొక్కి యిట్లనియె. "అమ్మా! నావితర్కమునకు మన్నింపవలెను. నిన్ను దేవతయేయిట్లుపల్కించినదని యెఱుంగకపోలేదు. కాని యాడినమాట తప్పుట పాడికాదేమోయని యింతదూరము వివాదము పెంచితిని. తల్లీ! నీయాజ్ఞకుబద్ధుఁ డనుగాని యెప్పుడును లేదుకదా! ఇదే నే శపథము చేయుచున్నాను వినుము. ఆతుచ్ఛమ్లేచ్ఛుని రేపే నాకరవాలంబునకు నాహారంబుగావించి నీయాజ్ఞ పరిపాలింతును." అని యిటు తనసమ్మతి దెల్పుడుచేసి గదికి వెలుపలనున్న తానాజి నాతాజిశూరులకడకుఁబోయి వారితో నిట్లనియె. "మనకు జయము సిద్ధాంతము. మాతల్లియునికి మీరు చూచియుంటిరికదా! ఇప్పటికే చాలరాత్రియైనది. ఓయీ తానాజీ! నీవుమాత్రము మాతోరావలసియున్నది కాన నుదయముకాఁగానే యిచ్చోటికిరమ్ము—నాతాజీ! నీవు మాయానతి చొప్పున మెలంకువగల్గి వర్తించునది" అని వారినిబుత్తెంచి తిఱుగ లోనికిఁ బోయి తల్లివేడ్కోలున నారెయి నచ్చటనే భగవన్నామస్మరణ గావించు కొని నిదురింపసాగెను.

అప్పటికప్పుడే చాలరాత్రి యగుటయుఁగని వెట్టి జీజీభాయి నిద్రింపక శివాజిని దనతొడమీఁదఁ దలపెట్టుకొని పరుండఁజేసి చిన్నిపిల్లలకుఁబోలె జోఁ గొట్టుచు నతండు మాఁగన్నువేసినపిమ్మట నిట్లు వితర్కింపఁ జొచ్చెను. "హాహా నేనెంతపాపాత్మురాలనోకదా! నాడు హిందూరాజ్యస్థాపనము చేయుమని పల్మాఱు నాభర్తను బలవంతపెట్టుచువచ్చితిని. ఆయన నాప్రార్థన లకుఁ జెవియొగ్గక పోవుటయేకాక యోర్తుఁజేపట్టి నన్ను బునహా నగరిలోనుం డఁజేసి నాపెద్దకుమారుఁ దోడ్కొని తంజావూరికిఁబోయెను. అయ్యయో! ఈనడుమనేకదా నే బ్రతికియుండఁగా నాజ్యేష్ఠపుత్రుఁడు పోయినవార్త యాలింపవలసివచ్చెను. ఆయన నన్నెడఁబాసిననాటనుండియు నీశివాజి నో క్కనినమ్ముకొని యెట్లో ప్రొద్దుపుచ్చుచుంటి. ఔరా! ఎంతమొండికట్టె నోకాని నా డాకుంతి నిజనందనుని బకాసురవధకు నియోగించినట్లు నే నెంత

వారికి దుస్సాధ్యముగు స్వధర్మస్థాపనముచేయుమని యీవరప్రసాదిని బ్రేరేపించుచున్నాను. పృథకు నేవురుతనయులుంటబట్టి యట్లుసాహసించిన నవ్వీరమాతకుఁ జెల్లునేకాని దిక్కుమ్రొక్కులేని నాబోటిదానికి నిట్టిపోక లొప్పునే? హా! నాపట్టి నిట్టిసాహసోద్యోగములకు నెట్లు పురికొల్పుచున్నానో నాకు నేనేయెఱుంగకున్నాను గోభూదేవులపైనిగల ప్రేమయే న న్నీరీతిగా మార్చివేసియుండనోపు. ఇంతకు దైవఘటన తప్పింప నెవరి శక్యము?" అని పలుతెఱంగులవిచారించుచు నద్ధీరతద్దయుఁ బెద్దనిట్టూర్పువిడిచి కేలుఁదమ్మి గండస్థలికిఁజేర్చి తూర్పువైపుననున్న గవాక్షమువంక దృష్టినిగుడించి చూచుచున్న తఱిఁ దనభూతకాలకష్టములన్నియు నొక్కుమ్మడి స్మృతికిరాఁ గొంతసేపు జతనముతప్పినదానివోలె నిశ్చేష్టితయై గోడకు జేరఁబడెను. ఇంతలో నరుణోదయమౌటయు వెలుతురు కిటికీక్రంతలనుండి గదిలోనికిఁ బ్రసరింపఁ దిగ్గనలేచి మూసియున్న కిటికీతలుపులను దెఱచి తెల్లవాఱుటఁజూచి తనుజుని నిద్రాభంగముచేయ మనసురాక యిట్టిట్టు తలపోయుచున్న సమయమున పుత్రుని దక్షిణహస్తపద్మము నిజదృక్పథంబునఁ బడుటయు నందలి ధ్వజఛత్రాది చిహ్నంబులు పొడఁగాంచి విస్మయమంది తనకింతకుఁ బూర్వము శివాజీఁజూచి యోధులు చెప్పుమాటలు జ్ఞప్తికిరాఁ గడుమోదించుచు నందనుండు దేవాంశసంభూతుండనియు నాత్మమనోరథం బీడేర్చుననియుఁ బెల్లుబ్బి నేత్రకమలములనుండి చల్లనిబాష్పములు జాఱవిడిచెను. అంత నాబాష్పంబులు మేనిపైఁ బడుటవలన శివాజి యుల్కిక్కిపడిలేచి తల్లిమొగంబువంకఁ జూచి యవి సంతోషాశ్రువులుగా నెఱింగి యిట్లను. "అమ్మా నీకరుణారసవృష్టిచే రాత్రి నాకుఁగల్గిన మనోసంతాపంబెల్లయు నాఱినది. నేను ధన్యుండనైతిని" అని పల్కి తాను బరుండు జాముకాలములో "నొకవింత కలగంటిని" అని తల్లికిఁ దెల్పుడుచేయుడు నాపై యాతురతతో నాస్వప్నము సాంతంబుగాఁ జెప్పుమనిన శివాజి యిట్లు చెప్పఁ దొడంగెను. "ఇచ్చటకు మన శ్రీరామదాసుయోగి వచ్చినట్టును నా మహాత్ముఁడు నన్నునుద్దేశించి ఓ శివాజీ! నీవు రామచంద్రునియాజ్ఞ నవతరించిన మహానుభావుండవని యెఱుంగుము. నీవు హిందూరాజ్య స్థాపనచేయు

టకే జనించితివి. గో భూదేవతలను దేవాలయములను నాశనముచేయుచున్న తురుష్కులను నీభవానిమహోగ్రాసికి బలియిచ్చి సనాతనవర్ణాశ్రమధర్మములను ధర్మరాజాదులయట్లు పాలించి శాశ్వతకీర్తి వహింపుము. ఇంద్రాదిసకలదేవతలు నిన్నుఁ ద్రికాలంబుల సంరక్షించుచుందురు. నీ కాపదలు ఘటిల్లుకాలమున మాచే నుపదేశింపఁబడిన తారకమంత్రము జపించుచుండుము. దాననెట్టిసంకటములైనను సూర్యోదయమునఁ దిమిర మడంగినట్లు యడంగిపోవును" రాజకీయాంశములలోఁ బ్రధానమైనవానినెల్ల మీతల్లితోఁ గలసి, యాలోచించి యద్దేవతాసన్నిధురాలు నియోగించునట్లు వర్తించుట శ్రేయస్కరము. సామాన్యధర్మములకొఱకు విశేషధర్మములు విసర్జింపకుము. గోవిప్రసాధురక్షణ రాజులగువారికి విధ్యుక్తధర్మ మని నమ్ముము. అని గంభీరముగా వాక్రుచ్చి తాఁ దిరోహితుండయ్యె. ఇది నిజమా కలయా యని కలవరపడుచుండుతటి నీకన్నవనీరు నను మేల్కొనఁజేసెను" అని యావత్స్వప్నమును మాతకు వినిపించెను. ఆవీరమాతయు బట్టరానిసంతోషంబునఁ బరవశురాలై కొంతతడవు భాషింపఁజాలక యెట్టకేలకు గ్రమ్మఱ శివాజి నుద్దేశించి యిట్లనియె. "నాయనా! తొల్లి శ్రీకృష్ణభగవానులు దేవకీదేవియందు నవతరించినట్లు నాభాగ్యవశంబున నీవు నాకడుపున జన్మించితివి. ఇంక నేఁ గృతార్థురాలనైతిని. మీ నాయనగోత్రంబును మీతండ్రివంశంబును పవిత్రంబులయ్యెడి. నీకుఁ గలలో రామదాసయోగి వచించునదియెల్ల యథార్థమే యైయుండవలెను". అని క్రమ్మఱ నానందబాష్పంబులు దిగవిడిచి యనంతరము నిరువురును భగవద్ధ్యానంబు గావించి ప్రాతఃకాలక్రియలు జఱుపుటకై యటనుండి వెడలిపోయిరి.

—o—

# పదునైదవ ప్రకరణము.



భానుమంతుండు ప్రాగ్భాగంబున నావరించియున్న మేఘసముదాయం పుతెరను విచ్చుకొని తననియమితపాత్రమును జఱుపుటకుగాను నభోరంగస్థలము నలంకరించెను. దేహికి జ్ఞానోదయముకాఁగానే యజ్ఞానమెల్ల నశించునట్లు లత్తేజోరాశిరాక యంతకుఁబూర్వము కాఱుక్రమ్ముకొన్న చీకట్లు మటుమాయమై రోదసికి నెక్కు-వింతప్రకాశము గల్పించెను. అత్తఱి వియత్తలమునుండి నానావిధపక్షులుచేయు కలకలగవంబులును జేరువనున్న పొలములనుండి గోపాల కృషీవలాదులు సల్పుకోలాహలమును విని ఖానుసయ్యదు ఫజీలును లేచి చయ్యన దంతధావనాదులు కావించి తమకై కోడిగ్రుడ్లతోడను గొఱ్ఱుమాంసముతోడను దయారుచేయబడిన వంటకములు తగుమాత్రము పుచ్చుకొనిరి. అటుపైని వారుసంకేతస్థలమునకుఁబోవుటకుగాను ద్వరపడుచు నెవరికినచ్చినదుస్తులు వారు తొడుగుకొనఁజొచ్చిరి. అత్తఱి ఖానుచేతికి వానిసేవకుండు కవచము నుక్కు-కుళ్లాయిని నందియ్యగా నతండు నవ్వుచు "ఓరీ! ఇవి నాకక్కు-ఱలేదు. నామామూలు మజిలీనుదుస్తులు తెమ్ము" అని విధిప్రేరితుఁడై భృత్యునకు నియోగించెను. ఆమాటలు వినుచున్న ఫజీ లచ్చటికివచ్చి తండ్రిని శిరస్త్రాణాదులు ధరించుట మంచిదని యెంతో బలవంతపెట్టెనుగాని కొడుకును వట్టిబేలయని నవ్వి యతని మాటలు బాటింపక కాలవిధేయుఁడై మజిలీనుదుస్తులనే గ్రహించి యెప్పటియట్ల కరవాలంబుకైకొని హయారూఢుండై బయలవెడలసాగెను. అదిచూచి కవచము జొమిడికముదాల్చి ఫజీలును, తమప్రభువునకువలె మజిలీనుపుట్టములు కాలుపొగాయుఁజుట్టి సయ్యదుబందును జెరియొకయశ్వము నెక్కి- ఖానుని వెంబడించిరి. ఇంతలో నటకుఁ గొందఱు శివాజిసేవకులువచ్చి వారికి దారిచూపుచు ముందుండి నడవఁజొచ్చిరి.

ఇట్లు వారుపోవుచున్న సమయమునఁ బ్రయాణపుభేరి ప్రమోగింపఁబడిన నదివినిని యొకరిద్దఱు సుబేదారులు తమతమసైన్యములఁ దీసికొని తమప్రభువు

వెనకభాగమునుండి నడవఁజొచ్చిరి. ఈసందడివెల్ల కొండలపైని బొంచియున్న మావళేలు కొందఱుకనిపెట్టి యయ్యది తమమిత్రులకుఁ దెలియఁజేసిరి. వెంటనే వేలకొలంది మావళేలుపైకివచ్చి చెట్లసందులనుండి శిబిరములోని మహమ్మదీయులయవస్థ నరయఁజొచ్చిరి. రాత్రికైకొన్న మత్తతపదార్థముల మహిమవలన యవనభటులలోఁ బెక్కండ్రు లేవనేలేదు. లేచినవారిలోఁ గొందఱు తమప్రాతఃకాలకృత్యములు దీర్చుకొంటకు దగ్గఱ వాగులకుఁ జనిరి. కొందఱు మంటలు వేసికొని చలిగాచుకొనుచుండిరి. ఇట్లు యవనులందఱు నేదోవిధముగాఁ బనివడియుండిరి. కాని యొక్కరైనను మఱొకగడియకు రాబోవుదుర్దశ యెఱుంగఁజాలకుండిరి.

ఖానుఁడును దదీయులును గోటను దరిచేరునప్పుడు వారికిరుమైలల నర మైలుదారి పొడుగునను శివాజిభటులు బారులుతీర్చినిల్చియుండిరి. వారు సింహద్వారము సమీపింపఁగానే మరాటసైనికు లచ్చోటువాసి సాహేబులు నడిచిన దారికడ్డముగాఁ బెద్దపెద్దచెట్టుకొమ్మలు కొన్ని విఱిచి పడవైచి కొండలపైనున్న తమవారితో మెల్లఁగాఁబోయి కలిసికొనిరి. ఖానుఁడు కోటద్వారమువద్ద దిగి నిర్ణయముప్రకారము తా నొక్కరునే వెంటఁ దీసికొనిపోదలంచి కుమారు నుద్దేశించి యిట్లనియె. "ఫజీల్! నేను దిఱుగవచ్చుపర్యంతము నీ విచ్చోటనే భద్రముగా నుండుము." నావుఁడు ఫజీలు మొకము చిన్నవుచ్చుకొని తన్నే వెంటఁ దోడ్కొని పోవలసినదని తండ్రిని బలవంతపెట్టెను. గాని యతం డందులకు నొప్పుకొనక కొడుకు నోదార్పఁజూచి యిట్లనియె. "కుమారకా! నీవు వయసుచేతఁ జిన్నవాఁడవు. కయ్యమునకుఁ గాలుద్రవ్వు మరాటులతో మాటలాడుటకుగాని మాటలాడుచోట నీవుంటగాని యంతగా మంచిదికాదు. ఇట్లంటినని వేఱొకరీతి నెంచకుము. ప్రభావతిప్రసంగము వచ్చినప్పుడు నీవచ్చటనున్నచో మరాటకేసరితో మాకు మాటలాడుటకే సరిపడదు. ఇంక నామాటలకు మాఱుచెప్పక మమ్ముఁ బోనిమ్ము" అని సయ్యదు చేయూతఁ బుచ్చుకొని పల్లకీనెక్కి వాడు వెంటరాఁ గదలఁజొచ్చెను. జనకునిమీఁద ప్రేమచే ఫజీలు నాల్గడుగులు పల్లకీతోఁ గలసివచ్చి, "హల్లా

మీకుమేలుగూర్చు. కార్యసానుకూలముచేసికొని సురక్షితముగా వేగర మమ్ము గలిసికొందురుగాక" అని తండ్రిని హెచ్చరింప ఖానుఁడు మోమునఁ జిఱునవ్వలంకరింప నిట్లనియె. "పట్టీ! భయముపడకుము. నే మసలక పోయినపని చక్కబెట్టుకొని వత్తును. ఇంక నీవాగుము." అని చెప్పి సవారిని ద్వరగాఁ బోనిచ్చి కొంతసేపటికిఁ గమ్యస్థానము చేరుకొనెను.

అచ్చట కదివఱకే వచ్చియున్న గోపినాథుఁడును గృష్ణాజియు ఖానునకుఁ గేలూతయిచ్చి యతండు పల్లకీనుండి దిగినవెనుక నేర్పాటుకాఁబడిన చావిడిలోనికిఁ దీసికొనిపోయి యచ్చోటనున్న వాల్కుర్చిపై నతని నధిష్ఠింపఁజేసి శివాజికి ఖానునిరాక వెంటనే యిరువురు మావళీలనుబంపి తెలియఁజేసిరి.

శివాజికి ఖానునిరాక తెలిసినతోడనే కవచ శిరస్త్రాణాదులు ధరించి తల్లివద్దకుఁబోయి మ్రొక్కి యామెచే దీవనలువడసి మాలసూరిసహితుండై కొండపైనుండి మెల్లగా దిగి యటకు వచ్చుచుండెను. అదిచూచి పంతోజి కృష్ణాజు లెదురుగాఁబోయి రాజునకు ఖానువచ్చి కనిపెట్టుకొన్న సంగతి నెఱింగించి యతనితో నాల్గడుగులు కలిసి నడిచిరి. తా మచటనిల్చుటకు వీలుగామి శివాజీసెలవుదీసికొని యథేచ్ఛఁగా నడిచిరి. తానునిర్ణయించినప్రకారము ఖానునివద్ద నొక్కఁడేయుంటఁజూచి లోన సంతోషించి శివాజి ఖానుసమావేశమునకు భయపడుచున్నట్లు నటించి మందగమనముతోఁ జనుదెంచుచుండెను. ఖానుఁడు మరాటకేసరిచేయునటన నిజముగానమ్మి శివాజిని పట్టి పిరికిపందగా నెంచియు రాజులకు చేయుగౌరవము చేయకుంట పాడికాదని పదియడుగులు ముందునకు నడిచి పదంపడి యాయనకు సలాముచేసెను. తనకు రాజు నూఱుసలాముచేసినవెనుక రెండడుగులు వెనకకు నడిచి యతనితో నిట్లనియె. "రాజాసాహెబ్! మనలోమనకు నఱమఱభ్యంతరంబులు లేనిదానికి సూచకముగా నన్ను గౌఁగలించుకొనుము" అని వెంటనే తా నాలింగనముచేసికొనఁబోయెను. అంత శివాజితల్లికోర్కి చెల్లించుటకు మంచిసందుదొరికినదనియుల్లంబున నుప్పొంగుచు నంతవఱకుఁ జేతులలో నిమిడ్చియున్న పెద్దపులి గోరుతోడను బిచ్చువు బల్లెముతోడను ఖానునిగ్రుచ్చి కౌఁగలించుకొనెను. పాపము శివాజినెన్నైనను వీలైన

యెడల బంధీకృతునిజేసి తీసికొనిపోవలె నని పేరాసతో విచ్చేసినఖానుఁ డట్లు కౌఁగలింపఁబడిన దానికి నొచ్చి యిట్లని మొఱ్ఱవెట్టెను. "ఛీ! దొంగా! తుచ్ఛపనిచేసితివిరా! నమ్మించి యెంతద్రోహముచేసితివిరా" అనుచుఁ దనపట్టాకత్తితో శివాజినెత్తిపై నొక్కపెట్టు పెట్టెను. కానియావ్రేటు తలకట్టుదాల్చిన రాజున కెక్కుడు ఘాతచేయలేకపోయెను. ఇంతలోఁ దనభవానీఖడ్గము నందుకొని శివాజి వాడు కరవాలంబునుబట్టినహస్తంబును దెగవ్రేసి తన్ను నోనాడినదానికి బదులుగా నిట్లనియె. ఓరీదురాత్మా! నీవు మాతులజామాతను బాండురంగవిఠలుని బరిభవించి తద్దేవాలయములు నాశనముచేసిన క్రూరాత్ముండవు. మత్ప్రజల నుఱక హింసించిన మహాపాపివి.మాయన్నను ద్రోహముచేసి చంపించిన దురాత్ముఁడవు. మఱియుఁ బ్రభావతినెపంబున దండయాత్రకల్పించి నన్నుఁ జెఱఁబట్టఁదలచుకొన్నమాయావివి.ఇట్టిని న్నిట్లు గిట్టించినను దోషము మోసములేదని యెఱుంగుము. ఓరీ! బ్రాహ్మణకులహంతకా!నీమూలమున విజాపురివారికిని మాకును దీరని వైరము రగులుకొనెను. నన్ను రాజద్రోహిఁగాఁజాటినట్టి నీయపచారమునకు నిద్దిప్రతిఫలముగా నూహింపుము" అని యీవిధమున దెప్పిపొడుచుచుఁ జిక్కినపని త్వరలో ముగించెను. అక్కడనున్న స్వామిభక్తుఁడు సయ్యదుబందు తనప్రభువుని గాపాడ సమకట్టి శివాజిమీఁదికి దుమికెను. కాని యీనడుమ మాలసూరి దూరి వానితో నెక్కటికయ్యమునకుఁ దలపడి నివారించి ఖానుపధాంతరమున శివాజి తనకుఁ దోడ్పడ నాపఠానుని గీటడఁగించెను. ఈసందడి సమీపముననుండి కని పెట్టుచున్న సవారిబోయీలు ఖానుశిరమును దీసికొనిపోవలెనని ప్రయత్నించిరి కాని యాశాజికంకను మరాటసర్దారుఁ డొకఁ డడ్డుపడి వారిఁ దఱిమి యామూర్ధమును గైకొని రణవిజయచిహ్నముగాఁ గోటబురుజులపై నిల్పెను. అత్తఱి శివాజితానాజులు "జే కాళి జే తులజామాత" అని గొప్పసింహనాదములుచేసిరి. అదివిని వెంటనె యొకభటుండు తనశంఖమును బిగ్గరగాబూరించి ధ్వనింపఁజేసెను. అట్లు పూరింపఁబడిన శంఖారావము పర్వతగుహలలోనుం డెడి పల్కుటాలమూలమున మఱింత పెద్దదై రెండుమూడుమైళ్ళదవ్వున నుండు నగంబులకుఁదాకి ప్రతిధ్వనుల నిగుడింపఁజేసెను. వెండియు నటు

మీఁదటఁ గోటపైనుండి రెండుఫిరంగులు పేల్పఁబడినవి. ఆసన్నలు వినఁబడఁగానే యదివఱకుఁ గోటలోదాగియున్న మావళే హేతకారులు గుంపులు గుంపులుగాఁ బయలుదేఱి ఖాను వెంటవచ్చిన పదైదువందలమందిని జీల్చి చెండాడఁ జొచ్చిరి. అప్పుడు పొదలచాటున దాగియున్న నాతాజి తన యశ్వబలముతో నగ్నికి వాయువు సాయంపడునట్లు తానాజి పదాతులకుఁ దోడై పైకొని పాఱిపోవుచున్న మ్లేచ్ఛులను బోనీక వధించుచు సమరవిహారము సల్పుచుండె. ఇట్లు శివాజిసైనికులు తుపాకులతోడను బాకులతోడను బ్రతిపక్షులఁ బరిమార్చుచుండ నట జావళీగ్రామమున నున్న మోరోపంతు త్రివిధముగా యవనుల దునుమాడుచుండెను. హఠాత్తుగా యుద్ధము తటస్థించుటచేత భయకంపితులై రణాంగణము నిల్వఁజాలక గాత్రిగొన్న సారాయీలను బప్పుకూండ్లను గ్రక్కుచుఁ బెక్కులు పఠానులును వారితోఁబాటు విడిగుఱ్ఱములును వెన్నిచ్చి చెల్లాచెదరై పఱుగిడఁ జొచ్చినది. బాపురే! మావళీసైనికుల ముంజేతిబలం బేమియో కాని వ్రేటువ్రేటునకు నూటిమందికిఁ దగ్గకుండఁ దెగటార్చుచుండిరి. ఒక్కొక్క బాకుపోటునకుఁ బదిపదేనుగురఁ గ్రుచ్చి పొలియించుచుండిరి. ఈవిధమున మఱాటసుభటులు కోటక్రిందిబలము నుగ్గుచేసి జావళీగ్రామమునకుఁ బోయి తమవారికిఁ దోడ్పడి యరిబలంబుల నిరవశేషము గావింపఁదొడంగిరి. అత్తఱి యుద్ధభూమి బహుభయంకరముగాఁ జూపట్టెను. వీరరసంబు వివిధమూర్తులై నగతి నొక్కచోఁ బదుగురుభటు లొక్కనితోడను నొక్కఁడు పదుగురితోడను ముగ్గురేవురితోడను నేవురు ముగ్గురితోడను నిట్లు పెక్కువిధంబుల గుములై దిక్కులు పిక్కటిల్ల సింహనాదము సల్పుచు నట్టహాసంబులు చేయుచు పోరుచుండిరి. మఱియుఁ బ్రతిపక్షులను దోయుచు రణభేరి మ్రోఁతలకు నుత్సహించుచు గర్వమ్ముల నుబ్బుచు ఖడ్గంబుల వ్రేయుచు బల్లెంబుల గ్రుచ్చుచు బాఁకుల సాపుచు గదల నదుముచు శూలమ్ములఁ జిమ్ముచు ననేకభంగులఁ బరాక్రమించుచుండిరి. పదంపడి నానావిధాయుధములచేఁ గాల్బటులనొప్పించు హయారూఢులును, అశ్వంబుల హతమార్చి రౌతులఁ బరిమార్చు పదాతులును, కమలకాళ్ళక్రిందఁబడి కసి

ముసంగుసైనికులును తురంగంబుల గిట్టలసందునఁబడి చెడుయోధులును తమనా
యకుల హతమైనను వెనుక కంజవేయక ప్రాణములు దాచక యరివీరుల నురు
మాడు శూరులునునై సంగ్రామం బతిభీమం బయ్యెను. వెండియు నెడతెగక
కురియుచుండిన నారసంబులవలనను జిచ్చఱపిడుంగులఁ బోలెడి సీసముగండ్ల
వలనను గొందఱు మేనులు తెగి వ్రాలుచుండిరి. తలలు బ్రద్దలై కూలుచుండిరి.
కాళ్ళుదెగి యొఱగుచుండిరి. అట్టియెడ మర్త్యసత్త్వాదిమస్తిష్కము కడు
రొంపియై యుండ నందుండి నల్దిక్కులకు సెలయేళ్ళవలెఁ గీలాలంబు ప్రవ
హింపసాగెను. కరచరణంబు లను మీనంబులతోడను గపాలంబు లను కచ్ఛప
ములతోడను భుజంబు లను తామర నాళంబులతోడను శిరోజంబు లను శైవాలం
బులతోడను గజతురగకళేబరంబు లను పెనుమొసళ్ళతోడ నారణకాసారము
నెంపొంది చూపరులకు భీతి గొల్పుచుండెను.

ఈయుద్ధవైఖరినెల్లఁ గోటబురుజులపై నెక్కి కనిపెట్టుచున్న శివాజి
తా ననుకొన్నదానికంటె నెక్కుడు జఱిగినందులకు నానందించినను బ్రాణా
శనాజివిముఖులై పాఱుచున్న పఠానుసైనికులఁ గాపాడఁ దలంచి నిజద
యాంతరంగికత్వము విశదముగా నంతటితో బోరు నిల్పుచేసెను. కయ్యము
ముగియునప్పటికి మధ్యాహ్న మగుటయు నంత శివాజి తానాజి నాతాజిము
ఖ్యులు వెంటరాఁ దల్లిఁ దోడ్కొని దిన్నెగాఁ గలదేవతగుడికేగి యట మహాకా
ళిం బూజలచేతను బలులచేతను సంతుష్టిపఱచి యనంతరమున బంధువులతో విం
దారగించి నాఁటిదినము సుఖగోష్ఠిఁ దేలి రాత్రిపూఁటఁ దనసఖులతో బాటు
గుండెలమీఁదఁ జేవేసికొని హాయిగా నిద్రింపఁజొచ్చెను.

# పదునాఱవ ప్రకరణము.



సహస్రౌదార్యసముద్రుండగు శివాజి ఖానువధానంతరమున రెణ్ణాళ్ళు గడిచినపిదపఁ బుట్టలుగట్టులలోఁజిక్కి దారితెలియక మలమలమాడుచున్న పరసైనికులనెల్లఁ రావించి యభయంబిచ్చి తనవద్దనొల్వుండవలసినదని వారితోఁ బెక్కులకు బోధించుచుండె. ఆసమయమునఁ జంద్రాతపంబున కీడుచేయందగు తనూవిలాసంబుగల యొకతాపసిప్రవరుండు విష్ణునామంబులు పఠించుచు నచ్చటకు విజయము చేసెను. ఊర్ధ్వపుండ్రశోభితలలాటముతోడను, ఆకర్ణాంతలోచన ద్వయముతోడను, తులసీమాలికాలంకృతకంఠముతోడను, ఆలంబిత చామరశ్మశ్రువుతోడను విరాజిల్లు నయ్యోగి వీణ మఱచివచ్చిన నారదయోగియో యనఁ జూపట్టుచుండెను. అట్లాయోగికులశేఖరుం డరుదెంచినవెంటనే సంభ్రమముతో గద్దియడిగి యెదురుగాఁజని 'యోగిశ్రీరామదాసాయ నమోనమః' అని యమ్మహానుభావు చరణములకుఁ బ్రణమిల్లి భక్తివిశ్వాసంబులు తెల్లంబుగా నర్ఘ్యపాద్యాదివిధుల నప్పరమయోగిం దృప్తుఁజేసి యొకరత్నఖచిత సువర్ణపీఠముఁ దెప్పించి యందాయన నధిష్ఠింపఁజేసి సన్నిధిని భృత్యునిబోలెఁ జేతులు జోడించుకొని నిల్వఁబడెను. అంత నాయోగిపుంగవుండు తన ప్రియశిష్యుని గూర్చుండ నియమించుటయు నటుపై నయ్యిరువురు నిట్లుమాటలాడుకొనఁ జొచ్చిరి.

రామదాసు—రాజా! నీవును నీపుత్రమిత్రకళత్రంబును దక్కుంగల నీప్రజలు నాయురారోగ్యభాగ్యసంపన్నులై సుఖులైయున్నారుకదా! నీకుగాని నీరాజ్యమునకుగాని యేవిధమైన తొందరలు సంభవింపలేదుకదా?

శివాజి—స్వామీ! దేవరవారికటాక్షంబున మేమెల్లరము కుశలులమై యున్నారము. సకలజ్ఞులగు తమకుఁ దెలియని దేమున్నది? అయిన నడిగి

నప్పుడు చెప్పకుంటఁ దప్పకావున మాకుగల్గిన మహాసంకట మనునది నిన్నటికి నివారణమైన తెఱంగును సంగ్రహముగా నెఱింగించుచున్నాను. సావధానులరై యాలింపుడు.

అని విజాపూరుసుల్తానుమంత్రియు దండనాయకుఁడగు నఫజలాని కుమారుఁడు రామోజిపరభుకూఁతురగు ప్రభావతిపై వలపు నిలిపి వాఁ డాచిలుకలకొల్కిని బలవంతపెట్టుటయు, రామోజి ప్రభావతిని గాచుతలంపున దర్బారుద్యోగము చాలించి కోంకణసీమకుఁ బాఱివచ్చుటయు, నంత ఫజీలెల్లియైన నారూపవతిని దనకుఁ బెండ్లిచేయింపవలసినదని తండ్రి బలవంతపెట్టుటయు ఖానుఁడుకొడుకు ముద్దుచెల్లింపఁదలంచి తనపై నేరములుకల్పించి తన్నుఁబట్టి కట్టితెత్తునని సుల్తాను నొడంబఱచుటయు, ఆనెపంబున కోంకణము మీఁదికి దండెత్తివచ్చి తులజాపురి ముఖ్యదుర్గంబుల నాశనము చేయుటయు, తులజాపురినుండి శత్రువులకుఁ జిక్కకుండఁ దప్పించుకొని ప్రభావతి ప్రతాపగడకుఁ జేరికొనుటయు, ప్రభావతితోఁబాటు తన్నుఁగూడఁ గొంపోవలెనని యూహాలుచేసి ఖాను గోపినాథుని రాయబారము పంపుటయు, రాయబారిని స్వాధీనముచేసికొని కోటకు ఖానునిరావించి తల్లియాలోచనచొప్పున వానిని గడఁదేర్చుటయు లోనగుసంగతులెల్ల శివాజి పూసగ్రుచ్చినట్లు మనవిచేసెను.

రామ—శివాజీ! ఈ నీచెప్పువృత్తాంతమంతయు మొన్నటిరాత్రిఁ దెల్లవాఱుజామునఁ గలగంటిని. అంత మేల్కాంచి మీయందఱక్షేమ మరయఁ దలంచి యానాఁడే బయలువెడలి యిచ్చటికి వచ్చినాఁడ. నీ కెంతెంతయుపద్రవములు సంభవించినను మనరామచంద్రునికరుణవలన నవి క్రమముగాఁ దొలంగిపోవును. నీవు మాకొఱకై చేపట్టిన యుద్యమము ముమ్మాటికిఁ దుదముట్టును.

శివాజి—స్వామీ! నాకు ముందుగాఁ దెలియఁజేసినచో పల్లకీయొక దానిని బంపకపోయియుందునే? మాకై తమరింత శ్రమదీసికొని యింతదూరము పాదచారులై వచ్చుటకు నామనసు మిగులఁ గష్టపడుచున్నది.

రామ—సన్యాసులమగు మేము పల్లకీలను నేనుఁగులను నెక్కి వచ్చెడివారము కామని యెఱుంగవు కాబోలు?

శివాజీ—ఏమీ! మీరి ట్లపూర్వముగా సెలవిచ్చుచున్నారు? శంకరస్వాముల వారు పల్లకీలనెక్కరో? వారుమాత్రము సన్యాసులు కారో?

రామ—శివాజీ! నీ కీమాత్రము తెలియదా? సన్యాసశబ్దమునకు నర్థము తెలియక కాబోలి ట్లనుచున్నావు. కేవలము లోకవ్యవహారముపై విరక్తి పుట్టికదా! మాబోంట్లు సన్యసించుట. అట్టిచో ఛత్రచిహ్నము లగు వాహనాదు లెక్కుట కెట్లు శాస్త్రి మంగీకరించును. అయినను పీఠస్థు లగువారుమాత్రము నీ నియమము పాటింపకుండ నాశ్రితుల వేడ్కోలున రాజలాంఛనములకు నొడంబడుచున్నారు. ఇంతమాత్రము చేత నిది శాస్త్రీయ మని యంగీకరింపఁజాలము. దీని కేమిగాని మా కీదినమున నొకయుపన్యాసము చెప్ప నుద్దేశ మున్నది. కాన నేటి సాయంకాల మెల్లవారిని రావింపవలెను.

శివాజీ—చిత్తము. దేవరవా రానతిచ్చొప్పున భోజనానంతరమున సమకూర్చెదను. ఇప్పుడు కొంత ప్రొద్దెక్కినది. దేవరవారికిఁ బాలుఫలము లిటకుఁ దెప్పింపు మని యాజ్ఞయిచ్చెదను దెప్పించెదను.

రామ—నల్గురుఁ జూచుచుండఁగా భుజించుట యనారోగ్య మని చెప్పు ఋషులవాక్యములు వినలేదా? కొందఱు వెడగులు శాస్త్రీయమైన యీనియమమును బాటింపక తేజోహానియు బుద్ధి నాశనముగల్గి పాడగుచున్నారు. అట్టిచో మీబోంట్లవిషయము చెప్పవలెనా? అది కాక రామచంద్రారాధన గావింపక జలముసైతము పరిగ్రహింపము.

అని యతఁడు దిగ్గనలేచిన నావెంటనే శివాజియు నక్కడివారును లేచిరి. అంత శివాజి వారి కందఱకు సెలవు దయచేసి వారు పోయినపిమ్మటఁ దాను స్వయముగా గురుసేవచేయుచు నచ్చటనే నిల్వసాగెను. ఆ యోగిపుంగవుండు పూజాపునస్కారములు కావించుకొని నియమితాహారము కైకొన్న పిదపఁ దన కాజడదారి దయచేసియిచ్చిన ప్రసాదంబు పరిగ్రహించి తదనుజ్ఞ

కైకొని భోజనార్థము నిజమందిరమున కరిగెను. తదనంతరమున వాడుక ప్రకారము శయనింపక తిన్నగా దేశికునివద్దకుబోయి యాయనతో రాజకార్యంబు లనేకంబు లాలోచించుచు నమ్మధ్యాహ్న మెల్లఁ గడపెను. ఇంతలో సాయంకాల మగుటయు నిరీక్షించి శివాజి రామదాసుఁ దీసికొని నవరాత్రోత్సవమునఁ గథలు జఱిగిన యాస్థలమునకు నడిచెను. వీరిరాకకుఁ బూర్వమే ప్రతాపగడలోనున్న పురుషు లాబాలగోపాలము శివాజి యుత్తరవుప్రకారము విచ్చేసియుండిరి. ఆస్థలమునకు శివాజి రామదాసులు సమీపించుతఱిఁ గృష్ణాజిప్రముఖులు దవ్వుదవ్వున వచ్చి సగౌరవముగా వారిని దోడ్కొనిపోయి యుచితాసనంబుల నధిష్ఠింపఁజేసిరి. అంత శివాజి లేచి స్వామివారిగుణంబులు కొంత వర్ణించి యమ్మహోదారుఁ డుపకారబుద్ధితోఁ జెప్పఁబోవు నుపన్యాసమును సద్దుచేయక యాలింపవలసిన దని సభవారి కానతిచ్చి తాను స్వస్థానము నలంకరించెను. అటుతఱువాత రామదాసు నిల్చుండి కొన్ని భగవత్ప్రార్థనాశ్లోకములు కర్ణరసాయనంబుగాఁ బఠించి యందఱకు వినఁబడునట్లు కంఠమెత్తి గంభీరముగా నీ దిగువరీతి నుపన్యసింపఁ దొడంగెను.

“ ఓ భారతులారా! మీ మేలుగోరి యుపన్యాసముఖమునఁ గొంత హితోపదేశము చేయ వచ్చితిమి. మామాటలు పాటించిన మీకును మీమూలంబున భరతఖండమునకు శ్రేయోభివృద్ధి గల్గును. ఇప్పుడు మా చెప్పఁబోవు దానితో మీ కెఱుంగనివిషయము లుండవని చెప్పఁ జాలము కాని యయ్యవి పాటించి వర్తించిన విశేషకీర్తికర మని ముమ్మాటికిఁ జెప్పఁగలము. మామాటలు వ్యాసాదిఋషిప్రోక్తములు కాని కల్పితములు కా వని మీరు నిదానించి విచారించినఁ దెలిసికోఁగలరు. ఓమహారాష్ట్రులారా! అన్ని జన్మములలో నుత్తమమైన పూరుషజన్మ మెత్తుట దుర్లభము. అట్టితను వెత్తిన మనకు సాధింపవలసిన పురుషార్థములు ధర్మార్థకామమోక్షము లని యెఱుంగునది. ఈనాల్గింటిలో మొదటి మూడును కేవల లౌకికులగు మీబోఁటి గృహస్థులు సాధింపవలసినవి. మిగిలిన పురుషార్థము శ్రీశుకాదు లట్టి మహావిరక్తులగు పారలౌకికులకు సాధ్యమగును గాని తదితరులకు దుష్కరంబు. కావునఁ

ప్రస్తుతము మీమ్ము నందఱ నాచతుర్థపురుషార్థము సాధింప మని బోధింపము. ఏలన ! కొందఱు తగినంత యనుభవజ్ఞానములేనిదే సన్యసించి వెడగు లగుదురు. కొందఱు భార్యమీఁద నలిగియో సంసారము భరింపఁజాలకయో మఱే యేయనర్థము పైఁబడుటనో కాని కాషాయవస్త్రములు ధరించి లోకమును వంచింతురు. ఇట్టివా రెల్లరు నిహపరభ్రష్టులై నశింతు రనుటకు సందియములేదు. పరదార పరవిత్తంబులు హరింపక గృహస్థాశ్రమముననుండియే తగినగురువుని జేపట్టి ముక్తిని సాధింపవచ్చును. దేహబలబుద్ధిబలములు సన్నగిల్లుచున్న యీ కలికాలములోఁ జరమాశ్రమము స్వీకరించుట బొత్తిగా ననర్థకదాయక మని యెఱుంగుఁడు. ఇట్లనుటవలనఁ గర్మసన్యాసముకంటె మనస్సన్యాసమును, తురీయాశ్రమముకంటె గృహస్థాశ్రమము శ్రేయస్కరంబులగుట యెఱింగి వర్తించునది.

బిడ్డలారా ! ఇంక సాధనవిధానం బెఱింగించెద వినుండు. ప్రాణులకు బొందెతోఁ బోయినవి రెండు, పుణ్యపాపములు ; భువిలో నిల్చునవి రెండు కీర్త్యపకీర్తులు కదా ?

పుణ్యకీర్తు లార్జింప నిచ్ఛగించువారు మనుమార్గమునఁ బోవలెను. అట్టివారినే మానవులని చెప్ప నొప్పును. మనుమార్గవిముఖులగువారు వారికిఁ దెలియకయే పాపము మూటగట్టుకొని యపకీర్తి ధాత్రి నిల్పుకొందురు. వీరినే రాక్షసులని పెద్దలెన్నుదురు. మనుమార్గమునఁ బోవుటనగా స్వాయంభువ మను మనువు చెప్పుధర్మంబుల ననుసరించుట యగును. ఈసనాతనధర్మములనే శ్రీకృష్ణభగవానులు గీతలలో జొన్పి లోకమునకు శాశ్వతోపకారము చేసెను. అట్టిధర్మములే మీకొఱకు సంగ్రహముగాఁ జెప్పెదము వినుండు.

సదసద్వివేకులారా ! మానవునకు దేహాభిమాన మున్నంతదాక స్వమతముపైనను స్వజాతిపైనను స్వదేశముపైనను నభిమానముండవలెను. ఇట్టియభిమానము లేనివాఁడు బ్రతికియుండియు లేనివాఁడగును. (అనఁగా జీవచ్ఛవమగుననుట.) ఇట్లనుటవలనఁ బరమత పరజాతి పరదేశంబులపై ద్వేషము పూనవలసినదని మాయభిప్రాయముకాదు. కాని మనయభివృద్ధికి ముఖ్యముగా

నైకమత్యమావశ్యకము. అయ్యది మనలో లేకుంటవలననే మొదటఁ బఠానులు ఈదేశము నాక్రమింపఁగల్గిరి. ఇప్పుడు మొగలాయీలుకూడ నిదేరీతి నాక్రమింపఁ జూచుచున్నారు. పఠానులదౌర్జన్యమువలననే దేశము ముప్పాతికవంతు నాశనమైనది. ఇంక మిగిలిన పాతికపాలును రేపో నేడో కాలూన సమకట్టుచున్న మొగలులవలనఁ బూర్తి యగునేమోయని భయముపడుచున్నాము.

ఓ దేశభక్తులారా! ఇప్పుడు మీరు విజాపురిగోల్కొండవారితో మైత్రిఁ జేసికోలేకపోయినను మొగలులు దక్కనుపై దాడివెడలినప్పుడైనను బాతపగలు దిగమ్రింగి దక్కనుయోధులెల్ల నొక్కమొగంబై పోవలెను. కావున బీజాపూరువారితోఁ గాలుద్రవ్వి కయ్యము పెంచుకొనకుఁడు. దాన నుభయులకు నష్టము తటస్థించును. ఇప్పుడు మీ కొక్కవిజాపురిబలముతోఁ బోరవలసివచ్చినదికాని రేపు దీనికి మూడింతల మొగలుబలముతో డీకొనవలసి వచ్చునేమోయని నాకుఁ బొడఁగట్టుచున్నది. ఇదెఱింగి మీజాగ్రత్తలో మీరుండవలసినది సుడీ!

ఓ మరాటశూరులారా! మనజాతిమతదేశములపై నభిమానము గల్గియుండవలసినదని యిదివఱకే చెప్పియుంటిని. "సంఘేశక్తిః కలౌయుగే" అను వ్యాసోక్తిమహత్త్వము మనకుఁ దెలిసియే యున్నదికదా? ఇట్టియైకమత్యము మనపూర్వులు విడనాడుటవలననే మన కిట్టియవస్థ చేకూరెను. కావున నింకనైనను మనమందఱము కలసి మెలసి మెలఁగుట యత్యావశ్యకము. ఇదియే భారతులకుఁ బరమధర్మంబని యెఱుంగుఁడు. దీనికైనా నక్షాములు చెప్పినట్లు జాతిమతములు త్యజింప నక్కఱలేదు. కాని జాతికంటె గుణము ప్రధానమని తెలిసికొని మన యనుచోట నభిమానము గుణమున్నచోట గౌరవముగల్గి చరింపవలెను. ఎక్కుడుజాతులువారు తక్కువవారి నెన్నడును తృణీకరింపరాదు. దేశవిషయమై పనిచేయునప్పుడు 'దేవుడుపెండ్లి కందఱు పెద్దలే' యనునట్లు సమస్తజాతులవారు నొక్కమొగంబై నడుచుట లాభముకాని యెక్కుడుజాతులువారు నిక్కి తక్కినవారిని జేపట్టకపోయిన వారికిని గొన్నాళ్ళకుఁ దక్కువవర్ణములవారిగతి పట్టుననుటకు మనకు మనమే నిదర్శనము.

ఓ మనుమార్గవిధేయులారా! ఐకమత్యమునకుఁదోడు పౌరుషము స్వార్థపరిత్యాగము స్వబలవిశ్వాసము దేశాభివృద్ధి గోరువారికిఁ గావలసియున్నవి. ఇవియన్నియు నొక్కనివద్ద సాధారణముగానుండవు. కాని మనయదృష్టవశంబున మనలో నొకరివద్దనున్నవి. అతం డెవ్వఁడో యెఱుంగుదురా! యతండు మనశివాజియే సుఁడీ!" అని రాజువంక వ్రేలుచూపి యిట్లనియె.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే".

అను గీతావాక్యార్థముచూడ నీకోంకణప్రభువునందు సార్థకముగచున్నది. అనుటయు నాపలుకుల కలరి సభ్యు లెల్లరు "జై శివాజిమహారాజాకు జై" అని యొక్కపెట్టున వాక్రుచ్చుచుఁ జప్పట్లు చఱచిరి. ఈ సందడి యడంగినపిదప నయ్యోగి

మ. వనితావాంఛనో ద్రవ్యకాంక్షనో సదా వర్తించి లోభాత్ములై
చను సామాన్యులజన్మ మొక్కఘనమా? చర్చింప లోకంబుకై
నను దేశంబునకైన సంఘమునకైనన్ మేలు కావించు నా
జనుఁడే పుణ్యుఁడు కీర్తిగణ్యుఁడు జగచ్చైతన్యుఁడున్ ధన్యుఁడున్."

అను నీపద్యమును సరసంబుగాఁ జదివి తనయుపన్యాసము తిఱుగ నిట్లు ప్రారంభింపఁ దొడంగెను. ఈదేశభక్తతిలకమే సుఁడీ. మహమ్మదీయ దౌర్జన్యమునకుఁ జెలియలికట్టై నిల్చియున్నాడు. మీరెల్లరుఁ ద్రికరణశుద్ధిగా నీయనకు సాయముచేయఁ గడంగితిరేని బీజపూరువారి మైత్రి యలవడక పోయినను మీకు భయంబు లేదు. భరతఖండములోని హిందువులందఱు నేకమైనచో విజాపురివా రెంత వారితలమీఁదివా రగు మొగలులుంకూడ వశ్యులు కాకపోరు. ఇప్పుడు నిష్కారణముగా శివాజి యుద్యమము గ్రహింపఁజాలక యితనిని రాజద్రోహి యని సుల్తానునకుఁ దన్మంత్రులు బోధించినారు. కాని మీరాజునకు విజాపురివారిపైఁ దిరుగుఁబాటు చేయవలయను నుద్దేశ మిప్పటివఱకు లేదని నే నెఱుంగుదును. సుల్తానునకు బాసటయై మొగలులను దక్కనునకు రానీకుండుటకే యీపరాక్రమనిధి ప్రయత్నించుచున్నది.

ఐనను విజాపురివారు దురూహపడుచున్నారు. ఇట్లు శివాజిని రాజద్రోహి యని చెప్పి యితని నెన్నటికి విశ్వసింపరేని యితండును వారి కెట్లు సహకారి యై మెలంగు? శివాజివంటిఘనులతో విరోధించి వారి వెడలఁబెట్టి పేరూరు లేకుండ నెన్నిరాజ్యములు గంగలోఁ గలియలేదు? పాప మెంతటివివేకుల కైనను గాలవైపరీత్యమువలనను నేత్రములు సమముగాఁ గనఁబడవు. దీనికంతకు నేమి! మీరు నాచెప్పినట్లు జాతినీతులు విడనాడక యైకమత్యాదులు కల్గి మీరాజునకుఁ జేదోడు వాఁదోడులై యియ్యవతారపురుషుండు చేపట్టి నట్టి ఘనోద్యమము నెగ్గించి చిరకీర్తి వహింతురుగాత. గోబ్రాహ్మణ సాధురక్షా ధురంధరుఁడగు మీరాజును లోకముపాటిరాజుగా నెంచకుఁడు. దీనిరహస్యము నింతమందిలోఁ జెప్పుటకు వీలులేదు. మీలో వక్తలగువారు దేశాటనము చేసి నాచెప్పుధర్మముల నాచండాలపర్యంతము బోధించి మమ్ము కృతార్థుల జేయుదురుగాక. గోబ్రాహ్మణులయెడల గురువులయెడను మీరాజెట్టి గౌరవప్రపత్తులుగల్గి ప్రవర్తింపుచున్నాఁడో యట్లే మీరును మీరాజునందు నడుచుకొందురుగాక.'' అని రామదాసు కూర్చుండినపిదపఁ గృష్ణాజి లేచి సమయోచితముగాఁ గొంతసేపు ప్రస్తావించి పదంపడి తమకై యంతశ్రమదీసి కొనివచ్చి హితబోధచేసినందులకు నాయోగిశిఖామణిని భూషించి యానాటి సభను ముగించెను.

అటుపిమ్మట శివాజి చిక్కిన మహమ్మదీయజనానాస్త్రీల నొక్కింతయు నగౌరవింపక తగినవారి వెంటనిచ్చి విజాపురికి నంపెను. మఱియు హతశేషులలోఁ దనవద్ద నిల్తుమన్న వారి నట్లుండఁజేసి తక్కుఁ గలవారని వారిదేశములకుఁ బోనిచ్చెను. ఇట్లు పోనిచ్చినవారిలో జంఝూరరావు ఘాటగేమరాటవీరుఁ డుండెను. అతండు తనతండ్రి షాజిస్నేహితుని సుతుఁ డగుటఁ జూచి వానిని తనయొద్ద నుండవలసిన దని మిక్కిలి బోధచేసెను కాని యామ్లేచ్ఛభక్తుఁడు తా నచట నిల్చుట రాజద్రోహమనియో లేక విజాపురిలోనున్న బాంధవుల విశ్లేషమునకు నోర్వఁజాలకయో లేక తనసఖుని వియోగమునకు నాగఁజాలకయో యత్తఱి శివాజిబోధలు పాటింపనివాఁడాయెను. ధర్మ

రాజు శల్యునివద్ద వరము తీసికొన్నట్లు జంఝూరరావు కారాగృహాధిపత్యము గల్గియుంట తెలిసికొని శివాజి బాలాజివిషయమున గరుణగల్గి యుండవలసినదని వానిచే వాగ్దానము చేయించుకొని వాని యథేచ్ఛగా బో నిచ్చెను. సమరములో శౌర్యప్రతాపములుచూపిన నాతాజిప్రముఖయోధులకును గాయములు తగిలి జీవించిన వీరభటులకు గొప్ప యుత్సవముచేసి నిజౌదార్యము తెల్లంబుగా బంగారుమురుగులును గొలుసులును నాణెములును పల్లకీలును శాలువులును మఱియు ననేకపదార్థము వారివారికిఁ దగినట్లు కోంకణప్రభువు బహుమతిచేసెను. మఱియుఁ బంతోజికిఁ దానన్నరీతిగా హివరేగ్రామము జాగీరిచ్చి తన సచివునిగా జేసికొని విశేషముగా గౌరవించెను. ఫజీలుని దత్కుటుంబమును ఖండాజీకాకడే లంచము తిని దొంగదారిని దీసికొనిపోయి విజాపురికిఁ జేరినసంగతి దెలిసికొని తనసర్దారుని చూడక వాని నేనుఁగుకాలు క్రిందఁ బెట్టి మట్టించెను.

రామదాసుయోగి శివాజి వేడ్కోలునఁ గొన్నాళ్ళచ్చట నిల్చి భారతరామాయణాదులలో నిమిడియున్న సనాతనధర్మ్మంబులు ప్రియశిష్యునకు నెఱుంగఁజేసి పిమ్మట నతనిసమ్మతివడసి యథేచ్ఛగాఁ బోయెను. ప్రభావతి తల్లిదండ్రులతో గలిసికొన్నందునకు నొక్కింత సంతసించియుఁ బ్రియుండు విదేశమునఁ బడియుంటవలన నెప్పటియట్లు చింతించుచు దుర్భరవిరహతాపంబునఁ దపించుచుఁ దనమనోవ్యసనము జనకులకును రాజునకునుఁ గ్రమముగాఁ దెలియఁజేసెను.

---

## పదునేడవ ప్రకరణము.



మనకథ జరుగు కాలము నాఁటికిఁ గర్ణాటకరాజ్య మస్తమించుటయుఁ దద్రాజ్యలక్ష్మి విజాపురి గోల్కొండసుల్తానుల పాలౌటయుఁ దటస్థించుట వలనఁ గ్రమక్రమముగా సుల్తానుల రాజ్యంబులు ప్రబలి యించుమించుగా దక్షిణహిందూస్థానమంతయు వ్యాపించియుండెను. ఆరాజ్యంబు లొక్కొక్కటియే యెంచిచూడ బలైశ్వర్యాదులందు మొగలుల ఢిల్లీరాజ్యముతోఁ దులతూఁగుచున్న దనుట యతిశయోక్తి కాదు. ఆరెంటిలో బీజపూరురాజ్యము దక్కను పశ్చిమభాగస్థమై యుంటవలన నాఫ్రికై రోపాఖండవర్తక వ్యాపారములకు నిమ్ముగా నుండెను. దానంజేసి విజాపురిరాజ్యము బహువిధ సంపదల కాకరమై బలసంపత్తిని గాకున్నను ధనసంపత్తిని నాఢిల్లీరాజ్యమును సైతము దిరస్కరించుచుండెను. అట్టి రాష్ట్రమునకు రాజధానియై పంచయోజనవిస్తీర్ణమై యొప్పొందు పట్టణరాజం బగు విజాపురివైభవంబు వర్ణింప నేరికి సాధ్య మగు? అప్పటికే పొందుచున్న ఢిల్లీనగరమును శతాబ్దము క్రిందట శిథిలమైన విజయనగరమును విడిచి వైశాల్యమం దింతటి గొప్పపత్తన మాకాలములో వేఱొకటియున్నట్లు తోఁపదు. అట్టి పట్టణతిలకంబుచుట్టును నెత్తైన శిలాప్రాకారములు గల్గి శత్రు దుర్భేద్యమై యుంటవలన నయ్యది తద్రాజ్యలక్ష్మి కాటపట్టై భాసిల్లుచుండెను. అందలివీథులు వంకరటొంకరులులేక తూర్పుపడమరలకు నుత్తరదక్షిణములకును వ్యాపించి చతురంగపాళి ననుకరించుచుండెను.

అం దేవీథినిజూచినను వేలకొలంది ఖరీదుచేయు సౌధభవనంబులతోను లక్షలకొలంది విలువచేయు పెద్దమసీదుగోపురములతోడనుగూడి యందలివీథులు చూపఱకుఁ గనుపండువచేయుచుండెను. పురవాసులు మూఁడువంతులు మహమ్మదీయులును రెండువంతులు హిందువులును నైయుండిరి. వీరెల్లరు మంచి

స్థితిపరులుగానున్నారనుటకుఁ దదీయనివేశనంబులే మనకుసాక్షి. ఇంతటిధనధాన్యాదివిభూతులు ప్రకీయుల కెట్లు లభించెనోయని చదువరులమదికి సంశయము గల్గవచ్చును. తఱుచు న్యాయార్జనవలన నెట్టివారికిని ధనము గూడఁబెట్టుట దుర్లభంబగు. అట్టిచో వీరెట్లు ధనాఢ్యులైరో తెల్పెదవినుండు. అనాదరైతులయు నమాయకులయు ద్రవ్యంబు చెలిమిని బలిమిని గ్రహించు నేర్పు అందలి యుద్యోగస్థులకును, పరదేశీయుల బెదిరించి బలవంతమున వారివద్దఁ బైకము రాబట్టుకొను నేర్పు రక్షకభటులకును, కూటసాక్ష్యంబులు చెప్పియుఁ దప్పుపత్రంబులు పుట్టించు నేర్పు సుల్తానాశ్రితులకును, తప్పుతూకంబులు తూచియు నవధాన్యాదులందు దుమ్ముధూళికల్పి రూకల కర్థలు లాభములాగు నేర్పు వర్తకులకును, వెండిబంగారులలో రాగి యిత్తడి చేర్చి యార్జించు నేర్పు కంసాలులకును గల్గియుంటయేయని తెలిసికొండు. ఇంతకుఁ గలియుగమున లక్ష్మి నీచుల నాశ్రయించునను పౌరాణికోక్తి యియ్యెడల సార్థకపడుచున్నదనుటకు నింతయు సంశయములేదు. ఇది యటుండ సామంతులగు మహమ్మదీయులకుఁ గంటికిఁ గాన వచ్చిన పరసుందరులనెల్ల బల్మిని జేపట్టి విషయభోగంబులఁ దేలుచుంట యొకసంప్రదాయకమై యుండెను. ఇట్టి దుర్ణయములకెల్లఁ బుట్టినిల్లగు నారాజధాని నేలు నేదులుశాహి యనువాడు తప్పించుకొని పాఱివచ్చిన సైనికులవలన ఖానుఁడు సైన్యసమేతముగా మ్రగ్గఁబడు వృత్తాంతమువిని కోపఘూర్ణమానసుండై తత్ప్రతిక్రియఁజేయ సమకట్టి యొకనాఁడు మంత్రిసామంతులఁ బిల్పించి వారితో నాలోచనలు సల్పుచుండెను. ఆసమయమున ఫజీలు జంఝూరరావుతోఁ జనుదెంచి యొక్కింతసేపువఱకు సుల్తానుతో మాటలాడఁజాలక మొగమువంచి దుఃఖించుచుండెను. పదంపడి యచ్చటివారిచే ననునయింపఁబడినపిదపఁ గన్నులనుండి వ్రాలుచున్న జలంబును దుడుచుకొనుచు, పంతోజిసల్పిన ద్రోహమును శివాజిచేసిన మోసమును ఖానుతోపాటించుమించుగా నెల్లసైనికులు రణనిహతులౌటయు, ఖండోజి కాకరే యను శివాజిసర్దారునకు లంచమిచ్చి తాను దప్పించుకొన్న సంగతియు, సఖుఁడగు జంఝూరరావు మున్నగువారి విడుదలయు సొరది వివరించుచు నిలఁబడు పాటనఁ దటాలున నేలపైఁ గూలఁబడి మూర్ఛఁబోయెను. తోడనే

ఝంఝూరరావు జలములు తెచ్చి వాని మొగముపైఁ జల్లుటయు వాఁడును దెల్వి తెచ్చుకొని యట నొకబల్లపైఁ గూర్చుండెను. ఫజీలునకుఁ బూర్తిగా దెల్వి వచ్చినపిమ్మట నచ్చటివా రిట్లు ప్రసంగింపఁజొచ్చిరి.

సుల్తాను—సిద్దీజోహార్! ఫజీలు చెప్పిన సమాచారమెల్ల నీవు వింటివికదా? బీజపూరు రాష్ట్రనాశకుఁడగు శివాజి నెట్లు సాధింపవచ్చునో మాకెఱుంగరాకున్నది. పత్తేఖాను తాళగోసల దుర్గములు ముట్టడించియు ఖాను మడిసినపిదపఁ బఱాయితుండైనట్లు తెలియవచ్చినది. ఆమరాటధూర్తుఁడు చుట్టుపక్కలనున్న కోటలనెల్ల నయమున భయమున వశపఱచుకొనుచు నానాఁటికి బలవంతుండగుచున్నాఁడు. వాని నిప్పటిలో నుపేక్షించినచోఁ గ్రమముగా మదీయరాష్ట్రముకూడ నాక్రమించునను టకు సంశయములేదు. ఇందులకుఁ బ్రతిక్రియ మనమేమి చేయవలెనో నీవు చెప్పవలసినది.

సిద్ది—సుల్తాన్జీ! ప్రస్తుతము మనకు మొగలాయీలబాధలేదు. ఔరంగజేబు తన యన్నదమ్ములతో సింహాసనమునకై పోట్లాడుచున్నాఁడు. ఈ తరుణమున శివాజిని లోఁబరుచుకొందుమేని పిదప గోల్కొండనవాబులతోఁగలసి మొగలులను నర్మదానది దాటకుండ నదుమవచ్చును. వీలైనచో నుత్తరహిందూస్థానమునఁగల మనపఠానుజాతివారి నందఱఁ గూడఁ దీసికొని తొల్లింటివలె ఢిల్లిలో మనప్రభుత్వము స్థాపింతము. శివాజిప్రయత్నములు మొగలలమీఁదికే యని తద్గూతులు కొందఱు నాతోఁ జెప్పినారు. కాని యింతమాత్రముచేతనే శివాజిని నమ్మఁజాలను. అతనికి గోబ్రాహ్మణులన్న మిక్కిలిప్రీతి. తద్రక్షణకై వీలైనచో ప్రత్యేకహిందూరాజ్యస్థాపనచేయ నుద్యోగించును. కావున నెట్లుఁ జూచినను మనకు నాతనికిఁ బొత్తు గలియుట దుర్లభము. మొగలాయీలు దక్షిణమునకు దాడివెడలకమున్నే శివాజి నణఁచకున్నచో నతండును వారితోఁజేరి మనపైఁ గత్తికట్టక మానఁడు. ప్రస్తుతము రుస్తుంజమానునకుఁ దగినంత సైన్యమిచ్చి కొల్హాపూరుజిల్లా రక్షించుటకుఁ బంపవలెను.

పత్తేఖానునకు నొక్కుత్తరము వ్రాసి శివాజిమీఁదికిఁ బురికొల్పుఁడు. ఇంతలో నచ్చటచ్చటనున్న సేనలనన్నియుఁ గూర్చుకొని శివాజిని స్వాధీనపఱచుకొనుటకు బ్రయత్నింతము.

ఇట్లు వీరు ప్రస్తావించుచున్న సమయమున రంగనా చిళణా దుర్గాధిపతులు దర్బారునకు విచ్చేసి తమరాక సుల్తాను కెఱింగించి యాయనసమ్మతిఁ బడసి లోనికరిగి సుల్తానునకు సలాముచేసిన నతండు వారి కుచితాసనంబులు చూపి కూర్చుండఁజేసి వారితో నిట్లు ప్రసంగింపఁ దొడంగెను.

సుల్తాను—సాహేబులారా! మీరాకకుఁ గతంబేమి? మీరెల్లరు సుఖులై యున్నారుకదా? శివాజి యిప్పు డెచ్చట నేమిచేయుచున్నాఁడు? మనరాష్ట్రములో ననేకులు దుర్జనులబోధలవలనఁ బ్రతిపక్షులపక్షము వహించుచున్నారు. అట్టివారిని మీరు కనిపెట్టి శిక్షించుచున్నారా? మీప్రదేశములలో నెట్టితొందరలును లేవుకదా? మాపాలనమందయిష్టముపడువారు కొందఱిప్పుడిప్పుడు బయలదేఱుచున్నారట. వారిని గనిపెట్టి మాకుఁ దెలియఁజేయవలెను జూడీ!

రంగనాధిపతి—సుల్తాను మహారాజ్! తమక్షేమని విన్నవింతుము. మొన్న శివాజి స్వయముగా దుర్గాధిపునకు గొప్ప లంచమిచ్చి యాదుర్గమును స్వాధీనము చేసికొనెను. మఱియు మాదుర్గములను ముట్టడించి యవి లోబఱచుకొన్నాఁడు. ఇంతవఱకు మాప్రదేశములలోనికి విచ్చేసిన బోధకులను బైరాగులనుబట్టి పల్లార్చుచునేయున్నాము. మీతో మాయవస్థ మొఱవెట్టుకొన వచ్చినారము. మీరు తగినంత సిబ్బంది దయచేయుదురేని మాకోటలను మేము తిరుగ వశపఱచుకొందుము.

చిలణా దుర్గాధిపుడు.—పాదుషాహే! తమకు రంగనాధిపతి యెల్ల సంగతులు మనవి చేసియే యున్నాఁడు. నే నొక్కటి దేవరకుశలంబును మన రాజ్యక్షేమమును గోరి తమ రడుగకయే యొక యాలోచన చెప్పఁబోవుచున్నాను. ఇట్టి స్వాతంత్ర్యము నేఁ దీసికొన్నందులకు నన్ను మన్నింపవలెను. శివాజి యించుమించుగా సహ్యాద్రిపంక్తి

లోని దుర్గంబులెల్ల నాక్రమించుకొని యున్నాఁడు. తమ దృష్టిలో నుపేక్షించిన గొప్పముప్పు మనకు వాటిల్లును. మనమూలబలమునెల్ల నొక్కపెట్టునఁ బోయి కొంకణంపుకోటలు వశపఱచుకొనక పోయినచో నానాఁటికి బలవంతుఁడై రాజధానిమీఁదికి దాడి వెడలకమానఁడు. ఇప్పటికి వాని సైనికులసంఖ్య మనదానిలోఁ జూడఁగా మూడవవంతున్నది. అతండు దినదినమునకుఁ జతురంగబలము వృద్ధిచేయుచునే యున్నాఁడు. ఈ సంగతులెల్ల స్వయముగాఁ జారులవలనఁ గనుంగొంటిని. ఇంక మన ముపేక్షింపరాదు. మనరాజ్యములో బ్రాహ్మణులనేకులు లోలోన శివాజిపక్ష మవలంబించియున్నారు. అట్టివారినెల్ల నొకకన్నుతోఁ జూడవలసియుండును. రుస్తుముమహారాజ్! దుర్గాధిపులు చెప్పుదానిలో నొక్కింత హెచ్చుతగ్గులులేవు. నేనా పదివేల సైనికులతోఁబోయి రంగణావిశాళణాకోటలు వశపఱచుకొందును. తమరు సిద్దిజోహారుఖానుని మూలబలమెల్ల నిచ్చి నావెనుక నంపుడు. మేమిద్దఱము కలిసిపోయి శివాజికి రెండుకన్నులైన కృష్ణాజితానాజులను బొడిచి బాహువులైన పేష్వానాతాజులను దునుమాడి యతనిని వీలైనచోఁ బ్రాణములతోఁ బెడరెక్కలు కట్టితెచ్చెదము. మీసెలవైనచో శివాజినేమి గోల్కొండనవాబును సైతము పట్టితెచ్చి తమకట్టెదుటఁ బెట్టఁగలము. ఈలోఁగా దక్కనుప్రభుల నుక్కడంచకపోయిన వారు తిరుగ మొగలులు దండెత్తివచ్చినవేళను మనకుఁ బక్కలో బల్లెములై బాధించెదరు. కావున దేవరవారు తామసింపఁదగదు.

ఫజీలు — రుస్తుముప్రముఖులు చెప్పుసంగతులెంతయు నుక్తియుక్తముగానే యున్నవి. నే స్వయముగా నేఁగి మాతండ్రిని మోసముచేసి చంపించిన పంతోజిని చంపిన శివాజిని దెగటార్చినదాక నాకోప మెంతమాత్రము శాంతింపదు. తాతలనాఁటినుండి మీతిండితినుచున్న మే మీ

మాత్రపుపని చక్కఁబెట్టకున్నచో మాజన్మమేల? దయచేసి తమరు నన్ను పంపఁ బ్రార్థించుచున్నాను.

ఖోహారు— యవనకులోద్దీపకా! తమరు ఫజీలు చెప్పినట్లు చేయవచ్చును. ఈతత్క్షణమే చిళణా రంగనాదుర్గాధిపతులకు సాహాయ్యంబుగా మనరుస్తుంజమానుని బంపుట నామతంబు. వెనుకనుండి ఫజీలుని మూలబలము నిచ్చి పుత్తెంచవచ్చును. ఇచ్చట నేనొక మాట చెప్పఁబోవుచున్నాను. మొగలులతో మనకుఁ గయ్యము తటస్థించునప్పుడు తన మావళీబలముతో సాయము చేయుదునని వాగ్దానము చేసినచో శివాజిని మనము సామంతరాజుగాఁ బరిగణించి విడుచుటొప్పు. ఈనామాటలు ఫజీలుముఖ్యుల కంతగా నిష్టముండదని నేనెఱుంగుదును గాని యిట్లు చెప్పుటకు నొక్కహేతువున్నది. శివాజితో మనము బద్ధవైరము పెట్టుకొంటిమేని షాజియుఁ దత్ప్రేరణఁ గర్ణాటకరాజులును విరోధు లగుదురు. ఇంతయేకాక గోల్కొండనబాబుమంత్రులు బ్రాహ్మణు లౌటవలన వారు శివాజికి సహాకారు లౌదురు. ఇదికాక మనకు బలవద్విరోధి యగు నౌరంగజీబు రేపో నేడో తనచక్రవర్తిత్వము స్థాయిపడిన వెనుక బలముల బంపి చలము సాధింపక మానఁడు. ఒక్కింత దూరదృష్టితో మీ రీవిషయంబుల నాలోచించినచో మీకే విశదమగును. ప్రస్తుతము రుస్తుంజమానుని బంపుట కర్తవ్యము. వెనుక విచారించి వీలుకొలంది చేయుదము.

సుల్తాను—ఓహితవాదులారా! మీలో నొకరికంటె నొకరు విశేషించి రాజకీయాంశము లనేకము తెల్పుడు చేసినారు. మనమంత్రి యిబ్రహీము నేఁ డేకారణముననో రాఁడయ్యె. ఆతనితో మాటలాడి యెట్లు చేయుట లాభమో యట్లు చేయుదము.

ఓయీ! రుస్తుముజమాన్! నీవు నీసేనతోఁ బోయి చిళణా రంగనాదుర్గములనుండి శత్రువులం బాఱఁదోలి యచ్చట నుండుము. మేము కొలంది

రోజులలో విస్తారసైన్య మిచ్చి జోహారునిగాని ఫజీలునిగాని లేక యుభయు లనుగాని శివాజిమీఁది కంపుచున్నారము. అప్పటిలో నీవు వారితోఁ గలసి నీపౌరుష సాహసంబులను జూపి యిందాక నీచెప్పినట్లు చేయునది. రేపే బయలుదేరి పోవలెనుజుమీ! అని వాని కానతిచ్చి యప్పటికి సాయంసమ యము సమీపించుటఁ జూచి కొల్వుచాలించి మసీదునకు నడచెను. తోడనే యచ్చటివా రెవ్వరిదారి వారు పట్టిరికాని ఫజీలు ప్రభువువెంటనంటి మసీదు నకు నడచెను.



# పదునెనిమిదవ ప్రకరణము.



అనంతరము కొన్నాళ్లైనపిదప నొకనాఁటి మాపటివేళ దీపములు వెలిఁగించుతఱి నొక్కపురుషుండు రాజమార్గమునుండిపోవుచు, ఫజీలునికేతనము వెదికికొనుచు నొకభవనంబు డాసి యచ్చోట నిల్చెను. లోగిడినుండి యొక మరాటుండు వెలికిఁ బొసెంచి యటనున్న యావింతమనుష్యునిజూచి నీవెవ్వఁడవు? ఎవ్వనినిమిత్తము వచ్చితివి? అని యడుగుటయు వాఁడిట్లనియె. అయ్యా! నేనెవ్వఁడనైన నేమి? ఇదేనా ఫజీలుగృహంబు? నే నతనిదర్శనమున కరుదెంచితిని. నావుడు నామరాటప్రముఖుఁడు వానివర్తన మనుమానించి, "ఓయీ! నీ వెవ్వఁడవో! యెందుల కేతెంచితివో నాకెఱింగింపుము. లాతిని ఖానుని దర్శించుటకు నీకు వీల్పడదు"—అని యడుగుటయు వాఁడు తగినయుత్తరము చెప్పమి మఱింత యనుమానించి తిఱుగ నిట్లనియె. "ఓయీ! నీపేరు చెప్పినసరే లేనిచో నిన్నుబట్టి జవానుల కప్పగింతును. అప్పుడు నీవును నిన్నుబుట్టించిన జేజమ్మయు నడిగినదానికి సరిగా జవాబు చెప్పుదురు" అని యీరీతిని వీరిరువురును ఘర్షణపడుచుండఁగా ఫజీ లచ్చోటికి విచ్చేసి "ఓయీ జంఝూరీ! వీఁడెవ్వఁడు? ఎందుల కరుదెంచెను" అని యడుగుడు జంఝూరి నవ్వుచు నిట్లనియె. "ఇదివఱకు నేఁ బ్రశ్నించితినిగాని యూరుపేరులనుమాత్రము చెప్పక ఫజీలుకోసము వచ్చినాననిమాత్రము చెప్పినాఁడు కావున నీవే యడిగి తెలిసికొనుము" అని జంఝూరరావు అనునంత నావచ్చినవాఁడు ఖానునకు సలాము చేసి "సాహేబుగారూ! మీతోఁ గొన్నిరహస్యములు మాటలాడవచ్చినాను. నేనెవ్వఁడనో క్రమముగాఁ దెలిసికోవచ్చు" అని వానినోటివెంట మాటలు వెడలినవెంటనే ఫజీలభిప్రాయము కనిపెట్టి జంఝూరరావు వీధిలోనికి నడచెను. తదనంతరంబ ఫజీ లాక్రొత్తమనుష్యుఁడు నిరాయుధుండౌటఁ బరిశీలించి చావడిలోనికిఁ దీసికొపోయి "నీవెందుల కేతెంచితి" వని వాని నడుగఁగా

వాఁడు మొలలోనున్న జాబు నూడఁబెఱికి ఫజీలుచేతి కందించెను. వెంటనే దీపమువద్దకు నేగి యతండు లేఖను రెండుమూడుసారులు తనలోఁ జదువుకొని సంతోషించి యది ప్రభావతి వ్రాసియుండునో లేక మరేరైనను వ్రాసియుందురో యని యొక్కింత సంశయించి పదంపడి యావింతజనునితో నిట్లు ముచ్చటింపఁ గడంగెను.

ఫజీలు—ఓయీ ! నీ వెవ్వఁడవు ? నీ కీయుత్తర మెవ్వరిచ్చిరి.

విఠలు—ఖానుగారూ ! నాపేరు విఠలదాసందురు. నా కీకస్తు ప్రతాపగడలో నున్న రామోజిపట్టి వ్రాసి యిచ్చినది. ఈపట్టణములో రామోజి యుద్యోగస్థుఁడై నివసించుకాలములో నే నతని యింటివద్ద గుమస్తాగా నుంటిని. అప్పటిలో నా పెఁ దఱుచు నెత్తికొంచు నాచేతులమీద నే పెంచుటవలన నాఁటఁగోలె నాయందు విశ్వాసముగల్గి యాకన్యయు నాకాంతయందుఁ బ్రేమగల్గి నేను నుంటిమి. ఇట్టి చనువుబట్టి యా పరభుపట్టి యుత్తరమిచ్చి మీసన్నిధికి నన్ను బుత్తెంచెను. నారాక మీరు గోప్యముగా నుంచవలెను. లేనియెడల ఖండోజియవస్థ నాకును దటస్థించును.

ఫజీలు—ఏమేమీ! ఖండోజి కేయుపద్రవమువచ్చెను ?

విఠలు—ఫజీల్సాహెబ్ ! మీరు వినలేదా ! పాపము మరణము తటస్థించెను.

ఫజీలు—అన్నన్నా ! ఎంత పనియైనది. నన్ను దప్పించినందులకుఁ గాబోలు.

విఠలు—ఔ నదియేకారణమని విన్నాను. కాని యాపెవేడ్కోలున.—

ఫజీలు—ఓయీ ! యీలేఖలోనిలిపిఁ బట్టిచూడ నాముద్దులగుమ్మ పంపినట్లు నాకుఁ దోపకున్నది. నీవు నిజముగా నిదెవ్వరుపంపిరో చెప్పుము.

విఠలు—నాయెడల మీ కింతయనుమానము పుట్టుట కెంతయు వింతగానున్నది. మీచిన్ననాటనుండియు నే మిమ్మెఱుంగుదును. మీతండ్రిగారు

కాలముచేసిరి కాని వారున్నచో నన్నుఁ బోలికపట్టియేయుందురు. మీ కింతసంశయమేల ? ఈయుంగరము చూచియైనను మీయనుమానముఁ దీర్చికొండు.

అని చెప్పి ఫజీలుచేతి కాయుంగర మందిచ్చుటయు నతండు నందు స్ఫుటముగాఁ గనఁబడుచున్న ప్రభావతినామము చదువుకొని తన కింతవఱకుఁ దగిలిన యనుమానము బాఱఁదోలి యాయుత్తరము ప్రభావతియే పంపియుండునని నిశ్చయించికొని తా నటనున్న యొకకుర్చీపైఁ గూర్చుండి విఠలదాసుని జేరువనున్న బల్లపైఁ గూర్చుండఁజేసి ప్రభావతి యగ్గలపువలపు నాసందేశహరుండు తెలుపుచుండ నాలించుచు నాసుందరి యసమానరూపగుణంబులు తా లెక్కించుచు మరుఁడు మది నురవడింప సొక్కుచు సోలుచు గొంతతడవు ఖానుకుమారుం డట్లు కాలక్షేపము చేయఁజొచ్చెను. అంత నొకజాము రాత్రి చెల్లుటయు నటుపిమ్మట ఫజీ లయ్యతిథిఁ బాలు ఫలములచే సంతృప్తిపఱచి యటుపిమ్మట దా భోజనముచేసివచ్చి తిఱుగఁ గొంతసేపు దాసుతోఁ బ్రసంగించి వెండియు నప్పటికిఁ జాలరేయియగుటయు వాని నాచావిడిలోఁ బరుండఁజేసి తా నెప్పటియట్ల తనసౌధములోఁ బరుండఁజొచ్చెను. ఖాను మృతిఁ జెందిననాటనుండియుఁ బ్రతిరాత్రిని దండ్రికై దుఃఖించువాఁడయ్యు నాఁటి నిశిని జనకునిసంగతి వెనకపెట్టి ప్రభావతిగూర్చి ధ్యానించుచుఁ జాలకాలము మేలుకొని తెల్లవాఱుజామునఁ బరుండెను.

ఆమఱునాఁడు విఠలదాసునకు స్వయంపాకమిప్పించి వానిభోజనానంతరమున నెవ్వఁడురొక్కము మట్టుఁజెప్పి తా నొకయుత్తరము వ్రాసి వానికిచ్చి యది ప్రభావతి కందఁజేయుమని చెప్పెను. వాఁ డాలేఖను గ్రహించి నేర్పుమెయి నిట్లు పల్కెను. సాహెబుగారూ! తిరిగివచ్చినప్పుడు మీ యుంగరము నడిగిపుచ్చుకొని తెమ్మని యాముద్దులగుమ్మ గ్రుచ్చిగ్రుచ్చి చెప్పినది. అది యెందులకని నే నడుగఁగా నమ్మోహనాంగి మోహము మెట్టిదియో కాని "ఆయనను గలసికొనువఱకు నాయనయుంగరము పెట్టుకొని

గ్గొనెనను ముచ్చటింతు" అని చెప్పి నన్నుం బుత్తెంచెను. అదికాక మాహిందువు లలో వివాహపూర్వము తన్నిర్ణయసూచకంబుగాఁ బ్రధానంబను పేరుతో నత్తవారు పెండ్లికూఁతురున కేదైనవస్తువొకటి పెట్టు నాచారముగలదు. కావున నియ్యెడ మీవేలియుంగరము ప్రధానపుగురుతుగాఁ బరిణమించును. అన వుడు వానిమాటలెల్ల వానినోటిలోనుండి వెడలకపూర్వమే తనయంగుళీయ కముతీసి దాసునిచేతిలోఁ బెట్టుచు నిట్లనియెను. "నీ వెట్లైనను మాయిద్ద ఱను గలుపవలెను జుమీ! నీమే లెన్నటికైనను మఱచిపోను. వివాహసమ యమున నీకు నే నేమిత్తునో యప్పుడు చూతువు కాక. ఈమాత్రముపకార ముచేసి నన్ను నుజ్జీవింపఁజేయవలెను. వేగముపోయి రావలెను" అని వానిని వీడ్కొల్పి ప్రభావతిపై వలపు వడికిఁబాఱఁ బగలెల్లఁ బొగలుచు రేయెల్లఁ గలవరించుచు నాసౌందర్యతిలకచక్రదనంబు లెక్కించుచు దొంటికంటె రెట్టింపుకష్టాతితి నెట్లో కాలము వేగించుచుండెను.

అట్లు విఠలుదాసు ఫజీలునివీడ్కొనిపోయిన నాల్గునాళ్లకు, లోఁగడ మెక్కాపురికిబోయెదనని చెప్పి చనిన నాపకీరు విజాపురికివచ్చి ఫజీలుని గలిసి కొని పరామర్శఁజేసి యిట్లనియె. "కుమారకా! మిమ్ము విడనాడినపిమ్మట సూరత్తునకు వారమునాటికిఁ జేరుకొంటిని. అటనుండి ప్రయాణమునకు సిద్ధపడి నావలో గాలుపెట్టుతఱి ఘోరవార్త నందొక్కయాత్రికునివలన దెలిసికొని నామేను నీరైనది. అంతట ముందునకుఁ బోజాలక న్యాయముగా మాబోటి పకీరులకు రాగద్వేషంబు లుండఁగూడదని దైనప్పటికిని నీమీఁదివాత్సల్యమునకు మఱుసటిసంవత్సరము పోవచ్చునని యుద్దేశించి యిటకు బహుప్రయాసమున విచ్చేసితిని" అని యొక్కింతవిచార మభినయించి క్రమ్మఱ నిట్లు మాటలాడఁ దొడంగె. "ఓయీ! నీ వింతవిచారసముద్రములో మునిఁగియున్నప్పుడు నిన్ను వేఱుసంగతు లడుగుట కూడదుకాని నీవద్దఁ గలచనువుమీఁద నొకసంగతి యడుగుచున్నాను. ప్రభావతి నిన్నుఁ జేరుకొన్నదా?" అని యడుగుట యు నాప్రశ్న కుత్తర వొక్కింతతడవు చెప్పఁజాలక పెద్దనిట్టూర్పు నిగిడ్చి యిట్లనియె.

ఫజీలు—ఆర్యా! తండ్రిని జేతులార పగఱ కప్పగించుకొను నీమందభాగ్యున కుఁ బ్రభావతి లభించుపాటి యదృష్టముకూడునా ?

పకీరు—ఫజీల్ఖాఁ! నీవు నాకడ దాఁచుచున్నావు. నీపైని బ్రేముడి యాపిల్లకుఁ గల్గియున్నట్లు నాకుఁ దెలియవచ్చినది. శివాజికాని తదీయులుకాని పోనీకుండ నాతంకపెట్టుచున్నారా యేమి?

ఫజీలు—శివాజి పరకాంతలఁ దడవనిమాట పట్టి వదంతియనియా మీయాభి ప్రాయము. అతం డెంతమాత్ర మట్టివాఁడుకాఁడు. మొన్నను మా జనానా స్త్రీలు చిక్కినప్పుడు నింతకుముందు మాయుద్యోగస్థులకాంతలు పట్టుపడినప్పుడు నాతఁడు వారి నగౌరవపఱచక పంపివేసినాఁడు. కాక యితనికే యట్టిదురూహయున్నచో నాతరుణి నిదివఱకే గ్రహించియుండును. రామోజి కయిష్టముంటవలన శివాజియు వానివేడ్కలున బ్రభావతి నెటకుఁ బోనీకుండఁ జూచుచున్నాఁడేకాని వేఱొకటికాదు.

పకీరు—ఔనౌను. నీవు చెప్పినది నిజముకానోపు. ఆవిలాసిని సౌందర్యమునకు మోహించి యుండునేమోయని యూహించి యిట్లంటిని. ఆతఁడు పర కాంతలను ముట్టఁడను కారణంబుననే కాబోలు వానివద్ద నెన్ని చెడుగు లున్నను జను లతనిని సదా ప్రశంసించుచుందురు. దీనికేమిగాని యీ యొప్పులకుప్పజాడ నీకేమైనను దెలిసినదా? నీతండ్రియొకటియు నే నొకటియుఁ గాదుసుమా! దాఁచక యథార్థము చెప్పుము.

అట్లనుడు ఫజీ లొక్కింత నిదానించి పెట్టెఁ దెప్పించి యందలిజాబు తీసి పకీరుచేతి కందిచ్చెను. అతం డది యొగాదిగఁ జూచి యిట్లనియె. “నేనను కొన్నట్లును దలంచునట్లునే యాపెచిత్తమున్నది. ఇంక నాయొమ్మెలాడి నిన్నుఁ గలియుననుటకు సంశయింపఁబనిలేదు. శివాజి ప్రస్తుతము ప్రతాపగడలో లే నట్లు వినుచున్నాము కావున నిదేమంచిసమయము. తగినవాండ్రనుబంపి యాపె నిటకు భద్రముగాఁ దెప్పింపుము” నావుడు ఫజీలు తాను గమ్మఁ దెచ్చినవానిచేతికి నుంగరముతోపాటు జాబు నొసంగినసంగతియు నా

వెనుక నొకయుద్ధముచారులఁ బ్రతాపగడకుఁ బనిచినసంగతియు నెఱింగించి ఫకీరుని గొన్నాళ్ళు తమయింట నుండుమని బహువిధములఁ బ్రార్థించి యతం డందుల కీయకొనుఁడు నాయనతోఁ గలసి శివాజిని జంపుటకుఁ బ్రభావతిని రాబట్టుకొంటకు దగినయాలోచనలు చేయుచుండెను.

# పందొమ్మిదవ ప్రకరణము.



బిజాపురిసుల్తానుతల్లి క్షయవ్యాధిచేఁ జాలకాలమునుండి బాధపడుచుం డెను. ఇట్టి దీర్ఘజాడ్యమునకుఁ దోడు క్రొత్తగా వత్సరద్వయమునుండి కడుపునొప్పి యొకటి దొరికించుకొని పీడించుచు నాసెను సగముచేసి మంచ ము పట్టించెను. సుల్తానుపేర్మి నెంద ఱెందఱనో ఘనవైద్యులను రప్పించియు లక్షలకొలంది విలువచేయు నౌషధము లిప్పించియు నెక్కింతయుఁ గార్య ములేక నిరాశుఁడై యుంట కాక తద్విచారమునఁ దానుగూడ మంచమెక్కు స్థితిలోనికి దిగుచుండెను. వయసు ముదురుటచేతనో మఱికారణములచేతనో కాని నానాటికి కాసెను శూలరోగము మఱింతయెచ్చి రేపో నేడో యను స్థితికిఁ దెచ్చుచుండెను. చిన్నవాఁడైన సుల్తానునకు జననియవస్థవలన నేమి యు మతిస్థిమితములేక రాజ్యభారంబెల్ల మంత్రులయందుఁ బెట్టి యెట్టులో కాలము గడుపుచుండెను.

ఇట్టియవస్థలోనున్న సుల్తా నొకనాఁడు తనకచేరిగదిలోఁ గూర్చుండి యొకతట్టు తల్లిజాడ్యము నొకవైపు శివాజిపరాక్రమము దన్నుబాధింప నేమి యుఁ దోపక వికలమనస్కుఁడై విచారించుచుండెను. అత్తఱి నటకు ఫజీ లెవ్వియో రాచకార్యములు ప్రసంగించుటకుఁ గాబోలు మహోత్సుకతతో విచ్చేసెను. కాని సుల్తానుస్థితి నవలోకించి చనుదెంచినతఱువాత మాటలాడ కుండఁబోయినఁ బ్రభు వేమియనుమానపడునో యని వితర్కించి యాగది లో నొక్కెడఁ గూర్చుండసాగెను. ఫజీలువచ్చిన నాల్గుక్షణములపిమ్మట సుల్తాను వానిరాక గనిపెట్టి యిట్లు ప్రసంగింపఁ గడంగెను.

సుల్తాను—ఫజీల్! ఎంతసేపై విచ్చేసితివి?

ఫజీలు—నాల్గునిముసములయి.

సుల్తాను—నీవువచ్చినదే యెఱుంగను జుమా !

ఫజీలు—చిత్తము. ఇది కనిపెట్టియే నేనుగూడ—

సుల్తాను—ఏమిచెప్పుదునోయీ ? నిన్న రాత్రి మాయమ్మగారికిఁ జాలఁ దొందరచేసినది.

ఫజీలు—ఇప్పుడు కొంచెము నిమ్మళముగా బీగముగారికున్నదా? పాపము మీతండ్రిగారు కాలముచేసిననాఁటినుండి యామె నాల్గుదినములు లేచి తిరిగినట్లు కనుపించదు. ఎట్టివారి కేదో యొకమనోవ్యాకులము దేవుడు పెట్టియే యున్నాఁడు.

సుల్తాను—గ్రహచారము ? ఇంతకు మాదినము లసామాన్యము. అచ్చట శివాజి మాకోటలు కొల్లగొట్టుచున్నాఁడు. ఇచ్చట మాతల్లిగారు శూలచేఁ దల్లడిల్లుచున్నారు. ఎన్నెన్నో మందు లిప్పించి నాప్రాణము విసిగినది. ఇప్పుడు మరల మన యహమ్మద్ సాహెబుచే నిప్పించుచున్నాము.

ఫజీలు—అహమ్మదు చూడ గొప్ప రాచవైద్యుఁడేకాని యతనిహస్తము మంచిదికాదని నాయభిప్రాయము.

సుల్తాను—అట్లైన మంచివాని నొకని దెప్పింపుము. అహమ్మదునకు మంచి శాస్త్రానుభవము గలదు. నాకుఁ దెలిసినమట్టుకు నీతనికంటె ఘనచికిత్సకులు మనరాజ్యంబున నున్నట్లు వినము.

ఫజీలు—తమ రిట్లు సెలవిచ్చినఁ జెప్పఁజాలను. ఇట్లనుటవలన నహమ్మదు ఘనుఁడు కాడనియు ననుభవశాలికాడనియు నెన్నటికిఁ జెప్ప సాహసింపను. కాని యెందులోనైనను నొకరికంటె నొకరుచూడ నొక్కొకసంగతియందుఁ దెలిసినవారుగా నుందురు.

సుల్తాను—అదినిజమే-వైద్యులని పేరుపెట్టుకొన్నవా రెల్లరిచేత నిప్పించి విసిగినాము. ఈనడుమ వారమురోజులై యౌషధమే లేదు. కాని నిన్నరాత్రి మిక్కిలి యాయాసపడుటచే నేదైన మందిప్పించిన నివారణయగునేమో యని యహమ్మదును మరలఁ బిల్పించితిని.

ఫజీలు—ఏమైనఁ దగ్గుఁదలలోనికి వచ్చినదా?

సుల్తాను—తగ్గుఁదలలేదు హెచ్చుఁదలలేదు. కాని శూలకు మించి దగ్గొకటి దొరికించుకొన్నది.

ఫజీలు—కొండనాలుకకు మందిచ్చిన యున్న నాలుక యూడివచ్చినట్లు పాప మీయవస్థలో నామెకు దగ్గొకటికూడ రావలెనా?

సుల్తాను—ఏమిచేయుదు. మాదినముల వంకర. దానికేమి యీయూరికే లేని కొత్తవైద్యులు వచ్చినారా యేమి?

ఫజీలు—వైద్యులమని పేరుపెట్టుకొని రాలేదుకాని యీనడుమ నొకపకీ రెచ్చటనుండియో యీవీటికి విచ్చేసినాఁడు. అదృష్టమువలన నా కాయ నతో మంచిస్నేహము గలసినది. మాయప్పకు దగ్గులేదుకాని చెప్పరా నికడుపునొప్పిచేఁ బదేండ్లె బాధపడుచునే యుండెడిది.అట్టిజబ్బు పకీ రుమూలికౌషధముచే మూన్నాళ్లలో గుదిరించినాఁడు. నిత్యము కాన్పించుచున్న కడుపునొప్పి యిప్పటికిఁ బదుమూదినములై కనఁ బడలేదు.

సుల్తాను—అట్లైననేమోయీ! నా కిన్నాళ్లనుండి పకీరుసంగతి చెప్పక దాచి నావు. బైరాగులు పకీరులు తిరుగుచుగా వనసంచారముచేయుటచేత వారి కనేకమూలికలు తెలిసియుండును. అదికాక వారివద్ద మంత్రబలము కూడ నుండును. పూర్వము మహమ్మదుగురోజీ చచ్చినవారిని సైతము గొందఱ బ్రతికించినట్లు విందుముకదా! కావున బోయి వేగమ యాప కీరుని దోడ్కొనిరమ్ము.

అంత ఫజీలు సెలవుతీసికొని యేగి యాతురకజోగిని వెంటఁ బెట్టుకొని పావుగంటతఱువాత నక్కచ్చేరిగదికి మరలఁ జేరఁగ్రైను. వీరిరాకను వీక్షించి వెంటనేలేచి సుల్తాను పకీరునకు సలాముగావించి దగిన యాసనము వేయించి విశేషగౌరవించి యాయవనసన్యాసితో నిట్లు సంభాషింపఁదొడంగెను.

సుల్తాను—హాజరత్! తమ దేదేశము? తమరెచ్చటనుండి వచ్చినారు?

పకీరు—పకీరులమగు మాకొక దేశమని పట్నమని నిర్ణయముండునే? ఎల్లసీమలు మాకు నివేశనంబులు. మే మెల్లరకును బంధువులము.

సుల్తాను—తమవలన నొకయుపకార మర్థింపఁగోరి యిటకు రాఁ బ్రార్థించినారము.

పకీరు—మావలన నేమగును? మీరు గోరినయుపకార మేదో సెలవిచ్చినఁ జేయఁగల్గినదైనఁ జూతము.

సుల్తాను—గురోజీ! తమరు వైద్యవిషయములోఁ జాలవట్టుకుఁ దెలిసినవారని వినుచున్నారము. మాయింట నొక వ్యాధిగ్రస్థురాలున్నది. ఆమెను వ్యాధినుండి విముక్తను జేయఁ బ్రార్థితులు.

పకీరు—సుల్తాన్సాహెబ్! మేము వైద్యులముకాము. యేదో మామిత్రులు గోరినప్పుడు చిల్లరమల్లరమందు లొసంగుచుందుము. అదికాక యీవృత్తి మేము పెట్టుకోలేదు.

సుల్తాను—ఏదేని యొకవృత్తి నవలంబించినచో మాలో మీరొకరై యుందురు. కాని యన్నివృత్తులు నన్నివాంఛలు విసర్జించుట నేకదా! తమవంటి పకీరు లెల్లవారికి వందనీయు లగుచున్నారు. నిందుకుండ తొణక దను న్యాయమున మీరు మావద్ద దాచుచున్నారు. కస్తూరిని గుడ్డలో దాచినమాత్రమున దానిపరిమళము దాగునే? తమరు ఫజీలుతల్లికి శూల రోగము బాగుచేయలేదా?

పకీరు—కడుపునొప్పిని బాగుచేసినంతమాత్రమున ఘనవైద్యుల మగుదుమే? ఏదో మాకుఁ దోచిన శుద్ధక్రియచేసినారము. అది యల్లాకృపవల్ల మాకు మాటనిల్చినది.

ఫజీలు—పకీర్జీ! మాటలతో నేటికిఁ బ్రొద్దుపుత్తురు? సుల్తానుతల్లిగారికిఁ బదేండ్లై తుయ యంకురించినది. దానికి మందు లిప్పింపగా నిప్పింపగాఁ బైపెచ్చురెండేండ్లై శూల యొకటి దొరికించుకొని నామెను మంచము పట్టించినది.

సుల్తాను—మందు లిచ్చియిచ్చి మాప్రాణము చిట్టగట్టినది. తమరు మాయెడల దయచేసి తద్వ్యాధి నివారణచేసి పుణ్యముకట్టుకొందురుగాక. "పరోపకారార్థ మిదం శరీర"మ్మను న్యాయమెఱింగిన మీకు వేఱ చెప్పవలెనా ?

పకీరు— మీయాస్థానవైద్యులు మామైఁ గొఱకొఱ లాడుదురేమో యనుభయంబున నింతవఱకు వెనుకఁదీసితిమి. కాని వేఱొకటికాదు. ఈమాత్రముదానికిఁ గాదనవలెనా? ఉపకార మున్న దన్న నూరువిడుచువారము కాము. అల్లామీద భారమువేసి శక్తివంచనలేకుండఁ బాటుపడెదము. ఇందొక మనవిగలదు. దీర్ఘజాడ్యము కావున నిమ్మళించు నప్పటికిఁ గొన్నాళ్ళుపట్టునని దోఁచెడిని. వారముదినములైనను మాయౌషధము సేవింపవలెను. అటుపైని గుణము గనిపించకపోయినచో మఱొకచికిత్సకుని బెట్టుకోవచ్చును. కాని యీనడుమఁ దొందరపడి పెరవారిమందు పోయరాదు. ఇందులకు నొడంబడి వాగ్దానముచేసితిరేని చేతనైనంతదాక ప్రయత్నించిచూతుము.

సుల్తాను—ఒకవారముకాదు పదివారములైనను మీరు తీసికోవచ్చును. సంవత్సరముల నెరఁబడియున్న రోగములు గొజులలో బాగుచేయుమన్న నెవరుమాత్రము చేయఁగలరు. మీరుకోరినప్రకారము నడుచుకొంటకు మా కభ్యంతరము లేదు. ఇంతకుఁ దమబోటివా రూఱక లభింతురా ? ఆశాపాశముక్తులగు మీబోటిమహాత్ములు మాసదనంబులు మెట్టుట సంభవించెనేని సర్వశుభావహమగుటకు సందేహములేదు.

అని యీరీతిని బకీరుతోఁ బ్రసంగించి యప్లజులుకుమారునకు సెలవొసంగి బైరాగిని దోడ్కొని యంతఃపురికి నడిచి యట మంచమునకు బల్లివలె నంటియున్నతల్లిఁ జూపెను. అంత నాపకీరు నాడిపరీక్షచేసి కొంతవఱకు నధైర్యపడియు నానాఁటికిఁ దనకుఁదోఁచిన భేషజమొసంగి యామటు నాఁటి నుండియుఁ గొన్ని వనమూలికలు తెప్పించి వానిలోఁ గొన్నివస్తువులువేసి కషాయము పెట్టించి మోతాదుగాఁ బూటకు రెండుసారులచొప్పున నామెకుఁ

ద్రావించుచుండెను. ఔషధమహత్త్వముచేతనో హస్తమహత్త్వముచేతనో కాని యామెరోగము నానాఁటికిఁ దగ్గుదలలోనికి వచ్చుటయేకాక వారము దినము లైనపిమ్మటనుండియు శూల యెడఁబెట్టి క్షయతగ్గి యామెకుఁ గొంత జవసత్త్వము లోలిఁ గల్గించుచుండెను. ఇట్లు వ్యాధి క్రమక్రమముగా నివారణయగుటయు నాసుల్తాను పెల్లుబ్బి యప్పకీరు దైవసమానుండని యెంచి యాయనతో మైత్రిచేయ సమకట్టి తీరుఁబడి చిక్కినకాలమెల్ల నతనితో ముచ్చటలాడుచుఁ బ్రొద్దుపుచ్చుచుండెను.

పకీరునకు మాటదక్కు యోగముంటవలనను కాలకర్మ పరిపక్వము వలనను క్షయవ్యాధియు నక్కషాయముల మూలమున నెలదినములనాఁటికిఁ జాలభాగము నిమ్మళించి యామెను దొంటివలె నింటఁ దిరుగులాడఁజేసెను. చచ్చినతల్లి బ్రతికివచ్చిన యెంతసంతసింతురో యంతకంటె నెక్కుడు సంతోషించి సుల్తాను పకీరున కేమి కోరిన యదియిచ్చుటకు నిశ్చయించి యొకనాఁడతనిని రావించి యిట్లనియె. "మహానుభావా! యుష్మదీయనిర్హేతుకజాయమాన కటాక్షంబున నస్మజ్జననికిఁ బునర్జన్మముచూడ నీదేహముతోడనే ప్రాప్తించినది. మీఋణంబు నెన్నిజన్మములనెత్తి మీపాదసేవ జేసినను దీర్చుకోఁజాలను. అయినను నాకుఁ గల్గినదానిలో మీ రేమి కోరుకొన్నను సమర్పించుటకు సిద్ధముగానున్నారము." అని యనుటయు దానికి నాపకీరు మందహాసముచేసి యిట్లనియె. "మహారాజ్! కోరికలెల్లఁ జంపుకొనికదా యీపకీరువేసము దాల్చినాము. అట్టిచోఁ గ్రమ్మఱఁ గోరికలలోఁ జిక్కికొని సంసారులతోఁబాటు సుఖదుఃఖముల పాల్పడుటకు నిచ్చగింపము. మాయెడల విశ్వాసముంచుఁడు. అదియే మాకుఁ బదివేలు. మా కొకచోట నత్తి నిల్చుట కూడదు కావున పోయివచ్చెదము. దయయుంచుఁడు." అనిపల్కి సుల్తాను చిన్నఁబోవుట వీక్షించి యతని నోదార్చునట్లు నటించి యిట్లనియె. "మీమనసులో మేమేమియు గ్రహింపలేదని విచారమున్నట్లున్నది. అట్లైన మెక్కాలో యాత్రికులకొఱకు భూరిసత్ర మొకటి కట్టింపవలెనని మా కుద్దేశమున్నది. అది మీపేరుగాఁ గట్టించిన సరే. లేనిచో మీకు దోచినంతసొమ్ము నర్పించితిరేని

నల్వురి ప్రభువులవద్దకుఁ బోయి మదీయసంకల్పము సాంతముగాఁ గొన సాగింతుము.'' నావుడు పకీరునకు నిప్పటిలో ద్రవ్యమొసంగిన మెక్కాకుఁ బోవుననియు నందువలన నతనివిశ్లేషము తటస్థించుననియు నెంచి సుల్తా నిట్లనియె. "మహాత్మా! మాతల్లిగారికి జాడ్యము నిశ్శేషముగాఁ గుదిరినదాక మీ రీరాజధాని విడిచిపోవుట మామతంబుకాదు. మీకుఁ గావలసినంతద్రవ్య మొసంగుటకు సిద్ధముగానున్నాము. మీ రున్నంతకాలము మాతండ్రిని జూచు కొన్నట్లు చూచుకొందుము. వేయేల! యిప్పటిలో మీవియోగంబు మా కధికసంతాపంబు గూర్చుననుటకు సంశయింపఁబనిలేదు. అని నొక్కిచెప్పి పకీరుని దమభవనములోనే నుండఁజేసి యతని కేకొఱంత రాకుండ సుల్తాను స్వయముగాఁ గనుంగొనుచుండెను.

అట్లు పకీరు సుల్తానుభవనములోనేయుండి ప్రభువు తన్నుఁగలిసికొను వేళల వింతవింత ముచ్చట్లును గథలును జమత్కారముగాఁ జెప్పుచు నతని రంజింపఁ జేయుచుండెను. ఈరీతిని సుల్తాను స్వాధీనము చేసికొని యొక్క నాఁడు మంతనంబునఁ బ్రభావతిపై ఫజీలునకు గలవలపును,తన్మిత్త్రము ఖాను దండయాత్రచేసినయంశమును సుల్తానున కెఱింగించెను. అంత సుల్తాను పకీరు మాటలకు నాశ్చర్యపడి వివరముగా ననేకవిషయముల నడిగి తెలిసికొని పదంపడి ప్రసంగవశంబున "ప్రభావతి చక్కదనము మీకేమైనను దెలియునా?'' యని తురకబైరాగి నడిగెను. అతండు నొక్కింత సంశయించి చనువుతీసికొను వానివోలె నటించి విజాపురీశునితో నిట్లనియె. "సాహేబ్ జీ! తండ్రియగు రామోజితోఁ గలసి మనదర్బారునకు విచ్చేసినప్పు డొక్కటి రెండుసారులు నే నాయిందుముఖిఁ జూచియుంటిని. అప్పటిలో దానికిఁ బదేండ్లు సుమా రుండును.'' నావుడు నాపలుకులు విన్నతోడనే సుల్తాను జ్ఞప్తిదెచ్చుకొని "ఏమేమీ! రామోజితనూజయా! అట్లైన నది మావస్తువే! మే మావిలా సినితో నప్పటిలోఁ గలిసి మెలసి యాడుకొనుచుంటిమి'' అని యూరకుం డెను. పకీరు ప్రభువునభిప్రాయము కనిపెట్టి యతనికి వలపుగల్గునట్లు ప్రభావ తిని నఖశిఖపర్యంతమును జమత్కారముగా వర్ణించి పదంపడి యౌవనవల్ల

భునితో నిట్లనియె. "సుల్తాన్జీ! మే మొకరహస్యము చెప్పుచున్నాము. అది వెల్లడిచేయకుండ నుంచవలెను జుడీ! సాముద్రికశాస్త్రములో నాకుఁ గల యనుభూతినిఁబట్టిచూడ నాభువనైకసుందరి ఫజీలునకు దక్కుట దుర్లభము. తమబోటి రాష్ట్రాధిపతుల నేరినో కృతార్థులఁ జేయునని చూపట్టెడిని" అని యీవిధమునఁ బెక్కుసంగతులు విన్నాణంబుగా వాక్రుచ్చుచు నానాఁటికిని సుల్తానునకుఁ బ్రభావతిపై వలపు హెచ్చింపఁజేయుచుంటయేకాక యేమి హేతువుననో కాని జంఝూరుని వశపఱచుకొని బాలాజివిముక్తికై ప్రయత్నించుచుండెను.



# ఇరువదియవ ప్రకరణము.



అట శివాజి తాను ఖానునిజంపినందులకు బిట్టు గినిసి బిజాపురివారు మఱొకదండయాత్రచేయ బ్రయత్నించుచున్నారని చారులవలనఁ దెలిసికొని ప్రభావతిని బ్రతాపగడలోనే భద్రముగానుండఁజేసి తగినంతదండు తీసికొని మరాటతిలకము కోలాపూరుప్రాంతమున విడిసెను. ఆప్రదేశాధిపతియగు పన్హాళాధికారి శివాజితోఁ బోరుటకు మగటిమిలేక యతనివద్ద లంచముపుచ్చుకొని కోట యొప్పగించెను. ఇట్టు లనాయాసముగా లభించిన యీదుర్గమున కణ్ణాజిదత్తుఁ డను లౌకికబ్రాహ్మణుని నేతగా నియమించి యటుపైని పావనగడ వసంతగడ యను దుర్గములు బలిమిని సాధించెను. తఱువాతఁ గృష్ణానది సమీపగ్రామములకుఁబోయి పేష్కుషు వసూలుచేయుచు నచ్చటచ్చట ఠాణాల నేర్పఱుచుచుఁ బదంపడి సన్నిహితపర్వతప్రదేశములలోఁగల రంగణాచిళణాముఖ్యదుర్గములను విశేషప్రయాసముమీఁద లోఁబఱచుకొని తనపైనెత్తివచ్చిన రుస్తుముజమానుని దత్సైనికులకు బదివేలమందిఁ జీల్చిచెండాడి సాహసించి విజాపురితాలుకా సరిహద్దులవఱకుఁ గలపట్నములను బల్లెలను గొల్లగొట్టి శత్రువులచేతిలోఁ బడకుంట చిళణా యను నామాంతరముగల విశాలగడకుఁబోయి చేరుకొనెను. మఱియు నటనుండి గొప్పదండు తోడ్కొనిపోయి సాగరప్రాంతదుర్గములగు రాజాపూరు దాభోలు లోనగువానిని బట్టుకొని యచ్చటిప్రజలవద్దఁ గప్పముఁ గైకొని యట్లు సంపాదించిన విత్తమంతయు రాజగడకుఁ జేర్చి దాను బన్హాళాదుర్గమున కేగెను.

ఇట నీలోఁగాఁ బకీరు తనవాక్చమత్కృతినిజూపి సుల్తానుని వశ్యునిగాఁ జేసికొని యతనికిఁ బ్రభావతిపై మనసు లయింపఁజేసెను. సుల్తాను యౌవనావస్థలో నుంటవలనను బ్రభావతిసోయగంబు మఱికొందఱివలన వినుటజేసి మొదటఁ బకీరు వర్ణించుతఱి నొకతీరుగానుండియుఁ గ్రమక్రమముగా నాము

ద్దులగుమ్మపై వ్యామోహపడి యొక్కనాఁడు తా నేకాంతముగాఁ బకీరుతో నిజమనోభీష్టము వెల్లడించెను. పకీరు తాఁబచరించువాక్కులు దైవవశంబునఁ గందర్పబాణములై సుల్తానుహృదయంబున నాటుకొని తచ్చిత్తము మెత్తఁబడఁజేసి నందులకు నెంతయు లోలోనసంతసమంది మఱియు నవాబునకుఁ బురెక్కింపఁ దలంచి తియ్యఁగా నిట్లు మాటలాడఁ దొడంగెను. "నబాబుసాహేబ్! అట్టి శ్వర్యసంపత్తిని ఢిల్లీచక్రవర్తితో సమానులగు మీర లాసింపరానివస్తు వుండదనియే నొక్కి వక్కాణింపఁగలము. మీబోటివారు ప్రభావతి నపేక్షించుటయాసుందరి పూర్వకృతపుణ్యమేతక్క వేఱొకటికాదు. దేశాధీశులగు మీరు నిజముగా నిచ్ఛగింతురేని పరరాజ్యంబులవంటివి సునాయాసముగా స్వాధీనమగుచుండ నొక్కయింతిమాట చెప్పనేల? తొల్లి జయిపూరు జాట్పూరురాజులంతటివార లక్బరుచక్రవర్తికిఁ దమకూఁతుల నొసంగి తత్సన్మానమువడసి తోడి రాజులలో వాసికెక్కిరికదా? అట్టిచోఁ దాతలనుండి మీయన్నము తినుచున్న రామోజి సామాన్యుఁడగు ఖానుకుమారునికిచ్చుట కొల్లకుండెనుగాని దేశాధీశులు మీబోటివార లపేక్షించితిరేని యేల యయిష్టపడును? సిరిరా మోకాలొడ్డుకొను గోలయుండునే? ఒకవేళ నతఁడిష్టపడకున్నను శివాజిని స్వాధీనపఱచుకొని మీకోర్కె నెఱవేర్చుకోవచ్చును. ఇప్పటి కాచందనగంధి యొక్కని వరించినట్లు వినరాదు. కాని తమరు తోడ్తో నీప్రయత్నముచేసినచోఁ బ్రభావతి మీపాలౌట కెందును సందియములేదు. ఆకాంత యొకరివస్తువుకాలేదు కాన మీ రపేక్షించుట దోషములోనిదికాదు. అక్బరు హిందూమహమ్మదీయులకు సంబంధబాంధవ్యములు నెఱిపినగాని పరస్పరమైత్రి యలవడదనియు నట్టి మైత్రిచేకూటినఁ బాతపగలుమఱచి యుభయులు వర్ధిల్లుదురనియు నెంచియేకదా యిశ్వప్రయత్నముచేసి యట్టిపెండ్లిండ్లు కొన్నికావించినాఁడు. కాని తదనంతరమున నాయుద్యమము నభివృద్ధిచేసినప్రభులు లేకపోయిరి. ఇప్పుడు మీ రిట్టిప్రయత్నముచేసి మరాటులకును మనపఠానులకు సంబంధములు కల్పింతురేని మరాటులు మనవా రగుదురు. దాన మొగలులవలనిభయము మీ కెంతమాత్రము గల్గనేరదు. రాజావలంబనమున్నచో నెట్టిదుష్కరకార్యమైనను

సుసాధ్యపడును. మీరు మొదట ఈవివాహము గావించుకొంటిరేని పిదప ననేకో ద్వాహములు వానియంతట నవియేజఱుగును.'' అని యీరీతిగా బకీరు చెప్పు నుపన్యాసమునకు సుల్తాను మెచ్చుకొని తా నట్లుచేయుట దోషములేదనియు లాభకారియౌననియు నిశ్చయించెను. కాని తా నెట్లు ప్రయత్నము చేయవలెనో యెఱుంగక పకీరునిజూచి యిట్లనియె.“మహాత్మా! మా యీకోర్కి యెట్లు ప్రయత్నించిన సానుకూలపడునో తమరే విచారించి చెప్పవలసినది. మీమాటవలననే మాహృదయములో నంకురించిన యీకోరిక యీరెకలెత్తి ఫలింపఁజేయు భారము నా పూర్తిగ మీమీద వేసితిమి. తమరు ఈపటినుండియుమా భవనంబులో నిల్వవలసినదని మాప్రార్థన. మీ కేమికావలసిన నది సమర్పించుటకు సిద్ధము గా నున్నాము'' అనుటయు నాపకీరు మందహాసముచేసి యిట్లనియె. “ప్రభువరా! మీరు కోట్లకొలంది నిచ్చినను బుచ్చుకొనువారము కాము. ఇంతకుఁ దీసికొనిపోయిమాత్ర మెవరికిఁ బెట్టవలెను. మా కిష్టులును శిష్యులు నగువారి క్షేమముతక్క వేఱొండు వాంఛయుండునని యెన్నటికి నూహింపకుఁడు. సర్వ పదార్థసన్యాసమే పకీరుధర్మము. అట్టియెడ మాకు వాంఛలతోఁబనియేమి? మీరు వయస్సునఁ జిన్నవారు గాన నిట్లంటిరి. దానికేమి స్నేహముగలిగినచో ట్లమీరు మమ్మనన్నను మిమ్ము మేమన్నను సహించుకోవలెను. నిశ్చయముగాఁ బ్రభావతి కరంబు గ్రహింప నెంచితిరేని మీ కొకరియాలోచనతోఁ బనియేమి? మీరు రామోజి నిచ్చోటికి రప్పించి యతని కాశచూపించి మీవాంఛితం బెఱింగించితిరేని యతండు తప్పక మీచెప్పినట్లు వర్తించును. రాజాధిరాజు లగు మీ రీస్వల్పవిషయములో నొకరిసాయము వేడవలెనా? సంకల్పసిద్ధు లనఁగా మీబోంట్లుతక్క వేఱె యన్యులున్నారా? రామోజిని రావించు యత్నము కావింపుఁడు. అట్లచేసితిరేని మీయభీష్టము సిద్ధించును.'' అని యనుటయు నదివిని సుల్తాను “రామోజి శివాజి పక్షముచేరియున్నాఁడు కదా! అట్టివాఁ డెటు మనల నమ్మియుటకువచ్చును.'' అని ప్రశ్నించుటయు దాని కొక్కింతసేపాలోచించి యాజోగి యిట్లనియె. “ప్రభువర్యా! మీ రానతిచ్చినదెల్ల నిజమేకాని విశ్వాసపాత్రులగు మీసేవకులలో నొకని

చేతికి జాబునిచ్చిపంపినచో రామోజి రాఁగలఁడు. ఇంతకుఁదప్ప నెవ్వరుమాత్రమేమిచేయఁగలరు? '' అనిసమాధానముచెప్పి యూరకుండిన నటుమీఁద సుల్తానునకు నెవ్వరినంపుటకుఁ దోపక పకీరునుద్దేశించి తిరుగనిట్లనియె. '' ఓలోకబంధూ ! మామనోభీష్ట మన్యులకు నెఱిఁగింపరాదు సుడీ ! మనయత్నము నైకిమాత్రము ఫజీలునకనియే చేయవలెను. కానిచోఁ బెక్కనర్థము లొడఁగూడును. ఓహో! ఇప్పుడెవరచేతికిచ్చి యుత్తరముపంపుటకుఁ బాల్పోకుండనున్నది. మొదట నతఁడెచ్చటనున్నాఁడో తెలియదు. మీరు సకలజ్ఞులగుమహానుభావులరు. మీ కెఱుంగరాని యుపాయమున్నదే? ఈవిషయములో మీరు తటస్థభావమువహించిన యత్నము సఫలీకృతంబౌట దుర్లభము. అట్టిచో యత్నించిన నేమిప్రయోజనము? కావున దయచెసి మీ రేదైన తగినయుపాయంబు యోజించి యానతిండు. (అట్లే) నడుచుకొనువారము'' అని దైన్యముతో వేడుకొంటయు నంతఁ బకీరు దీర్ఘాలోచన గావించినట్లు క్రిందికి మీదికొక్కింతసేపుచూచి యటుపైని మెల్లఁగానిట్లనియె. ''సుల్తానుబహద్దూర్! మీరింతవిధేయతతో నడుగుచున్నప్పుడు తోచినంతమట్టుకు జెప్పకుంట పాడిగాదు. మీ కారాగృహములో బాలాజిరావను మరాటకుమారుం డున్నవాఁడు. నాఁటిదండయాత్రవేళ ఖానుఁ డతనిం దగినంతకారణములేకయే బందీకృతునిజేసి యిటకుఁ బంపించినాఁడు. అదిమొద లాసుకుమారుండు దురంతచింతనుమునిగి కృశించుచున్నాఁడు. ఒకనాఁడు ప్రసంగవశంబున నే నతని నెవ్వఁడోయని తెలిసికోఁగోరి పలుకరింపగాఁ దాను బ్రభావతికిఁ బెద్దతండ్రికుమారుండననియు నారూపవతినిదాచిపెట్టితినను ననుమానముమీఁద ఖాను తన్నుఁ జెఱఁబెట్టెననియు నెఱింగించెను. వానింబిల్చి మనకేమైన సాయముచేయునేమో యడిగి చూతము'' అని యింక నేమో మాటలాడఁబోవుచుండఁ బఠానప్రభువు నడుమ దూరి యిట్లనియె. ''ధీనిధీ ! మీరు సెలవిచ్చినదానిలో నొక్కింతసంశయము గలదు. అతఁడు కడుఁజక్కనివాఁడని వింటిమి. అదేనిజమైన మనమాతనిఁ బంపినచో మనసెపంబున నాతఁడు ప్రభావతినిఁ జెట్టవట్టునేమోయని దిగులొందుచున్నాను'' అనినవిని పకీరు మర్ఘూరే! మీరు హిందూపద్ధతి నెఱుంగక మాటలాడుచున్నారు. వారు మనమాడ్కి పెదతండ్రిపినతండ్రికూఁతుల గ్రహిం

పరు. వారి కదిచాలతప్పు వారు వారినక్కచెల్లండ్రవావిని జూచుకొందురు. అని సుల్తానునకు నచ్చఁజెప్పిన నమ్మాటలుపాటించి బాలాజి నచ్చోటికి రప్పించి సంకెళ్లెడలించి సుల్తాను తగినమాటలచే నతని ననునయించెను. తరువాత నమ్మువ్వురు నిట్లు సంభాషించిరి.

సుల్తాను—ఓయీ! నీపేరేమి? నీవెవ్వరిపుత్రుండవు? ఏమికారణంబునఁ జెఱ నుంపఁబడితివి?

బాలాజి—నవాబ్ సాహేబ్! నాపేరు బాలాజియందురు. బాజీపరభు నందనుండను. శివాజి రాజుచేయు దేవపూజలకై పయనమైపోవుచుండ నాదారిలో నన్నును నాతోపాటు మఱిముగ్గురని ఖాను సర్దారులలో నొక్కండు తనసేనతో నరుదెంచి యడ్డగించి పెడరెక్కలు విఱుగఁగట్టి ఖానునికట్టెదుటకుఁ గొంపోయిరి. అత్తఱి ఖానుఁడు మానల్వురను వేఱ్వేఱపిల్చి ప్రభావతి యెచ్చటనున్నదో తెలియఁజేయవలసినదని నిర్బంధపెట్టెను. అప్పుడు మాలోనొక్కండు తనకుఁ దెలిసినవో తెలియనివో కొన్నిమాటలుచెప్పి వారినుండి తప్పించుకొనిపోయెను కాని నేనును దక్కినయిద్దఱును మాకాయెలనాఁగసంగతి తెలియదని పలికితిమి. దానికాగ్రహించి ఖానుఁడు మాముగ్గురనుబంధించి రెండునాళ్లపిదప నే కారణముననో వారినిమట్టుకు విడుదలచేసి నన్నుమాత్రమిటకుఁ బంపించినాఁడు. ఇంతకుమించ నేఁజేసినయపరాధమేమో నాకుఁ దెలియదు. మాయమ్మచేసికొన్న సుకృతమూలమున మీతో నేఁడుమాటలాడఁ దటస్థించినది.

సుల్తాను—ప్రభావతికి నీకు నెట్టిసంబంధమైన నున్నదా?

బాలాజి—ఆతరుణి మాపినతండ్రికూఁతురు.

సుల్తాను—ఇందుకొఱకే ఖాను నిన్ను బంధించియుండనోపు. దానికేమి? అట్లైన నీవు రామోజి నెఱింగియేయుందువుకదా?

బాలాజి—చిత్తము ఎఱుంగుదును.

పకీరు—బాలాజీ! ఆతఁ డిప్పు డెచ్చటనున్నాఁడో యెఱుంగుదువా ?

బాలాజి—రామోజి ప్రతాపగడలోనో లేక పన్హాళాపురిలోనేతఱుచుండును కాని యిప్పుడిన్నాళ్లుగా నీకోనలోఁ బడియున్న వాని కాతనిసంగతి యెట్లు తెలియును?

సుల్తాను—నీకుఁ బ్రభావతికిని పరిచయమున్న దా ?

బాలాజి—ప్రభావతి వ్యక్తురాలైనపిమ్మటఁ దఱుచుమాటలాడి యుండలేదు కాని యంతకుఁబూర్వము నాకొక్కింత చనువుగల్గి యుండెడిది.

సుల్తాను—నిన్ను నకారణముగాఁ గారాగృహమున వసింపఁజేసినసంగతి మాకీ పకీరుమూలమునఁ దెలిసినది. నీ కింక నవశ్యము ముక్తి యొసంగెదము. కాని నీవు మాకొక యుపకారము చేయవలసియున్న ది. అదిచేసిన నీకును మీ వారికిని దగినంత గౌరవసన్మానములు చేసి శాశ్వత జీవనోపాధులు కల్పింతుము.

బాలాజి.—నేనేమి! దేశాధీశులైన దేవరవారేమి? మీబోంట్ల కుపకారము చేసెడిభాగ్యము నాకీజన్మములో నబ్బునే?— అయినను మీబోంట్లర్థించినప్పుడు చేతనైనంతసాయము చేయకుందునా ?

పకీరు—ఓయీ! వారు కోరిన యుపకారము చేసినచో వారి సన్నిహిత బంధుఁడవై యిహలోకభాగ్యంబులు పొందెదవు. నిన్నే హేతువునఁ జెఱపెట్టిరో విమర్శింపకయే నిన్ను విడుదలచేయనున్న సుల్తానుగారి యౌదార్యము కనిపెట్టితివికదా? నీవు వారు కోరినప్రకారము వర్తించి నీకృతజ్ఞత్వము జూపుకొమ్మ.

బాలాజి—భాగ్యము.

సుల్తాను—ఓయీ ! మే మొకయు త్తరమిత్తుము. దాని నెవ్వరు నెఱుంగకుండఁ దీసికొనిపోయి రామోజి కీవలెను. ఆతని నెల్లైన నొడంబఱచి భువనసుందరి యని పొగడ్తకెక్కినప్రభావతిని మాకుఁ గూర్పవలెను. నీ వీమాత్ర ముపకారముచేసితివేని నాడు జహాంగీరు నూర్జహానునిఁ జేపట్టి

తదీయులను దండనాయకాదులఁ జేసినట్లు తగినన్ని జాగీరులిచ్చి మీరా రామోజిని మాయంతవారిఁగాఁ జేసెదము.

బాలాజి—మా కీవిషయమై యింతదూరము చెప్పవలెనా? ఐనను దమ కీవిషయములో నొక్క సంగతి జెప్పవలసియున్నది. సావధానులై చిత్తగింపుఁడు. ఫజీలు మీకోరినయింతికై మున్నెన్నో ప్రయత్నములుసల్పియు నెగ్గలేక తుదకు తండ్రితోఁ జెప్పిన నతండు కొడుకు ముద్దు చెల్లించుటకై మొన్న టిదండయాత్ర కల్పించినాఁడు. ఇప్పుడు ఫజీలు మీరుచేయు ప్రయత్నమునకు నడ్డు దూరకుండఁ జూతురేని నాచూపిన తెఱంగునఁ జక్క బెట్టుటకు సిద్ధము గానున్నాఁడను. ఇట్లంటినని యన్యథాభావింపకుఁడు. ఫజీలు నాకట్టితి రేని శీఘ్రముగా దేవరకార్యము సాధించికొనివత్తును. రామోజికిఁ దనపట్టిని ఫజీలునకిచ్చుటకు లేశమాత్రమిష్టములేదు. నిజముగా-

సుల్తాను—ఓయీ నీవు మాకార్యమువిషయమై పని పూనినప్పుడు తగినబందోబస్తు చేయకుందుమా? నీవింతఁగా జెప్పవలసిన యవసరములేదు. ఎందులకేని మంచిది మాకాంజహానుని దోడ్కొని నీ వీదినమే పొమ్ము.

అని యొకయుత్తరమువ్రాసి బాలాజిచేతికిచ్చి సుల్తాను క్రమ్మఱ నిట్లనియె.

సుల్తాను—నీకడనుండి యుత్తరము వచ్చుదాక మాకేమియు దోపదు సుమీ! కాంజహాను కడుఁదక్కరి. వీడు నీకుఁ జేదోడువాదోడునైయుండును. నీవువచ్చుటకు వీలులేనివేళల వీనివలన మాకుఁ గబురందఁజేయవలెను.

పకీరు—ఆలస్యముచేయక, పోయినవెంటనే రామోజి యభిప్రాయము కనుంగొని పిదప వీలైనఁ బ్రభావతిచిత్త మెట్లున్నదో తెలిసికొని కమ్మ వ్రాసి పంపవలెనుఁ జుమా? సుల్తానుగారుచేసిన మేలు మఱువకుమా? చేయనున్న మేలు త్వరలోఁ బొందుదువు గాక.

అని యీవిధమున పకీరు సుల్తానులు పరభుకుమారుని బొమ్మని యాన

చ్చిన నతండును వారియొద్ద సెలవుతీసికొని తా నింక జననీజనకులను మనోనాయికను జూడఁగల్గుభాగ్యము తటస్థించెఁగదా యనియుప్పొంగుచు, తనవిషయమున పకీరుచూపిన యౌదార్యమునకును జేసినతంత్రమునకు నమ్మహోపకారిని బ్రశంసించుచు ఖాంజహానునిఁ దోడ్కొని యాదినమే ప్రయాణము సాగించెను.



# ఇరువదియొకటవ ప్రకరణము.



"ఓసీ మంజువాణీ! నా కీయాధివ్యాధులు నాతోఁ బోవలసినవే సుమీ? తల్లిదండ్రుల బంధవిముక్తి విని నాప్రియుండుఁగూడ విడుదలయై యుండు ననియనుకొని కొండంతగాఁ బొంగితిని. కాని క్రూరతురుష్కులాధమనైకసుందరుని విజాపురిబందికానాలోఁ బడవైచినారట. కటకటా నాటినుండి యమ్మహానుభావుండు పడుచున్న పాట్లింతంతని చెప్పరాదు. నన్నీతండు రెండుమాఱు లుపద్రవములనుండి తప్పించెనే కాని యిస్సిరో! నే నాతని కొక్కింతసాయము చేయలేకపోతినిగదా! ఇంక నాజన్మ మెందులకే? పాప మాపూజారి మా కొఱకై యెంతలేసి శ్రమపడుచున్నాఁడో నీవెఱుంగుదువుకదా! ఇప్పు డప్పరోపకారిజాడగూడఁ బెక్కుదినంబులై వినరాకున్నది. అయ్యయ్యో! నా పడువిప్లవంబులకుఁ బ్లకంబయి తోడుపడిన యాసుగుణశాలిని నింకెన్నఁడైనను జూతునో లేదో కదా! ఆనేత్రపద్మములసౌరు నా లలాటవిలాసము నా ముఖవిలాసము నాయెగుభుజంబులవైఖరియు నావక్షస్థలవిశాలమును నే నే పురుషునందును జూడలేదుసుమీ? అట్టి భూలోకమన్మథుని వివాహముకాని నాడు వజ్రము నూఱుకొనికాని విషముద్రావికాని ప్రాణత్యాగము చేసికొనెదను. ఆకారమునకుఁ దోడు విద్యాబుద్ధులు, శౌర్యస్థైర్యములు గల్గియున్న యాసుకుమారదేహుఁడు పంచాగ్నిమధ్యమున గ్రాగినట్లు శత్రువులమధ్యను జిక్కి యిట్లు క్రుగ్గవలసినదేనా? రూపగుణసంపన్నుండగు నామనోహరు నిట్టిపాట్లు పడఁ జేసిన యక్కట్టడివిధాత నెంతదిట్టినను బాపముండునే? ఆవన్నెకానిఁ గలసికొని సుఖించుభాగ్యము నా కింక లభింపదు కాఁబోలు? అయ్యో! నే నెంత మందబుద్ధినే? యవనుల నడుమనుండి తప్పించుకొంటకుఁ ద్వరపడితినిగాని నాప్రభుకుమారునితో నట నే యుండిపోయిన నీ వియోగావస్థ లేకపోయినదేకదా? ఇసీ! అట నతండు చెఱలో వేగుచుండ

నేనుమాత్ర మింటఁ జక్కఁగాఁ గాలము వెళ్ళఁ బుచ్చుచున్నాను. ఇంత కంటెఁ గతియు రాలుండునే? ఇన్నాళ్లాయె నాతండ్రి రామోజీసంగతియు బాజీపరభువర్తమానమును దెలియదయ్యె. హా హా! ఇంకను నెంద టెందఱు నాకొఱకు నిక్కట్టు లొందవలసివచ్చునో కదా? ఛీ! యింక నే నా హారము తీసికొనక మంచముపైనే ప్రాణములు విడిచెదను గాక—అయ్యయ్యో నాకేమో యాయాసమగుచున్నదే? ఔనే! మాయప్ప నెక్కడమూఱు రమ్మనవే?'' అని యిట్లు మాటలాడుచునే మంచముమీఁదఁ గూర్చుండిన ప్రభావతి వెనుకకు నొరఁగఁజొచ్చెను. మంజువాణి యంతటఁ దటాలున లేచి యామె తలక్రిందికిఁ జేవైచి సమముగాఁ బరుండఁజేసి యామెతల్లి యగు లలితాదేవిని బిల్చుటకుఁగాను గదివెలుపలికి వచ్చెను.

ఆసమయమున నొక్కఁడు రామోజీగృహముకు వెదకికొనుచువచ్చి యటఁ దారసిల్లినమంజువాణినిఁజూచి "ఇదేకా రామోజీగారిల్లు?'' అనిన మంజువాణియు నౌ నిదేయని లోనికి రమ్మనిపిల్చి వానివృత్తాంతమడుగుడు వా డిట్లనియె. "నే శివాజీవేగులవాఁడను నాపేరు భేతాలుఁడందురు. ఓ చెలియా! రామోజీగా రెక్కడ నున్నారు? ప్రభావతి కొకమేలువార్త నెఱుఁగఁజేయవచ్చెసినాను'' ఆమె వానిమాటలకు బదులుచెప్పకయే ప్రభావతిమందిరమునకుఁ దీసికొనిపోయెను. ఈసందడివిని లోపలినుండి లలితాదేవియు నచ్చోటికివచ్చి వాని రాకకు హేతువు మంజువాణివలనఁ దెలిసికొని యట నొకచాపవేయించి వానిం గూర్చుండఁజేసి యిట్లనియె. "ఓయీ భేతాలా! ఇదిగో యిటఁ బండుకొనియున్నదేసుమీ మాపట్టిప్రభావతి. మగవా రింటలేరు. నీవు చెప్పఁదలఁచుకొన్నదేదో యెఱింగింపుము. అనవుడు వాఁడు మెల్లగా "మీప్రభావతి కిష్టుండగు బాలాజీ విజాపురినుండి యెట్లోతప్పించుకొని యీయూరికి వచ్చియున్నాఁడు. అమ్మనోహరాంగునిజూడ నిచ్ఛగింతురేని యిప్పుడేయిటకుఁ దీసికొనివత్తును'' అని యూరకుండెను. అదివిని మంజువాణి "అమ్మక్క! మనకష్టములు తీఱి యింక బ్రతికినారమని కెవ్వునఁ గేకవేసెను. లలితాదేవియు మంజువాణితోఁ బాటు సంతోషించెను. శ్రవణానందదాయకములగు భేతాలునివాక్కుల నాలించినతత్క్షణమే మాటలాడుటకుఁగూడ శక్తిచాలక సెజ్జపైఁబవ్వళించియున్న

యప్పద్మాక్షి చివాలునలేచి కూర్చుండి " ఏమేమీ! నాప్రాణవల్లభుం డిటకు నిజముగా విజయముచేసియున్నాఁడా! అమ్మా! వీనికేమైనను దగినబహుమాన ముచేసి మీాయల్లువాని మనయింటికిఁ దెప్పింపరాదే? '' అని నయనములనుండి సంతోషాశ్రువులు జాఱవిడిచి పరవశయైయుండెను. తల్లియుఁ దనముద్దుపట్టి గోరినట్లు బేతాలునికి విలువగల ముత్యాలహారము నొకటియొసంగి "యిప్పుడే బాలాజిని దోడ్కొనిరావలసిన,'' దని చెప్పి వానిననిపి తాను నైపనులేవో చూచుకొంటకు లోనికిఁ బోయెను.

ఇంతలోఁ గర్మసాక్షియగు దినరాజు తనకాలమ్మునఁ బ్రాణికోటిసల్పు పాపంబులు తన్నంటకుంటకై యెప్పటివలెఁ బశ్చిమాబ్ధికిం గ్రుంకులిడఁబోయె ను. అంత రాజు లేనిసమయంబు కనిపెట్టినలుదెసలనుండి తిమిరతస్కరులు చెల రేగుటంజేసి యరాజకమ్ము ప్రబలసాగెను. ఇదియెఱింగి రేరాజు సహింపఁజా లక తనరాజత్వంబు సార్థకంబుగాఁ బ్రాగ్దిశనుండి బయలువెడలి వాడిమయూ ఖంబులు కోటానుకోట్లు ప్రయోగించి యయ్యంధకారచోరులఁ బోకార్చి నె మ్మదిగాఁ బరిపాలింపఁ దొడంగెను.

ఈలో మంజువాణి ప్రభావతికి మొగలిరేకులతో జడవేసి మేలిమి సొమ్ములుగైసేసి యిట్లుతగిన ముస్తాబుచేసి తన్మందిరము శుభ్రపఱచి పొందుగఁ దివాసులుపఱచి రకరకంపుదీపకళికలచే దాని నలంకరింపఁజేసెను. ఇట్లు లలంకరింపఁబడిన యామందిరము తళుకు తళుకుమని తారకలువలెఁ బ్రకాశించు దీపకళికలచేతను, ఆనడుమఁ జంద్రబింబమువంటి భాసమానమైన ప్రభావతి ము ఖలావణ్యముచేతను రెండవరోదసిమాదిరిఁ జూపట్టుచు విశ్వామిత్రసృష్టినొక్కిం త స్మృతికిఁ దేఁగల్గెను.

" ఇప్పుడే నాప్రియుని దోడ్తెత్తుననిపోయిన, భేతాళుం డింకను రాకుం టకు నేమిహేతువైయుండునే? చెలీ! నిజముగా నాలోకైకసుందరుఁ డూ రికి విచ్చేసియుండునే? ఆభూలోకప్రద్యుమ్నుం డీరాత్రి యిటకువచ్చెనేని నాకోరికి లీరికలెత్తి పదంపడి ఫలించుననుటకు సందియములేదు. నాలోచన చకోరములకు నాపరభృతిలకుని ముఖసుధాకరబింబము బ్రదర్శించుభాగ్య

మబ్బె నేని తద్వచనామృతధారలచే నాతనుతాపము చల్లారును గదా? ఇట్టి మన్మథమన్మథు నగ్నిసాక్షిగాఁ బరిణయంబైన నాడుకదా! నా జననంబు సఫలంబగుటయు మొగి భూలోకసౌఖ్యంబు లనుభవించుటయుఁ బొసంగెను. ఆకళానిధిరాక విన్నది మొదలదియేమోకాని కృశించియున్న నాతనువునకు జవసత్వాదు లంకురించినవి. ఆయనపునర్దర్శనము నాకిమ్మెయిఁ బునర్జన్మముగాఁ బరిణమించుచున్నది. ఓసీ! నీతోఁ జెప్పలేదుకాని నిన్నరాత్రి నాల్గవజామున నస్మహానుభావుని గలలో దర్శించియుంటినిజుమీ! అప్పటినుండియు నాసవ్యనేత్రమును వామభుజంబు నదురుచునేయున్నవి. కలలు కల్లలని కొందఱం దురు కాని చూచితే యీస్వప్నము సద్యఃఫలమిచ్చినది. నే నీదిన మింతవఱ కును బలుతెఱంగులఁ గలవరించుటకు రాత్రికలయే సుమీ కారణము."

శా. ఆవిద్యోన్నతి యాసుధారసవచోన్యాపార మాశాంత మా
భావప్రక్రియ యాకృపాతిశయ మాప్రజ్ఞాధురీణత్వ మా
ప్రావీణ్యైకవిశేష మావినయసంపన్నత్వ మాయార్జవం
బావిఖ్యాతునియందుఁ దక్కఁ బరులం దమ్మక్క నేఁ జూడనే?

అని ప్రభావతి యిట్లు తనహృత్కమలవల్లభునిగుణంబులు లెక్కించుచు నా పురుషోత్తముని గన్నులకఱువుదీఱఁ గాంచుటెప్పుడగునో కాంచి మనసుదీఱ ముచ్చటలాడుటెన్నఁడగునోయని యువ్విళ్లూరుచుండెను. ఆసమయమున గాలిచే రెండుసారులు చావిడితల్పు త్రోయఁబడుటయు నది ప్రియునిరాకయేయని సంబరపడి చెలికత్తెను గనుంగొనుటకుఁ బుత్తెంచుచుఁ దా ననుకొన్నట్లు కానం దులకు విసుగుకొనుచుండెను. మఱియు నిక్కముగాఁ దనమనోహరుండు వచ్చెనో లేక తన్ను వంచించుటకు నేరేని భేతాళునిబుత్తెంచిరోయని పలుతెఱంగుల నూహించుచుఁ జీకాకుపడుచుండెను. అంతఁ గొంతసేపటికిఁ దిఱుగ నాచావడి తలుపు త్రోచినచప్పుడుకాగాఁ బ్రియునిరాకయే యైయుండునని యటకు మంజువాణి ననిపి యవల బాలాజి మంజువాణిని బలుకరించినపలుకులు చెవులం బడఁగా నే మిన్నుముట్టిన యానందముతోఁ దల్పమ్మునుండి దిగ్గనలేచి యొక్క ప్రక్కకు నొదిగి నిలువంబడెను. అప్పు డొగి మంజువాణి వెంబడివచ్చుచున్న

మ్లేచ్ఛగ్రహవిముక్తుఁడైన పరభుచంద్రునిముఖంబుఁ బొడసూపఁగానే యాపెకుఁ దనువెల్లను బులకలెత్తి హృదయంబు దడదడఁగొట్టుకొనసాగెను.

ఆపరభుకుమారుఁడు దీపకళికామధ్యమున మహోజ్జ్వలఖండభూరిదీపికవలె ప్రభాసిల్లుచున్న సౌందర్యతిలకయగు ప్రభావతిఁ బొడఁగాంచెను. చిరకాలమై చూచియుంటఁగాబోలు తా నింతకుముం దెన్నఁడుఁ జూడనివారిభంగి రెప్పవేయక యనిమిషత్వంబువహించి యాసుందరాంగి లావణ్యామృతము తృప్తిఁదీఱ గ్రోలుచు మైమఱచి యానందరసాబ్ధిఁ దేలుచుండెను. ఆశృంగారవతియు నప్పుడు మదనుతూపులకుఁ దీటగువాలుఁజూపులఁ బఱపి యాతని పుండరీకవీక్షణంబులకుఁ గులుకుచు విశాలవక్షమునకు మురియుచు నుత్తుంగభుజంబుల కుప్పొంగుచు నంగసౌష్ఠవమునకు మెచ్చుకొనుచు నట్లు తదీయరూపమనుభవించుచు నొక్కింతసేపు గడపెను. మంజువాణియు నయ్యువపురుని దన రెండుకన్నులతోఁజూచుచు నుభయులలో నెవ్వరు చక్కనిమక్కలోఁ దెలుసుకొనఁగోరియు నిరూపింపలేక రతిమన్మథులే యిట్లవతరించిరని యూహించుచు వారితో నొక్కింతసేపు తానుఁ బరవశమంది యొక్కసితము తెచ్చి యం దానవరతివల్లభు నాసీనుంగమ్మని ప్రార్థించుటయు నవ్వేడికో లతండు సమ్మతించి యధివసించి పిమ్మట మంజువాణి నుద్దేశించి "మీసకియ సుకముగానున్నదా? మాన్యులగు లలితాదేవియు రామోజీయుఁ దక్కఁగలబంధుగులు కుశలులైయున్నారా? మనపూజారికుటుంబ మిప్పుడెక్కడనున్నది? అని పలుకరించిన నాచెలికత్తెయుఁ దగురీతి జవాబుచెప్పెను. పూజారికుటుంబము సంగతి ప్రియుండెత్తినతటిఁ బూజారిమాట మనసులోఁబడి యాయన క్షేమము నడిగి తెలిసికొనఁగోరి సిగ్గువెనుకకులాగుచుండ నొక్కింతసేపూగులాడుచున్న మనసుతో మాటలాడఁజాలక యెట్టకేలకు నిదివఱకుఁగల చనువుతీసికొని సిగ్గను తెరనువిచ్చుకొని తలయెత్తి యచ్చిలుకలకొలికి మెల్లగా నిట్లనియె. "ఓసీ! మంజువాణీ! పాపము మాకొఱకై యిల్లువాఁకిలివిడిచి విదేశములవెంబడి తిరుగుచున్నపూజారిమాట నేటి కాఱుమాసములై వినరాదయ్యె. అమ్మహాత్ముం డిప్పు డెచ్చటనున్నాఁడో కదా! పాపము 'పరోపకారార్థమిదంశరీరం' అను ధర్మమునుబాటించి మాపై నిర్హేతుకప్రేమవహించి విజాపురినుండి మా

తల్లిదండ్రులు తులుజాపురికి విచ్చేసినది మొదలు తురకలచేతిలోఁ జిక్కుకుండ నన్నుఁ గాపాడుచువచ్చిన పూజారిసమాచారము దెలియక నామనసాందోళ పడుచున్నది” అని యింక నేమేమో చెప్పఁబోవుచు వెనుకదీసినఁబ్రియు రాలిమన సెఱింగి “ఏమీ! ప్రభావతీ! నన్నేమో క్రొత్తచేసి వింతగాఁ బల్కరించుచున్నావు. చోరులబారినుండి తప్పించికొని నాతోఁగలసి ప్రయాణముసాగించినదినంబులును ఖానుశిబిరమునొద్దఁ గలసిమెలసియున్న దినంబులును మఱపునకువచ్చెనా యేమి? అప్పటిలో మనకలవడిన మైత్రియేయుండ నీకు సహజమైనకల్పకోద్దనముగూడ మట్టుపఱచి యెఱుక లేనివారితీరున నిట్లుపచరించుచున్నావేల? ఎఱుఁగకపోలేదు నీసిగ్గే దీనికి హేతువు” అని నర్మగర్భముగా వ్రాక్కుచ్చి యటుమీఁదఁ దనవిముక్తివృత్తాంతము సాకల్యంబుగా నెఱిఁగింపఁగోరి యిట్లు ప్రసంగింపఁగడంగెను. “ఇందుముఖీ! నీవు మ్లేచ్ఛుల శిబిరమునుండి తప్పించుకొన్నది మొదలు విజాపురి బందిగములో నాపడిన యిక్కట్టు లిన్నన్నియని చెప్ప నలవికాదు. నీవు నన్నెడఁబాసినలెఱువాతఁ గొలదిదినంబులకే మాతలిదండ్రులు పట్టువడి నాతోపాటు పెక్కుసిలుగులు వడుటయు ఖానుఁడు ప్రతాపగడకు నేఁగుచు నన్ను విజాపురికనిపినసంగతియు నీవెఱింగియేయుందువు. అటుపిమ్మట శివాజిమహారాజో లేక పూజారియో నీవు వ్రాసిన శ్లోకకమ్మనువ్రాసి దానితోఁగలిపి నీయుంగరమును భేతాలువలన ఫజీలున కందఁజేసెను. ఫజీలాజాబు నీవువ్రాసినదనియే నమ్మి భేతాళుఁడు కోరినప్రకారము తనయంగుళీయకమును బ్రత్యుత్తరమును వానికిచ్చెను. ఇప్పు డారెండును నావద్దనేయున్నవి.” అనిచెప్పి పదంపడి యొకపకీరు బీజాపురికివచ్చి యేమికారణముననో ఫజీలుతో మైత్రిచేసి సుల్తానుదయసంపాదించిన క్రమమును ఫజీలు వాంఛ చెల్లించుటకు ఖాను దండయాత్రసల్పినవృత్తాంతము ఫకీరుమంత్రనమున సుల్తానున కెఱిఁగించినతెఱఁగును సుల్తానునకుఁ బ్రభావతిపై వలపుగలుగఁజేసి పకీరు తన్ను విడిపించినవిధమును మఱియుఁ దానాయవసకారాగారంబునఁబడిన యాతనలవిద్ధూరమును బ్రభావతిమంజువాణుల హృదయములు కరగునట్లు సొరది వివరముగా నెఱిఁగించి క్రమ్మఱ నిట్లనియె. “ప్రభావతీ! నాడు మనము తుళజాపురమునుండి రాచూరికిఁబోవు త్రోవలో నుద్ధ

వించి చోరులబారినుండి తప్పించుకొనివచ్చి నీవు నాతోఁ గలిసికొన్నతఱిఁ బెం
పొంది యామీఁదట మ్లేచ్ఛక్రౌర్యవాతాహతి నొక్కింత కదలింపఁబడి వాడిన
మోహలతఁ గ్రమ్మఱ నేటికి దైవకృపారసంబునఁ జిగిరించి యలరులుగల్గి ప్రకా
శింపఁజొచ్చెను. నిక్కముగా నీవు నాపైఁబరపిన వాల్గంటిచూపులు జ్ఞప్తికిఁ
దెచ్చికొనియేసుమీ! నేనిన్నియమవేదనలకంటె శతాధికంబులైన సంకటంబుల
లోఁ ద్రుగ్గియు నెన్నటికైనను నిన్ను గలసికొందునేమో యను నాశతోఁ నిన్నినాళ్లు
మేనిలోఁ బ్రాణంబులు చిక్కఁబట్టియుంటిని. ఖాను లాడిపోసిన మాటలకును
వారినౌకరులుచేసిన హింసలకును నిన్నుఁ దలంచికొనియే సుమా యోర్చి
యుంటిని" అని యతఁడు తనవృత్తాంతము సాంతముగాఁ దెల్పుడుచేసినయనం
తరమునఁ బ్రభావతి పూజారివిషయము దెలిసికొనఁగోరి యొక్కింతచనువుఁ
దీనికొని యిట్లనియె. ఆర్యా! మీరు మీపడినపాట్లు మీవిడుదలయు దెలియఁ
జేసినందులకు మొదలు విచారము బిదప సంతోషము గల్గినది. మీకు సత్యం
తోపకారముచేసినపకీ రెవ్వఁడు? పకీరునకు మతాంతరప్రవిష్టులగు మీపై నింతయ
నురాగముగల్గి ప్రవర్తించినవాఁడని మీచెప్పుమాటలకు నాకాశ్చర్యమగుచున్నది.
దీనికేమికాని మనపూజారివిషయ మెఱింగినచోఁ నాకు జెప్పఁ బ్రార్థించుచున్నాను.
అని యమ్ముద్దరాలు పల్కిన తియ్యనిపల్కుల కలరి పరభుషుమారుం డిట్లనియె.
పూజారి కుశలముగా నేయున్నట్లు వినుచున్నాను. అతనియునికి కొంచెము రహ
స్యముగా నుంచవలసినది. కావున నీకు వెనుక నెఱింగించెదను. నీవడిగినపకీ రెవ్వఁ
డైననేమి? అతండు మనపూజారివలె నాయెడలఁ బ్రేమవహించి నాబంధ
ముక్తికిఁ గారకుండయ్యె. ఇంతకు సన్యాసములగుపకీరుల కిట్టిభూతదయయుంట
లోకప్రసిద్ధము కదా! సామాన్యులకువోలెఁ దనపెరయను భేదంబులు వారికేల
యుండును? అని యిట్లుకొంతసేపు ప్రసంగంబుల వారు కాలయాపనచేయుటయు
నంత జాము రాత్రియగుటఁజూచి లలితాదేవి గదిలోనున్న మంజువాణినిఁబిల్చి
యద్దానివలనఁ గాఁగలదంపతులకు రాత్రిభోజనముసంగతి జ్ఞాపకముచేయించెను.
అంతఁ బ్రభావతీ పరభుషుమారులు దిగ్గనలేచి భోజనశాలకేఁగి యటముచ్చటలా
డుచు నింపాదిగాభుజించి తదనంతరంబునఁ దాంబూలాదులు గ్రహించి పెండి
యూఁ బెక్కుసంగతులు చెప్పుకొంచుఁ జాలసేపు మేల్కాంచి పిమ్మట నవ్వ

ధూవరులు ప్రత్యేకమందిరముల శయనింపసాగిరి. అట్లు కలయక కలయక గలసికొను నక్కాఁగలదంపతుల హృదయంబు లానాటి చంద్రకిరణప్రభావం బున నెక్కుంతకరఁగి మెత్తఁబడుట కనిపెట్టి మనోభవుండు నాఁడు రుద్రుని పైని బ్రయోగింపఁగా మిగిలినవాడిశిలీముఖములచే నుభయులను దత్తఱపాటు పడఁజేయుచు విజృంభించెనేకాని ఫలసిద్ధిమాత్రము పొందఁడయ్యె. ఇక్కారణ. మువలన రెండుజాము లగువఱకు వారికిఁ గూర్కురాదయ్యె. అత్తటి జనకు లేమనుకొందురో యనుజంకుకంటెఁ బ్రభావతి గాంధర్వవివాహమునకు సమ్మ తించునోలేదోయని బాలాజియు బాలాజికిఁ దనమనోభిప్రాయ మెఱింగించిన నతఁడిష్టపడునో లేదోయని ప్రభావతియుఁ దలపోయుచు వారు మూఁడవజామున నిజపర్యంకంబుల నిద్రింపఁజొచ్చిరి. మఱునాఁడు బాలాజిపన్హాలలోనున్న తన తల్లిదండ్రులను శివాజిని వీక్షించుటకునై పయనము సాగింపఁజూచెనుగాని ప్ర భావతిప్రార్థనకతన రెండునాళ్లచ్చోట నతని కాగవలసివచ్చెను. వారికిఁగల్గినట్టి సంయోగముకంటె దొంటివియోగమే వేయిరెట్లు మేలనితోచినప్పుడు వారియ వస్థ యెట్లుండునో మేము వర్ణించుటకంటెఁ జదువరు లూహించుకొంట లెస్స యని యది విడిచిపెట్టుచున్నాము. తాఁ దలపెట్టినమహాకార్యమునకు భంగక రమగుననియెంచి ప్రతనిష్ఠాపరుండగు నర్జునుండూర్వసీసంగమందును సవతితల్లి యాటఁజేసి సారంగధరుండు చిత్రాంగి సంసర్గమందును విముఖులైరేకాని మన బాలాజిపరభునకువోలెఁ దటస్థపడినవా రేమయియుందురో విధిదుష్యాంతౌదు. లకథ లెఱింగినవారికిఁ దెలియకపోదు.

అటనున్న జిజాభాయిని దర్శించి యయ్యపరభవాని సన్నాసమువడసి యామెకుఁ దనవృత్తాంతమెల్ల శ్రుతపఱచి యవ్వీరమాత శివాజి కెఱుంగఁజే యుమను సంగతులెల్ల జాగ్రత్తతో జ్ఞాపకముంచుకొని భేతాళుని విజాపురికిఁ బోనిచ్చి యక్కడిపెద్దలగువారిసెలవు దీసికొని విడలేక వెంటవత్తునన్న ప్రభావతిపైఁ జిత్తముమాత్రమునిల్పి తాను తిన్నగాఁ బన్హాలకుఁ బ్రయాణమై పోయెను.



# ఇరువదిరెండవ ప్రకరణము.



ఒకనాటి యుదయకాలమునఁ బ్రహ్మాలాపురమునఁ బ్రజలందఱు విషాద విస్మయంబుల మునుంగుచుఁ దేలుచుండిరి. ఇది కడు నద్భుతమనువారును పాపము బాజీపరభున కెంతయాపత్తు వచ్చినదనువారును శివాజీరాజు వసించు దుర్గమున నే యిట్టిఘోరకృత్యంబు జరిపిన సాహసికు లెవ్వరో యుందురని గోజిల్లువారును గటకటా బాలాజి యెడఁబాటునకు సగము శవమైన లక్ష్మీభాయి కెంత కష్టమువచ్చిన దనువారునై జనులు వీధులలో గుమిగూడి చెప్పుకొనఁజొచ్చిరి. బాలాజిజనకులు కాపురమున్న సదనమునకుఁ జోరు లెవ్వరో కన్నము వేసి తత్పుత్రికయగు విశాలాక్షియను దాని నెత్తికొని పోవుటయే యాకలవరమునకుఁ గారణమని చదువరు లెఱుంగునది. పాపము బాలాజి వియోగమునకత్యంతమును దుఃఖించుచున్న లక్ష్మీభాయి బాజీపరభులకు ముద్దులకూన విశాలాక్షియెడఁ బాపు దటస్థించినందువలన వారి కది గోరుచుట్టుమీఁది రోకటిపోటువలె నెంతేని దుర్భరమైయుండెను. పురుషుఁ డౌటవలన బాజి తనశోకములోలో నడంచుకొనెను గాని లక్ష్మీభాయి కన్నీరు మున్నీరుగాఁ గార్చుచుఁ దిరుగ నీజన్మముతోఁ గూఁతుఁ బొడగాంచుభాగ్యము సంభవింపదని పెద్దపెట్టున నేడ్వసాగెను. బంధువు లెంతయూరడించినను లోనుండి పొరలివచ్చుచున్న దుఃఖము నాపుకోఁజాలక లక్ష్మీభాయియు నాపెతోఁ బాటు బాజియు నాదిన మభోజనముతోనే పరుండసాగిరి.

శివాజీ యెట్టకేలకు నీఘోరవార్త యెఱింగి చేయునది యేమియుఁదోపక యొక్కింతతడవు సామాన్యునివోలె విచారించి యనంతరమున నిట్లూహింపఁ దొడంగెను. బాజీగృహమున రామోజీ ప్రస్తుతము నివసించుటవలన నతనినందన యనుకొని తెలియక ఫజీలుపనుపునఁ దురుష్కులే యీఘోరకృత్యము గావింప నోపుదురని నిర్ణయించి తదన్వేషణార్థమై కొందఱ గూఢ

చారులను బంపి యామఱునాఁడు బాజిగృహంబునకు నేఁగి బాజిని బరామర్శించి లక్ష్మీభాయి నోదార్చి విశాలాక్షి నెట్లైనను వెదికించి తెప్పింతు నని దంపతులతో వాకొని వారి ఖేదమును గొంతమట్టున కుపశమింపఁజేసెను. ఇట్లు రాజు వారినోదార్చి కొన్నాళ్లై నపిదపఁ దా నంపినచారులు తిరిగి త్వరలో రాకుంటకుఁ గారణ మేమో యని విచారించి మఱికొందఱనుగూడఁ బ్రచ్ఛన్న వేషములు వేయించి పంచి విశాలాక్షివిముక్తికై తగినన్నివిధంబులఁ బ్రయత్నింపఁ జొచ్చెను.

ఇట నీచర్యజరిగిన వారమునకుపిమ్మట ఖాంజహానుసమేతముగా బాలాజి షహ్జాలాపురమునందలి తమయింటికిఁ జేరుకొనెను. లక్ష్మీ భాయీబాజిపరభులు కుమారునిరాకకుఁ బెన్నిధిగన్న పేదలవోలెఁ బెల్లుబ్బి "నాయనా! మృత్యుముఖంబునఁ బడిన నీ వెట్లు తప్పించుకొనివచ్చితివి! ఇంక మేము మహాదృష్టమంతులమైతిమి" అని వారు బాలాజి నెగిఁ గౌఁగలించుకొని సంతోషములను వెళ్లఁబుచ్చఁదొడంగిరి. అంత బాలాజి "అమ్మా! మనవిశాలాక్షిజాడ గనిపింపకున్న దేయేమి?" అని యడుగుటయు వారు కంటఁ దడిపెట్టుకొని జవాబీయకుండిరి. అందులకు నప్పరభుకుమారుండు కలవరపడి దగ్గరనున్న వారి నడిగి జరిగినసంగతి తెలిసికొని తాను గొంతసేపు వారితోపాటు విచారించె. ఇంతలో రామాజి యచ్చోటికి వచ్చుటయు నదిచూచి బాలాజి యాయనకు నమస్కారముచేసెను. రామాజి యతనిని యథోచితముగా నాశీర్వదించి కౌఁగలించుకొని "అబ్బాయీ! నీవిముక్తి యెట్లు సమకూడెనో యెఱుంగను. ఇందువలన మాయందఱికష్టంబులు గట్టెక్కినవి. ఎఱింగియేయుందువు. పాపము మీసోదరి నెవరోయీనడుమ ప్రుచ్చిలించినారు.ఇప్పటికాపిల్లజాడయే తెలియకున్నది" అని యూరకుండెను. అంత బాలాజి తల్లిదండ్రులనోదార్చి వారికి ధైర్యముచెప్పి తాఁ దప్పించుకొనివచ్చినవిధంబునుఁ బ్రభావతి జీజీభాయిమున్నగువారినిఁజూచి మాటలాడివచ్చినసంగతియు వెండియు నిన్నాళ్ళు తాను బడుచున్నయిక్కట్టులును లోనగు పెక్కువిషయము లెఱింగించి వేవేగ మజ్జనభోజనాదులుకావించి రామోజినిదోడ్కొని శివాజిదర్శనమునకుఁ బోయెను.

ఆనాఁటియపరాహ్ణసమయమున శివాజి కృష్ణాజిసమేతుండై రాజకార్యములేవో వితర్కించుచుఁ బ్రసంగవశంబున బాలాజిసంగతి దేఁబడుటయుఁ దోడనే యల్లపూజారివద్దనుండి పెక్కుదినాలై యేవిధమైనవర్తమానము తెలియరాకున్నదనియు విశాలాక్షియొక్కయుఁ దదన్వేషణార్థము పంపఁబడిన చారులయొక్కయు జాడఁగూడ నెఱుంగరాకున్నదనియు వలపోయుచు మిక్కిలి విచారించుచుండెను. ఇట్లు దీనబాంధవచింతామణియగు కోంకణాధీశ్వరుం డేమియుఁ దనకుఁ బాలుపోక యోజించుచున్న వేళ నక్కడ కొక్క దౌవారికుం డరుదెంచి బాలాజిరామోజులరాక నెఱింగించుటయు, శివాజి నిజముగా బాజికుమారుండే వచ్చియుండునా యని క్షణమాత్రము సంశయాశ్చర్యానందపరవశుండై యెవ్వారువచ్చేసినది తెలిసికొనిరమ్మని కృష్ణాజినంపెను. అతండు వారిని తీసికొనిరాఁగా శివాజికి నయ్యిరువురు జోహారుగావించిన రాజును యథోచితమర్యాదలతో వారి నుచితాసనంబుల నధివసింప నియోగించి "బాలాజీ! నీవెప్పుడువచ్చితివి? ఎట్లు రాఁగల్గితివి? అనిపల్కరింప నప్పరభునందనుం డిట్లనియె! మహారాజా! దేవరవారి దయావిశేషంబున నీదినమే యీగ్రామమునకు వచ్చేసినాఁడను.

అని నుడివి తా ఖానుశిబిరములోఁబడినపాట్లును విజాపురిలోఁ బడిన సిలుగులును ఫజీలునకువోలె సుల్తానునకుఁ బ్రభావతిపై మోహ మంకురించిన సంగతియు సుల్తాను దనవెంట ఖానుజహానుని బుత్తెంచినవిషయమును బ్రతాపగడకుఁబోయి ప్రభావతి జిజాభాయి ముఖ్యులసందర్శించివచ్చినయంశము నట జిజాభాయి యెఱింగింపుమనిన సంగతులును సవివరముగా శ్రుతపఱచి యింక నేమేమో చెప్పఁజూచుచుండఁగా మరాటకేసరి యిట్లనియె. "ఓయీ నీరాక కూఁతుంగోల్పోయిన మాజనకులకును నీకై మేను సగముకృశింపఁజేసిన ప్రభావతికిని దదీయులకు నేకాక మాయెల్లరకు సంతోషదాయకంబయ్యె. కాని నీచెలియలిని ధూర్తు లెవ్వరో దోచికొనిపోయిరి. ఆమెను వెదికించి తెప్పించుటకై తగినవారి నంపినాను. అక్కటా! యక్కన్యయునికి యిప్పటికిని నాకుఁ దెలియరాకున్నది. మనపట్ల దైవ మేమిచేయఁదలఁచియున్నాఁడో తెలియదు. అనవుడు బాలాజి శివాజిరాజు తమవిషయములోఁ దీసికొనుచున్న

శ్రమకు నుత్సహించి భక్తివిశ్వాసంబులు విశదపడ నిట్లనియె. దేవా! రాజులగువారు ప్రజలఁగన్నబిడ్డలవోలెఁ జూడవలసినదని శాస్త్రంబులవలనను బురాణరాజులచరిత్రంబులవలనను వినుట దక్క తమరిమర్యాద స్వజనంబులఁ బోషించి తదీయకష్టము లరసి రక్షించుప్రభువులు నే డీకలికాలములో మమ్మాటికి లేరని త్రిశుద్ధిగాఁ జెప్పఁగలను. ఏతద్ధేతువువలనఁగదా యస్మదాదులు విజాపురిరాష్ట్రము విడనాడి మి మ్మాశ్రయించి మీతోపాటు కష్టసుఖం బలమనీకుంట

క. గో వేద విప్రరక్షణ
గావింపఁగఁ గంకణంబు గట్టినమీ కీ
యావనబలముల ద్రుంచుట
యావశ్యక మయ్యె శంకరాంశజరాజా.

తే. మీపదంబులు జేపట్టి మేము కష్ట
జలధిఁ దరియింప నుంటిమి జనుల కెందుఁ
దండ్రియును దైవమును రాజు తలఁచిచూడ
వైరికులజైత్ర శ్రీజిజాభాయిపుత్ర.

ఇట్లు బాలాజి శివాజిని సమయోచితముగా స్తుతించినపిదప నచ్చట వారీవిధముగాఁ బ్రసంగించిరి.

శివాజి—బాలాజీ! పకీరు నీకేమైనను జెప్పుమని చెప్పినాఁడా!

బాలాజి—చెప్పుమని యేమియుఁ జెప్పలేదుకాని నాతో సుల్తానువినుచుండఁగాఁ గొన్నిమాటలు చెప్పినాఁడు. ఏవన "నీవెనకనే సిద్ధిజోహారును ఫజీలును వారిసేనలఁ దీసికొని శివాజిమీఁది కెత్తివత్తురు. వారిసాయము కూడ నీకుండును గాన కార్యము సానుకూలపఱచవలెను."

శివాజి—ఓయీ! నీ వెన్నాళ్లక్రింద విజాపురి విడిచినావు?

బాలాజి—సుమారు పదినాళ్లగును. మీ కీసంగతిఁ దెల్పఁగోరియే ప్రతాపగడకుఁ బోతిని. అట మీరు లేకుంటఁ దెలిసికొని మసలక నిటకు వచ్చితిని. మన మీపాటికి యుద్ధమునకు సిద్ధపడవలసినదే?

శివాజి—ప్రభావతినిఁగూర్చి సుల్తానున కేమివర్తమానము పంపనున్నావు?

బాలాజి—మీయాలోచనచొప్పున వర్తింప సమకట్టినాను.

శివాజి—(మందహాసముతో) రామోజీ! ఇందులకు నీయభిప్రాయమేమి?

రామోజి—మహారాజా! బాలాజి వాక్రుచ్చినట్లు మీయిష్టమే మాయిష్టము. మమ్ము రక్షించుభారము మీయది. పాలముంచినను నీళ్లముంచినను నాశ్రితులమగు మాకు మీరుకాక వేతొక్కదిక్కుగలదే?

శివాజి—బాలాజీ! రామోజి యొడఁబడకున్నాఁడనియుఁ బ్రభావతిని గలసికొని తిరుగ నుత్తరము వ్రాతుననియు వ్రాసి యంపుము. రామోజీ! నీవు వేగము పయనమై ప్రతాపగడకుఁ బొమ్ము. ఇన్నాళ్లొక్కఫజీలునకే కాని యిప్పుడు సుల్తానునకుఁగూడ నీపాడుబుద్ధి పుట్టినది. కావున నీ వప్రమత్తుండవై నీతనూజాతఁ గాచికొనియుండుము. అట మాదుర్గమునకు వింతపురుషులు వచ్చిన బంధించి వారిస్వరూపస్వభావంబులు తెలిసికొని యావెంటనే మాకు వర్తమానము చేయుము. మాతల్లిగారికి నానమస్కృతులు చెప్పి బాలాజితోఁ జెప్పినసంగతులు చేయుచున్నా నని యెఱింగింపుము.

అని రామోజిని బుత్తెంచి వెండియు శివాజి బాలాజిని విజాపురివింతలడిగి తెలిసికొనుచుండఁగా నొక్కప్రతీహారి యేతెంచి తిరుమలురాక నెఱింగించినతోడనే శివాజి వానిని రప్పించెను. ఆవచ్చినతిరుమలుగాజానకు నచ్చటి వారికి నమస్కారము లర్పించి యిట్లనియె. "మహారాజా! ఫజీలు పనుపునఁ దదనుచరులు విశాలాక్షిని విజాపురిలోనికిఁ దీసికొనిపోయిరి. ఈసంగతి చారులవలన నిన్ననే తెలిసికొంటిని" అని యతఁడు చెప్పుమాటలు వీనులఁ బడఁగానే యచ్చటివారు భగ్గుభగ్గుమని మండిపడిరి. అందు ఫజీలుని బిలుకుమార్చునిదే బాలాజి ప్రభావతి కేలువట్టు నని ప్రతిజ్ఞవట్టెను. సుల్తాను విశాలాక్షిని విడుదల చేయించక పోయినచోఁ దదీయరాష్ట్రము కొల్లగొట్టించెద నని శివాజి శపథము సల్పెను.

ఇట్టిసమయమునఁ బేష్వామోరోపంతులును నాబాజీసోనదేవు లచ్చోటి కరుదెంచి ఫజీలుసహాయుండైన సవబత్ఖా ననుబిరుదమందిన సిద్ధిజోహారు ప్రచండ బలముతో నెత్తి వచ్చుచున్న సంగతియు సుల్తానుప్రేరణచే జింజిరాధిపతిప త్తేఖా ననువాఁడు ప్రాంతపుదేశముఖుఁడైన సావంతుఁడు గత్తికట్టి యెదురేతెంచుచున్న యంశమును శివాజి కెఱింగించిరి. ఇట్లు శత్రువు లందఱు నొకసారిగాఁ దనపై దండెత్తివచ్చువృత్తాంతము తా నింతకుఁ బూర్వము కొంతయెఱింగిన వాఁడౌటవలన నంతగాఁ దత్తఱపడక యొక్కింతతడవు చింతించి శత్రు భయంకరుఁడైన శివాజి మేఘగంభీరమైనవాక్కులతో ని ట్లుపన్యసింపఁ దొడంగెను. ఓయామాత్యశేఖరులారా! నాఁడు రామదాసుయోగిశిఖామణి చేసిన హితోపదేశము మీయెల్లరయుల్లంబున నాటుకొనియేయుండవచ్చును. ఐనను సమయానుగుణముగా నేను గొంతదెల్పుచున్నాను. సావధానులై యాకర్ణింపుఁడు. స్వార్థపరత్వమువిడిచి ధైర్యస్థైర్యము లవలంబించి తొల్లింటిభూనాథులు గోబ్రాహ్మణసౌఖ్యార్థమై లోకకంటకులగు మ్లేచ్ఛులఁజక్కడఁచి చిర కీర్తి సంపాదించికొనిరి. అట్లే మనము ప్రయత్నముచేసి శాశ్వతకీర్తిసంపాదింతము. కేవలకుక్షింభరులమై కాకములవలె నెన్నాళ్లుజీవించినను సార్థకమున్న దే? 'పరోపకారార్థమిదంశరీర' మను నార్యోక్తిని పాటించి మనజనక్షేమాభివృద్ధికై శక్తివంచనలేకుండఁ గష్టపడుదము. నా కీయుపదేశము మజ్జనని బాల్యముననే చేసినది. రెండియు మామకగురువు శ్రీరామదాసుయోగిగారును గోభూదేవతల కపకారముచేయుచున్న క్రూరుల దండింపవలసిన దని నియోగించినారు. కావున నేరు సహకారులైనను మానినను నాశక్తికొలంది వైరులరూపుమాపక మానను. ప్రస్తుతము విజాపురిసుల్తాను క్రొవ్వడంగించి యతనిని వశ్యునిగాఁ జేసికొనినగాని ముందు మొగలాయీలతోఁ బోరుట దుష్కరమగు. గోల్కొండ నవాబుమంత్రియగు మాదన్నగారితో మైత్రిచేయుచున్నాను. బీజపూరు గోల్కొండ నవాబుల సాహాయ్యంబున హిందూపథాన విద్వేషియగు నౌరంగజీబుసైనికులైన మొగలులను నర్మదాతటిని దాటిరాకుండ నాకట్టవలెను. కానినాఁడు మనక్షేమాత్రము లక్ష్మీస్వాతంత్ర్యములు గలుగనేరవు.

దేహముదాచక మీరు మీ సేనలతో నాకు సహాయభూతు లైతిరేని సర్వ కార్యము లోలి ననుకూలపడును. ఖానుల మూలమునఁగదా మనకు విజాపురి వారికి వైరము సంఘటిల్లెను. అప్జలుహాతుఁడైనను ఫజీ లోకఁ డింకనున్నాఁడు. వీనివలన నది మఱింత హెచ్చుచున్నది. గోబ్రాహ్మణాదిహింస దక్కను దురు ష్కులుమానునట్లు చేయవలెను. ఇప్పుడు గోల్కొండనవాబు మాదన్నగారికి హితోపదేశమునఁ దనరాష్ట్రమున గోబ్రాహ్మణసాధుహింస చాలమట్టుకు నా పుచేయించినాఁడు. ఇట్లు యవనులను భ్రమరకీటకన్యాయమున భారతులనుగా మార్చి తదీయసహాయమున మొగలులదౌర్జన్యములు వారింపవలెను. అంతవఱకు మనకు శాంతియు విశ్రాంతియుఁ జొప్పడదు. అని యీరీతి శివాజి యుపన్య సించుటయు దానికి నచ్చటి కృష్ణాజిప్రముఖులు తమ యంగీకారము వాక్కుల చేతను ముఖవైఖరులచేతను గరతాళధ్వనులచేతను దెలియజేసి రాజున కుత్సా హాము గల్పించిరి.

అనంతరమున శివాజి జింజరాధిపతి నెదుర్కొన రఘునాథబల్లాలును వాడే సావంతుపైకి బాజీఫసలకరు సర్నోబత్తును బంపవలసినదనియు, ప్రతా పగడసింహగడాదిదుర్గముల సంరక్షింపవలసినదనియుఁ బేష్వాను నియోగిం చెను. మఱియుఁ గోంకణదేశము కాపాడుమని యాబాజిసోనదేవుని నియ మించెను. ఇట్లు సైన్యాధిపతుల నిజదుర్గసంరక్షణార్థ మాజ్ఞాపించి తనదగ్గర నేతాజి లేనందులకు విచారించి యతనిని శీఘ్రముగా నిటకుఁ దోడ్తెమ్మని తిరుమలును బుత్తెంచి తాను బన్హాళాలోనుంటకే నిశ్చయించి యటనుండి బాజీ కృష్ణాజిప్రముఖులతోఁ గలసి కోంకణప్రభువు యుద్ధసన్నాహములు సల్పు చుండెను.



# ఇరువదిమూఁడవ ప్రకరణము.



ఫజీలు బాలాజిముక్తికిఁ గారణం బరయఁజాలక తన మిత్రుండగు జంఝూరరావును బిలిపించి యతనితో నీవిధముగా ముచ్చటించెను.

ఫజీలు—మిత్రమా! బాలాజిని సుల్తా నేకారణమున విడిచిపెట్టెను.

జంఝూర—కారణమేమో నాకుఁగూడఁ దెలియదు.

ఫజీలు—నీకుఁ దెలియదన్న నెవరునమ్ముదురు? స్వజాత్యభిమానము.

జంఝూర—ఏమీ! ఫజీల్! అపూర్వముగా వచించుచున్నావు? నీకడ నెన్నఁడేని యేసంగతులైన మట్టుపఱచితినా? ఇంతకు నీయయిష్టుఁడు నా కిష్టుఁ డగునా?

ఫజీలు—బందికానా యాజమాన్యము నీక్రిందనుంటచే నిట్లంటిని.

జంఝూర—నిజముగా నాకుఁదెలియదు. కావలసినచో నీయొళ్లుముట్టి చెప్పెదను. ఒకవేళఁ బకీరున కేమైనను దెలిసియుండునేమో?

ఫజీలు—పకీరు నిందుకొఱకే గృహమునకు దయచేయుమని వర్తమానమంపినాను. అతఁడు వచ్చినమీఁదటఁ గనుఁగొనవచ్చును. దానికేమికాని మొన్న నే విశాలాక్షి యను నొకపరభునందనను నాసేవకులు మోసికొనివచ్చినారు. దీన నేమి ముప్పువచ్చునో?

జంఝూర—ఔను నేను నాలకించితిని. ముప్పనకిం దేమున్నది? సర్కారునకుఁ దెలియకుండ నుంచవలెను. నీప్రియురాలిజాడ యేమైనను దెలియునా?

ఫజీలు—నాఁడు ప్రభావతి వ్రాసినయుత్తరము నీవుకూడ జూచితివికదా! మరల నాకొమ్మ నే డొక్కకమ్మవ్రాసి పంపినది. ఔరా! ఆయమ్మె

లాడి కింతచిన్నవయసులో నింతమంచి కవనముకూడఁ బట్టువడినది. రూపమున్నచోటఁ బ్రజ్ఞయు సహజముగా నుండునుగదా! వహ్వారే! ఇందలి వ్రాతచూచిన నమ్ముద్దులగుమ్మను జూచినట్లే యున్నది.

తే. ఖానువర! మీరు దయచేసి • కడక నంపు
నట్టిప్రత్యుత్తరము నుగ్ర • మందుకొంటి
నాఁటినుండియు నాయెద • నాటుకొన్న
ప్రేమ మగ్గలమై నన్ను • వెతల ద్రోచె.

క. మీతండ్రిఁ జంపుఘాతకుఁ
బాతకుఁ డెగటార్చి యిటకు • వచ్చితి రేనిన్
మీతో నిదె వచ్చెద నతఁ
డాతంకము నన్ను బెట్టు • నది యెఱుఁగరటే.

క. ఒల్లను దల్లిని దండ్రిని
నొల్లను మాజాతినీతు లొల్లను వంశం
బొల్లను వేఱొకపూరుషు
వల్లభ! నాకేలువట్టఁ బ్రార్థింతు మిమున్.

జంఝూర—సఖా! ఈజా బెవ్వరు తెచ్చినారు?

ఫజీలు—అట్లడుగుచున్నావేమి? మొదటవచ్చిన వితలదాసే తెచ్చియిచ్చినాఁడు. చూచితే! నామాట లిన్నాళ్లు నమ్మకుంటివి. వలపులేనిచో నిట్లు వ్రాయుట తటస్థించునే? ఇంతకుముందు వ్రాసిన కమ్మలో నాయొయ్యారిబొమ్మ తానే తప్పించుకొని వత్తునని వ్రాసినది. రాజద్రోహియు మజ్జనకద్రోహియు నగు శివాజీమూలముననగదా మన ప్రయత్నములన్నియు భగ్నమగుచున్నవి. ఆదురాత్ముని ఘోరముగా నాఖడ్గమునకు నాహారముగావించి మాతండ్రికి సూడెద దీర్తుఁగాక. ఆమాయావిని రూపుమాపకున్నఁ బ్రభావతి నాకు లభించుటదుర్లభము. దీనికి నీయభిప్రాయమేమి?

అని యడుగుచుండఁగాఁ బకీ రచ్చటికివచ్చుటయు నాతనికిఁ బ్రభావతి తిరుగఁ గప్పవ్రాసినసంగతియు నందలియంశములును దెల్పుడుచేసి యటుమీఁద నతనితో నిట్లు ప్రసంగింపఁదొడంగెను.

ఫజీలు—స్వామీ! బాలాజి యెట్లుతప్పించుకొనిపోయెనో మీ రెఱుంగుదురే? ఇంక నాకుఁ బ్రభావతి దక్కునని తోపదు.

పకీరు—శివాజిపట్టువడిన మనసైనికులను విడిచినాఁడని చెప్పి వాని నట్లువిడిచి యుండనోపు. ఇంతకుఁ బరభుకుమారకుని విడుదలకుఁ బ్రభావతి దక్కుకుంటకు సంబంధమేమి ?

ఫజీలు—మీ రెఱుంగరు కాబోలు. ప్రభావతి తులజాపురిలో మాకుఁ బట్టుపడవలసినదేకాని దుర్మార్గుఁడగు నచ్చటి పూజారివలనను వీనివలనను మాకుఁ జిక్కినదికాదు. కానిచోఁ బ్రతాపగడకు మేముపోవుటయే తటస్థింపకపోవునుగదా? మఱియు నారూపవతి—

పకీరు—అన్నట్టు జ్ఞప్తికి వచ్చినది. మీతండ్రికొడుకులు ప్రభావతినిమిత్తమే దండయాత్రకల్పించినారనియు నందువలననే శివాజి మిమ్మువంచించుటకును ఖానును వధించుటకు సాధ్యపడిన దనియు నెవరో సుల్తాను చెవి కొఱికినారు. అంత నతండు నీపైనిగోపించి మాటలాడిన మేముతగు నట్లుచెప్పి యాయన నెంతో కష్టముమీఁదఁ బ్రశాంతునిజేయుటయే కాక నీ కాయెలనాగ నెట్లైనను గూర్పవలసినదనియుఁ జెప్పి యొప్పించితిమి.

ఫజీలు—మీకటాక్షము పూర్తిగా నామీఁదనుంటచేఁగదా సుల్తానుగా రాగ్రహించుటకు మాఱు కరుణించుట గల్గినది. అదికాక మొన్నను నాతోఁ బ్రసంగించి నాకోరినట్లు సవబత్ఖానుతో యుద్ధమునకు నన్నుఁ బోవలసినదని సెలవొసంగినారు.

జంఝూర—నీతో నన్నుఁ గూడఁ దీసికొనిపోవలెను జూమా!

ఫజీలు—నీ వింతయడుగవలెనా? నీవులేనిదే నా కొకగడియ వేగదు. సుల్తానుగారి నడిగి నిన్నుఁ దోడ్కొనిపోదును.

పకీరు—ఓయీ ! ఫజీలూ ! పన్హాలాపురిలోనుండి యొక్క సుందరిని వేగులచే రహస్యముగాఁ దెప్పించి మీయింటనుంచితివని సర్కారున కెట్లో తెలిసినది. ఆవిషయమ్ము మిమ్ము గనుంగొనుటకుఁగాభోలు దోడ్కొని సత్వరమ రమ్మన్నారు.

ఫజీలు—ఈసంగతి యెట్లు తెలిసినది ? ఏమీ ! నాపైఁ గోపగించినారా? ఆ తరుణి నెందులకుఁ దెప్పించితివన్న నే నేమి చెప్పుదును ?

జంఝూర—ఈమాత్రమునకు భయమేమి ? మనపక్షమునఁ బకీరే తగినయుత్తరవుచెప్పి సమాధానపఱుపఁగలఁడు.

పకీరు—అప్పుడే నేవచ్చి పావుగంటయైనది. వేగముగా మన మటకుఁ బోవుట మంచిది. అని వారినిదీసికొని కోటలోనికి నడిచెను.

అట సుల్తాను ఖాంజహాను తీసికోవచ్చిన బాలాజిలేఖవలనఁ దతోన్దరి యగు విశాలాక్షిని ఫజీలు తెప్పించినదియు రామోజి ప్రభావతి నిచ్చుటకు సమ్మతింపనిదియు లోనగు సంగతులను దెలిసికొన్నవాఁడై బాలాజికోరినట్లు విశాలాక్షిని విడుచుట యుక్తమో విడువకుంట యుక్తమో యనియు, ప్రభావతి తన్నిచ్చగించునో లేదో యనియుఁ బరిపరివిధముల విచారించుచుండెను. అత్తఱిఁ బకీరుసహితముగా ఫజీలు ఝుంఝూరరావులు తనయొద్దకువచ్చుటయు వారి నాసీనులఁజేసి విజాపురిప్రభు విట్లు ప్రసంగింపఁ దొడంగెను.

సుల్తాను—ఫజీల్ ! నీయింటఁ బరభుకుమారి యొకర్తున్నట్లు తెలిసినది. ఆకన్యక యెవ్వరిపుత్రిక ? నీ వాకన్నియఁ దెప్పించుటకు హేతు వేమి?

ఫజీలు—సర్కార్ ! నావద్ద మీరడిగినకన్యయుంటయు నిక్కవమే ! నేనిది తెప్పించుటయు నిజమే ! నన్ను మన్నింతురేని తెప్పించుటకు హేతువు యథార్థముగాఁ జెప్పుచున్నాను.

పకీరు—సరే నీవుచెప్పకముందె సర్కారునకుఁ దెలిసినది. ప్రభావతిని దీసికొనిరమ్మనిపంపిన నీయనుచరులుచేసిన యవకతవకగదాయిది.

ఫజీలు—పకీ రూహించినది వాస్తవమే !

సుల్తాను—ఆపిల్లను మాపరముచేయునది.

ఫజీలు—చిత్తము అట్లే కావించెదను.

సుల్తాను—ఘూటగే! నీ వాకన్యను భద్రముగా రక్షించునది. తగినపరిచారికలను నియమించి యామెకు నన్నపానాదులలో లోపముగాకుండఁ జూడవలెఁ జుమా! మాయాజ్ఞ కానిదే యాతరుణికి విడుదలచేయరాదు.

జంఝూర—సర్కార్! చిత్త మట్లేకావింతును.

సుల్తాను—ఫజీల్! నీవు రేపుయుద్ధమునకుఁ బొమ్ము. నీవలచినసుందరి నెట్లైనను దెప్పింతునులే! మీతండ్రి నా కత్యంతహితుఁడని యెఱుంగవే? అతనికుమారుండగు నీవును మాకట్టిడివే! ఇంతకుముందుగా నాతోఁ జెప్పినచో నీపాటికి నాబోటిఁ దెప్పింపకపోదునే?

ఫకీరు—ఆకాంతకై పాపము తండ్రినిసైతము బోఁగొట్టుకొన్నాఁడు. తమరీమాత్ర ముపకారముచేసి ఫజీలుని సంతోషపెట్టుఁడు. ఇతండు సంతసించిన మాకు నామోదమే! మీబోటివారు తలంచుకొన్న చక్రవర్తితనూజాతనైనను రప్పింపఁగలరు. అట్టిచోఁ బ్రభావతివిషయము చెప్పవలెనా?

జంఝూర—పకీరుచెప్పినది బహుయుక్తముగా నున్నదనుటకు సందియము లేదు. తండ్రికంటె ఫజీలు కార్యశూరుండును సదసద్వివేకియుఁ జుడీ! ఈతనికోర్కి చెల్లించినచోఁ దండ్రితాతలమాడ్కి నితండును సమయమువచ్చినవేళ మనరాష్ట్రమునకై మానప్రాణంబులు ధారవోయకమానఁడు. నాకు స్నేహితుఁ డగుటవలన నింతకంటె నేమిచెప్పినను బాగుగానుండదు. కాని యీతండు రాజనీతియందు ఖానునకుఁ బైచేయి యనుటకు సందియములేదు. నాఁడు తండ్రికిఁ దనుత్రాణశిరస్త్రాణాదులు ధరించిపోవలసినదని పోరిచెప్పిన యాతని దూరాలోచన పరత్వ మెల్లరకుఁ దెల్లమేకదా! మఱియు మావలె శత్రువులచేతిలోఁ

జిక్కకుండఁ దప్పించుకొనివచ్చిన యీతనిప్రావీణ్యము తమ కెఱిం గినదేకదా! సర్కార్! కావున దయచేసి తమ రట్లు జరిగింపఁ బ్రార్థితులు.

అనియిట్లు వీరుఁనల్వురు సంభాషించుచుండఁగా సిద్ధిజోహారచ్చోటికి వచ్చుటయు సుల్తానాతనిఁ జేరఁబిల్చి తనసమీపమున నధివసింపఁజేసి ఫజీలు నుద్దేశించి "ఓయీ! నీవు రేపు మనసవాబత్ఖానుతోఁ బయనముకావలసినది. కావున పోయి నీవు తత్ప్రయత్నములో నుండుము. నీతో జంర్ఘూరరావు నవసరమున్నఁ దీసికొనిపొమ్ము." అని వా రుభయులను వీడ్కొల్పి పిమ్మట సుల్తాను సిద్ధితో నిట్లు ప్రసంగింపఁదొడంగెను.

సుల్తాను—సవాబత్ఖాక్! మన మనుకొన్నట్లు జఱిగినదా?

సిద్ధి—సర్కార్! పత్తేఖానుఁడును సావంతుఁడును మీయాజ్ఞశిరసావహించి నారు. వారు నాకు సహకారులైె నిల్చినప్పుడు శివాజియెంత? ఔరంగజీ బెత్తివచ్చినను నిగ్రహించెదను. ఈమాటు శివాజి పట్టువడుటగాని మృతినొందుటగాని సంభవింపకతీరదు. వేయేల నే బహుభాషలవాఁడఁ గాను. నే నెంతచేయఁగలవాఁడనో మీరే వెనుక యోజింగవచ్చును.

సుల్తాను—ఓయీ! నీసామర్థ్యాదులు మాకుఁ గ్రొత్తలుకావు. నీవుచూచిరమ్మన్న గాల్చివచ్చువాఁడవని నాటికన్నాటకయుద్ధములవలన నే తెలిసికొంటిమి. నీవు మా కాంతరంగికుండవౌటవలన మా కొకయుపకారముచేయవలసి యున్నది. ఇదివఱలో మాదర్బారులో శిరస్తాదారుగానున్న రామోజి పరభు నెఱింగియుందువుకదా! అతఁడిప్పుడు శివాజివద్దఁ బన్హాలాలో నున్నాడట. అతని కొకవివాహము కానికూఁతురుగలదు. అది లోకైక సుఁదరి యని వినుచున్నారము. ఆమెకుఁ బ్రభావతి యనుసార్థకనామ మున్నది. ప్రస్తుత మది పన్హాలలోనే యున్నట్లువదంతి. ఆ రాజముఖి నెట్లైనను నాకుఁ గూర్పఁజూడుము. శివాజి స్వయముగాఁ బ్రభావతిని సమర్పించి సామంతుగానుంటకు సమ్మతించె నేని యాతనిని బలవంతము

గాఁ గట్టి తీసికోరావలసిన పనిలేదు. అతనిస్నేహము నీవు నాడువా
గ్రుచ్చునట్లు ముందున కుపయోగింపవచ్చును. కావున మీచెప్పినచొ
ప్పునఁజేయునది. ప్రభావతిపట్టువడినదాఁక మావాంఛ గూఢముగా
నుంచవలసినది సుమా !

పకీరు — జోహార్ ! నీ వెట్లీరాచకార్యము సాధించుకొనివత్తువో చూతము.
నీకు మహోన్నతపదవి త్వరలోఁ బ్రాప్తించునులే !

సిద్ధి — సర్కార్ ! తమరు సెలవిచ్చినవిధమున నవశ్యము కార్యము సఫలము
చేసికొనివత్తును. పోయివత్తును.

అని సుల్తానుపకీర్లకు జోహారు జోహారు కావించి వారిసెలవుతీసికొని
పోయెను. పిమ్మటఁ బకీరు సుల్తాను లిట్లు ప్రసంగము నడిపిరి.

సుల్తాను — మావద్దఁ బంతోజియే యిట్టిసమయములోనున్నచో నరనిముసము
లోఁ బ్రభావతిని దీసికోరాఁగల్గియుండును. ఆదురాత్ముండు లంచగొం
డియై మమ్ము విడిచినాఁడు కాని లేనిచో నొగి మాతో సమానుఁడై
మెలఁగవలసినవాఁడే.

పకీరు — పంతోజి యెవ్వఁడు ?

సుల్తాను — తమ రెఱుంగరేమో! మాదర్బారువకీలుగా నిన్నాళ్ళునుండి మొన్న
ఖానునివెంట నిచ్చిపంపగా లంచముతిని యతనిని శత్రువులచేతిలో
బెట్టి నమ్మించి స్వామిద్రోహముచేసినాఁడు. కాని వాని తెల్వితేటలు
దర్బారులో నేరికి లేవనియే మానమ్మకము సుడీ !

పకీరు — ఎన్ని తెల్వితేటలున్నను నేమిప్రయోజనము? గుణములేనివాఁ డెట్లు
ముందుకువచ్చును? అన్నిదుర్గుణములలో స్వామిద్రోహమువంటిది మఱి
యొక్కటిలేదు. మణియుతంబైయున్నను బాపజాతిఫణి విసర్జనీయము
కదా! అట్టివారిని ప్రభువగువాఁడు తెలిసికొని తఱిమివేయవలెను.

సుల్తాను — ఇచ్చట నున్నన్నాళ్లు తలలో నాలుకవలె మాలో మెలంగుచుండెడి
వాఁడు. లంచమే వాని నట్లు మార్చివేసియుండును.

పకీరు—ధనము పాపిష్ఠమను లోకోక్తి యెంతయు నిజంబు. కులాంగనలను గులటలగాను, సత్యవాదుల నసత్యవాదులగాను, నీతివంతుల నిర్నీతివంతులగాను, పుణ్యాత్ములఁ బాపాత్ములనుగాను జేయును. మఱియుఁ జోరహత్యాదినీచకృత్యంబులకు మూలకారణంబైయుండును. కావుననే మాకు ధన మెవ్వార లొసంగినను నమస్కారము చేసెదము.

సుల్తాను—ధన మట్టిదియే కాకున్న బంతోజి యీపనిచేసియుండకపోవును గదా!

పకీరు—పంతోజి కేవల ధనాపేక్షతోఁ జేసినట్లు మీదర్బారులోని మరాటోద్యోగస్థుల బట్టిచూచినఁ గానరాదు.

సుల్తాను—ఏమేమీ! మీ రనుమాటలు నాకు వ్యక్తపడకున్నవి.

పకీరు—దర్బారులోనున్న మరాటులలో బెక్కుఱు లోలోన శివాజిపక్షము వారుగా నున్నట్లు వారి రాకపోకలబట్టి మా కనుమానము తగులుచున్నది. ఇది యింతకుముందే తెలియఁజేయవలెనని తలంచితిమి కాని యాప్రమేయము వచ్చినప్పు డెఱింగింపవచ్చునని యుపేక్షించితిమి.

సుల్తాను—రాష్ట్రములోఁ గొంకణస్థు లిట్టివారని యిదివఱకే యెఱింగియుంటిమి కాని దర్బారులోఁగూడ నట్టిద్రోహు లున్నసంగతి తమరు చెప్పగాఁ దెలిసినది. ఓహో! యికమీఁదట జాగ్రత్తగా నుండవలసినదే!

ఇట్లు కొంతసేపు ముచ్చటించి యటుమీఁదట సుల్తాను విశాలాక్షినిగూర్చి పకీరుతో నాలోచించి ప్రభావతిని బాలాజిపట్టితెచ్చి యిచ్చువఱకు విశాలాక్షిని విజాపురిలో నుంచుకొంటకు నిర్ణయించియే తన్నిర్ణయంబు సూచనగా నిరూపించుచు నొక్కలేఖనువ్రాసి ఖాంజహానునిరావించి వానిచేతికి దానినిచ్చి బాలాజి కందఁజేయుమనిచెప్పి పుత్తెంచెను. నాటనుండియు నవాబు మఱింత ప్రభావతిమీఁదనే లోకముంటఁజేసి తదేకచిత్తుండై రేయింబవళ్ళు తత్తఱపాటు చెందుచు, నెన్నఁ డాభువనసుందరిఁ జేపట్టుదునోయని మురియుచు దినమొకయోయుగముగాఁ గడపుచుండెను.



# ఇరువదినాలుగవ ప్రకరణము.



ఆమఱునాఁడు సిద్ధీజోహారు ఫజీలుసహితుండై పదివేల యశ్వబలము తోడను నిర్వదివేల పదాతిబలంబుతోడను వేయికిమించిన కుంజరసముదాయము తోడను మఱియు గొప్పఫిరంగిబండ్లతోడను పయనముసాగించి యప్పటికిలో శివాజివసించియున్న పన్హాలాదుర్గముమీఁదికి దాడివెడలెను. ఇంతటిప్రచండమైనచతురంగబలముతో సిద్ధిప్రయాణము సాగించుతఱి భూమి యదరఁజొచ్చెను. ఉత్తమహాయవేదండంబుల నేత్రంబులనుండి జలకణచయ మొలుకఁ దొడంగెను. ఘోటకాదిపాదఘర్షణచే జాతంబయిన పెంధూళి పైకెగసి యంబరాచ్ఛాదనచేసి రక్తవర్ణమైన మేఘముభంగి భయంకరముగా నుండెను. అడుగడుగునకు గజంబులుచేయు ఘీంకారములచేతను దురగంబులుచేయు ఖురపుటధ్వానంబుచేతను భటసముదాయముచేయు కోలాహలముచేతను మఱింత భీకరంబై గోచరించెను. వెండియు నీమహాఘోషమునకు జంబుకాదివన్యమృగంబులు సహకార మగుచుండెను. ఆసమయమునఁ బురోభాగమున నొక్కప్రచండమారుత ముద్భవించి విజృంభించి నభంబున నంతపర్యంతము ప్రేలాడుచుండిన ధూళిపటలంబుతోఁ గలసి మ్లేచ్ఛనాయకులదెస వీచి తల్లోచనాదిముఖరంధ్రములలోఁ జొఱఁబడఁజొచ్చెను.

ఇట్టి శుభశకునములతో బయలువెడలిన పఠానులదండు మిడుతలదండు కరణి దారిపొడుగునఁ బైరుపంటలు నాశనముచేయుటయేకాక గ్రామంబుల రూపుమాపుచుఁ గతిపయదినంబులకుఁ బన్హాలాదుర్గము సమీపింపఁగల్గెను.

అటఁ బన్హాళలోని మరాఁటులు లావచ్చుచున్న వైరిబలమును రెండుక్రోసులదూరమున నున్నదనఁగానే నిరీక్షించి సమరసన్నాహములు సల్పఁజొచ్చిరి. ఇంతలో వేలాలంఘనముచేసి వెల్లివిరిసినయవనసముద్రమువిధంబున నయ్యవన బలౌఘము తమపట్టణంబునకు ముట్టడిచేసి చుట్టువిడిసినఁ బట్టరానికోపంబునఁ

గోటలోని మరాటభటులు బాణంబులు ప్రయోగించియుఁ దుపాకులు గాల్చి యుఁ గొన్ని దినంబులు ప్రాకారంబులదరి జేరకుండ శత్రువులను దునుమాడుచుఁ జీకాకుపఱచుచువచ్చిరి. అత్తఱి నెటనుండియో నేతాజి తనయశ్వసైన్యముతో నటకువచ్చి శత్రువులను సరిగా నిలఁబడి యెదిరించుటకుఁ జాలినంత సైన్యము లేమి విచారించి పగలెల్లఁ జుట్టుప్రక్కలనున్న పొదలలోమాటుపడి రాత్రివేళల శిలాశిలీముఖంబులు గురిపించుచు శిబిరములు తగలబెట్టుచు నరిభటు లెదిరించి నప్పుడు పరుగిడుచు వారు బెదిరినప్పు డెదిరించుచు నిట్లు పెక్కుతెఱంగులఁ దురకలఁ జిక్కుపెట్టుచుండెను. కాని ముట్టడిమాత్రము తగ్గుటలేదు. మఱియు నొక్కొక్కదినము దుర్గములోని మరాటసైనికులకును వెలపలనున్న పఠాన సైనికులకును దురము దుస్సహంబగుచు నొక్కొక్కదినము కొంతతగ్గుచు నిట్లు రెండుమాసము లతిక్రమించెను.

ఇట్లు ముట్టడి జఱుగుకాలమున శత్రువులు దుర్గములోనికిఁ జొరఁబడ కుండ శివాజిభటులు బహుప్రయాసమున సంరక్షించుచుండిరి. కాని తమకం టె శత్రువులసంఖ్య నాల్గురెట్లధికముగానుంటవలనను నానాటికిఁ గోటలోని యాహారసామగ్రి తరుగుచుంటచేతను శివాజియుఁ దదీయులును జయముపట్ల నిరాశులై యెట్లు తప్పించుకోవలెనో తెలియక సంభ్రమపడఁజొచ్చిరి. మొట్ట మొదట శివాజి యావత్సైన్యముతో వెలికిదుమికి దొమ్మియుద్ధముచేసి సందు దొరికినయెడలఁ దప్పించుకొనఁజూచెనుగాని సంఖ్యాతిగంబైన శత్రుసైన్యంబు పరిగణించి యది దుస్సాధ్యమనియుఁ బ్రాణాపాయకరమనియుఁ దెలిసికొని యాప్రయత్నంబు మానుకొని మంత్రిపురోహితులనెల్లర రావించి వారితో నీరీతి ముచ్చటించెను.

శివాజి—సఖులారా! ప్రస్తుతమనయవస్థ చిత్తగించితిరికదా! మన మీయు పద్రవము తప్పించుకొని బయటఁబడు టెట్లో నాకుఁ దోచకున్నది. కయ్యము పొడిగింతుమన్న సైనికులనేకులు నిహతులౌటయేకాక పై పెచ్చుభోజనసామగ్రి సన్నగిల్లుచున్నది. ఇంక సామమే మనకు శరణ్య ముగాఁ గనుపట్టుచున్నది. అదెట్లు లనుకూలపడునో యెఱుంగకున్నా ను. తానాజీ నీయభిప్రాయమేమి?

తానాజీ—స్వామీ ! నాకు నేమియుఁ బాల్పోవకున్నది. వెలికి దుమికి దొమ్మి యుద్ధముచేసి తప్పించుకొనుటయే కర్తవ్యమని తోఁచుచున్నది.

కృష్ణాజీ—తానాజీ యంతవాఁడౌటకు సందియములేదు. ఇతఁడు విజృంభించిన భీమునిభంగి నెంతలేసికార్యంబులైన నవలీలలోఁ జక్కఁపఱపఁగలఁడు. కావుననే యిట్టిపౌరుషోక్తు లతనినోటనుండి వెడలినవి. కాని ప్రస్తుతము స్వబలపరబలతారతమ్యమునుఁ బరిశీలించిన నతనిమాటలు క్రియలలోఁబెట్టుటకు నెంతమాత్రము మంచిదికాదు. ఇట్టిసాహసంబున జొరఁబడుటకంటెఁ 'బాహుబలంబుకంటె బుద్ధిబలంబు కార్యసాధక' మని పెద్దలు వచింతురు. కాన నెక్కింతనిదానముతో నాలోచించి వైరుల వంచించి తప్పించికొను నుపాయము నన్వేషించుటయే శ్రేయస్కరమని నామతము.

శివాజీ—కృష్ణాజివాక్కులు నీతియుక్తములనుటకు సందియములేదు. కాని తప్పించుకొను విధానముమాత్రము తెల్పఁడయ్యె. నాకు సంధిచేసికొనుటయే యుక్తముగాఁ గన్పట్టుచున్నది. ఇది మీయందఱికి సమ్మతమగు నేని యెట్టినిబంధనల కొడబడవచ్చునో యెఱుంగఁజేయుఁడు.

బాజీ—మహాప్రభూ! మన మీనడుమ నాక్రమించిన కోటలెల్ల నర్పించితిమేని మనలఁ దప్పించుకోపోనిత్తు రని తలంతును.

బాలాజీ—చాలుఁజాలు బాబయ్యా! పరభువంశంబునఁబుట్టిన మన కిట్టియొప్పందల చెల్లునే? కష్టార్జిత మ్మగుకోటలువైరులపాలుచేసి యబలులచాడ్పున మనము నిరాయుధులమై పోవలెనని మీయాలోచన. ఇదేటియుపాయము? రాజపుత్రసంతతివార మగు మన మీదైన్యము సహింపఁగలమే? శూరాగ్రేసరుండైన తానాజివచించునట్లు వర్తించుట మానధనులమగు మనకు యుక్తముకాని యన్యధాచరించిన లోకులు నవ్వరే ?

తానాజీ—ఔను! మానాభిమానముగల మనమెట్లు తలలువంచుకొని రిక్తహస్తులమై పోవుదుము. మానముకంటెఁ బ్రాణమే యెక్కుడనితోఁచిన మనము గాజులు తొడిగించుకొని మెలంగుటయొప్పు. ఇట్లుంటిమేని యన్య

ధా విచారించి నాపైఁ గోపగింపకుఁడు. పుట్టిననాటనుండి కత్తిపట్టి వర్ధిల్లిన మన మిప్పు డిట్టిదైన్యావస్థకు నీకొందుమే? ఏదైన బన్నుగడఁ బన్ని శత్రువులను దప్పించికొనిపోదము. కాదేని దొమ్మియుద్ధమునకు సిద్ధమౌదము.

కృష్ణాజీ—నామాటలను బాజీపలుకులను సులువుగాఁ బూర్వపక్షముచేసిన బాలాజితో నాజుల నేమందును? ఇరువురిలో నొక్కరును దప్పించుకొను వెఱ వెఱింగింపకయే యుఱక మావచనంబులు ఖండించిన నేమిప్రయోజనము? దూరాలోచనచేయక తోచినట్లు ప్రసంగించుట రాజనీతికిఁ జాలవిరుద్ధము. కాలము ప్రతికూలమైనవేళల నెంతవారికిని దైన్యం బనుభవింపక తీరదు. నాఁడభిమన్యుకుమారుని రక్షింపసమకట్టి భీమాదులు సైంధవునిచే నోటువడలేదా? జరాసంధకాలయవనాదులఁ దప్పించికొని కాలజ్ఞులైన రామకృష్ణులు పాదచారులై పాఱిపోలేదా? సమయము వచ్చినప్పుడు గాడిదెకాళ్ళుపట్టవలెననుమాట యెఱుంగరా? ఎదిరిబలంబునకుఁ దమబలంబునకుఁగల హెచ్చుతగ్గులు పరిశీలించి కాలానుగుణ్యముగా బ్రవర్తించుటయే రాజనీతిగాని తొందరపడుటవలనఁ గార్యానుకూలమగునే? కావున సంధి కెట్టినిబంధన లొప్పుకొంటదగునో యోజించి చెప్పుఁడు. బాజిచెప్పునట్లు కోటలన్నియు నిచ్చుట తగదుకాని కొన్ని యిత్తుమనిచెప్పి ప్రస్తుత మీచెఱ దప్పించుకొంట సమంజసము.

శివాజీ—అట్లైన నెవ్వఁడు సంధికుదుర్చికొనివత్తురు?

కృష్ణాజీ—ఖానునికడకు నా జేను రాయభారము పోవుటఁజేసి నీమాఱు నేఁబోయిన వా రనుమానింతురు. బాజిపరభు నంపినచో నతండు కార్యము సానుకూలపఱచుకొని రాఁగలఁడు.

బాలాజీ—దేవరవారు మన్నింతురేని నే నపాయంబులేనియుపాయం బొక్కటి చెప్పఁబోవుచున్నాను. కృష్ణాజి చెప్పునట్లు మీరు మాతండ్రిని రాయబారము పంపవచ్చును. కాని నే నిట నొక్కింత విన్నవించుకొంచున్నాను. సావధానులై చిత్తగింపుఁడు. "మహారాజా! ప్రభావతిపై

ఫజీలునకు వలపుకలదుగదా! భేతాళుఁడెట్లో, అతనినివంచించి తదంగుళీయకము నాచేతికిచ్చినాఁడు. అది యిపుడు నాయొద్దనున్నది. ప్రభావతి యిక్కడనున్నట్లు ఫజీలున కీయుంగరమంపించి తగిననమ్మకము పుట్టించితిమేని వాఁడు తప్పక మెత్తఁబడును. సంధిపరతులలోఁ గొంత బెట్టు సరిచూపుచుఁ దుట్టతుదకుఁ బ్రభావతిని సమర్పింతుమని యాశ చూపినచో నది నిజముగాఁ దలఁచి సిద్ధినొప్పించి ప్రభావతిని బంపుమని బలవంతపెట్టును. తొల్లి పద్మినీమోహితుఁడైన యల్లాయుద్దీనుని వంచించిన రసపుత్రులవలె నత్తఱి నేను నామిత్రులతో సంజవేళ నొకపల్లకీలోఁ గూర్చుండి కొందఱుభటులు వెంటరా శిబిరమున కొక్కింత దూరమున నేర్పఱచుకొన్న సంకేతస్థలమునకుఁ బోవుదును. వీలైనచో ఫజీలుని దెగటార్చి నాతోవచ్చినవారితో నొండొకదెసకుఁ బారిపోదును. ఆగందరగోళములో మీరు వీలైనంతమందిని దీసికొని రణగడాకుఁ దప్పించుకొని పోఁజాలుదుఁడు. నేను నాసందువేళఁ బగఱకు దొరకకుండఁ దప్పించికొనివత్తును. పట్టువడితినేని సుల్తానుమన సెఱింగి యట్లు చేసితినని సవాబఖ్థాను నొడంబఱచి నా నేర్పుకల్మివెరుఁలను క్షమలించుకొనివత్తును.

అని బాలాజిచెప్పిన పన్నాగము సమయోచితము గానున్నదని తండ్రియగుటచేత బాజితక్క నచ్చటివారెల్లరు నతనిని వేనోళ్ల శ్లాఘించి యట్లే కావించుటకు నిర్ణయించిరి.

అట్టుపైని శివాజి బాజికిఁ జెప్పవలసినసంగతులెల్ల బోధించి సంధిపేరిట సిద్దిసవాబఖ్ఖానునొద్దకుఁ బుత్తెంచెను. ప్రభు వాదేశించినరీతినే బాజియు సంధిపరతులు సరిగాఁ దెమలింపక మెలిపెట్టుచుఁ గోటనుండి యరాతుల గుడారములకును గుడారములనుండి కోటకునుఁ దిరుగుచు నాల్గైదుదినములు జఱుపుచు జాగరూకతతో మెలంగుచుండెను.

ఈలోఁగా బాలాజి యొకయుత్తరము వ్రాసి యాకమ్మతోపాటు వానియుంగరమును నిజమరిస్నేహితున కొక్కని కిచ్చి ఫజీలుకడకుఁ బను

పుటయు వాఁడును ప్రభావతిపంపఁగా వచ్చినసందేశహరుఁడట్లు నటించుచు ఖానుకుమారుని భ్రమింపఁజేయుచుండెను.

ప్రభావతీసమేతముగా మొన్న గెల్చుకొన్న కోటలన్నియు స్వాధీనపఱుటయేకాక సామంతుండౌటకుఁగూడ శివాజి సమ్మతించుచున్నాఁడని సిద్దియు నిదేసమయము ప్రభావతిని జిక్కఁబట్టుకోవచ్చునని ఫజీలును నొకరికంటె నొకరు పెల్లుబ్బి యుభయు లేకముఖులై శివాజి నిజముగా సంధి కొడంబడునని నిశ్చయించి పోరునిల్పుడు చేయించిరి. శివాజియు దదను గుణముగా రేపోమాపో కోటపఠానులపాలు చేయునట్లు వేషభాషల నటమటించుచుఁ దా మనుకొన్నట్లు కొనవఱకు జఱుగునో లేదో యని భయపడి యిష్టదేవతయగు భవానిని గార్యానుకూలతకుఁ బ్రార్థించుచుఁ దత్ప్రీత్యర్థము జపహోమాదులు చేయించుచుండెను.



# ఇరువదియైదవ ప్రకరణము.



బాలాజిపంపిన కపటసందేశహరునివచనంబులచేఁ బూర్తిగా వంచింపఁబడి వాఁడు తెచ్చినయుత్తరమువలన సుల్తాను ప్రభావతి నాసించియే బాలాజిని విడుదలచేసియుండునని నిశ్చయించి తనలోఁదానిట్లు వితర్కించుకొనెను. "ఔరా! సుల్తానెంతటక్రూరీఁడు. పైకి నాకని చెప్పి నాప్రేయసిని తానేచెట్టవట్టి సమకట్టినాఁడుకదా? ఇస్సిరో! నన్ను నమ్మించి నాకుత్తుకఁగోయఁజూచినాఁడు. ఛీఛీ! ప్రభులకంటెఁ బాపాత్ములొక్కరుండదరనియే యూహింతును. వాఁడు శివాజి నాజనకునివంచించి వధించినసంగతి దర్బారుద్యోగస్థుల కెఱింగించి తత్సమక్షమున నమ్మరాటపతిని బెలుచ నిందించి వారిసాయమునఁ బగదీర్చుకొన జూచుచుంటిని. నేఁడు నాయజమానియే నన్ను మోసపుచ్చి చెడప నుంకించుచున్న నింకనెవ్వరితో మొఱ్ఱవెట్టుకొందును. ఇస్సీ! పైకెంతోహితుండట్లుపచరించుచు నింతలోనెంతచేయ నుద్దేశించెను. దీనికంతకు హేతువు ఫకీరుకాఁడుకదా! నిజముగాఁ బ్రభావతికి నాపై నిష్టములేకున్నచో నిట్లువ్రాయునా? ఆకొమ్మ యీకమ్మ వ్రాయకపోయినచో సుల్తానుచేతిలో నాప్రాణములు పోవలసినవేకదా! అయినను జంఝూరునితో విచారించి యింకముందు కెట్లు మెలంగవలెనో తెలిసికొందునుగాక." యిట్లు విచారించి జంఝూరరావు నటకు రావించి యతనికీసంగతులెల్ల యెఱింగించి పదంపడి యిట్లు ప్రసంగింపఁజొచ్చెను.

ఫజీలు—మిత్రమా! చూచితే! యీయుత్తరము. సుల్తానింతవాఁడని యెఱుంగను. పకీరు దీనికంతటకు హేతువైయుండునాయేమి?

జంఝూర—ఫజీల్! మొదటనుండియుఁ బకీరు రాకపోకలు నాకనుమానాస్పదములుగానే తట్టుచున్నది. ద్రవ్యాపేక్షకుండైనను గావలె లేదా మనలనందఱను వంచించుటకు వైరులచేఁబంపఁబడినవేసగాఁడైనను గా

వలెను. కాని యెంతమాత్రము నిజమైనపకీరని నాకుఁదోఁచదు. విరాగుల కేడ రాజాశ్రయము. అతనిమాటలనమ్మియే సుల్తాను బాలాజిని విముక్తి చేసియుండవచ్చును. లేకున్న నన్ను నడగకయే యింతకుఁబూర్వ మెవ్వా రినేని విడుదలఁ గావించెనే! నాతో నప్పుడప్పుడు భూతదయనుగూర్చి ముచ్చటించుచు నానడుమ బాలాజిప్రసంగము తీసికొనివచ్చి యాతని సౌందర్యసౌకుమార్యాదు లభివర్ణించుచు నంతవాని కింతగతిపట్టెఁగదా! యని విచారించుచునుండువాఁడు. దీనిఁబట్టిచూడఁగాఁ బకీరేమో మోస కాఁడట్లు కనఁబడుచున్నది. దీనికేమిలే! ఏదీ కమ్మ యిందిమ్ము.

అని యాజాబు గ్రహించి యందలివ్రాతలవైఖరి కనిపెట్టి ముందటివ్రాత లకును దీనికిఁ గొంత భేదముండుటఁజూచి సంశయించి యెంతమట్టుకువ్రాతలు నమ్మవచ్చునో యని విచారించుచున్న సమయమున ఫజీలు "నీకేమి యందలి సంగతులు బోధపడకున్నవా? అట్లైన నా కాకమ్మనిమ్ము" అని జాబును లాగికొని యిట్లు చదువఁదొడంగెను.

తే. సామి ! నన్ను మీయేలిక సామి తన్నుఁ
బరిణయము కమ్మనుచు రాయబార మిపుడు
సలుపుచున్నాఁడు తమ రిది తెలిసికొనిరొ
లేదొ మిమ్ముఁ గూడు టెట్లింక మ్లేచ్ఛవర్య.

ఉ. ఓరసికాగ్రగణ్య! నను నొప్పుగఁ జేకొనఁ జూతురే న్విజా
పూరును బాసి నన్ను గొనిపోవలె వేఱొకసీమ, కిందుకుఁ
మీరలు సమ్మతింపవలె మీకును దక్కును కానినాడు వి
స్తారము మాట లేటికి విచారముచేసిన మీ రెఱుంగరే.

ఉ. ఎట్టినిబంధనంబులకు నేని యొడంబడ నున్నవాఁడు రా
జిట్టిదివేళ యాటఁ దమ రిపు శివాజిఁ దదాశ్రితప్రజఁ
నెట్టన విడ్చిపుచ్చుటకు నెమ్మది సమ్మతి చేయు చాపయిఁ
గట్టిగ నన్ను గోరినను గాదన కిచ్చెడు నాత్మరక్షకై.

తే. మంచిసమయంబు చేకూఱె నెంచిచూడ
నిట్టియెడ నుపేక్షింతువే నింకమీఁదఁ
దల్లిదండ్రులు నన్నొక్కకల్లరికిని
గట్టిపెట్టుదు రావలఁ గార్యము సెడు.

తే. చెప్పవలసినదంతయుఁ గప్పిపుచ్చ
కిందుఁ బొందుపఱచితి మీరింకపైని
నన్నుఁ జేపట్ట నెట్టుల నడుచుకొందురో
భారమెల్ల మీమీఁదనే వైచియుంటి.

జంఝూర—ఓయీ! తొంటికమ్మకును దీనికిని వ్రాతతోఁ గొంతవ్యత్యాసము న్నది సుమీ ?

ఫజీలు—ఔనౌను! మొదలిట్లేయనుమానపడి జాబు తెచ్చినచారునిఁ దర్కించి యడిగితిని. వాఁడది కలములోటువలనఁ గల్గినదని చెప్పి యప్పటికి నేను నమ్మకున్న నే నింతకుముందొసంగినయుంగర మానవాలు చూ పెను. కావున లేఖలోనివ్రాఁతల కనుమానపడవలసిన పనిలేదు.

జంఝూర—నిశ్చయముగా సుల్తానునకుఁ బ్రభావతిపై నాసగల్గినచో నతని గొల్వుపై నాసయు మనకు నింతటితో నుడుగవలయు. కానిచో మన నాశనమునకు మనమే కారణమగుదుము.

ఫజీలు—ఔను. నీవు వాక్రుచ్చినట్లే ప్రభావతియు లేఖలో వ్యక్తపఱచినది నే నెట్లు ప్రియురాలిని వశపఱచుకోవలెనో యెఱుంగకున్నాను.

జంఝూర—తెలియకుంటకుఁ దోచకుంటకు నేమున్నది ? విజాపురి మొగము చూడవలెనన్నఁ బ్రభావతి మొగమును, ప్రభావతిముఖము దర్శింపవ లెనన్న విజాపురిముఖమును దూరంబగును. ఈరెంటిలో నీకెద్దిప్రియమో చూచుకొమ్మ.

ఫజీలు—దీనికేమి సరేకాని యెట్లు జోహారని వంచించి ప్రభావతిని దీసికొపో వలెనో చెప్పితివి కావుగదా? ప్రభావతికంటె విజాపురియే కాదు నాకు మఱేదియుఁ బ్రియంబు కాదుసుమీ !

జంఝూర—అవ్వ బువ్వ రెండు గావలెనన్న సరిపడ దన్నమాట మాడ నీపట్టఁ బట్టినది. ప్రభావతి తోఁపాటు పన్హాలాకోట మనకు శివాజి యర్పించుట తటస్థించు నేని తక్కినవానికోటలు తాను లోఁబఱచుకొందునని సవాబత్ఖానుఁడు నిన్న నాతోఁ బ్రసంగవశంబున వచించినాఁడు. కాన నతఁడిప్పటిలో విజాపురికి మఱలుకొనఁడనియే నిశ్చయింపవచ్చును. అంత నన్ను గాని నిన్ను గాని తోడిచ్చి ప్రభావతిని సుల్తానుసన్నిధికి గొంపోవు మనును. లేదా లాఁతివానినిబంపినచో మార్గములో మన మడ్డగించి ప్రభావతిని విడిపించుకొనిపోవచ్చును.

ఫజీలు—అట్లైన నెచ్చెలీ! నిన్ను వెంటనిచ్చిపంపినచో నేను మనవారిని జరాస్తితోఁబాటు తప్పించికొని తీసికోవత్తును. నన్ను బుత్తెంచినచో నీవట్లు చక్కపెట్టుకోరాఁగలవా?

జంఝూర—ఈమాత్ర ముపకారము చేయలేనా? నీపై ప్రేముడిచేఁగాదే నాడు శివాజి తనవద్దనుండుమని యెంతబోధచేసినను బెడచెవినిఁబెట్టి నిన్ను గలసికొంటిని! నీవు చెప్పినట్లు చేయుటయేకాక నీతోఁపాటు నే నుద్యోగము విడిచి విజాపురినుండి లేచివత్తును.

ఫజీలు—ఘూటగే! ప్రభావతిసంగతి నాలోచించి సుబీూ సిద్ధిసేనాని శిబిరమునకు విచ్చేసినశివాజిని బగఁదీర్చుకోక విడిచిపెట్టితిని.

జంఝూర—శివాజి యన్నజ్ఞాపకము వచ్చినది. నిన్నటిదినమున సంధినిబంధనలన్నియుఁ బరిష్కరింపఁ బడినవా?

ఫజీలు—రణగడ ప్రతాపగడ విశాలగడ దుర్గములుమాత్రము కొంకణప్రభువు వదిలిపెట్టనని గట్టిపట్టు పట్టియున్నాడు. కాని సుల్తానునకు శివాజి సామంతుఁడై మెలఁగుదు నన్న పుడీమూఁడుదుర్గములు విడిచిపెట్టవచ్చునని నొక్కి వక్కాణించితి. ఇందుల కతం డిష్టపడినట్లే తరువాతఁ జెప్పినాడు. అటుపై నేమైనది నాకుఁ దెలియదయ్యె. ఈపాటికి శివాజి గాని వానిరాయబారిగాని జోహారుడేరాకు నేతెంచియే యుందురు. మన మటకుఁ జనుదెంచిన నన్నిసంగతులు బోధపడఁగలవు.

జంఝూర—చూడుము. ఆడఁబోయినతీర్థ మెదురాయె నన్నట్లు రాయబారి యు సిద్ధిఖానుఁ డిచ్చటికే యరుదెంచుచున్నారు.

అని దిగ్గనలేచి యతండు వారిని సగౌరవముగాఁ దోడ్కొనివచ్చి యుచితాసనములపై నాసీనులఁజేసిన వెనుక నానల్వురు నిట్లు ముచ్చటించిరి.

ఫజీలు—సవాబ్ఖాక్! మేము మీసన్నిధికి వేంచేయవలెనని యిప్పుడే యను కొనుచున్నాము.

సిద్ధి—ఎవరివద్ద నెవరువచ్చిన నేమి ? నిన్న మనమనుకొన్నట్లు జరిగించుటకు నీ కిష్టమేనా ?

ఫజీలు—శివాజికోరిన మూఁడుకోటలు వదలివేయుటే కదా?

సిద్ధి—ఔను. తక్కిననిబంధన లింతకుముందే పరిష్కరింపఁబడినవి. కోటలిచ్చు టకు నొప్పుకొంటిమేని ప్రభావతి నీమాపటివేళనే పంపుదురట.

జంఝూర—సుల్తాను కోరినదింతేకదా ! దీని కొప్పుకొనుంట కేమున్నది ? ఫజీ లభిప్రాయము నిన్ననే వెల్లడిచేసినాఁడుకదా ?

సిద్ధి—బాజీ ! వింటివికదా ! ఇంక మీయాలస్యమే !

బాజీ—అట్లైనఁ బ్రభావతి నిప్పుడే యొప్పఁజెప్పెదము. కాని విశాలాక్షినిఁ బంపవలెను జుడీ! మారాజుగారీవిషయము నొక్కిచెప్పమన్నారు. సాహెబులారా ! ఇయ్యెడ నామనవి యొక్కటియున్నది. ప్రభా వతి యెన్నఁడుఁ బరపురుషుల కంటఁబడఁదు. దానికిఁ దగినయేర్పాటు చేయఁ బ్రార్థితులు. ఇంతకు సుల్తాను పరిగ్రహింపనున్న తరుణివిషయ ములో నెట్లుచూచుకొవలెనో వేఱెచెప్పవలెనా ?

సిద్ధి—ఇంతకుఁ బూర్వమే తగినయేర్పాటు చేయించినాను. అదిగో ! మనకు నుత్తరమువైపున నరమైలుదూరములో గనఁబడుచున్న చిన్నిగుడార ము నే నాపెకొఱకే పటిపించినాను. ఓయీ ! వేగమపోయి ప్రొద్దుపో కమున్నే ప్రభావతిని సాగనంపు నేర్పాటు చేయుము. రేపు కోట స్వాధీనము చేయవచ్చును.

బాజీ—చిత్తము. సెలవు తీసికొందును.

అట్లుతండు చనినపిమ్మట సిద్ధిఖాను వారితో నిట్లనియె. "ఓయీ! ఆసుందరి వచ్చెనేని యీ రేయియే యాపెను రాజధానికినంప నిశ్చయించుకొన్నాను. సంధిలో షరతుల ప్రకారము శివాజి నడుచుకొనినది మానినది కనిపెట్టికాని నే నిచ్చోటు విడిచిపెట్టి పోఁజాలను కాన మీలో నొకరు ప్రభావతివెంటఁ బోవలసియుండును. మీకంటె నాకు నమ్మఁదగినవారు వేఱొకరులేరు." అని చెప్పి యూరకుండిన ఫజీలు తనకోర్కె నేతిలోఁబడినదని మనసులో నుప్పొంగుచుఁ బైకిమాత్ర మొక్కింత సమ్మతించువానిరీతి నటించుచు నిట్లనియె. "సాహెబ్ఖాన్జీ! హుజూరుకార్యవిషయములో మీరింత చెప్పవలెనా! ఏమిది మీస్వంతకార్యమా అట్లైనను మీవెంటవచ్చినప్పుడు చెప్పినపనిచేయకుండఁ దప్పుకొందుమా! నావెంటమాత్రము కొంత సైన్యము తీసికొనిపోవుటకు సమ్మతింపవలెను లేనిచో మార్గమధ్యమున శత్రువులచేతిలోఁ జిక్కుకొందుమేమో యని యిట్లడిగితిని." నావుడు సిద్దిఖానుఁ డిట్లనియె "నీసైన్యముండఁగా నిట్లడగవలసిన పనియేమున్నది? ప్రభావతిని దిగఁబెట్టి తిఱుగ నావెంటనే మమ్ముఁ గలసికోవలసినది. వీలైనచో శివాజినిగూడఁ గట్టితేవలెనని యుద్దేశించుచున్నాను. మఱియు నాతఁడు చిక్కిన పిమ్మట దుర్గములెల్లఁ బ్రాణముపోయినదేహమువోలె నిస్త్రాణములై స్వాధీనపఱచుకొంట సుసాధ్యపడును." అని యిట్లు తనతలంపు తెల్పుడుచేసి పోయివచ్చెదనని చెప్పి వీరినివిడిచి తనశిబిరమునకుఁ దిన్నగా నడచెను.

ఖానుఁ డిట్లుచెప్పిపోయినవెనుకఁ దా ననుకొన్నట్లు తటస్థపడినదని పట్టరానిసంతోషముతో మిన్నుముట్టి తనసఖుని గాఢాలింగనముచేసికొని నేడు కదా! సుదినము. ఔరా! ఆయన్ను మిన్ననుగూర్చి యెన్నెన్ని పాట్లుపడితినో నీవెఱింగియే యుండుదువుకదా! మన మిందాక మాటలాడుకొన్నట్టు లక్షురాల జేరపవలసినది సుమీ! నే నుత్తరమునకు నత్తలోదరి వెంట నిడుకొనిపోయి బహుశః అహమ్మదునగరమునకుఁ బోయి చేరికొందును. నీ వచ్చటి కెంత వేగము వత్తువో నీమీఁదభారమువైచియే సుమీ! నే నిట్లుపోనిశ్చయించితిని. అనిచెప్ప వలసినవెల్ల గ్రుచ్చిచెప్పి యతనిని వీడ్కొని తనసైనికులకెల్లరకు నీదినమే ప్రయాణ

మని చాటించి తత్సన్నాహంబులోఁ గొంతకాలము వెచ్చించి వెండియు గొందఱు భటులందీసికొని సంకేతస్థానసమీపమునకుఁ జని ప్రభావతి రాకకై యెదురు చూచుచుండెను. అప్పటి నేవిధమైనధ్వని వినిపించినను బల్లకీబోయీల కేక లేమోయనియు నేమాత్ర చీమచిటుక్కుమన్నను తనవలపుకత్తియవచ్చుచున్న దేమోయనియుఁ గోటలోనుండి యెవ్వరేపనిమీఁద వెలికివచ్చినను ప్రభావతిరాక తెల్పుటకు చేయుదురేమోయనియు నడియాసఁజెందుచు, సంజవేళ సమీపించుచున్న కొలంది నీదిన మాయొప్పులకుప్ప గన్నులారఁ జూచుభాగ్యము లభింపదేమో యని విచారించుచు క్షణ మొకమహాయుగముగతి గడుపుచు వేగించుచుండెను.



# ఇరువదియాఱవ ప్రకరణము.



త్రికాలజ్ఞుండగు జగన్నాటకసూత్రధారుఁ డింక నొక్క ఘడియలో సంభవింపనున్న బీభత్సకృత్యము లోకసభ్యులకుఁ బ్రదర్శింపఁజేయుట ప్రాచీనసాంప్రదాయకము కాదనియెంచి కాఁబోలు నంతరిక్షమున వ్రేలాడుచున్న నభోమణిదీపిక నింతలో మెల్లగాఁ దొలంగింపఁజేసెను. అంతట ఫజీలు కాల సమాప్తిగని పెట్టి మృత్యుదేవతయే వచ్చుచున్నదన్నట్లుగా సంజచీఁకటి వేవేగఁ గ్రమ్ముకొనఁ దొడంగెను. ఇదికనిపట్టి సమయజ్ఞుఁడగు శివాజీ ధర్మరాజు దూతలు మువ్వురు దవ్వుదవ్వన నాగుడారము దెసకుఁ బరుగిడుచుఁబోయి ప్రభావతి యిదె వచ్చుచున్నదని ఫజీలున కెఱింగించి వెంటనే యచ్చోటువాసి వచ్చినదారినే పోయిరి. అటుతరువాతఁ దలుపులుమూసికొనియున్న యొక్క సవారినిమోసికొని యార్వురుబోయీలును వారననుసరించి కొంతమంది దాసీ జనంబులునుఁ ద్వరితముగా నాగుడారముకడకు నడిచిరి. పాపము వారినిఁజూచి దురాశాపిశాచపీడితుండైన ఫజీలు నిజముగాఁ బ్రభావతియే వచ్చుచున్నదని నమ్మికొని యింకఁ దనకోరిక లీడేఱనని పొంగి యుదివఱకు గుడారమున కొక్కింతదూరమున నున్నవాఁడు కతిపయజనముతో విధిప్రేరితుండై యున్నచోటనుండలేక సవారి గుడారములోనికిఁ జేరకతప్ప ముందే తానునచ్చటికి వెసఁ జనుదెంచెను. అప్పటి కప్పుడే మ్లేచ్ఛజనతిమంబునుబోలెఁ గ్రమంబుగాఁ దమంబును వృద్ధి కాఁజొచ్చెను. వెలుపలివిషయములన్నియు మెలఁకువతో సవారితలుపుల సందులనుండి వీక్షించుచున్న బాలాజి నిజసఖునిమిత్రముగాఁ దటాలునఁ దలుపులు తెఱచుకొని క్రిందికి దుమికిఁ గరవాలంబుతీసికొని గజంబు పైకి లంఘించు సింగంబుభంగి ఫజీలుమీఁది కుఱికెను. తోడనే ఫజీలును దన కరవాలంబు వరలోనుండి లాగజొచ్చెను. అదిచూచి బాలాజీ కరవాలంబు గ్రహించుకరంబును దెగనఱికి ఫజీలుని గ్రిందికిఁ బడఁద్రోచి "ఓరీ! దురాత్మా!

నీవు ప్రభావతిని బరిణయంబు కాజూచితే! నాడు నీవు నాకుఁబెట్టినబాధల కెల్ల నిప్పుడే ప్రతిఫల మనుభవింపఁజేసెదను. నీతండ్రితో లేనిపోనికొండెములు చెప్పి పుణ్యాత్ముఁడగు పూజారిని జిక్కులు పెట్టఁజూచిన నీపాపమునకు మేర గలదే? " అని యిట్లు నిష్ఠురోక్తుల నోనాడి యొక్కింత సేపు తనయాజికౌశలముచూపి భీముఁడు సింహబలునట్లు వైరినిఁ బంచత్వమందించెను. ఈలో బాలాజి వెంటవచ్చిన వానిసఖులగు స్త్రీవేషధారులైన మరాటసైనికులు బాలాజిపైఁ గవసిన ఫజీలుభటులతోమార్కొని వారిని యమమందిరమునకు నతిథులుగాఁ జేసిరి. అంతట నాసమీపముననుగల ఫజీలుసైనికులు హాహారవంబులుచేయుచు మోసము మోసమనియెలుఁగెత్తుచు హుటాహుటిని గుడారము దెసకుఁ బరుగెత్తిరి. ఈగోలయు గందరగోళము నదివఱకుఁ బట్టణముముట్టడించిన తక్కటి యవనసైనికులు కనిపట్టి తొట్రుపాటుపడుచు నందఱు నొక్కమొగంబుగా వేగమ యాస్థలమునకుఁ రాఁజొచ్చిరి. ఇట్లు సైనికులొక్కపెట్టున వచ్చుచుంటజూచి బాలాజి ముఖమరాటులు భీతిల్లక పోనీకుడు పోనీకు డని నొండొరులు పురికొల్పుకొనుచు దారికడ్డముదూరిన ఫజీలుసైనికులం గత్తికటారములచే విదిలించుకొంచు దూసికొని యసంఖ్యాకమైన శత్రుబలంబు తమ్ముఁదరుముచుండఁగా నాచేరువనున్న పొదలలోనికిఁ బాఱి మఱుఁగుపడిరి. ఆరేయి యొకరిమొగ మొకొరికిఁ గనఁబడని బహుళపక్షరాత్రియౌటఁజేసి మరాటులను వెంబడించి ముందుగాఁ బరుగెత్తిన ఫజీలు సైనికులను వైరులఁగా భావించి యావెనుకనుండి తరుముకొవచ్చిన సిద్ధిభటులు తుపాకిగుండ్లచేఁ దమవాండ్రఁ బెక్కుఱఁ బోకార్చిరి.

ఇట్లు యవనబలమెల్ల నాయల్లరిలోఁబడి కొట్లాడుకొనుచుండఁగా శివాజి బాజిప్రముఖులను దోడ్కొని కొంతసైన్యముతో వేఱొకవైపునుండి చడిచప్పుడుకాకుండఁ బాఱిపోయెను. ఆదిని బలాయితులైన బాలాజిముఖ్యులకునాకొండదారులెల్లఁ గొట్టినపిండియైనకతన జాముచరాత్రి యైనపిమ్మట శివాజిప్రముఖులగు తమవారిని గలసి నవ్వుచు ద్రుళ్ళుచు వారితో బాటు త్వరితముగా నేఁగుచుండిరి.

ఇటు నా రాత్రి సవాబత్ ఖాను తన సైన్యముతోఁ బడిన సంక్షోభ మింతం తని చెప్ప నలవికాదు. ఫజీలుని బోకార్చినది యెవ్వరో తెలియక పోవుటవలనను దమ సైనికు లొండొరులు గానక పొలియించుకొనిరని తెలియుటవలనను సవాబత్ ఖాను తా నానిశీథమున నేమి చేయుటకుఁ దోపక సైనికులతోఁ బాటు నిద్ర మానుకొని బల్లుమని తెల్లవాఱువఱకుఁ గంగారుపడుచుండెను. అటుతఱువాతఁ గోటకుఁ బశ్చిమభాగమున గానవచ్చిన మరాటుల కాళ్లజాడఁ గనిపట్టి శివాజి సేనాసమేతముగా నాదారి వెంటఁ బోయియుండవచ్చు నని సిద్ధి నిర్ణయించి యావెంటనే తనకుమారునకుఁ గొంతయశ్వసైన్య మిచ్చిపంపెను. సిద్ధినందనుం డును వాని వెంటఁబోయిన తక్కినయోధులు తమవాజుల నతిత్వరితముగాఁ బోనిచ్చిరి. కాని వారు జాముప్రొద్దెక్కుదాక మరాటసేన పృష్ఠభాగ మే వీక్షింపలేకపోయిరి. అట్లు ప్రతిపక్షులు ఘోటకారూఢులై యతి త్వరితముగా వచ్చుచుంట శివాజి పరికించి యక్కడకు రణగడాదుర్గ మింక నాలుమైళ్లుంటఁ దెలిసికొని సైన్యముతో బాజి నటనిల్పి కృష్ణాజి బాలాజి ముఖ్యులను గొంతమందినిఁ దీసికొని తాను గమ్యస్థానమును జేరుకొనుటకు దవ్వు దవ్వునఁ బాఱఁజొచ్చెను. ఇంతలో సిద్ధిసైనికులు మహావేగముగా బాజి నిల్చియున్న స్థలమునకు సమీపించిరి.

•

పరభుసైన్యాధిపతి నిల్చినట్టితావు రెండు పెనుగుట్టలకు నడుమనున్న యిఱుకుత్రోవ మొగయాటవలన నటనుండి తనకొలంది సైన్యముతో సిద్ధి కుమారునివాజిసైన్యమును ఒకగంటపిమ్మట నావెంబడినే తత్సాహాయ్యముగా వచ్చిన భూరిపదాతిసైన్యమును సరకుచేయక యుద్ధముచేయుచు రెండుగంటల సేపు నిలువరించెను. కేవలము స్వదేశాభిమానపూరితులై తొల్లి ధర్మపోలీస్థలము నందు మూడువందల స్పార్టనులు ప్రచండపారసీకబలంబునోర్చి పెనంగిన తెఱంగుననే స్వామిభక్తిపరాయణులైన మరాటసుభటులు ఘాటీలనడుమ నుండి పఠాణులఁ జొరఁబడనీకుండ నతిసాహసముతోఁ బోరాడఁజొచ్చిరి. కానిచిచ్చునకు గాడ్పుతోడైనట్లు గుఱ్ఱపుబలమునకుఁదోడుగా కాల్బలముగూడుటవలన ఒకటినర్ర గంట సేపటికి శివాజిభటులు ముప్పాతికమంది వీరశయ్యన

మంది తమనాయకుఁడగు బాజికి జయంబుపట్ట నిరాశను గల్గించిరి. ఐనను నప్ప
గభువీరశిఖామణి శౌర్యస్థైర్యములు విడనాడక సాహసపరాక్రమంబులు చే
పట్టి నాటిపద్మవ్యూహమునఁజిక్కుకొనిన యభిమన్యునివోలె విజృంభించి యరి
జనంబును బీనుఁగపెంటగావించుచుఁ బావుగంట కెక్కుడుకాలంబు యవనుల
తోఁగసిమసంగి కయ్యంబుసల్పెను. ప్రాణములింక నైదునిముసములకుఁ బోవు.
ననఁగా శివాజినిర్ణయప్రకారము రణగడనుండివచ్చిన ఫిరంగులధ్వని చల్లగావిని
శివాజిముఖ్యులు సురక్షితముగా దుర్గమును జేరికొన్నందులకు సంతసించి "నా
విధ్యుక్తకార్యము సల్పితి" నని బిగ్గరగా నుగ్గడించి జీవితాశవిడిచి యటుపై
నెక్కింతపోరాడి రణాంగంబునకుఁ బ్రాణంబులు సమర్పించెను.

ఇట్లు రాజుకార్యమునకై దేహముదాఁచక యద్భుతముగా నిరు
వాగులవారును మెచ్చుకొనునట్టు లాలముసల్పి ప్రాణత్యాగముచేసి వీరస్వర్గము
చూఱఁగొన్న యాస్వదేశాభిమానధురంధరునికళేబరమును దద్భటులు వైరులకు
జిక్కకుండ బహుప్రయాసముతోఁ బర్వతముపైకి దీసికొనిపోఁగల్గిరి. ఇట్టి
ప్రభుభక్తిపరాయణశిరోమణి యాటవలననే బాజిపరభునామ మీనాటికి
మానధనులగు మహారాష్ట్రులు స్మరించుచు గౌరవింతురు.

ఉ. కావలె రాజరాజయినఁ గావలె సత్కవి చంద్రుఁడైననున్
గావలె యోగిరాట్టయినఁ గావలె భోగశచీంద్రుఁడైననున్
గావలె వైష్ణవుండయినఁ గావలె యోధకిరీటియైననున్
భూవలయానలాతినరుపుట్టుకపట్టెనిరర్థకంబగున్.

బాజి కీర్తిశేషుండౌట శివాజి బాలాజి ముఖ్యులును హతశేషులవలన
నెఱింగి తద్దయు దుఃఖించిరి. శివాజి బాలాజికంటె నెక్కుడువగచి తండ్రిని
గోల్పోయిన యాపరభుకుమారుని ఖేదము తగినమాటలచే నుపశమింపఁజేసి యా
బాజికళేబరము కష్టముమీఁదఁ దెప్పించి యథావిధిగా సాంపరాయక ప్రేత
క్రియలు కావింపించెను. బాజిచూపిన యనన్యసామాన్యపరాక్రమాదులకు నత
నిని వేనోళ్ల శ్లాఘించి కోంకణపతి తదీయసైన్యాధిపత్యము మనబాలాజికి

నర్పించి బాజీతోఁబాటు యుద్ధముచేసిన యతనిసోదరులకు నమూల్యాభరణములు నాందోళికాదులనిచ్చి వారికి సరబనీసుపదంబులొసంగి యాదరించెను. అట్లు తరుముకొనివచ్చిన యవనభటులు బహుకష్టముమీఁద రణగడకోటఁజేరుకొని కొన్నిదినంబులు ముట్టడిజఱపిరి. ఈసంగతి నెట్లో నేతాజిపాల్కారు తెలిసికొని పేష్వాసమేతముగా నచ్చటకు విచ్చేసి విరోధిసైనికుల నేనవేలను నేలపాలుగావింప నమ్మరాటధాటికి నాఁగజాలక పఠానులు పలాయనంచిత్తగిరి. తన కుమారుండు రణగడనుండి ప్రాణంబుతోఁ దప్పుకొని తన్నుఁగలసికొన్న పిమ్మట సవాబక్షిఖాను యావద్బలమును వినియోగించి రణగడకోట లోఁబఱచుకొనుట మేలో లేక పన్హాల వశపఱచుకొనుట మేలో యనివిచారించి యేటుపాలుపోక వెంటవచ్చిన జంరఘూరరావు బాజి ఘోరపురేలతో నిట్లాలోచనలు సేయదొడంగెను.

సిద్ధి—ఓయీ జంరఘూరరా! చూచితికదా మనకంటిలోమన్నుకొట్టి శివాజి తప్పుకొన్నవిన్నాణము. నాడు అఫ్జలును నేడు ఫజలును పడిసిరి. ఇంక శివాజి నెట్లైనను బంధింపకకాని వధింపకకాని రాజధానికి రాఁజాలను. ప్రస్తుతము పన్హాలాస్వాధీనపఱచికొని ప్రభావతినైనను వశపఱచుకొందుగాక ఇట్లు కానినాడు సుల్తానుమోము చూడఁజాలను.

జంరఘూర—ప్రభావతి పన్హాళాలో నెంతమాత్ర ముండునని నాకుఁదోపదు. మీ రీమిగిలిన సైన్యముతోఁ బన్హాలాకోట నాక్రమించినను దక్కిన కోటలు వశపడవు. అదికాక పేష్వానేతాజు లేకమైవచ్చినచో నిచ్చట మనము చిక్కుపడక మానము. కావున మూలబలంబులు మఱికొన్ని తెప్పించినపిమ్మట నెట్లుచేయవచ్చునో చూచుకొందము.

ఘోరపురే—జంరఘూరరావు చెప్పినచొప్పున నడుచుట మంచిదని నా నమ్మకము. ప్రభావతి ప్రతాపగడలోనేయున్నదని నా కనుమానముగలుగుచున్నది.

ధి—అట్లైన ఘోరపురే! నీవు నీసైన్యముతీసికొని ప్రభావతిని వెదకి తీసి
కొనిరమ్ము. జంఝూరరావు రాజధానికిఁబోయి సైన్యము తెచ్చులోఁగా
నీపట్నాలాదుర్గమును లోఁబఱచుకొందును.

అని వారియాలోచనప్రకారము ఘోరపురేను ప్రతాపగడకును జం
ఘూరరావును రాజధానికిఁ బుత్తెంచి జోహరుఖాను ముట్టడి తిరుగఁ బ్రారం
ింపఁజేసి నాథుఁడు లేని పట్నాళను బట్టుకొన సమకట్టెను.

# ఇరువదియేడవ ప్రకరణము.



ఇబ్రహీముఖాను సుల్తానుమంత్రి యని యిదివఱలో వ్రాసియుంటిమి కదా! కర్నూలు జమీందారుఁడగు సవాబత్ ఖాను కర్ణాటకరాజుల నెల్లరను జయించి వారిని సుల్తానునకు సామంతులఁగాఁ జేయుటవలననే యేదులుషాహి వానియెడల విశేషప్రీతిఁగల్గి తనరాజధానియందు నిలువఁజేసెను. నాఁటఁగోలె రాజకీయవిషయములందేమి తదితరాంశములందేమి తలుచుగా సుల్తాను ఇబ్రహీముమ్ముఖ్యులమాటలతో సి కార్యశూరుండైన సిద్ధిజోహారుమాటలు పాటించుచు వానియాలోచనచొప్పున నడుచుచుంటఁజేసి వారికెల్లగకు సవబత్ ఖానుపై ననూయఁ బెరగఁజొచ్చెను. వారిలో ముఖ్యుండైన యిబ్రహీము సిద్ధినెట్లైనను దర్బారునుండి తొలఁగింపఁజేయుటకు సందువెదకుచుండెను.

ఒకనాటిప్రాతఃకాలమున నిబ్రహీము నిజమందిరమున నధివసించి యేవో కార్యాలోచనలు చేయుచుండెను. ఆసమయమున వజీరుపరిచరుం డొక్కఁడక్కడకువిచ్చేసి ఫజీలుభటుం డొండు చనుదెంచి యింటిముంగల వేచియున్న సంగతి తెలియఁజేసినవెంటనే వానిని లోనికి రప్పింపవలసినదని యప్పఠాను మంత్రి యప్పరిచారకునకు నానతిచ్చుటయు వాఁడు నాభటుని యజమానియొద్దికిఁ దీసికొనివచ్చి తా నేదోపనిమీఁద నచ్చోటువాసిపోయెను.ఆవచ్చినభటుండు రూపమునుబట్టిచూడ ఫజీలువద్దకు రెండుసారులువచ్చిన విఠలుదాసునివైఖరిఁ జాలమట్టుకుఁ బొడగట్టుచుండెను. కాని వాఁడు హిందువు. వీఁడు మహమ్మదీయుఁడు. కాన నుభయులొక్కరని చెప్పుటకు నంతగా వలనుపడదు. ఆభటుఁడు వజీరునకు సలాముజేసి యతనిచే మన్నింపఁబడినతరువాత నయ్యిరువు రిట్లు మాటలాడుకొనఁజొచ్చిరి.

భటుఁడు.—వజీర్సాహెబ్ ! తమ కొకఘోరవార్త వినిపింపవలసివచ్చినది.

అక్కటా! ఫజీల్సాహెబ్.

ఇబ్ర—ఏమీ! ఫజీలునకు నేమేని యుపద్రవమువచ్చినదా ?

భటుఁడు—పెద్దయుపద్రవమేవచ్చినది. మరణమే !

ఇబ్ర—ఔరా! ఎంతపనియైనది. నిన్న వచ్చినచారులు తెలియఁజేసిన వర్తమానమునకును నీవు చెప్పుదానికిని జాలహెచ్చుతగ్గు గన్పడుచున్నది. నిజముగా ఫజీలు మృతిఁజెందినాఁడా! వివరముగా జెప్పుము.

భటుఁడు—నిన్నటిచారులు చెప్పినదినిజమే నాచెప్పునది నిజమే! సాహేబ్జీ! ఇట్టిచెడువార్త లెవ్వరు పుట్టింతురు? మాదురదృష్టమువలన నిట్లు సంభవించెను. శివాజికిని మాకును నాలైదుదినములు సంధిమాటలు జఱిగినవి. ఆఅవనాటిసాయంకాలమునఁ బ్రభావతినిఁబంపుచుమని యొకసవారిశిబిరములకు నరమైలుదూరమువనున్న యొకగుడారమువద్దకుఁబంపిరి. ఆసవారిలోఁ గూర్చుండిన వీరులును వారివెంబడివచ్చిన స్త్రీవేషధారులగు మావళేసైనికులు నటనున్న ఫజీలును దద్రితుల నంతమందించి పాఱిపోయిరి. ఈసందడిలో మేమెల్లరముండఁగా వెనుకతట్టునుండి శివాజిముఖ్యలు కొందఱుదుర్గముపెలికి దుమికిచడి చప్పుడు కాకుండ రణగడాకుఁ బాఱిపోయిరి.

ఇబ్ర—సిద్ధిఖాను దీనికేమి ప్రతిక్రియ గావించినాఁడు ? ఇదియాసిద్ధిచేసిన నిర్వాహము ?

భటు—సాహెబ్జీ! ఏమిచేసెనో తెలియదు. చేయనున్నది తెలియదు. మీనాయకుఁడుమాత్రము దుర్మరణమందెను.

ఇబ్ర—సిద్ధిసైనికులు గలియలేదా ?

భటు—అదేమిమాయయోకాని వారు మాలోఁ బెక్కుఱఁ బిల్కుమార్చినారు.

ఇబ్ర—ఎట్టెట్టూ! సాయముచేయకుంటకుఁ దోడు మిమ్ము దునుమాడిరే ?

భటు—చిత్తము.

ఇబ్ర—శివాజి తప్పించుకొని పాఱిపోవుట నిజమేనా ?

భటు—సాహేబ్జీ! శివాజి తప్పించుకొనుట నిక్కమే ప్రభావతి చిక్కకుంట నిక్కమే !

ఇట్లాభటునివలనఁ బన్హాలాసంగతు లెఱింగి వానిని జంఝారరావుని దీసికోరావలసినదని పుత్తెంచి యప్జలు తనకు మిత్రుండౌటవలనఁ దత్ప్రాత్రమ్ము తికి నెక్కెంతవిచారించి యిదేసమయము సుల్తానుమనసు విఱిచివేయవలెనని తనలోఁ దా యోజించుచుండెను.

అత్తఱి ఖాంజహానుఁ డచ్చోటికి వచ్చేసి "అమాత్యవరా! ప్రభావతిని మీసఖుఁడు ఘోరపుడేమల్కారుఁ డెట్లో పట్టితీసికొనివచ్చుచున్నాఁడు ఈమా ట తమకుఁ దెలియఁజేయుమని నన్ను ముందుగాఁ బుత్తెంచెను." అని చెప్పిన వానికి నొక మొహరుబహుమతిచేసి "ఓకీ నీవీసంగతి నెవ్వరికిఁ దెలియఁ జేయకుమా! యని బోధించి వాని నంపి తాను సుల్తానుసన్నిధికిఁబోవ సమకట్టెను. ఏకారణముననో కాని యప్పు డక్కడికిఁ బకీరు రాఁదటస్థించెను. అతనివలన నిజమనోరథసిద్ధి పొందవచ్చునని యుద్దేశించి యిబ్రహీ మీరీతిగాఁ బ్రసంగిం పఁదొడంగెను.

ఇబ్ర—మహాత్మా! ఇన్నాళ్ళకైనను దేవరకటాక్షము నాపై వచ్చినందులకు నే ధన్యాత్ముండనైతిని. భవదాగమనమువలన మాగృహంబు పావనం బైనది ఇంక సకలశుభంబులు మా కొడంగూడును.

పకీరు—ఇబ్రహీమ్! మేము సాధారణముగా సంసారులయిండ్లకుఁ బోవువా రముకాము. కానిచో మీసదనమునకు వచ్చేయుటకేమిభాగ్యము? రాగద్వేషములు విసర్జించిన మాబోంట్ల కందఱును సమానులే? ఫజీలు సుల్తానుల బలవంతముపై నిట నిన్నిదినాలుంటిమికాని లేనిచో నొక్కొ డ నిట్లుండిన రాగ మంకురించునని శాస్త్రము సమ్మతింపదు.

ఇబ్రహీ—తమరింకను విననట్లున్నది. పాపము ఫజీలునకు మొన్న ఘోర మరణము సంఘటిల్లెనఁట.

పకీరు—ఏమేమీ! ఫజీలా మృతినొందెనా?

ఇభ్రిహీ—ఔను స్వామీ?

పకీరు—సిద్ధిజోహారు మనకు జయము సిద్ధాంతమనియు శివాజి రేపోనేడో లోఁబడుచున్నాఁడనియు సుల్తానునకు వర్తమానమంపెఁ గదా? ఇం

తలో నిట్టిఘోర మెట్లు వాటిల్లినది ? మిక్కిలి యద్భుతముగా నున్నది. ఎవరైనను గిట్టక యిట్లు పుట్టించిరేమో కాని నాకునమ్మకము చాలకున్నది. నిన్ననేకదా ! యటనుండి వచ్చినసేవకుఁడు ప్రభావతి పట్టుపడవచ్చునని మనకెఱింగించినాఁడు. ఇట్టిఘోరము సంభవించిన సిద్ధిఖాను మనకేల తెలియఁజేయకుండును ? కావున నిది వట్టిసీలివార్తయైయుండును.

ఇబ్ర—లేదు. పకీర్జి ! ఇప్పుడే సవాబత్తా నంపినచారులు నాకుఁజెప్పి వెళ్ళినారు. అదికాక మనఖాంజహానునిఁగూడఁ గనుఁగొంటిని.

పకీరు—అన్నన్నా ? ఇదెంతదుర్దినము. అట్లైన ఫజీలుఖాను మృతినిశ్చయమే యైయుండునా యేమి ? పాపము వారికుటుంబమునకు నెంతయాపత్తు ఘటిల్లెను. అఫ్జలుఖానుపోయి పూర్తిగ సంవత్సరమైనఁ గాలేదు. ఇంతలో నింతకష్టము రాఁ జెల్లునే ? ఇంతకు విధికృత మెవ్వండు తప్పింపనోపు ? మాయెడల వానికి భక్తివిశ్వాసములు మెండు సుమీ ! పాపమాకుటుంబమునకు సుల్తానుతో నీవు చెప్పి యెంతైన వార్షిక మేర్పఱుప వలసియున్నది.

ఇబ్ర—నాకు ఖాను పరమమిత్రుండు. కాన నాకుటుంబము పట్ల నాతోఁచిన సాయంబు చేయవలె ననియే నిశ్చయించుకొన్నాను.

పకీరు—ఏమి మనవారి కపజయము సంఘటిల్లెనా? లేనిచో ఫజీలుచావునకు హేతు వేమైయుండును ?

ఇబ్ర—స్వామీ ! జయమో యపజయమో నిర్ణయింపఁజాలను. పెదవిదాటిన పృథ్విదాటునుగదా! అదికాక గోడకుఁ జెవు లుండునని పెద్దలందురు. కావున నేఁ జెప్పుటకు—

పకీరు—ఇందులో రహస్య మేముండును ? మన మనుకోకపోయినను లోకులు మాఁటలు మూసికొందురా ?

ఇబ్ర—ఔను లోకులు కాకులని యెఱుంగకపోలేదు కాని యీమాటలు నానోటనుండి ముందుగా నేల రావలెనని వెనుదీయుచున్నాను.

పకీరు—అంతరరహస్యమైనచో నేనుమాత్రము నల్వురికిఁ దెలియఁజేయుదునా? ఫజీలుపైనున్న వాత్సల్యముచే ని ట్లడిగితి నేకాని—

ఇబ్ర—మీబోంట్లవద్ద నాకేల యింత దాపరికము. ఐనను సిద్ధి జోహారునకు నాకు నంతగాఁ బడకుంటవలన నేనే పుట్టించితి నని సుల్తాను ముఖ్యులనుకొందురేమో యని యింతవఱకు జంకినాను.

పకీరు—నీమాటలలోని సందర్భము మేము గ్రహింపఁజాలకున్నాము. ఫజీలు చావునకు సిద్ధికి సంబంధ మేమున్నది?

ఇబ్ర—సిద్ధి జోహారు ప్రవ్యాళ ఫజీలు తనువిముక్తికిని శివాజి బంధవిముక్తికిని గారణమయ్యె. దీనినిఁబట్టి తక్కినదెల్ల మీరే యూహింపనగును.

పకీరు—మేము మీవంటి లౌకికులము కాము. వివరించిచెప్పినఁగాని గ్రహింపఁజాలము.

ఇబ్ర—సగముచెప్పి యాందోళపెట్టు టేల? వినుఁడు. ఫజీ లెఱుంగకుండ జోహారు గొప్పలంచము పుచ్చుకొని శివాజిని ఏదీయులను విడుదలచేసెను. యఁగా నదియెఱుంగక మనఫజీలు తనసేనం దీసికొని యడ్డగింపఁబోయె. అప్పుడు సిద్ధి కుట్రకులోఁబడి తన్కినసైనికు లెవ్వరును వేళకుఁ దోడ్పరైరి. అందువలన శివాజిప్రముఖులు నిరాయాసముగా ఫజీలునిఁ దద్భటులను రూపుమాపి రాత్రిరాత్రి కణగడాకు ప్రయాణముసాగిపోయిరి. కేవల ముపేక్షించినఁ దనకు మాట వచ్చునని యెఱింగి మరాటులు పలాయనమైన చాలసేపటికిఁ దనసైన్యమును గొంత కొడుకువెంట నిచ్చిపంపెను. కాని మరాటులలో ముఖ్యు లెల్లరు తప్పించుకొని భద్రముగా దుర్గమునకుఁ జేరికొనిరి. చూచితిరా! జోహారు ఋజుమార్గప్రవర్తనము.

పకీరు—మ ఝ్జారే! ఇదియా సంగతి?

ఇబ్ర—మన మేమన్నను సుల్తానునకుఁ జెడ్డవార మగుదుము. అతని లంచగొండితనమే సుఁడీ. జయము నపజయముగా మార్చినదియు ఫజీలు ముఖ్యుల నకాలమృత్యువు నోటఁ బడవైచినదియు ఇవన్నియు

నటుండనిండు. రేపు శివాజి యింక నేకుమేకై తనబలంబులన్నియు జేర్చుకొని మనరాష్ట్రము కొల్లగొట్టుచు దేశము నెమ్మదికి భంగము కల్గింపక మానఁడు.

ఫకీరు——ఔను వానిని లాఁగదీయవలె ననికదా! సుల్తానుయొక్కయు మనయొక్కయు నభిప్రాయము. చేతఁజిక్కినవాని విడిచిపెట్టుటకంటె సుల్తానునకు వేఱేయపకారముచేయవలెనా? ఇట్టిడని యేమెఱుంగము. సుల్తానుతఱుమగానతని ధైర్యశౌర్యాదులగ్గించుచువచ్చుటవలన నతండు యోగ్యుండని యెంచుచుంటిమి, ఇస్సిరో! మాణిక్యమున కాసించి సర్వమును జేరఁదీయుదురా? ఎంతపరాక్రమమున్ననేమి? ఎంతవైదగ్ధ్యమున్ననేమి? ఎంతవిద్యయున్ననేమి? గుణము సరికానప్పుడివన్నియు నిష్ప్రయోజనములే? బాపురే! గుణముపరిశీలింపక కేవలసామర్థ్యాదులు పరికించి భ్రమించిచేరఁదీసిన రాజులగు వారికిటువలెనే యెంతలేసి నష్టములును సంభవించునుగదా? భూనాథులలో సదసద్వివేకసంపన్నుండెక్కఁడనో లెక్కకునొక్కండు దక్కతెఱుచు నిట్టివారే యుందురు. వీరియవివేకము ప్రజలకేకాక రాజ్యమునకుఁగూడ నుపద్రవమును దెచ్చుచుండును.

ఇబ్ర——ఎఱిగినపండితులు కావునయుక్తియుక్తముగా సెలవిచ్చితిరి. సుల్తాను బాలవయస్కుఁడౌటవలనఁ దగినంతలోకానుభవములేదు. కావున నేనేనుగాని మఱెవ్వరుగాని డాయవెఱతుము. అదికాక యడుగనిదే యేవిషయమునుగూర్చియైన నాలోచన చెప్పుటకు నెవ్వరు సమ్మతింతురు. వజీరునని స్వతంత్రతదీసికొందమన్నను మొదటనుండియు సిద్ధి పల్కులయందు సర్కారునకు మంచిగుఱియున్నది.

ఫకీరు——సుల్తా నంత వివేకములేనివాడని యెంచరాదు. ఈసంగతులన్నియుఁ జెవినిఁబడెనేని యీక్షణమే యతనిని దర్బారునుండి తొలఁగింపక మానఁడు.

ఇబ్ర—జఱిగినది జఱిగినట్లు చెవినిబడినపుడు కదా మీరన్న దిజముగుటు. సిద్ధి తన్నేమో యుద్ధరించునని యేకదా వానిని తనవద్ద బలవంత పెట్టి యుంచుకొన్నది.

పకీరు—నిజము నిలుకడమీఁద బయలవెడలక మానదు నీవు చెప్పినట్లు సిద్ధి హితులు కప్పిపుచ్చి చెప్పదు లేని నిజము బయటికిలాగక మానము.

ఇబ్ర—మాయదృష్టవశంబున మీరొక్క రిక్కడనున్నారు. కాబట్టియొక వేళ జఱిగినది జనటినట్లు సర్కారు కర్ణరంధ్రములలోఁ బడునేమో కాని లేకున్న నిజమబద్ధము నబద్ధము నిజముకాకపోవునే?

పకీరు—చిల్లరయుద్యోగస్థులొక వేళ లంచగొండులైన వారిని శాసించి సహింప వచ్చునుగాని యిట్టియున్న తపదస్థులగు వారి కీదుర్బుద్ధియంకురించినచో వారిని వదులుకొంటయే రాజనకును వెండియు గాజ్యమునకును లెస్స. అటుకాకున్నఁ జేటువాటిల్లక మానదు.

ఇబ్ర—చిత్తము.

పకీరు—సుల్తాను మాయెడలభక్తి తాత్పర్యంబులుగలవాఁడు. మీవలె మేము వానికొల్వులోని వారముకాము. సిద్ధికిఁగాని వానిఁబూసుకొనువచ్చు. మతేరికిగాని కోపమువచ్చినను సరకుచేయము. తుదకు సుల్తానునకు నాగ్రహమువచ్చినను సరే మాకుభయింపడవలసిన పనిలేదు కదా? మీరు వారి యాశ్రితులుకావున నొకవేళ హుజూరుమాట కెదురుచెప్పలేక బెదురుదురేమోకాని మాకట్టి జంకుగింకులు పడవలసిన పనిలేదు. సమయముచూచి సిద్ధిచర్యలు వెల్లడిచేయకమానము.

ఇబ్ర—నాకాతఁడైన విరోధియేకాని సుల్తాను వానివిషయములో నే యపకారముచేయకుండునట్లు చేయవలెను జూడీ!

పకీరు—మాకేమి వాఁడు ద్వేషియా! మీకొఱకు రాజ్యముకొఱకు వానిని వెడలఁగొట్టించుట యుక్తమని చూచుచున్నాము. కాని వానికే విధమైన యెగ్గుచేయుటకు మాకేమి యవసరము?

ఇబ్ర—అన్నట్లు చెప్పమఱచితిని. ప్రభావతిపట్టువడెను జూఁడీ.

పకీరు—ఆ! ఎప్పుడు? ఎవ్వరు తీసికోవచ్చిరి.

ఇబ్ర—ఎప్పుడో నే నెఱుఁగను గాని మాస్నేహితుండైన బాజీ ఘోరపురే తీసికొనివచ్చినాఁడని మనఖాంహానుఁడిప్పుడే చెప్పివెళ్లినాఁడు. ఈ సంగతి సర్కారునకు వినిపించవలెనని యనుకొనుచుండఁగాఁ దమరు విచ్చేయుటచేనాఁగినాను. ఈసంతోషవార్త యిప్పుడేపోయి వారిచెవులోవేయుట యుక్తముకదా!

పకీరు—మొదట మనము ప్రభావతివచ్చినది రూఢిపఱచుకొనిగాని ఖాంజహానుని మాటలునమ్మి సర్కారునకెఱింగింపరాదు. కావున ఘోరపురే యింటికేఁగి యీసంగతి గనుంగొందము.

ఇబ్ర—మంచిద ట్లేపోవుదము.

అని తగిన దుస్తులుధరించి పకీరుని దోడ్కొని వీధిలోనికి నడచెను.



# ఇరువదియెనిమిదవ ప్రకరణము.



అట్లు కొంతసేపు నడచి పకీరును వజీరును ఘోరపుడేయింటికిఁ జేరుకొనిరి. ఆసమయమునఁ జావడిలోఁ జేరపడి ఘోరపుడే ప్రయాణపు బడలికదీర్చుకొనుచుండెను. ఆవచ్చినవారినిఁ జూచి దిగ్గునలేచి వారికుచితాసనములు వేయించి తన్ను వారడుగకమున్నె ప్రతాపగడనుండి పన్హాలాపురికై వచ్చుచున్న ప్రభావతిని మార్గమధ్యమునఁ దాను స్వాధీనపఱచుకొన్న చందము తెలియఁజేసి పదంపడి పరభృత్కుమారీరత్నమును నిల్పినమందిరమునకు వారినిదీసికొని పోఁజూచెను. కాని యిబ్రహీము పకీరునటనిల్పి ఘోరపురేను లోనికిఁ దోడ్కొనిపోయి యేవో కొన్నిమాటలు బోధించి "ఓయీ! నే దిరిగివత్తును. అంతవఱకు నీ వింటనే యుండవలసినది జుమీ!" అని నొక్కిచెప్పి చావడికిఁ దిరుగఁ జేరుకొని పకీరునుద్దేశించి యిట్లనియె. "హజరత్! ప్రభావతి రాకయూఢియేకదా! ఇంక సర్కారుసన్నిధికిజని యీశుభవార్త తెలియఁజేయుదమురండు." నావుడు "ఓయీ! మనమిద్దఱము కలసిపోవుట యిందాక మనమనుకొన్న నిర్ణయమును బట్టిచూడఁ బ్రశస్తముగాఁదోపదు. మాకుఘోరపురే చుట్టమువంటివాఁడు కావున నిచ్చోటఁ గొంతసేపు విశ్రమించి యెండ చల్లబడినతరువాత దర్బారునకు విచ్చేయుదుములే! నీవుపోయి ప్రభావతి వర్తమానము మఱెచ్చట మసలక సర్కారునకెఱింగింపుము" అని పకీరు వజీరుని బుత్తెంచి తానుమాత్ర మచ్చోటనే నిల్చి ఘోరపురేతోఁ గొంతతడవు ముచ్చటించి యతండు మధ్యాహ్నభోజనమునకు లోనికరిగినవెనుక మెల్లగాఁ బ్రభావతియున్న గదివద్దకుఁ బోయి యశోకవనంబున శోకించి కృశించిననాటి సీతామహాదేవిమాడ్కి దిక్కులేక పరులకుజిక్కి యాక్రందించుచున్న యాయబల నాపకీరు విలోకించెను. అత్తఱి మేనెల్ల నీరుకాఁగా నిశ్చేష్టితుండై ముహూర్తకాలము కుడ్యమునకు నొరిగి యాయాపన్నురాలిని వీక్షించుచున్నకొలంది నాఁపశక్యముకాక దుఃఖము పొర్లిపొర్లివచ్చుటవలన నప్పటిలో నచ్చోటనుంట మంచిది

కాదని తన యెప్పటితావునకుఁ జేరుకొని యయ్యెడ గుభాలునఁ జదికిలఁబడి నడ్డివిఱిగినవానివలె గోడకు నీడిగిలఁబడి తనలోఁ దానిట్లు విచారింపఁదొడంగెను. "అయ్యయో! ఈకోమలికొఱకు నిన్నాళ్ళు నాపడినపాటులెల్ల వ్యర్థమయ్యెఁగదా! పాప మాపెతల్లిదండ్రులును బాలాజి ముఖ్యులెంతవనటఁజెందికుందుచుందురో! అట్టో! బాజి పరభుస్వర్గస్థుండయ్యెనని నిన్న నేవింటిని. అట్టిచో నీసుందరియుఁబరులపాలౌట వినిన బాలాజి యేమగునో! విశాలాక్షి విముక్తికై వెరవుతోఁచక విచారించుచుండ నాకుఁ దిఱుఁగఁ బ్రభావతి పాటవలోకింపవలసివచ్చెనుగదా!" అని యిట్లుకొంతసేపు వగవఁజొచ్చి క్రమ్మఱనిట్లను కొనియె. ఇసీ! బాలాజి విడుదలకై నాపన్నిన పన్నాగము వలన నింతముప్పువచ్చినది. అయినను ప్రస్తుతము ఫజీలు బాధయొండుతప్పినది. వజీరుతోస్నేహము మనకనేక విధములకక్కఱకు వచ్చును. సిద్ది సుల్తాను సన్నిధానమునన్నంతకాలము. ఇబ్రహీం మాటలును నాయాటలును సాగిరావు. మఱియు నన్నికార్యములలో సిద్ధిసైంధవునివలె నడ్డుపడుచున్నాఁడు. కావున సాధ్యమైనంత త్వరలో మిత్రభేదముపయోగించి వానిని లేవఁగొట్టవలెను. ఘోరపడేకూడ వజీరుమిత్రుఁడు కావున వీనిమైత్రియు సంపాదింపవలెను. నేఁడు ఖేతౌలుని మూలమున నిబ్రహీమును వశపఱచుకొన్నట్లు రేపు జంఘాలుని మూలమున జంఝూరరావును స్వాధీనపఱచుకోవలెను. వజీరుతోపాటు ఘోరపడే జంఝూరరావులు నాకనుకూలులైరేని రాజధానిలో నాయాడిన దాట పాడినది పాటయై చెల్లుననుటకు సందియములేదు. ఇప్పటికిని బ్రహీము నాకూఁతయాటవలన వేసినపాచిక కొంతమట్టుకుఁ బాఱుచున్నది" అనియిట్లను కొనుచుండఁగా ఘోరపడే ముఢలకరు భోజనముచేసి యాకులు పోఁకలుచేతఁ బట్టుకొని యచ్చోటికిఁ జనుదెంచి తానెట్లు ప్రభావతినిఁ జేకొని వచ్చినది మఱింత వివరముగాఁ దెల్పుచుఁ దాంబూలము వేసికొనఁజొచ్చెను. తదనంతరమునఁ బకీరనుజ్ఞకైకొని యొక్కింతసే పచ్చటఁ బఱచియున్నతివాసిపైనిగ్రహవాసిపరుండెను, ఇట్లతండు పరుండిన పావుగంటసేపటికి ఖాంజహాను డచ్చోటికి నరుదెంచి ఘోరపడేను లేపి పకీరుసహితముగా సతినిని దోడ్కొని కోటకు నేఁగును.

అటనిబ్రహీము తనపక్షమువారి నందఱఁ గ్రోడీకరించుకొంటయేకాక యీలోఁగా దర్బారునకువచ్చిన జంఝూరరావు మొదలైన పదస్థులకెల్ల దన యుద్యమము నెఱింగించి లంచమిచ్చియు భయపెట్టియు వారినందఱను వశ్యులనుగాఁ జేసికొనెను. ఇందువలన సుల్తానునకు సిద్దిజోహారు పన్హాలాచర్యలఁగూర్చివ్రాసిన వ్రాతలకును ఖంజహాను జఁఝూరరావులో నగువారు చెప్పుమాటలకును జాలవ్యత్యాసముంటవలన నేదినమ్మటకుఁదోపక యతండు డోలాయమానచిత్తుండై పకీరువజీర్ల రావించి సంభాషించుటయు వారును సిద్దిజోహారు వ్రాతలకును వర్తమానములకుఁ గలభేదములు చూపించి సిద్ది లంచముపట్టెనని సిద్ధాంతముచేసిరి. పన్హాళలోలేని ప్రభావతిని పున్హాళలోనున్నదనియుఁ బ్రభావతిశివాజులు పట్టువడుదురనియు నిదివఱకు సిద్దిఖానుపంపిన వర్తమానమునకును దద్విరుద్ధముగా జఱిగిన చర్యకును సుల్తానుకడు ననుమానపడి జోహారును దండనాయకత్వమునుండి తప్పించుటమంచిదని నిశ్చయించుకొనెను. ప్రభావతిని దనకోటలోనికిఁదెప్పించి యొక్క సౌధముననుండఁజేసి భోజనాదివిషయములలో నామెకు నేవిధమైనలోపములు లేకుండ జూడవలసినదని నల్వురుసైరంధ్రులను నియమించి పఠానప్రభువు నాల్గైదుదినములు వరుసగా జని యప్పరభుకుమారికకు । బోధింపఁజొచ్చెను. కాని యాసుందరి తనవద్దకు సుల్తాను వచ్చినదిమొదలు వెళ్ళినదనుక నేడ్చుచుంట దక్క యేమాటకు బదులుచెప్పదయ్యె, ఇది చూచి సుల్తాను తానుచెప్పుటకంటె నితరులు బోధించుటవలన లాభముండునేమో యని యంతఃపురస్త్రీల నామె నెట్లైనను వినుకొనునట్లు చేయవలసినదని నియోగించుడు వారును గొన్నాళ్లు ప్రయత్నముచేసి విసిగిరి. అనంతరమున నపరవయస్కుండైన పకీరు నొకనాఁడు బిల్పించి యతనితో నిట్లు సంభాషించెను.

సుల్తాను—పకీర్జీ! మీరు సెలవిచ్చినట్లు రూపములోఁ బ్రభావతినిఁబోలిన సౌందర్యమూర్తులగు స్త్రీలు ముమ్మాటికిని లేరనియే నొక్కి వక్కాణింపఁగలను. ఆభువనైకసుందరి లభింపక పూర్వము మాకుఁ గల్గిన తొందర మీ రెఱింగినదేకదా!, అట్టిచో నిప్పు డెట్లుండునో యూ

హింపుఁడు. ఆబంగారుబొమ్మ దొరికినపిమ్మట మాతనుసంతాపము చల్లార్పుకోఁ జూచితిమి. మాపాపమేమో కాని యెవరెంతబోధించినను నాముద్దులగుమ్మ యాక్రందించుట దక్క యేమాటయుఁజెప్పదయ్యె. బలాత్కారముచేసి వాంఛకొనసాగించుకోవలెనన్న తుణముపట్టదు. స్త్రీలవిషయమున నట్టితొందరపాటు ప్రమాదహేతువని కొందఱు చెప్పుటవలన నింతవఱకు నిరీక్షించితిమి. ఏకారణమువలన మాటలాడదో మేమెఱుంగఁజాలకున్నారము. సిద్ధపురుషులగు తమరు కటాక్షించి దీనికిఁ బ్రతిక్రియ యూహించిచెప్పుఁడు.

పకీరు—సాహేబ్! మీ రిన్నాళ్లోర్చితి మన్న దానికే మాకుఁ జాల సంతోషమైనది. ఎన్నఁడును గొంతలను బలవంతపెట్టఁదగదు. దానివలన సుఖము లేకుంట సరికదా ఒకానొకప్పుడు ప్రాణోపద్రవముకూడఁ దటసించుననుట నిస్సందేహము. తక్కిన జాతినాతులరీతిగాక యప్సరభుతరుణు లతిసాహసికలని వినుచుందుము. ఓర్పుగల పసరమునకు దేటనీరన్నట్లు మీరు మఱినాల్గుదినంబు లాఁగినచో మనోరథంబు సిద్ధించుననుటకు సందియములేదు. వంటయింటికుందేలువో లెనున్న యాకొమ్మ మీసొమ్మగుటలో సంశయ మేమున్నది. ఐనను స్త్రీలు బేలలు గోలలని కవులు వర్ణించుసంగతి ప్రభావతిచర్యయే రూఢిచేయుచున్నది. కావున్న సిరిరా మోకా లడ్డుకొను నిర్భాగ్యుల చందమున మీవంటివారే స్వయముగా నపేక్షించుచున్నప్పు డూరకుంటకంటె మూర్ఖత్వమేమున్నది ? ఎన్నిజన్మములఁ దపసుచేసినఁగాని బోంట్లకు మీబోంట్లసంయోగంబు లభించునే ? తగినవారిచేఁ జెప్పించిచూడుఁడు ! ఎన్నాళ్లిట్లుండునో చూతము కాక—

సుల్తాను—హజరత్! మేము పడవలసినపా ట్లన్నియుఁ బడితిమి. ఇంకమా బోధలవలన లాభ ముండునని తోఁపదు. దేవరవా రేదైనను దగిన యుపాయం బాలోచించి మీరే యాకన్యను లోఁబడునట్లుచేయవలెను. సకల మెఱింగిన మీతో నేనేమివ్రాక్రుచ్చుదును. ఈవిరహా

తాపంబున నాతనువెట్లు కృశించినదో చూడుఁడు. కంటికి నిద్రయా లేదు. జిహ్వకు భోజనమా రుచింపకున్నది. తక్కినవిషయములలో మా మనసు బొత్తిగాఁ జొరఁబడకున్నదని వేఱ చెప్పవలెనా ?—గుడికట్టినమీఁదే గోపురముకట్టి సాంతముచేయవలెను.

పకీరు—మీ రింతగాఁ బ్రార్థింపవలెనా ? మీ కాపురాఁబోడి తప్పక చిక్కునని ముందట మేము చెప్పితిమికదా !

సుల్తాను—మీరు సిద్ధపురుషులని యెవ్వ రెఱుంగరు ? తమరు ప్రయత్నించినచో నాచంద్రవదన తప్పక యొప్పుకొనుననియే తోఁచెడిని. ఇట్టి పనులకు మీబోంట్ల నియోగించిన నేమితప్పు పట్టుకొందురో యని యిన్నాళ్ళు చెప్పక యూరకొంటిమి.

పకీరు—దీని కింతగావలెనా! మాయోపినంత యత్నించిచూతుము కాక. కాని మీరు తొందరపడ మని వాగ్దానము గావించితిరేని ప్రభావతి నెట్లైనను నొప్పించి మీకు సమకూర్తుము.

సుల్తాను—ఇన్నాళ్ళు నిలిచియుండలేదా! అట్లే మీరాఁగ మన్నంతకాల మాఁగుటకు సంసిద్ధుఁడనై యున్నాఁను. ఎట్లైనను నాసౌందర్యతిలకను మాకు వశపఱచినఁ జాలును.

పకీరు—ఫజీలు ప్రతిస్పర్థిగానుండునని యిన్నాళ్ళెంచితిరి. ఇప్పు డాభయముకూడ లేదు.

సుల్తాను—అన్నట్లు జ్ఞాపకము వచ్చినది. ఫజీలు స్మృతికిఁ గారకుండు సిద్ధియే కదా ?

పకీరు—అతఁడుకాక మఱెవ్వరగుదురు. ఫజీలు మరణమునకేమికాని. చేతిలోఁజిక్కిన శివాజిని రణగడకుఁ బోనిచ్చుట సిద్ధికిఁదగినపనియా ? ఛీ లంచమున కాసించి యిట్లు సర్కారుకార్యము చెఱుపవచ్చునా ? రణగడనుండి శివాజి క్రమ్మఱ మామీఁది కెత్తివచ్చుటకు యుద్ధసన్నాహము చేయుచున్నాఁడట. తమ రది వింటిరో లేదో ?

సుల్తాను—ఔను మే మిదంతయు నెఱుంగకపోలేదు. ప్రభావతి గోడవలోఁ బడి యున్నాళ్లు కొట్లాడుకొనుచుంటిమి. సిద్దినిఁ దొలంగించుటకు సిద్ధాంతము చేసికొంటిమి కాని యెవ్వరిని నమ్మి పంపుటకుఁ దోఁప కున్నది.

పకీరు—ఇబ్రహీము లేఁడా!

సుల్తాను—అతండు రాజధానిని లేకున్న దక్కిన మావ్యవహారంబులు సమముగా సాగవు. అదికాక యతండు మంచియోధుండుకాఁడు. తక్కినవారిని నమ్మి యిట్టిపనులకు నంపనొల్లము. వెళ్లకుంటకు మాకుఁ దోపదు. వెళ్ళుటకు దోపదు.

పకీరు—ఈసమయములో మే మాలోచనజెప్పుటకుఁ దగము. ఏమనిన నెవ్వరెటువంటివారో యెఱుంగముగదా!

సుల్తాను—మే మేపోయి తగినయేర్పాటులుచేసి ఘోరపుడే శివాజికి బలవద్విరోధి కావున నతని నచ్చటనిల్పి తిరిగి నాల్గుదినములలోవత్తుము. మీరు ప్రభావతి కీలోగా మాపై ననురక్తిపుట్టింపఁ జేయవలెఁజుఁడీ! అని ప్రసంగంబుముగించి పకీరునుదోడ్కొని ప్రభావతియున్న సదనమునకు నడచెను.

ఇటఁ బ్రభావతి తనకుఁ దటస్థించిన యవస్థకుఁదోడు నిద్రాహారములు సమముగా లేకుంటవలన మఱింత నీరసించినదై నిరంతరము నంగలార్చుచు నానడుమఁ దనకధనుదలంచుకొని యిట్లనుకొనఁ దొడంగెను. ఆహా! నే నెంతపాపాత్మురాలనోగదా! నావలన నెందఱిందఱకు నెంతలేసికష్టములు కల్గుచున్నవి. నాడు తురకలచేతిలోఁ బడియు నెట్లో యీవలకువచ్చియున్నాళ్ళు నాప్రియునిచెఱగూర్చి విలపించుచునే వచ్చితిని. అతండు మొన్న విముక్తుండైనపిదప ధన్యాత్మురాలనైతినని యెంతయో సంతోషించితినే కాని యిట్లు పరులపాలై యిడుములఁగుడుతునని కలలోనైనను నెంచనైతినిగదా! నాకై మొదటనుండియుఁ బ్రాణముపెట్టుచున్న యాపూజారియా విదేశాలపాలాయెను. మనోహరుండా శత్రువులపంచలఁబడి యున్నాళ్ళ

భూలోకనరక మనుభవించెనుగదా ! ఇస్సిరో ! నాకై తండ్రినిఁగోల్పోయి యుఁ బ్రేముడిమట్టుకు విడఁజాలక తుదకు నామూలంబునగదా మావారి మాయ లలోఁబడి ఫజీలు మ్రగ్గినది. నన్నింతగాఁ బ్రేమించిన యాఫజీలుని వచించిన యాదోషమే నన్నింతి యలజడిలోనికిఁ ద్రోచెనుగాబోలు. లేనిచోఁ దండ్రిని గూడ వైరులచే నొప్పించి బంధువులకెల్ల దూరగనై యిట్లుండవలసివచ్చునే అయ్యయో ! నాతండ్రి పగరకుఁబట్టువడినది లేక తప్పించుకొన్నది మ ఱేమైె నది కూడ నే నెఱుంగకుంటిని. ఒకవేళ తప్పించుకొని వెళ్ళినను నాతల్లికి నాదయితునకు నీఘోరవార్త నెట్లు వినుపింతునని యారటజెందియుందునే కాని యింతవఱకు జీవించియుండునే నావెంటవచ్చిన మంజువాణి యింతవ ఱకుఁ బ్రాణంబులు చిక్కఁబట్టియుండునే! ఈసంగతి విన్న మాయమ్మకు నావెంటనే మేనువిడిచి ప్రాణంబులుతలకుండునే! నా పాటూలకించి వల్ల భుండు ప్రాణహత్యచేసికోకుండునే. ఏల ప్రతాపగడనుండ మాయమ్మ వలదు వలదనుచుండఁగ నిటకు రావలెను? వచ్చినందులకుఁ దగినప్రాయశ్చిత్తమైనది. హాహా! నేనుమాత్రము జీవముతోనుంటిని. ఔరా! విధి నాహృదయ మెంతకఠినవజ్రముతోఁ జేసెనోకదా లేకున్న నిన్నిసిలుగులఁజెంది కుందుచున్న నేనెట్లింతవఱకు బ్రతికియుందును? అన్నట్లు మఱచితిని విశాలాక్షిని నన్నను కొనికదా! నాడు తురుష్కులుతీసికొని వెళ్లరని వింటిని. ఇప్పు డాముద్ద రాలెచ్చట నెట్టికష్టములు పొందుచున్నదో యెఱుంగను. అప్పప్ప! ఇంక నెందఱెందఱకుఁ జిక్కులుగల్గించి జీరించియుంటినోకదా! నాహృదయే శ్వరు ముక్తికిఁగారణుండైన తురకబైరాగి యిప్పటికిని నాకంటఁబడలేదు. అతండు దీనదయాళుండని కదావింటిని. అమ్మహాత్మునితోడనైనను మొఱ నెట్టుకొనవలెనన్న జనానాలోనున్న నా కతనిదరిసెనము లభించుటెట్లు? ప్రస్తుతమాయన యిక్కడనున్నాఁడో లేడో కూడఁ దెలిసికొంటకు నాకెవ్వ రున్నారు? ఇంతకు నతండుమాత్రము వలలోఁజిక్కుకొన్న మీనమువలెనున్న నన్నెట్లు ప్రోవఁగలఁడు. సుల్తా నెంతదొడ్డవాఁడైనను మద్యపానరతుండును గోపిశితాశనుండునుగదా. ఇట్టిపంచమహులునకుఁ దనువొప్పగించుటకు నే నెట్లొ

ష్పికొంపను. అదికాక యీమ్లేచ్ఛజాతీయుండు దీనబాంధవచింతామణియు బ్రాహ్మణపక్షపాతియునౌ శివాజి రాజునకు గర్భశత్రువేకాక నిరంతరము గోహింసయు ద్విజద్వేషము గావించుచున్నాఁడు. మనమునఁ బరభుతిలకము నకు నొప్పగించినకాయంబు వే ఱొక్కనికప్పగించి సామాన్యలమాడ్కి జీవించుటకంటె మరణమే యెట్లును గీర్తికరము. మానవతులకు మానముపోయిన పిమ్మటఁ బ్రాణంబులతోఁ బనియేమి? అని యిట్లు పెక్కుతెఱంగులఁ జింతించి దుఃఖము నిర్భరంబుగాఁ బరిచారికలేదో పనిమీఁదఁబోవుట కనిపట్టి యాయొంటరిపాటునకు సంతసించి చీరపైటమెలిబెట్టి మెడకునురిపోసికొని ప్రాణహత్య కావించికొనఁదొడఁగెను. అంతట సుల్తాను వెంబడి సరుదెంచుచున్న పకీరాసాహసకృత్యమును బరీక్షించి దవుదవ్వునఁబోయి యాకోమలిచేతులు విదిలించిపట్టుకొని కంఠమునకు బిగియఁగట్టుకొన్న కట్టుకొంగును విప్పివేసెను. తనపనియందే మనసుంచి ముందువెనుకలను వీక్షింపని యాసాహసికురాలు తన్ను నివారించిన దెవ్వరైయుండురని కన్నులు పైకెత్తిచూచిగజగజవడంకఁ దొడంగెను. సుల్తానచ్చటికివచ్చి చెలికత్తె లెటకేతెంచినది కనుంగొని వాండ్రనురావించి గట్టిగాఁ జీవాట్లు పెట్టి "ఎట్టియవశ్యమైన పనియున్నను మీలో నెవ్వరైనను నొక్కతెను గాపుంచికాని యందఱు నీసుందరిని విడిచిపోరాదు సుఁడీ" అని వారికదిమిచెప్పి పకీరునుదీసికొని యచ్చోటు వాసిపోయెను.



# ఇరువదితొమ్మిదవ ప్రకరణము.



ఆ మఱునాడు పెందలకడఁ బకీరుసమేతముగా సుల్తాను ప్రభావతి యున్న సదనమున కరుగుదెంచి యామెను తగురీతి నోదార్చి పలుకరించి తన మాటలకు బదులుచెప్పవలసినదని నయమున భయమునబెదిరించి యెక్కుడు బలవంత పెట్టెను. కాని యాకన్యకారత్న మెప్పటి యట్లతలవంచుకొని మౌన వ్రతమువహించి యూరకుండెను. సుల్తాను మొగముచిందుకొని చీదరపడుచున్న సమయమునఁ బకీరు నయోక్తులచే నతనిని శాంతపడఁజేసి. మెల్లనఁ బ్రభావతి నుద్దేశించి యిట్లుపల్కరింపఁ దొడంగెను. "అమ్మాయీ! పెద్దమనుష్యులు వచ్చి సంభాషించునప్పుడు ప్రత్యుత్తరమీయక మూకభావంబు బూనుట యేరికిని భావ్యంబుకాదు. నీవుపచ్చి పదుదినంబులయ్యెగాని నీయుద్దేశమెవ్వ రికిఁ దెల్పకుంటకుఁ గారణమేమి? ఇచ్చట రాజోచితముగా సర్వోపచార ములు జఱుగుచుండ నీకుఁగల్గిన కొఱంతయేమో తెలియకున్నది. దేశాధీశు లైన సర్కారు నీకేలుపట్టి నిన్నుమహారాజ్ఞినిగాఁజేయ సంకల్పించుకొన్నారు. నీ పూర్వజన్మ పుణ్యంబెట్టిదో యెఱుంగకున్నాము. ఇంతీ! నీవంతమౌని నీ మనోవ్యసనంబునకుఁ గారణముతెల్పుము ?" అని పకీరు పలుకు పలుకులకు నెయ్యన నత్తొయ్యలి మాఱువలుకఁ గడంగెను. ఫకీర్జీ! మాపరుభుకన్యకలు పరపురుషులతో ముచ్చటింపనొల్లరు. తమరు సర్వసములైనవిరాగులు కావున మీతో సంభాషించుటను మీరడిగిన ప్రశ్నలకుత్తరమిచ్చుటకు సందియము లేదు" అని తెల్పి పదంపడి యిట్లు ప్రసంగించెను.

ప్రభా—మాజనకులకును రాజుగారికిని విరోధియగు పురుషుని వరింపనొల్లను.

పకీరు—ఓహో! నీకంటె బేల యెవతెగలదు. చక్రవర్తి సన్నిభుఁడగు సుల్తానునిట్లుచులకన చేయఁదగునే! నీవిష్టపడకున్నను గాఁగల కార్యము కాకమానదు. మ్లేచ్ఛకులావతంసుఁడగు నీసుల్తానును జేపట్టియోపట్టీ! యిహలోక భోగంబుల ననుభవింపుము.

ప్రభావతి—దమయంతియును తన్నర్థించిన దేవేంద్రాదులఁగన్నెత్తిచూచెనా? గోద్విజాదిసాధు హింసాలోలుండగు మీసుల్తానును వివాహమాడి మా జాతినీతులు గంగలోఁగలుపుదునా?

పకీరు—ప్రభావతీ! నీవెంత సాహసికురాలవే! సర్కారు సమ్ముఖమున జంకు దొరంగి యిట్లానతీవచ్చునే!

సుల్తాను—బోటీ! నీవన్నమాట మాకు వినిపించినదికాదు. మమ్ముఁగూర్చియేమి ప్రేలితివి? మమ్ముఁజెనకఁ జూచితేని నిన్నేమిచేసెదనో చూడుము.

పకీరు—త్వరపడినకార్యము చెడిపోవును. సర్కార్! ఇట్టిచోటులనా! మీ పౌరుషము? శాంతింపవలెను. మనస్థిమితము లేమినిట్లు పల్కియుండ నోపు. ఇంతకునింతులు గోలలుకారే!

ప్రభా—ఔ నింతులుగోలలు.—ప్రభువులు మదాంధులు.

సుల్తాను—చూచితిరా! దీనిపొగరు.

పకీరు—కుమారీ! నీవు నిదానించిమాటలాడుము. సుల్తాను నాగ్రహంబునకుఁ బాత్రురాలవై యేలచెడిపోయెదవు. ఇట్లు మాటలాడిన మాత్రమున లాభమేమిగల్గునో నీలో నీవువిచారింపుము.

ప్రభా—తల్లితండ్రి రాజులకు నెడఁబాయఁజేసి నన్నిచ్చోటికిఁ దెచ్చుట పాడియే? ఇట్టిపల్కులెల్ల మీతురకలకు ధర్మంబులుగాబోలు?. మావారి సమ్మతిలేకుండ నన్నిచ్చోటికిఁదెప్పించిన కలియుగరావణుం డగు మీసుల్తానుపోకలు మీకునచ్చినవి కాబోలు? ఇదియా మీసమత్వము? మీయుదారత్వము? పకీరులగు మీరును న్యాయము మట్టు పఱచిననేమిచెప్పుదును? చావునకుఁదెగించిన నన్నీ సుల్తానేమి చేయఁగలఁడు? సనాతన ధర్మసంస్థాపకుండును దీనజనరక్షకుండును, స్త్రీజాతి గౌరవకల్పకుండునగు శివాజిని గాకనే నింకొకనిఁ బ్రభువుగా గణించి మన్నించుట కొప్పుకొందునే! నాకిచ్చోమరణముదటస్థించినను సమ్మతమేకాని మీసుల్తానుగిల్తాను—

పకీరు—కాంతా! నిష్కారణమేల నశింపఁజూతువు? ఈభూకాంతుని బెండ్లాడి సకల సౌఖ్యంబులుగల్గి వర్థిల్లుము.

ప్రభావతి—ఇదివఱకే యొక్కరిని మనసుచే వరించియుంటిని.

సుల్తాను—సుందరీ! నీ వలచినవాఁడు మొన్నటి పన్హాళా ముట్టడిలోఁగిట్టి నాఁడని యెఱుంగవు కాఁబోలు. నీవు మమ్ముఁదప్పించుకొని యింక నెక్కడకిఁ బోఁజూతువు?

సుల్తాను వాక్యములు వీనులఁబడినవెంటనే యప్పరభుకుమారిక ప్రక్కకు నొరిగి హా! నాథాయని మూర్ఛిల్లెను. అదిచూచి చేరువనున్న చేటికలు చల్లనినీళ్ళు దెచ్చి యామెకుఁదగిన యుపచారంబులు చేయుచుండిరి. అత్తరి సుల్తానుఫకీరు నుద్దేశించి "మెమిబ్రహీమునితో నీదినము చెప్పవలసిన సంగతులెల్లఁజెప్పిరేపు నిశ్చయముగా మూలబలంబును దోడ్కొని ప్రయాణంబు సాగించుచున్నారము. మేమువీలులేక చనుదెంచుచున్నారము కాని యిటువంటిసమయమున నాయముగా నిక్కడనుండవలసినదే? మేము పోయినను మామనమిచ్చటనే యుండును జుఁడీ! తప్పకుండఁదగిన యేర్పాటుచేసి నాల్గుదినములలోవచ్చి చేరికొందుము. ఈలోఁగా మీ ప్రయత్నములలో మీరుందురుగాక ఇదె పోవుచున్నారమని సెలవుతీసికొని రెండడుగులు వెనుకకునడచి యతండు ముందునకు మఱలివచ్చి యేవో కొన్నిసంగతులుముచ్చటించి యచ్చోటువాసిపోయెను.తదనంతరంబ ప్రభావతికిఁ దెల్వివచ్చుటయుఁ గనిపట్టి ఫకీరు పరిచారికలనవలకునంపి యామెతో మెల్లగా నిట్లూరడిల్లఁజల్కెను.

పట్టీ! నిన్నుఁజూచి నప్పటినుండి మామనసు చెఱువగుచున్నది. నీకు వచ్చిన భయమేమియులేదు. నీకు సుల్తానుపై ననురాగమున్నదో లేదో తెల్పుము. పన్హాళాముట్టడిలోఁగిట్టినవాఁడు ఫజీలని తెలిసికొనుము, నీప్రాణమునకు మాప్రాణమడ్డుపెట్టెదము. ఎన్నాళ్ళిట్లుండిన నేమిఫలము? ఆపదలందు ధైర్యముచిక్కపట్టవలెనుగాని యిట్లుదుఃఖించినఁ గన్నులుపోవుట దక్కకార్యమేమియున్నది. మాపల్కులాలించి ప్రత్యుత్తరమిమ్ము" అని యూరకుండెను. దుఃఖార్ణవములో మున్గియున్న యాతరుణికిఁ బకీరొక తెప్పవలెఁ గన్పడుటే కాక తద్వచనామృతధారలకు నొక్కింత తెప్పిఱిల్లి యల్లననిట్లనియె. మహాత్మా! ఎవరితో నేమిచెప్పిన నేమిలాభము? నన్నుగాపాడగలవాఁడు భగవంతుఁడొక్కఁడు దక్కయిట్టిస్థితిలో మఱొక్కఁడుండునని నమ్మఁజాలను. ఇంతవు

సత్వము నెఱింగిన మీరు నాయభిప్రాయము వేఱయడిగి తెలిసికోవలెనా? ఊరకవన్నెల మాటలాడింతురు. అనిపల్కిన పకీరుదానెవ్వఁడైన దింకదాచిన ఫలములేదనియెంచి తననిజరూపెఱిగించిన మాటలఁబట్టియు నాకృతినిబట్టియు నతఁడెవ్వఁడైనది తెలిసికొని దిగ్గనలేచి యాతనిపాదంబులకు మ్రొక్కి పదంపడి బాలాజి క్షేమమడుగుటయుఁ బకీరుశివాజిసమేతముగా బాలాజిసురక్షితముగాఁ బన్హాలనుండి తప్పించుకొని రణగడాకుఁబోయిన సంగతియు బాజీవీరశయనమందిన విషయమును దెల్పి యామెకుఁగల్గిన సంతోషవిచారంబులు తానును బంచుకొని యొక్కింతతడవు కాలము వేగించెను. పిదపఁ బ్రభావతి మంజువాణిని దీసికొని రామోజి సమేతముగాఁ బ్రతాపగడనుండి పన్హాలాదుర్గమునకుఁ బోవుమార్గమునఁ దమకును దమవారికి నెదఁగూడిన యవస్థనెల్ల వివరించి చెప్పుచుఁ దనవియోగంబునకు జనకులును మంజువాణి బాలాజీలును నెంతకుందుచుందురో యనిబిట్టు విలపింపఁదొడంగెను. పకీరు విచారించుటకుఁ దగిన సమయంబుకాదని యక్కన్యకెఱింగించి బాలాజినిదప్పించుటకై పన్నిన పన్నాగమే తుదకిట్లు విషమించినదని విశదపఱచి వెండియు నిట్లనియె. ప్రభావతీ! నాచెప్పినచొప్పున వర్తింపుము. బాలాజి నెట్లువిడిపించితినో యట్లే సమయముచూచి యుపాయంబు నెమకి నీవిముక్తి కల్పించెదను. నీజనకులయొక్కయు మంజువాణియొక్కయు క్షేమసమాచారము తగినవారినిఁబంపి తెప్పింతును. నీవు ధైర్యమంతదాకవిడనాడకయుండుము '' అని హెచ్చరించిన నమ్మానిని పకీరునుద్దేశించి మీరేనాకు నిజమైన జనకులని పల్కియాయనను విశేషముగాఁ గొనియాడినాటనుండియు నవ్వేషధారిచెప్పినచొప్పున నడుచుకొనఁజొచ్చెను.



## ముప్పదియవ ప్రకరణము.



సిద్దిజోహరు లంచము పుచ్చుకొనియుండునని నిశ్చయించి తనమూల బలంబునెల్లఁ దీసికొని సుల్తానుపన్హాళా కోటకరిగి తానే స్వయముగా సర్వ సేనాధిపత్యము వహించి శివాజి దుర్గముల ముట్టడింపఁ జొచ్చెను. ఇట్టి యవ మానమునకు జోహారు సహింపఁజాలక కోపగించి తనసైన్యము దీసికొని తన జాగీరైన కర్నూలునకేఁగి యటనుండి కర్ణాటకజమీందారులను లేవనెత్తి సుల్తానుపైఁ దిరుగఁబడునట్లు చేసెను. ఈలోఁగా సుల్తాను పన్హాళాదుర్గమును సాధించి యటుపైని క్రమంబుగా సహ్యాద్రికిఁ బ్రాగ్భాగంబున నున్న దుర్గములనెల్ల స్వాధీన పఱచుకొనఁగల్గెను. కాని రంగణా విశాలగడ దుర్గములు మాత్రము లోఁబడినవి కావు. జంఝూరరావునకుగాని, ఘోరపురేకుగాని సుల్తాను సైన్యాధికారమిచ్చి తిరిగి వెంటనే రాజధానికిఁ బోఁజూచెను. కాని వారిరువు నుమరాట వీరులౌటవలన నంతసైన్యమునకాధి పత్యమిచ్చుటకు నెల్లకప్రభావతిపైని దనమదిలో నాటుకొన్న యనురాగముకంటె శివాజిపై గలద్వేషమే యెక్కువఁ తూఁగుచుంటఁజేసి యాయవనప్రభువు రమారమి నెలదినములా ప్రాంతములోనే గడపఁజొచ్చెను.

శివాజి సుల్తాను సైన్యమునకుఁ బట్టువడుక సముద్రతీర ప్రాంతమగు తులుకోంకణము మీఁదికి దండెత్తి యట రాజాపురమను రేవుపట్టణమును ముట్టడించి దానినిఁ గొల్లఁగొట్టి స్వాధీనపఱచుకొని యచ్చటనున్న యింగ్లీషువర్తకులు మందుగుండులసామానును విజాపురివారికి నిచ్చుట యెఱింగి వారి నొక కొండకోటలోఁ జెఱయుంచి పదంపడి యాతఁడు శృంగారపురికేఁగి తదధిపుడఁగుదళీయుని స్వతంత్ర రాజును యుద్ధమునందుఁ గీటడఁగించి దీనిని వశపఱచుకొనెను. మఱియు దనకుఁ బక్కలో బల్లముపోలె మెలఁగుచుండెడు సిద్ధి పత్తేఖానుని వశపఱచుకొనఁ జూచి బహువిధప్రయత్నములు చేయుచు ను

ల్తాను విజాపురికి మఱలునటకు నచ్చుటనే మెలంగఁ జొచ్చెను. ఎట్టెట్టో ఘోరపుఁడేసైనికుల బారినుండి తప్పించుకొని రామోజిపరభురణగడాకుఁ జేరుకొని తన కూఁతురు ప్రభావతి పరులపాలైన సంగతి శివాజి బాలాజి ప్రముఖులకుఁ దెల్పి తన శోకమువారికిఁగూడఁ బంచిపెట్టెను. పాపము తండ్రి బావునకుఁ దోడు విశాలా ప్రభావతులు పరాధీనులౌటఁజేసి బాలాజి బిట్టువగచుచు సంతతంబును సంతాపించుచుఁ గృశించుచుండెను. మంజువాణి రామోజీయానతి చొప్పునవచ్చిన దారినే పోయి లలితాదేవికిని జీజిఖాయికిని మఱియు దక్కటివారికినిఁ బ్రభావతివృత్తాంత మెఱింగింప వారందఱుఁదద్దయు దుఃఖించిరి. లలితాదేవియు నాపెకంటె మంజువాణియు రేయింబవళ్లు నిద్రాహారంబులు గైకొనక ప్రభావతికొఱకు విలపించుటయేకాక యాసుకుమారి వాయించు వీణను జదువుకొన్న పుస్తకములను మొదలగువానినిఁ జూచినప్పుడెల్ల క్రొత్తగా ప్రభావతి విశ్లేషము తటస్థించునట్లు బోరునవాపోవుచు నానాటికి జీర్ణించి మంచముపట్టి మరణమున కెదురు చూచుచుండిరి.

ఇటుఁ బకీరు సుల్తాను తాను జెప్పినచొప్పన వర్తించి సిద్ది జోహారునిఁ దొలగించినందులకు సంతసించి సిద్దిశివాజిలకు మైత్రి గల్పింపఁజూచి భేతాలుని గర్నూలునకుఁ బుత్తెంచెను. సుల్తానులేని సయమయములో నొకనాఁడు జంఝూరరావు పరముచేసిన విశాలాక్షివద్దకు నేఁగి మంతనమునఁ బెక్కుసంగతులు బోధించి యాసుందరికిఁ దగిన ధైర్యము గల్గించి తద్విము క్తికై జంఝూరరావును వశపఱచుకోఁ జూచుచుండెను. జంఝూరరావంతకుఁ బూర్వమే భేతాలుని తంత్రములోఁ జిక్కుకొన్న వాఁడగుటవలనను దాన వివాహితుండగుటవలనను విశాలాక్షిని సుల్తానును సమ్మతిపఱచి వివాహముచేసికొన నభిలషించుచు నాపెకు నేవిధమైనకొఱంత గల్గకుండ నరయుచు వచ్చెను.

ఇట్లుండ నొక్కనాటి సాయంతనమునఁ బకీరు జంఝూరరావు నొక్కయేకాంతస్థలమున గలసికొని యొక్కింతకాలము లోకాభిరామాయణము చెప్పుచుఁ బదంపడి యిట్లు ప్రసంగించెను.

పకీరు—జంర్ఘూర! ఫజీలు మృతికిఁ గారకుండు సిద్ధికాఁడని యిప్పుడిప్పుడు వినుచున్నారము.

జంర్ఘూర—ఇది యెట్లు మీకుఁ దెలిసినది.

పకీరు—నిజము నిడివిమీఁదఁ దేలకుండునా!

జంర్ఘూర— ఫజీలు మృతికిఁ గారకుఁ డెవ్వఁడైనది చెప్పఁజాలనుగాని పాపము సిద్ధి లంచముతీసికొని శివాజిని విడిచిపెట్టలేదు. అతఁడు—

పకీరు—అట్లైన నీవుకూడ నిబ్రహీము ముఖ్యులమాటలతో నేకీభవించితివేల?

జంర్ఘూర— అతని ప్రేరణచే నట్లు చెప్పవలసివచ్చినది. దర్బారుద్యోగస్థులకిట్టి యనృతములు విధాయకమై చెల్లుచున్నవి.

పకీరు—ఈయపవాదమునకు సృష్టికర్త లెవ్వరైయుందురు?

జంర్ఘూర—మనమంత్రిశిఖామణియే!

పకీరు—ఏమీ! ఇబ్రహీమునకును జోహారునకును మనస్పర్థగలదా?

జంర్ఘూర—సకలమెఱింగిన మీకుఁ దెలియదా యేమి? నన్ను గదిలించుచున్నారు కాని.

పకీరు—జోహారువంటి కార్యశూరుఁడు మఱొండు మనరాజ్యములో నున్నట్లు వినము.

జంర్ఘూర— ఇందులకు సందేహ మేమున్నది. జోహారు కార్యశూరుండు రాజ్యతంత్రప్రవీణుం డగుటవలననే సుల్తాను చేరఁదీయుటయు మిక్కిలి గౌరవించుటయు దటస్థించెను. దీని కోర్వలేక యిబ్రహీము వజీరు పన్నిన తంత్రాంగమే యీరీతి పరిణమించెను. కానియిట్లు నేనంటినని వజీరుతోనే సందర్భములో నేని యందురేమో సుఁడీ!

పకీరు—యథార్థము కనుగొన నడిగితిమేకాని యిక్కడసంగతు లక్కడ అక్కడ సంగతులిక్కడ చెప్పుటకు మాకేమితోఁచదా? జోహారు వంటిధీరులు లేమిఁజేసి పాపముస్వయముగా సుల్తాను యుద్ధము చేయవలసిన వాఁడయ్యె.

జంర్ఘూర—ఔను ఎవరుచేసికొన్న కర్మమునకు వారికే యనుభవము.

పకీరు—సర్కారువారి ఆలోచన మేమిటి? ఆజాఫరఖాను మాటలు విని సవాయి మహారాజు నయమేమైనా గలదా? ఇబ్రహీం ప్రముఖుల మాటలు నమ్మి ప్రవర్తించెను.

జంఝూ—ఇట్టివారినిఁ బ్రధానులఁగాజేసి కొంటయే సర్కారువారి తప్పు.

పకీరు—ఇట్టిది ప్రతిరాజాంగములలోనున్న విషయమేకాని విశేషమిం దేదియు లేదు.

జంఝూ—పర్యవసానము ముందునకుఁ జూతురుగాక. ఇప్పటిలో నేమిచెప్పి నను లాభమేమియున్నది? ఇప్పుడు రాజధానిలో రాత్రికిఁ బగటికి భేదమే లేనట్లున్నది.

పకీరు—ఏమీ నీమాటల కర్థముకాకున్నది. ఈసాదకేమికాని మన ఫజీలు తెప్పించిన యెలనాగయింక నీపట్టణములోనే యున్నదా?

జంఝూ—ప్రస్తుత మావిషయమేల మీకు స్ఫురించినది. సుల్తానుగారు మొద టనాకాంతను విడిచిపెట్టుమని చెప్పియు నేకారణముననో తిరుగ వలదని సెలవిచ్చినారు.

పకీరు—ఆతరుణిని సర్కారు హాజీసునకుఁ గట్టిపెట్టవలెనని యూహించు చున్నారట, నీవేమే నెఱుంగుదువా?

జంఝూ—నేనేమియు నెఱుంగను హాజీసనఁగా వారి పినతండ్రికుమారుఁడేనా?

పకీరు—ఔను, అట్లేవింటిమి.

జంఝూర—ఆకన్యకను బలవంతపెట్టి పెండ్లి చేయవలయునేగాని లేనిచో శివాజి ప్రతిపక్షులనేరిని బరిణయంబు కావించుకొనునని తోఁపదు.

పకీరు—ఇదినీవెట్లు తెలిసికొంటివి?

జంఝూర—ఈనడుమ నొకనాఁడు నేను కాలయాపనకై ప్రసంగించుతఱి వి జాపురీయులను వివాహముచేసికోననియు నందు ముఖ్యముగా మహా మ్మదీయులఁ జేపట్టననియు నొక్కివక్కాణించినది.

పకీరు—ఆసుకుమారి మీజాతిదేనా యేమి?

జంఝూర—బాలాజి చెల్లెలౌటయే నిశ్చయమైన మాజాతిదే కావచ్చును.

పకీరు—మీహిందువులలోఁ బ్రభు భక్తి మెండు ? జాత్యభిమానము దుర్గుణము మీకు లేకుంటవలననే గొప్పయుద్యోగములు సర్కారు వారొసంగుచున్నారు.

జంఝూర—జాత్యభిమానము దుర్గుణముగునా ?

పకీరు—దుర్గుణమా ? మతిదుర్గుణమా ? జాత్యభిమాన దురంధరుండగు శివాజి సంగతి యెఱుంగవాయేమి ?

జంఝూర—ప్రభు సేవకునకు జాత్యభిమానము పెట్టుకొన్న పనికి రాదు కాని యదిదుర్గుణమగునని నేనెన్నఁజాలను. శివాజియుఁ బ్రజాపక్షము పని చేయుచుంటకుఁ గొందఱు మహమ్మదీయులు సహింపక సుల్తానునకు మనసువిరిచిరి. కాని యతండు—

పకీరు—సరిసరి నీయభిప్రాయము బోధపడినది.

జంఝూర—మాటవచ్చినది కావున నిజమాడితిని ఈకాలములో నిజమాడిన నిష్ఠూరముకదా ! మీరు సగ్వాసములు. కావున మీయభిప్రాయములకు మాయభిప్రాయములకు సరిపడదు.

పకీరు—నీకుఁగూడ జాత్యభిమానముమీఁద రుచిగల్గినట్లు కనుపించుచున్నది. ఈసంగతి సర్కారునకుఁ దెలిసినచో నెంతప్రమాదమైనను బుట్టకమానదు. దర్బారులోని బ్రాహ్మణులెల్లరు లోలోన శివాజిపక్ష మవలంబించియున్నట్టువిందుము. ఈసంగతు లెల్ల సుల్తానునకుఁ దెలియఁ జేయుటకుఁ దోపదు చేయకుంటకుఁ దోపదు. ఇంతకు నిబ్రహీం ప్రధానియెఱుంగఁడా? ఈమాటలువినఁగానే జంఝూరరావు గజగజవడంకుచు, పకీరు పాదంబులపైఁబడి తన్ను రక్షింపవలసినదని వేడుకొనెను. అంత నాపకీరిట్లనియె. "ఓయీ! నీవీయుద్యోగమునకు నాశింపక రాష్ట్రము విడిచి పొమ్ము. లేదా! నీవుగూడ నిపుడు కాకున్నను మఱొకప్పుడైనను జిక్కులలోఁ బడకమానవు, నీమీఁద నిబ్రహీమునకు మంచియభిప్రాయము లేదు. నీవు ఫజీలుమిత్రుండవు కావున మాకునుప్రేమాస్పదుఁడవే! కాని యీరాజ్యములో నీవుండి నిర్వహించుకొలేవని తోఁచెడిని. అయినను

నీయిచ్చకువచ్చిన చొప్పునవర్తింపవచ్చును'' అని ఫకీరు పల్కినపల్కులకు నొక్కింతమనస్సు నిబ్బరము చేసికొని మరాటకుమారుం డిట్లనియె. "హజరత్ ! తమరు చెప్పిన రీతినడుచుకొందును. నేటినుండియుఁ దమరు నాపైని మంచియభిమానము గల్గియుండవలసినదని ప్రార్థించుచున్నాఁడను. నేనిందాకసల్పిన ప్రస్తావనలో లోపములున్న మన్నించి కాపాడునది''. అని యతిదైన్యముతోనిట్లు విన్నవించుకొనుచున్న తఱి నచ్చోటికి నిజమిత్రుఁ డొకఁడు వచ్చుచుంటఁజూచి తత్ప్రసంగంబు కట్టిపెట్టి ఫకీరునాజ్ఞదీసికొని యావచ్చు సఖుని దోడ్కొని యచ్చోటు వాసిపోయెను.



# ముప్పదియొకటవ ప్రకరణము.



పకీరు జంఝూరరావు నిట్లు పాదాక్రాంతునిఁగాఁ జేసికొని కోటలో దానాడిన దాటపాడినది పాటిగా నిరాఘాటముగాఁ జరుగుచుండెను. సిద్ధికిని సుల్తానునకును మిత్రభేదముఁ బొసంగించుటయేకాక పకీరు సిద్ధివద్దకు ఖేతాళుని బంపి యతని శివాజిపక్షము వానింగా గావించెను. సిద్దియు నిబ్రహీముప్రముఖులమాటలఁ బాటించి తన్నవమానించిన సుల్తానుపైఁ బగదీర్చుకొంటకు సమయముచూచుచున్న వాఁడౌటవలన ఖేతాళునిబోధలకు మెత్తబడి కన్నడభూస్వాములఁ జేఁపెట్టి వారిచే బిజాపురి సైన్యమును దరిమివేయించెను. ఖేతాళుఁడే తత్సమాచారము తనకు నెఱింగింపనది వీనుల విందుగావిని పకీరు సుల్తానునిఁ గన్నడసీమ కంపకముజేసి తన మనోభీష్టము నెరవేర్చుకొనఁ జూచుచుండెను.

ఇంతలో సుల్తాను రాజధానికివచ్చేసి పకీరునిఁ గలసికొని మహాతురతతోఁ బ్రభావతిసంగతి యడుగుటయు నతండిట్లు జవాబుచెప్పెను. "సుల్తానా! మీరు వెంచేసిన పిమ్మట తగురీతిగా బోధించితిమి. పూర్వముకంటె నిప్పుడు చాండ పరఘునందన కొంత దారిలోనికివచ్చినట్లు కనఁబడుచున్నది. ఇప్పటికిని మీమాట చెప్పిన నంతగా నిష్టపడకున్నది. జనకులువచ్చి యెవ్వానిని పెండ్లిచేసికొమ్మని యనుజ్ఞ యిచ్చిన వానినిఁజేపట్టుదునని చెప్పుచున్నది.అయినను మఱినాల్గుదినములు నిరీక్షించినఁ బ్రభావతి తమకనుకూలవతి యగుటకు సందియములేదు." అని తెల్పి సుల్తానుమనోభిప్రాయంబు కనిపట్టి యాతనినిదోడ్కొని ప్రభావతి వసించియున్న మందిరమునకుఁ గొనిపోయెను.

అటఁ బ్రభావతి వీరిరాకకనిపట్టి లేచి యొకప్రక్కకునొదిగి నిలఁబడెను. సుల్తాను సుందరి చూపినగౌరవమునకుఁ గరంబుప్పొంగి యాగదిలో నొక్కెడఁ బకీరుతోపాటధివసించి యిట్లు ముచ్చటింపఁ దొడంగెను.

సుల్తాను—పకీర్జీ! తమరు మాసమక్షమున నీమెనుబల్కరించి తదభిప్రాయము వ్యక్తపఱుపవలెను.

పకీరు—అమ్మాయీ! ప్రభావతీ! వింటివికదా సర్కారువారి సూక్తులు. నీయభిప్రాయము దాఁచక చెప్పవలది.

ప్రభావతి— నన్ను బాలముంచినను నీళ్లముంచినను నింకసర్కారువారే! ఇంతకుముందు నేను జాలదీవ్రముగా సంభాషించి యపరాధముచేసి తిని. కరుణాధీనులైన నన్ను మన్నింప సర్కారు ప్రార్థితులు. మాలో వివాహముకాక పూర్వము కాఁగల భర్తలతోనైనను ముచ్చటించుటా చారములేదు. మాజనకుల నిచ్చోటికి సర్కారు రప్పించి వారిసమ్మతి ప్రకారము నన్ను జేపట్టవచ్చును.

పకీరు.—వింటిరికదా! మానిని మనోభిప్రాయము. ఆమె తలిదండ్రులకుఁ దా నొక్కతెయే పట్టి యగాటఁజేసి తద్విశ్లేషము సహింపఁజాలక యీరీతిఁ బ్రసంగించెను. కావునఁ బరభు దంపతులరప్పించుట కర్తవ్యము. అట్లు కావించితిరేని మీకోరికలీరిక లెత్తుననుట నిస్సందేహము.

ప్రభావతిపలుకులకునలరి సుల్తానుతగురీతిగా నామె నూరడించి పక్కీరుని భూషించి యాయనను వెంటఁ దోడ్కొని భోజనశాలకు నేఁగి యట షడ్రసోపే తముగా నారగించి రామోజిని రావించుటెట్లోయని పక్కీరుతోఁగలసి యాలో చించి వెండియుదాను శివాజిదుర్గములను స్వాధీనముగావించుకొను విధానమెల్ల నాతురకబైరాగికి నెఱిఁగించి తదాజ్ఞగైకొని యొక్కింతసేపు నిద్రింపసాగెను. ఇట్లు గొంతతడవు నిద్రించి తదనంతరమునఁ గచేరిచావడికి నేఁగి వజీరు జంఝూర రావుపకీరులను రావించి యిట్లు ప్రసంగింపఁదొడంగెను.

సుల్తాను—వజీర్! శివాజి యిప్పుడు తులకోంకణమునకుఁ బాఱి తలదాఁచు కొన్నాఁడు. అట మనపత్తేఖానుఁడు విజృంభించి వానినిఁ దరుముచు న్నాఁడని వర్తమానము తెలిసినది. ఇంచుమించుగా మరాటులకోట లన్నియు లోఁబడినవి. ఇంక రేపోనేడో శివాజిసంధికి రాకమానఁడు. ప్రస్తుతము దక్షిణదేశపు జమీందారులు కప్పముకట్టక తిరస్కరించు

టయే కాక యందులకై పంపఁబడిన మన యుద్యోగస్థుల సేనల వధియించిరనియు మన ఠాణాలను ముట్టడించిరనియు వర్తమానము వచ్చినది.

ఇబ్ర—ఔను నేనుగూడ వింటిని. నాకొక యుత్తరము బళ్ళారి ఠాణాదారుఁడు పంపినాఁడు.

సుల్తాను—ఈయల్లరికిఁ గారకుఁడెవ్వఁడైయుండును.

ఇబ్ర—ఇంతకు నిదానించి యోజించిన సర్వాంశమునకే తెలియవచ్చును.

పకీరు—సిద్ధీ కాఁడుకదా!

ఇబ్ర—అతఁడుకాక మఱెవ్వఁడు? బళ్ళారి ఠాణాదారుఁడు మహమ్మద్సాహేబు యీపితూరికి సిద్ధి మొనగాఁడని వ్రాసినాఁడు.

సుల్తాను—అట్లయినచోఁ గర్ణాటకమున కిప్పు డెవ్వరని బంపుటకుఁ దోపకున్నది. ఇటు మేము లేకున్న శివాజి వశ్యుఁడగుట యథార్థము.

పకీరు—ఈపితూరిలో శహాజి చేరియుండఁడు కదా! ఆతనిని మహాశూరుని మనవారినిగాఁ జేసికొన్నచో నీయల్లరులు నణఁగునని తోచును.

ఇబ్ర—శహాజి యెంతమాత్ర మీకుట్రలోఁ జేరియుండఁడు. ఇది సిద్ధి మాహాత్మ్యమే. కాకున్న నిన్నాళ్లు నెమ్మదిగా నున్నవారిప్పుడేల యిట్లు మాఱు తిరుగఁబాటు జూపుదురు.

పకీరు—నిజముగా సిద్ధి దీనికి మూలకారణుండైనచో నింక శివాజికంటె మనకు బలవద్విరోధియై బాధించును. శివాజి ప్రోత్సాహమున శహాజి సిద్ధికి సహాయుఁడై నిల్చిన యెడల నింక మన రాజ్యము నస్తమించుటకు సందియము లేదు. కావున సిద్ధితో నైనను మైత్రిఁ జేసికొని శహాజి సాహాయ్యము తీసికొని గడిబిడులు ముదరకమున్నె యణఁచి వేయవలెను.

సుల్తాను—ఫకీరు చెప్పినది సయుక్తికముగానున్నదని నాయభిప్రాయము.

ఇబ్ర—సిద్ధిస్నేహ మింకఁ గుదుర నేరదు. అథవా కుదిరినను బాము చెలిమి

వంటిదగును. కావున హఠాత్తుగా నతనిమీఁదికి దండెత్తి వీలుచిక్కిన యెడల ఖైదిగాఁబట్టుకొంటకాని లేనిచో సబాంధవముగా సమయించుటగాని మంచిది. అతండుచిక్కెనేని కర్ణాటకపుచిల్లరరాజులు ఱెక్కలువిఱిగిన పక్షులవలె మనకు వశ్యులౌదురు.

జంఝూ — వజీరుసాహేబ్! సిద్ధిచిల్లరజాగీరుదారని యెంచితిరాయేమి? శివాజియొకవేళ పట్టుపడినఁ బట్టుపడునుగాని యతండుమాత్రము సామాన్యముగా స్వాధీనుఁడుకాఁడు. కోటలోని మూలబలంబెల్లఁ దీసికొనిపోయి ముట్టడించిన జెప్పఁజాలనుగాని లేనిచో నాతనిఁ జిక్కించుకొన మనకు శక్యముకాదు.

పకీరు — జంఝూరావుచెప్పినదెల్లవాస్తవము. మనజాగీరులో సిద్ధి వాసికెక్కిన వస్తాదుబిస్త వానితోఁ బ్రస్తుతము విరోధించుట ప్రశస్తముకాదు.

సుల్తాను — నిజము. అతండు నాకుఁ గుడిభుజముగా నుంటవలననేకదా! కర్ణాటకరాజు లేమి గోల్కొండపచ్చావు లేమి మాధాటికి వెఱతురు. అట్టి వానితో మైత్రి గొంట యెన్నటికేని మనకుఁ బనికివచ్చును. ఏదో కొంచెము లంచము తిన్నాఁడని వానిఁ దొలంగించితిమి. కాని తక్కుల్యంతో సేనాపతులలో నొక్కండైనిగలఁడే? వానిభుజపరాక్రమమువలనఁగదా కన్నడసీమ మనకు వశమైనది.

ఇబ్ర — అట్లైన శివాజితోఁగూడఁ గయ్యమునిల్పివేసి సఖ్యముకోరుఁడు.

సుల్తా — రాజద్రోహియగు శివాజికిని సిద్ధికిని హస్తిమశకాంతరముగలదు. మామూలు సోహాను త్రోసివేయవలసినవాఁడుకాఁడు.

ఇబ్రహీంకు — సర్కారు! మీరుతనిని పూర్వసిద్ధిగా ననుకొంటిరాయేమి! మీరుండవలసినది చెప్పుచుండఁగా లత్యేస్సెట్టిక కష్టాలునకు నేఁగలేదా? గడిచినసంగతి మఱచిపోతిరేమో! ఎవరినిఁబంపి తదీయసఖ్యముచేసికొందురో చూతుము గాక.

పకీరు — అంతగాఁ దగినవారే లేకున్నచో సర్కారే కర్నూలరిగి కార్యము సానుకూలపఱచుకొనివత్తురు.

జంఝూర—ఔను సర్కారుపోయినఁగాని యతండు స్వాధీనుఁడుకాఁడు. వెళ్లి వారముదినములలోఁ దిరిగి రావచ్చును.

ఇబ్ర—అట్లైననింక శివాజితో మాటాడువారెవరు?

సుల్తాను—లేకేమి వాడీసావంతుండున్నాఁడు. వానికి ఘోరపురే ల్కాఖానులను సాయాముగాఁ బంపుచున్నారము. మేమువేంచేయక తీరదు.

పకీరు—వేగముగా రావలెఁజుడీ!

సుల్తాను—జంఝూర్ ! ఎవరినైనుబుత్తెంచి రామోజిని భార్యాసమేతముగా నైనరావింపవలెను నాల్గైదుదినములలోఁ దిఱిగివత్తుము.

జంఝూర—చిత్తము. సర్కార్!

సుల్తాను—పక్కీర్ ! మేమువచ్చునంతలోఁ గంటికి రెప్పవోలెఁ బ్రభావతినిఁ జూచుచుండవలయునని మాప్రార్థన. రామోజిరాకున్నను గార్యము పట్లనుపేక్షింపఁజాలము. ఇప్పటిలో రాజధాని విడుచుటకు మనసొప్పకున్నది.

పకీరు—ఔనుసమయమట్టిది. తమరువీలైనంతవఱకు వేగముగావిచ్చేసిన సంతోషింతుము మేమువచ్చి చాలదినములైనది. మాకు మెక్కాలో మసీదు నిర్మింప సంకల్పమున్నది. నాల్గుసీమలకు నేఁగి మీబోంట్లను దర్శింపవలెను గదా!

సుల్తాను—సాధ్యమైనంత త్వరలో మఱలి విచ్చేసెదము. దయచేసి మీరు మారాకపర్యంతముండవలసినదిచుఁడీ! మీరున్నారను ధైర్యముననే పోవుచున్నారము. ఆమసీదునకు నెంతసైకముపట్టునో చెప్పిన మేమే యిచ్చివేసెదములెండి. ఈమాత్రమునకు నల్వురఁజూడవలెనా?

ఓయీ ఇబ్రహీమ్ ! నీవప్రమత్తుండవై సకలకార్యంబులను మాకు మాఱుగానిర్వర్తించునది. జంఝూరరావ్! విశాలాక్షిని విడిచిపెట్టుమని బాలాజి ప్రార్థించుచున్నాఁడు. కాని యతఁడు శత్రుపక్షములోఁ జేరినవాఁడౌటవలనఁ దత్సోదరిని విడిచిపెట్టవలెనని యెంతమాత్రములేదు. విశాలాక్షియుఁ బ్రభావతి

వంటి చక్కని చుక్క కాకపోయినను నందెకత్తెలలో జమయగును. కాన మాపినతండ్రి కుమారునకిచ్చి పరిణయముచేయింపవలెననియున్నది. ఎల్లిజనానాను బంపివేయవలెను. మేమువచ్చుదాక నీవు పకీర్ ఇబ్రహీములతోఁబాటు రాజకీయవ్యవహారము లరయవలసినది. శివాజిగూడ చాయలీనగరిలో సంచరించుచున్నట్లు వినుచున్నాము. అట్టివారినిఁబట్టి బంధింపవలెను. అని యానతిచ్చి పకీరును వెంటఁబెట్టుకొని యేమేమో సంగతులుచెప్పుచు నాచావడిని బాసిపోయెను.

# ముప్పది రెండవ ప్రకరణము.



బాలాజి సోదరియగు విశాలాక్షిని జంఝూరరావున కొప్పగించి యా పెను సగౌరవముగా నరయవలసినదని యతనితో సుల్తాను చెప్పినసంగతి మా చదువరు లిదివఱలో గమనించియే యుందురు. నాటనుండియు నవివాహి తుండగుటవలన జంఝూరరావునకు నప్పరభుసుందరి పై మనసు దగులుకొని మదనతంత్రంబున మది మఱలించుకొనేరక యాయిందువదన నేరీతి నైనను బరిణ యంబు గావించుకొనఁ జూచుచుండెను. ఇంతలోఁ దన ప్రియమిత్రుండైన ఫజీలు నిహతుండౌటయు నిబ్రహీముపన్నిన పన్నుగడవలనఁ గార్యసూరుండగు సిద్ధి జోహరు కర్నూలునకు వెడలి పోవుటయు నూరుపేరు లేనిపకీరుమాటల ప్రకారము విజాపురీశ్వరుండు నడుచుకొంటయు మున్నగువిషయముల నెల్ల గనిపెట్టుచున్న జంఝూరరావు సుల్తాను కన్నడమునకుఁ బ్రయాణము సాగిం చినపిమ్మట నిట్లువితర్కింపఁ జొచ్చెను. 'ఆహా! నే నెంతమంతబుద్ధిని. నాడు శివాజి మహారాజు ప్రార్థించి యటనిల్వుమన్నను నిల్వక యతనితో గోపినాథు నివలెవర్తించి స్వామిద్రోహపాపము మూటకట్టు కొననియుఁ గదా చెప్పివచ్చి తిని. అప్పటిలో నచ్చటనుండి పోయినచో నీయలజడియే కలుగక పోయియుం డును ఇప్పు డేమోముతో నేనుశివాజి కడకుఁబోవుదును? ఎవ్వనికై నేను విజా పురికి మఱలి చేరుకొంటినో యట్టినెచ్చెలి యాయిప్పుడు లేడాయెను. కేవలస్వా ర్థపరుండును దురభిమానియునగు నిబ్రహీము పై ప్రేమ పెరుగఁ జొచ్చెను. రా జకార్యధురంధరుండగు జోహరన్నను సుల్తాను పైఁగినిసి స్వదేశమునకు నేఁగె ను. పకీరిభ్రహీములపాలనా ప్రభావంబున నీనడుమ బ్రయోజకు లనేకులకుఁ బదచ్యుతియు దేశభ్రష్టత్వమును సంభవించెను. ఒకరినొకరు ప్రేమింపరు సరి కదా పచ్చగా నున్నవారినిఁ జూచి యోర్చువారుకూడనిచ్చోడలేరు. మఱియు సత్యమా చచ్చెను. ధర్మమా యరణ్యముఁ బాలాయె. వంచన లోభములా

నెన్నుపెరుగుచున్నవి. ఇట్టి రాజ్యంబుననుండుటకంటె వేఱొండుచోటికిఁ బోవుటయే మేలని తోఁచెడిని. దర్బారులోనున్న బ్రాహ్మణులొక్కొక్కరుజారుచున్నారు. ఇటీవల నాముంగల లెక్కకుఁ బెక్కుమాఱులు మరాటులను నమ్మరాదని సుల్తానును తదీయులును ఘోషించుచున్నారు. ఇట్టి స్థితిలోఁ నిచ్చటనుంటవలన బకీరు చెప్పినట్టులేదైన నుపద్రవము తటస్థింపకమానదు. ద్విజార్థముకదా శివాజి యవనులతోఁ బ్రతిఘటించుట. అదికాక మరాటుల దాస్యదారిద్ర్యములు నివారింపఁ గంకణము కట్టుకొనియున్న కోంకణప్రభువు నాశ్రయింపక నా జీవితము వ్యర్థపుచ్చితిని. ఇస్సిరో! నాకంటె స్వజనద్రోహియు వివేకశూన్యుండును. వేఱొక్కఁడుండునే! పిలచినప్పుడు నిలువక యిప్పుడుపోయినచో నతండేలమన్నించును. పనుపిచ్చినప్పుడు చంకకెక్కకుంటిని కదా? ఆమహారాజు నాశ్రయింపక యింకమీఁద నన్యమతద్వేషులగు మహమ్మదీయుల సేవచేసి నేనిహపరంబులనెట్లు వదలుకొందును. సుల్తాను నాజ్ఞ పాలించి విశాలాక్షిని జనానాకుఁ బంపినచోఁ దెలుఁగు నాకాంత నాకుఁ జిక్కుటకలలోవార్త. అముగ్ధను బంధువులతోఁ గల్పినచో నొకవేళ నాకోర్కె చెల్లించునేమో కాని లేనియెడ నాకు వశపడునని తోఁపదు, కావున నెట్లును శివాజి నాశ్రయింపక బాలాజి ముఖ్యులసఖ్యము సంపాదింపక యీసాధ్వి స్వాధీనపడుట దుర్లభము. పకీరుకూడ నన్ను నీరాష్ట్రమునుండి లేచిపొమ్మని యానతిచ్చినాఁడు కదా! కొమ్మను వెంటఁదీసికొని రాత్రి రాత్రిని గోంకణసీమకుఁ ద్వరతోఁ బాఱుటయే కర్తవ్యము దయాసింధువును నౌదార్యఖనియు స్వజనపక్షపాతియునగు శివాజీ మహారాజుపాదములపైఁబడి యపరాధము క్షమింపుమని వేఁడుకొన్నయెడల నతండేమిటికి నన్నాదరింపక తిరస్కరించును? కులజాల నెందఱఁ జేరఁదీసి తనంతవారిఁగాఁ జేసికొని బ్రోవలేదు? తొల్లి విభీషణుండు శ్రీరామచంద్రుని చరణంబులుపట్టి సకలైశ్వర్యవంతుఁడై యుజ్జీవించినట్లు నేనును స్వదేశాభిమానితిలకము నాశ్రయించి వర్ధిల్లుదునుగాక!" అని యుద్దేశించి విశాలాక్షికడకుఁజని యామెను తగురీతినోదార్చి తన యీప్సితంబుతెల్లముగానల్లన నిట్లువాక్రుచ్చెను. "ఓయిందీవరాక్షీ! పాపము ప్ర

భావతిలభించినపిమ్మట సర్కారు నిన్ను విడిచిపుత్తునని వాగ్దానముచేసియుఁ దప్పిపోయెను. నిన్ను గూర్చి నీతలిదండ్రులును రాజును ఎంతవంతనొందుచున్నారో? నిన్ను మీవారినెడఁబాయఁజేసిన ఫజీలు నీయుసురు తగిలికదా? దుర్మరణమొందెను. తల్లికెడయయిన దూడభంగి నీవిచ్చోట సర్వసౌఖ్యములు గల్గియుఁ గల్గనట్లే యలమట చెందుచున్నావు. నీయట్టిసుకుమారి కింతకష్టములు రాఁజెల్లునే! నినుఁజూచిన నాఁటఁగోలె నాహృదయముగలఁగుచున్నది. నమ్మవేమోకాని నీపై నాకుఁగల ప్రేమయింతింతని చెప్పరాదు. ఈనామాట నీకు విముక్తికల్పించిన తఱినెఱుంగుదువుకాక. అక్కటా! నీ సౌందర్యముయౌవనము కారాగృహముపాలు కావలసినదే? సుల్తానునకిష్టములేకున్నను నిన్నే నైనను విడిచిపెట్ట సమకట్టితిని. సుల్తాను నిన్ను దనపినతండ్రి కుమారునకిచ్చి పెండ్లి కావింప నిశ్చయించియున్నట్లువింటిని. జనానాకు నిన్నుఁబంపివేయవలసినదని సర్కారుత్తరవుచేసినారు. కానిస్వజాతీయురాలవైన నీకేలు యవనుండొకండు పట్టుట కెట్లోర్తును? నామీఁద నీకెట్టిప్రేముడియున్నదోకాని నాకు నీపైఁ గరుణగలదని తెలిసికొనుము—చల్లకువచ్చి ముంతదాఁచనేల? మావారీ మధ్య వేఱొకచోటఁ బెండ్లిమాటలాడుచుండ నీమీఁదవలపున నిప్పుడేను వివాహముచేసికొననిచెప్పి వారిని దప్పరియత్నవిముఖులంగావించితిని. నాకేలువట్టి నన్నుఁగృతార్థునిచేయ నీకొందువేని నిన్నీపాడుచెఱనుండి తప్పింతును" అని పల్కినపల్కులకు సంతసించి యింతకుముందుచేసిన పకీరుహితబోధననుసరించి యాపద్మనయన నిజమార్దవత్వాదులు విశదంబుగానిట్లనియె. మీరు నిజముగా నిట్లువాకొనుచున్నారో లేక నన్నువంచింపఁదలంచి యిట్లనుచున్నారో యబలనగునే నెఱుంగనుగదా? పెద్దలగు మాతల్లిదండ్రి రాజులుండఁగా నిట్టి విషయంబులలోనే స్వతంత్రించుటెట్లు? నావిడుదలకు మీరే కారణులైనచో జనకులుతప్పక మీయభీష్టముదీర్పఁగలరు. కాని శివాజీ విరోధులగు విజాపురి వారికొల్వులో మీరుంటవలన మావారందుల కిష్టపడరేమోయని సందేహము తోచెడిని. ఇంతకు నావిముక్తి సమకూడనిదే యీవిచారములతోఁబనియేమి?

నిజముగా మాజనకులతో బంధులతోఁ గలసికొను భాగ్యము నాకలవడు నే? అని నిట్టూర్పునిగిడ్చి యూరకుండిన జంఝూరరావు విశాలాక్షి మెత్తబాటునకు లోనుబ్బి యిట్లనియె. "కాంతా! నీవు నన్ను ననుమానించుచున్నట్టులున్నది. ఇదే దైవసాక్షిగాఁ జెప్పుచున్నాను. నామాటలుపాటించి నాకోర్కె చెల్లింప వేడుకొనుచున్నాను. సమయము చూచి నిన్ను విడుదలచేయసంకల్పించుకొంటిని. ఇంక సాహేబుల గులాపుపృత్తినివదలుకొని శివాజిమహారాజు చరణద్వయము సాక్షిగాఁబట్టి నిశ్చయించితిని. నీవునిజముగాఁ గూర్మినిల్పిన మీజనకులు మా త్రమేలసమ్మతింపరు? తొల్లిశకుంతల యేరినడిగి దుష్యంతుని వరించినది. వ్యక్తురాండ్రు కాక పూర్వమే యుద్వాహము నిర్ణయించుకొను బ్రాహ్మణస్త్రీలకిట్టి స్వాతంత్ర్యము లేకున్న లేకపోవచ్చుఁగాని తదితరవర్ణస్థులకునిట్టి ప్రతిబంధకము లేదనియే యెఱుంగుదును. అని యిట్లాడఁబరచుచుండ నచ్చోటికిఁ బకీరు చప్పుచప్పునవచ్చుచుండెను. జంఝూరరావు పకీరునకు సలాముచేసి యతని నొక యుచితాసనముమీదఁ గూర్చుండఁజేసి యిట్లు ప్రసంగింపఁదొడంగెను.

జంఝూర—పకీర్జీ! తమ రాక యపూర్వముగానున్నది. విశేషము లేమైన నున్నవా?

పకీరు—ఏమియు విశేషములున్నవి. మీరు కొంకణ సీమమీఁదికి దండెత్తిపోవలసి యున్నదఁట.

జంఝూర—ఎప్పుడు? ఇది వజీరు గారి యాజ్ఞయా యేమి?

పకీరు—ఔను వజీరు నాజ్ఞయే.

జంఝూర—సర్కారు నన్ను రాజధానిలోనే యుండవలసినదని యానతిచ్చినారు. అట్టిచో నేనెట్లు వజీరుమాట పాటింతును.

పకీరు—ఈవిషయము మీరిరువురుకలసి యాలోచించి సంప్రతించుకొనవచ్చును దానికేమి ఇంకను విశాలాక్షిని అంతఃపురికిఁ బంపకుంటకుఁ గారణ మేమి?

జంఝూర—ఏది? నిన్ననగా సర్కారు సెలవిచ్చినది. అట్లే జరిగింపవచ్చును కాని—

పకీరు—ఏమో చెప్పఁబోయి యూరకున్నావు. సర్కారాజ్ఞ చెల్లించుట మీకువిధాయకము కదా?

జంఝూర—చిత్తము. మీతో నొకసంగతి చెప్పవలసి యున్నది.

అని పకీరును వెంటఁబెట్టుకొని యచ్చోటువాసెను.



# ముప్పదిమూఁడవ ప్రకరణము.



అట్లు సుల్తాను కొంత సైన్యముతీసికొని కృష్ణానదివఱకుఁ బోయి యప్పటికిలో వర్షములు సంతతధారాపాతముగాఁ గురియుటఁజేసి తానచ్చోటనున్న చిముల్గ గ్రామమునందు సైన్యసహితము గానిల్చి యటనుండి సిద్ధిజోహారు ననేకసిద్ధముల రావలసినదని బలవంతపెట్టెను. జోహారును మొదలు మొదలు పోనొల్లకుండెను. కాని సుల్తానంతటి దొడ్డప్రభువుతోఁ బ్రతిఘటించుట దుస్సాధ్యమని నిర్ణయించి యుద్ధకేళికు జడియుచు జంకుచుఁ దదీయశిబిరమునకు వచ్చెను. సుల్తాను సిద్ధిరాకకు సంతోషించి వానినిఁ దగినట్లు గౌరవించి కర్ణాటకములోని యల్లరులు నివారింపుమని యతనినిబుత్తెంచెను. అయినను నేకారణముననో సిద్ధితగినంతశ్రద్ధతీసికొనకుండెను. అందులకు సుల్తానువానిపై ననుమానించి మరాటజనాంతములో నున్న సేనలన్నియు రప్పించుకొని వర్షములు తెరపియిచ్చినపిదప స్వయముగాఁ దానే కర్నూలునకుఁబోయి సవాబఖ్తాను నోడించి యతండు శరణుజొచ్చుటవలనఁ బూర్వమువలెనే గౌరవింపఁజొచ్చెను. కాని యిబ్రహీము సఖులలో నొక్కరుండు శిబిరమునందు నతండొకనాటిరాత్రికాలమున నిద్రించుచుండఁగా వానిని జంపి పగదీర్చుకొనెను. ఇట్లు సిద్ధిలోకాంతరగతుండౌటఁజేసి సుల్తాను స్వయముగానే కర్ణాటసీమకేఁగి యచ్చటి జాగీరుదారులను జమీందారులను సామంతరాజులను నొక్కరివెనుక నొక్కరిని లోఁబఱచుకొనుచుండెను.

ఇంతలో శివాజీ విజాపురిమూలబలములలోఁ జాలభాగము కన్నడభూమికిఁ బయనమౌటకనిపట్టి యీసమయములో సావంతునిస్వాధీనునిగాఁ జేసికొనవలెనని నిశ్చయించి విశాలగడమునకుఁ జేరికొనెను. అప్పుడు సావంతునిసాయముగాఁబోదలంచి యుద్ధసన్నాహముచేయుచున్న బాజిఘోరపురేమధోలు గ్రామములోనున్నట్లు చారులవలనఁ దెలిసికొన్నవాఁడై శివాజీ దండుతీసికొని

హఠాత్తుగా నటకు నరిగి ఘోరపురేను సకుటుంబబాంధవపరివారముగాఁ దెగటార్చి యాపురిని బరశురామప్రీతిగావించి తనతండ్రికి నప్పుడుచేసినయపకృతికిఁ బ్రతిక్రియసల్పితి ననుసంతోషముతో విశాలగడకు మఱలి చేరుకొనెను. ఇట్లు తండ్రికోర్కె చెల్లించి యనంతరమున నిస్సహాయుఁడైన శావంతుని దదీయమిత్రులైన దళ్వేలుతోపా టోడించి వానిప్రదేశములనాక్రమించుకొని వానినిఁబట్టదలంచి నేతాజివెంట గొంతసైన్యమిచ్చి పంపెను. వాఁడును నేతాజిచేఁ దరుమఁబడినవాఁడై గోవాకుఁబోయి బుడుతకీచుల సాయము వేఁడుకొనెను. కాని యాపోర్చుగీసువారు శివాజికి వెఱచి వానిని దమపట్టణమునుండి తఱిమివేసిరి. తొల్లి కాకాసురుం డప్రతిహతంబైన రామబాణమున కోడి బ్రహ్మరుద్రాది ప్రముఖులరక్షణ వేఁడియు వారివలనఁ బ్రయోజనము కానక తుట్టతుదకుఁ బరబ్రహ్మమూర్తియగు శ్రీరామచంద్రునే శరణుఁజొచ్చి యుజ్జీవించినట్లు దాళ్వేలసమేతుండై శావంతుఁడు శరణాగతరక్షకుండగు మహారాష్ట్రాధ్యక్షుని పదములాశ్రయించి నాటఁగోలెఁ దదీయోద్యమములకు సహకారిగను వర్తించెను. శివాజి శావంతుదాళ్వేలను దోడ్కొని జంజిరాతక్కఁ గోంకణప్రాంతముఁ దనస్వాధీనము చేసికొనెను. సిద్ధి పత్తేఖానుని లొంగదీయుచు నణిచియుంచి బొంబాయికి నిరువదిమైళ్ళు దక్షిణముననున్న కొల్బాబు మఱికొన్ని రేవుపట్టణములను లోఁబఱచుకొని యత్తావుల నావసైన్యము వృద్ధిఁబొందించి సిద్ధిని 'జగద్దేవర' యనిపించుటయే కాక తత్సహాయులైనిల్చిన గ్రుమగోవావారిసౌదాలను దోపిడిచేయించెను. వారును శివాజి నావసైన్యముధాటికోర్వఁజాలక కొంకణప్రభువునకు మందుగుండు సామానులనిచ్చుటకును దగుపాటికప్పము చెల్లించుటకు నొప్పుకొనిరి.

ఇట్లు తనసామంతప్రభువులనెల్లఁ జక్కపఱచుకొని బలపరాక్రమసంపన్నుఁడై నానాటికి శివాజివర్ధిల్లుచున్న సంగతి సుల్తానెఱుంగక యింకను గ్ఘాటకపుటల్లరులెల్లదీఱకుంటఁజేసి యచ్చటనే నిల్చి ప్రభావతి నటకు రప్పించుటకు నెంచి యట్లుచేయుట మంచిదో కాదో యని తనలో నాలోచించుచుండెను.

అప్పటికొకనాఁడు సంజవేళఁ బ్రభావతిపై మనసుపోఁగా మదనబాణపీడితుండై తన శిబిరములో మంచముపైఁ బొరలుచు నెవరువచ్చినను మాటలాడక వ్యవహారచింతమాని విషయచింతలో మునింగియుండెను. ఆసమయమున విజాపురినుండి యిద్దఱుబేగీరావులు శిబిరమునకు నేతెంచి తమరాకను సుల్తానునకెఱింగింప నతండును వారిని రావించి వారిచ్చిన యుత్తరములందుకొనియు నొక్కింతసేపు చిడిముడిపడుచుఁ బదంపడి యిట్లనియె. "ఓరీ! యీ జాబు లెవ్వరొసంగిరి" అనుడువారు ఫకీరుపంపినవని తెల్పఁగాఁ దత్తఱపాటుతోనవి తెఱచుకొని యొకటిపిరువాత నొకటి యత్యాంతానందముతో నొకటిరెండుమాఱులు చదువుకొని పినతండ్రి కుమారుండగు హాజేస్సునటకుఁ బిల్పించి ప్రకాశితముఖుండై యిట్లనియె. "ఓయీ! ఈదినముసుదినము నేడుమన ఫకీరు వద్దనుండి యుత్తరమువచ్చినది. అబ్బా! ఇన్నాళ్ళకుఁ బ్రభావతి మనసు మాపైఁ దిరిగినదట. కమ్మవినఁగోరెదవేని వినుము" అని తానే తీరునఁ జదువఁ దొడంగెను. "సుల్తాన్జీ! తమరు మొన్నను కొంకణమునుండి విజాపురికి విచ్చేసినప్పటికే ప్రభావతి మనసు మీపైఁ గొంతతిరిగియున్న సంగతి సర్కారెఱింగియున్నదేకదా! కాని యాపె నంపుడు కత్తెవలెనుంచుకొందురేమోయని యిన్నాళ్లును భయపడి మొన్నమాత్ర మీవిషయము మాతో బయలుపఱచినది. అంతమేముఁ నీకేమియు సంశయింపనక్కఱలేదు సర్కారు నిన్ను నూర్జనహోనును జహాంగీరు చక్రవర్తియాదరించినట్లు లాదరింతురని చెప్పి యొడంబఱచితిమి. అప్పటినుండియు నిచ్చటనుండననియు మీవద్దకుఁ గొంపోవలసినదనియు మమ్ముఁదొందఱపెట్టుటఁ జేసి యీలేఖ వ్రాయవలసివచ్చినది. ఈసంగతి ప్రభావతి వ్రాయుకమ్మలో విస్పష్టపడవచ్చును: శివాజికోటలు శావంతుఁడు క్రమక్రమముగా వశపఱచుకొనుచున్నాఁడు. ఇచ్చట సకలవ్యవహారములు సానుకూలముగానే సాగుచున్నవి. ప్రభావతి జనకులు మాత్రమింకను రాలేదు. ఆతరుణిని తీసికోరమ్మని మీయభిప్రాయమైనచో వజీరు పేరటనే తన్నిగ్గము లేఖపూర్వకముగాఁ బెల్పుడు చేయవలెను. సవాబ్ఖానుగతించిన పిదప మీకక్కడ విజయముగానే యుండునని తలంతుము. వెంటనే ప్రత్యుత్తరముదయచేయఁ గోరుచున్నాము. ఇంకనెన్నాళ్లిచ్చటఁ దమరుండవలసివచ్చునో తెలిసికొనఁ

గోరుచున్నారము. ఇచ్చట మనవారికెల్లరకుఁ గుశలముగానేయున్నది. తమ యోగక్షేమము మాకుఁ దెలియఁజేయునది. జవాబు జరూరు" అని యాలేఖ సాంతముగాఁజదివి రెండవయుత్తరమును చదువగమకించియు నందలి విషయములు పరులకెఱింగించుట సరసముగా నుండదని కాబోలుచదువుటమాని యా సైదోడుతోనిట్లు నుచ్చటింపఁగడంగెను.

సుల్తాను—అజీస్ ! చూచితే! శావంతుఁడు మరాటవాఁడయ్యును దక్కిన జాగీరుదార్లవలెఁగాక మాయెడలవిశేష భక్తిగల్గియున్నవాఁడు జోహారునకుసాటిసైనమగటిమిగలవాఁడు. కావుననే శివాజికిఁజిక్కకయ తనినిఁజిక్కులుపెట్టుచున్నాఁడు. వజ్రమును వజ్రముతో కోయవలె నన్నట్లు శివాజినిఁదదీయజాతీయుండగు శావంతుఁడేపట్టవలెను.

అజీస్—ఔనంతడట్టివాఁడే.

సుల్తాను—ఇక్కడ మనసర్దారులలో నెవ్వఁడేని గలఁడా?

అజీస్— సర్కార్ మీరెఱుంగరా? అంతశౌర్యస్థైర్యములును బుద్ధికుశలత యుఁగల వాఁడెవ్వఁడున్నాఁడు? ఉన్నచో మీకింతశ్రమయుండునే?

సుల్తాను—ఇప్పుడు మేము విజాపురికిపోవలసి యున్నది. నీవుమాకు నూఱుగా నిటమెలంగవలె లేదా! విజాపురికేఁగి ఫకీరుసహితముగాఁ ప్రభావతి నిటకుఁదీసికోరావలెను. ఈరెంటిలో నీకేదిసుకరమో వాక్రుచ్చుము.

అజీస్—ఇటసర్దారులలో నొకరిమాట యొకరికిఁ బొందకుండనున్నది. ఇట్టి స్థితిలోవీరి నందఱినొక్క మొగముగా నడిపించుటనాకు సాధ్యము కాదు. ఇట్లంటిననని మీరొకరీతిఁ దలుపఁదగదుసుఁడీ మీ రుకోరినట్లు ప్రభావతి నిటకుఁదెప్పింపు మన్న నీక్షణమే పోయి తీసికోవత్తును. కానిసర్వసైన్యాధిపత్యము వహింపఁజాలను. ఇదికాక మీరిప్పటిలో నిటలేకున్న లోఁబడిన జాగీర్దారులు తక్కుంగల వారితోఁ గలిసితిరుగఁ బడుదురేమో యని తోచుచున్నది.

సుల్తాను—అట్లైన నీవీదినమే నీసైన్యమును దీసికొని బయలుదేఱిపొమ్ము. వేగము ప్రభావతిం దోడ్కొనిరమ్ము. జాగుచేయుదువు సుమీ నీవువచ్చు నాక నాకేమియుఁ దోఁచదు.

అజీస్—నేనొకమనవి చేసికొనుచున్నాను. చెప్పుమని సెలవయిన యెడలఁ చెప్పుదును.

సుల్తాను—హాజీస్! మావద్ద నీకింత బిడియమేల? అట్లే చెప్పుము.

హాజీస్—శివాజితండ్రియగు మనశహాజినిటకు రప్పింతురేని యతండు నిముసములో నిజవిూందార్లను వశవర్తులఁ జేయఁగలఁడు. అతని కీసీమలో మంచి పలుకుబడిగలదు. కావున నితనివేగము రప్పింపుడు. నేనువిూ యాజ్ఞానుసారముగా విజాపురికిఁ జనుదెంచి సత్వరము ప్రభావతి సఖీయులను దోడితెత్తును. నేవచ్చుదాక మీరీమఖాము విడువవలదు. అని యతండు సెలవుతీసికొని యరుగునప్పుడు వానిచేతికి రెండుత్తరములు వ్రాసియిచ్చి చెప్పవలసిన సంగతులు చెప్పి పుత్తెంచెను. తరువాత నటకు వచ్చిన జేగిరావులకు నొక యుత్తరమిచ్చి తంజాపూరికిఁ బంప తాను ప్రభావతి యెప్పుడువచ్చునో యని యువ్విళ్లూరుచుండెను.



# ముప్పదినాల్గవ ప్రకరణము.

---

అట్లు సుల్తానుచేఁ బంపఁబడిన యజీసు కతిపయదినములలో రాజధానికిఁ జేరుకొని ఫకీరు ప్రభావతుల కుత్తరములందఁజేసి తాను వచ్చిన పని యిబ్రహీము ముఖ్యులకుఁ దెల్పుడుచేసి ఫకీరుప్రభావతులను త్వరగాఁ బ్రయాణము కావలసినదని తొందరచేసెను. ఫకీరు తా ననుకొన్న దానికి పూఁ సాకఁ దగ్గువచ్చెననియు వీని కంటిలో దుమ్ముగొట్టి ప్రభావతి నెట్లు చెఱ నుండి తప్పించి తీసికొని పోవలెనో తోపక దిగులొంది చింతాక్రాంతుఁడై ప్రభావతియొద్దకు వేఁగి యామెకీసంగతులన్నియు నెఱింగించెను. ఆసుందరి యుఁ గొంతసేపు విచారించి ఫకీరు నుద్దేశించి స్వామీ! మన జంఘాలుం డీ యూరనున్నాఁడా? యని యాతురతతో నడుగుటయు నతండు నాఁడు లేఁడుకాని జంఘాలుఁ డున్నాఁడని యెఱింగించిన నాముద్దులగుమ్మ అట్లైన నే నొకయుపాయము తెల్పెద'' నని యారీతిగాఁ జెప్పఁదొడంగెను.

"ఆర్యా! నాకుఁ గడుపు నొప్పి లేచుచున్నదను మిషపూని మనప్రయాణము క్రమముగా వారము దినములుదాఁకఁ జరుపుదము. ఈలోగా మంత్రి యుని పేర నొకయుత్తరము వ్రాసిపంపుదము. ఆయన వద్దనుండి జవాబు చూచుకొని మఱి పయనము సాగింతము.'' అని పల్కిన నాపన్నగడప మించిన మంచి పన్నాగము వేఱొకటి తనకు స్ఫురింపనందునఁ ఫకీరందుల కీయకొనెను. వెంటనే ప్రభావతి యొక కలము కాగితము సంతరించి తగురీతి నొక్క కమ్మ లిఖించి దానిని ఫకీరు చేతికిచ్చుటయు నాతఁడాకమ్మను దీసికొనిపోయి రహస్యముగా జంఘాలునిఁ గలసికొని "ఓయీ! నీవు వేగమ విశాలగడకుఁబోయి యీజాబు బాలాజికిచ్చి ప్రత్యుత్తరము దీసికొని రావలసినదని నొక్కి చెప్పి కమ్మచేతిలోఁ బెట్టి వానిని బుత్తెంచెను.

నాఁడు ప్రభావతి పరుల పాలౌటవిని తదీయులు కరంబు పరితపించిన సంగతి చదువరు లిదివఱకే యెఱింగియుందురు. అందు బాలాజి లౌకిక వ్యవహారవిముఖుఁడై సరిగాఁ దిండితిప్పలు గొనక యున్మత్తుని చందమున నిఃసుందరి సౌందర్యాదుల భివర్ణించుచుఁ గొన్నాళ్లు వేగించెను. వెఱ్ఱి కుదిరినఁగాని పెండ్లియుఁ బెండ్లి కుదిరినఁగాని వెఱ్ఱియుఁ గుదురదను నట్టియవస్థకు బాలాజి నానాఁటికిఁ దిగుచుండుట గనిపట్టి యతనికుదారుండగు శివాజి తగినయౌషధముల నిప్పించుటయే కాక విశాలాక్షీప్రభావతుల విముక్తికిఁ బ్రయత్నములు చేయుచుండెను. ఔషధసేవవలన బాలాజి శుక్లపక్ష చంద్రుని చందంబునఁ గ్రమక్రమముగా నొక్కింతజవసత్త్వములు గల్గి స్వస్థచిత్తుండై యొక్కనాటిరాత్రి ప్రభావతి తలంపునకు రాఁ బెట్టెఁ బరితపించి రెండు జాములు గడచినపిదప నిద్రింపసాగెను. ఆనిద్రలోఁ బ్రభావతి మాసిన చీరగట్టుకొని యేడ్చుచుఁ దనవద్ద నిలువఁబడి "నాథా! ఇంకమిమ్ము నేఁ గూడుట సంభవింపదు. సుల్తాను బలాత్కారముగా నన్ను బరిగ్రహింపఁ జూచుచున్నాఁడు. ఇంతటితో మనయిరువురకు ఋణముతీఱెనది" అని చెప్పిపోవుచుఁ బిల్చినను బల్కరింపక వచ్చిన దారినిఁ బోయినట్లు కలగని కలవరపడి నిద్రాభంగమైనపిదప నిట్లు తనలోఁ దా వితర్కింపఁ జొచ్చెను. "ఓహో! తానొకటి తలంచుకొన్న దైవ మొకలాగు సల్పిననుసామెత నాయందు సార్థకమైనది, నాబోటి పరమనిర్భాగ్యునకంతటి సౌందర్యవతి లభించునే! అందరానిపండ్లకాసించి యఱ్ఱులుచాచినట్లాయెఁ గదా. నావిముక్తియుఁ బదంపడి ఫజీలుమృతియుఁ దటస్థించుటఁజూచి నిశ్చయముగా నభినవరతి యగు ప్రభావతితోఁ గాపురము చేయునట్టి భాగ్యము చేకూఱునని కొండంతయాశపెట్టుకొని యుంటినిగాని యిట్లగునని కలనైనను దలంపనైతిని. ఇస్సిరో! ఫజీలునిమోసపుచ్చి చంపితిని. ఇట్టి క్రూరునకు నేల వారియుసురుతగులకుండును. హా! నాఁడు ప్రతాపగడలో బునర్దర్శనమిచ్చిన తటినెంతలేసి కోర్కులుమదిలో నుద్భవించియు నిప్పుడు తనుతాపవహ్నిచేనవి క్రాగి క్రుగ్గుచున్నవి. అప్పటిలో నాపడిన పాటులెల్ల సార్థకమయ్యెనని యూహించి యింకనిశ్చయముగా నాలోనె

కసుందరిని వివాహముచేసికొనవచ్చునని జీలనైయూరకుంటిని గాని గాంధర్వవివాహము గావించుకొని యొక్కమాటైన ననుభవింపకపోతిని. నన్ను దక్క వేఱొక్కనిఁ జేపట్టనని నొక్కిచక్కాణించిన యామొప్పులకుప్ప యింకొకనికి స్వాధీనమగుచుండఁ దత్ప్రతిక్రియఁ గావింపలేని నాబ్రదుకొక బ్రదుకా? ఇంక నాబలపరాక్రమంబులు కాల్పనా? కటకటా! ముగుదయగు విశాలాక్షి యక్కడ నొంటిగానుండి దుఃఖించుచు నేమయ్యెనో కదా! పోని ప్రభావతి చిక్కకున్నను విశాలాక్షియైనను దక్కరాదే! మాయెడల దైవమింత దయ తప్పుటకు మేమేమి పాపముచేసియుంటిమో కదా! భర్తమరణమునకు మంచముపట్టియున్న మాయమ్మశోకము నివారింపలేకుంటకుఁ దోడు నేనుగూడ నిట్లు విచారించుచున్నచో నాపెత్వగలోఁ బరలోకగతిఁ జెందుటకు సందియములేదు." అని పరిపరివిధంబులఁ జింతించుచు నేమియుందోపక ప్రక్కనెఁ బరుండి చికాకుపడుచుండెను. అత్తఱినచ్చోటికిఁ బనివడి భేతాలుండువచ్చుటయు వానిఁ జేసైగచేఁ గూర్చుండ నియమించి మెల్లగానిట్లు ముచ్చటింపఁ దొడంగెను.

బాలాజి—భేతాళా! బహుకాలమైనది దర్శనమే లేదు!

భేతాళు—పరభు తిలకమా! నాడు ప్రతాపగడలో మిమ్ము వీడ్కొనిన పిమ్మట విజాపురిలోఁ బెక్కుదినంబులుండవలసి వచ్చెను.

బాలాజి—ఇన్నాళ్లును విజాపురిలోనే యుంటివా?

భేతాళు—చిత్తము. కాని యిప్పటికప్పుడే పదిదినాలై యాపురి విడిచి వచ్చితిని.

బాలాజి—అట్లైనఁ బ్రభావతినెప్పుడైనను జూచియుంటివా?

భేతాళు—చూచియుండలేదు కాని పాపమాసుకుమారి నానాటికిఁ గృశించుచున్నదని తెలిసికొంటిని అంతఃపురిలోనున్న యాపెనుజూచుటకు నెట్లు వీలగును?

బాలాజి—సుల్తానునకు వలపులకత్తెయైనప్పుడామె కృశించుటకుఁ గారణమేమి?

శ్వేతాళు—సుల్తానుపై నాపెను మనస్సులేనట్లు వినికిడి.

బాలాజీ—అంతటి దేశాధీశుండు పాదాక్రాంతుఁడై ప్రాధేయపడుచుండ నాయనమనసు తిర్వకుంటకుఁ గారణమేమి?

శ్వేతాళు—దమయంతి యింద్రునంతటి వానిఁదిరస్కరింపలేదా? దానికేమి! నేనీదినము విజాపురికిఁబోవలసియున్నది. నేనిటకువచ్చినప్పుడు మీచెల్లెలు విశాలాక్షి మీయందఱిక్షేమమడిగిరమ్మన్నది. అదికాక రాజుగారును మిమ్ముఁజూచి మఱివెళ్లవలసినదని చెప్పినారు.

బాలాజీ—ప్రభావతిచిక్కఁగానే విశాలాక్షినివిడిచి పుత్తునని వాగ్దానముచేసియు సుల్తాను తప్పినాఁడుకదా! ఐస్సీయతని నేమన్న నేమి ప్రయోజనము? ఇంతకునూకర్మమునకు మేముకాక వేఱొకరుభోక్తలగుదురా?

శ్వేతాళు—మీచెల్లెలి విషయమై యంతగాఁ జింతింప నవసరములేదు. నేను బోయి యాతరుణినెట్లో విడిపించుకోరాఁగలను. కాని ప్రభావతి మాటయే యనుమానముగా నున్నది.

బాలాజీ—నీవీదినమాఁగుము. రేపునీతోఁగలసి వత్తును.

శ్వేతాళు—మీయమ్మగారిట్టి స్థితిలోనున్నప్పుడు మీరువిడిచివచ్చుట మంచిదికాదు రాజుగా—

బాలాజీ—అన్నట్లు రాజుగారన్నదా మఱలివేంచేసినారు.

శ్వేతాళుఁడు—మొన్న నేవిచ్చేసినారు.

బాలాజీ—అట్లైన రాజుగారి సందర్శనముచేసి వత్తును. నీపయనముమాట యీదినమునిల్పి వేయవలెనుఁ జుమీ.

అని యతని నింటివద్దనిల్పి తాను ప్రాతఃకాలకృత్యముల నిర్వర్తించుకొని తగిన దుస్తులఁదాల్చి శివాజీ దర్శనార్థముకోటకుఁ బోయెను.



## ముప్పదియైదవ ప్రకరణము.



ఉ. "భారతఖండబంధములఁ ♦ బాపఁ గపర్ద్యుపగావతాగ్రణి
ధారుణి ఖ్యాతికెక్కిన స్వ♦తంత్రుఁడు తంత్రవిదుండు ధర్మవి
స్తారుఁడు బ్రాహ్మణప్రభువు♦ శత్రుజనాంతకుఁ డౌశివాజిభూ
దారకుదండనాయక ప♦దస్థులు ధన్యులు మీకు మ్రొక్కెదన్.

తే. అల్లగణగండారణరంగ♦మందు మొన్న
స్వామికార్యంబుకొఱకు స్వ ♦ ప్రాణములను
బాజిపరభు మీజనకుండు ♦ వదిలె నంచు
విని విచారించితిని జాల ♦ విమలచరిత.

క. మనపూజారియొసుండీ
వినుఁడిచ్చటఁ దాఁబకీరు ♦ వేసముతో నె
ట్టన నున్నాఁ డితనిదం
డనె బ్రతికియునుంటి నిన్ని ♦ నాళ్ళను దయితా.

ఉ. ఈతనిమంత్రతంత్రముల ♦ కిచ్చట నెల్లరు లోఁకువౌటఁ గా
దే తలపోయ మీకుఁ జెఱఁ ♦ ద్రెళ్లను నాకును ద్రెళ్లు నింకనా
కై తనయిల్లువాఁకిలి ను ♦ దారమతిన్ విడి నెక్కుకష్టముల్
బ్రీతిగఁ బొందుచున్నయిటు ♦ వంటిదయామయు నెందుఁ జూతుమే.

మ. అలకర్ణాటకసీమయుల్లరులు ♦ చల్లార్పంగ నుద్యుక్తుఁడై
సులతా నచ్చటికేఁగె నిప్పుడటుకన్ ♦ సుల్తాను సైదోడుతో
నలినే నేఁగఁ దటస్థమాయె నదిగా♦నన్ మీరు వేవేగ మీ
బలమున్ దోడ్కొని దారికడ్డపడి ప్రో♦వన్ జూడుఁడీ నన్ గృపన్.

ఉ. ఈతరుణంబు దప్పినను ♦ నింకనుమీకును దక్కనాపయిన్
భీతి యొకింత యుండినను ♦ వేగమ వత్తు రటంచు నెంతు

నన్ లాతిగఁ జూతు రేని సర♦శంబుగఁజేసెదఁ బ్రాణహత్య ప్ర
ఖ్యాతియుఁ బుణ్య మబ్బదొకో ♦ కాచిన నాయటువంటిదీనను౯.

ఉ. వల్లభ! యెన్నమీకొఱకె ♦ ప్రాణము లీమెయి నిన్నినాళ్లునే
నిల్లనఁ జిక్కపట్టితి మ♦హాపదలెన్నియుఁ జుట్టుముట్టిన౯
గల్లరు లైనమ్లేచ్ఛులను♦గట్టుకొనంగను నిచ్చగింతునే?
యొల్లను మిమ్ముఁ దక్క మఱి ♦ యొండొకమానసినిం బ్రశుద్ధిగ౯.

ఉ. ఎన్నియొ సెప్పనేల వినుఁ♦డీవిపినంబుల నాఁడు దిక్కులే
కెన్నియొ నంగలార్చుతఱి ♦ నెప్పుడు బ్రోచితి రప్డె నన్ను నే
నన్నితి మీకు నింకొకని ♦ కన్నియు నాన్వకులంబుపేరు తా
వన్నెనరంపఁ జూచునె ప్ర♦భావతి మానిని కాదె చూడఁగ౯.

క. మన మల్ప్రతాపగడలో
మనములరఁగఁ గల్పికోలు ♦ మాటలతో మొ
న్ననుగద వేగించితి మా
చనుపే నిజమైన నాకు ♦ సాయముపడరే.

తే. పాలముంచిన నీళ్లలో♦పలనుముంచి
నను బ్రభావతి మీసొత్తు♦నచ్చఁ జెప్ప
వలసినది యేమి యున్నది♦తలఁప నింక
నైని మీచిత్తమును నాదు♦భాగ్య మధిప."

అని యిట్లువ్రాసియున్న యొకలేఖను జదువుకొనుచు నానడుమ బాలాజి యదితెచ్చినజంఘాలు నుద్దేశించి "ఓరీ! నీ వెవ్వఁడవు? నీకీ కమ్మయిచ్చిన వారెవ్వరు?" అని యడుగుడు వాఁడిట్లనియె. "స్వామీ! నాపేరు జంఘాలుఁడందురు. నేను శివాజిమహారాజుగారి వేగులవాఁడను. భేతాళుని యన్నకుమారుఁడను. నాకీయుత్తరము పూజారిగారిచ్చినారు. ఆయన యిన్నాళ్లును బకీరువేసముతోనున్న సంగతి యెఱింగియుందురు కదా!" అని యనిన నప్పలుకులకు నాత్మనలరి తెలుఁగ నాయుత్తరము మొదటినుండి తుదివఱకుఁ జదువుచు నందలి ప్రతిపదమార్దవమునకు శయ్యావిలాసమునకు భావవ్యక్తి

కరణమునకుఁ దనలోఁ బాముఱియుచుఁ గొంతసేపు సంతోషరసాబ్ధి నోలలాడెను. అనంతరము యాతఁడు గదిలోనున్న భేతాళుని బిల్చి జంఘాలుని వృత్తాంతము తెలియఁజేసి "ఓయీ! నీవు వీనినెఱుంగుదువా?" అని యడుగ భేతాళుఁడు చిరునవ్వునవ్వుచు నిట్లనియె. "అయ్యా! వీఁడు మాతమ్ముఁడేయగును. పెరవాఁడీవిశాలగడకు రాఁగల్గునే! మీ కీసందియ మేల? ఉత్తరములో వ్రాలులేదా!" అని యనఁగా బాలాజి క్రమ్మఱ నాకమ్మ పరిశీలించి దిగువనున్న యమ్ముద్దులగుమ్మ సంతకమును బూజారి వ్రాలును దిలకించి విగతసంశయాత్ముఁడై విలువగల తన యంగుళీయకమును జంఘాలునకు బహుమతిచేసెను. అత్తఱి భేతాళుఁడు తానింతకుఁ బూర్వము శివాజి పూజారుల యాలోచనచొప్పున ఫజీలుని మోసపుచ్చి యతనియుంగరము గొనితెచ్చినసంగతియు మఱియుఁ బూజారి జఱుపుచున్న తంత్రములను సవిరళంబుగాఁ దెలియఁజేసెను. వెంటనే జంఘాల భేతాళులకు సూగిరంబువెట్టించి తానును నియమితాహారము గైకొని బాలాజి శివాజిసన్నిధికి నరిగెను.

శివాజి—బాలాజీ! ఏమోయీ! నేడునీముఖంబు వికాసితంబైయున్నయది? మనమీప్రొద్దున ననుకొన్నట్లు జఱిగింతురా? జంఘాలుఁ డింతలో నెందులకు వచ్చినాఁడు?

బాలాజి—జంఘాలుని రాకయే నను నిచ్చటికిఁ దీసికొని వచ్చినది.

అని ప్రభావతి జాబు శివాజి చేతిలోఁబెట్టనతం డది సాంతముగాఁ జూచి నవ్వుచు నిట్లనును.

శివాజి—పండుపండినది పక్షివ్రాలినది అన్నట్లాయెను. పాపము విశాలాక్షిసంగతియే యింక నేమియు దెలియరాకున్నది.

భేతాళు—మహారాజా! ప్రభావతి యిచ్చటికి వచ్చులోపల నే విశాలాక్షినిఁ దోడితెత్తును.

శివాజి—జంఘాలా విశాలాక్షినిగూర్చి పూజారి యేమియుఁ జెప్పలేదా?

జంఘాలు—లేదు. ఎఱుఁగరు కాఁబోలు మహారాజ్! జంఝూరరావు మన పక్షమై యున్నాఁడు.

శివాజి—అదెట్లు.

భేతాళు—దేవరవారికి మనవి చేయలేదా.

జంఘాలు—విశాలాక్షిపై నతనికిఁ బ్రేముడికలదు. రేపో నేఁడో ఆబాలికను జంఝూరరావే యిక్కడికిఁ దీసికొరాఁగలఁడు.

బాలాజి—ఏమేమీ? జంఝూరరావా! మనపక్షమా నాఁడు రాజుగారి వేఁడ్కోలు తిరస్కరించి పోలేదా! అబ్బో ఆతఁడు సుల్తాను పెద్ద కొడుకు.

భేతాళు—స్నేహితుఁడగు ఫజీలు గతించిన పిమ్మట నతఁడు క్రమముగా మన పక్షము దిరిగినాఁడు. మన విశాలాక్షి నాతండు మోహించి యున్నాఁడు. కాని యామె అన్నగారిపైఁబెండ్లి పెద్దఱికముంచి పూజారి చెప్పినట్లు నడచుకొనుచున్నది.

శివాజి—బాలాజీ! మన విశాలాక్షి నతఁడు చెఱనుండి తప్పించి తీసికొవచ్చెనేని వానికోర్కెతీర్తువా?

బాలాజి—నాకతండు సన్నిహితబంధువే విశాలాక్షి వచ్చినపిదపఁ జూచుకోవచ్చును.

శివాజి—అట్లేకానిమ్ము, నీవీదినమే పయనమగుట మంచిది.

బాలాజి—తమ కదివిన్నవించుటకే యిటకు వచ్చితిని.

శివాజి—మంచిది. మీతల్లిదేహస్థితియెట్లున్నది? పాప మామె కిన్ని విపత్తులు నొక్కమాఱే సంభవించినవి. ఇంక నామెపట్ల దైవమెట్లున్నాఁడో.

బాలాజి—విశాలాక్షివచ్చిచేరుకొన్నఁగాని మాయమ్మకీవంతపోవుటయుండదు. ఇంతకు మాపుణ్యమెట్లున్నదో?

శివాజి—ఓరీ భేతాలా! నీవు జంఘాలుండును గలసి విజాపురి కేఁగి యిచ్చటి సమాచారమువెల్లఁ బూజారికెఱింగించి మీరు మీ ప్రయత్నములలో నుండుఁడు. మీ వెనుకనుండి బాలాజి సేనలతో వచ్చును.

అని వారినిఁబంపి బాలాజితో మఱికొంతసేపు ప్రసంగించి కోంకణ ప్రభువతనిని వీడ్కొల్పెను. తరువాత బాలాజి తనగృహంబునకు నేఁగి జననికిఁ దనపయనంపు సంగతిఁదెల్పి యామెయనుజ్ఞవడసి యానాఁడే బలంబులు చేఁగదీసికొని బయలువెడలసాగెను.



# ముప్పదియాఱవ ప్రకరణము.



వారము క్రిందట విశాలగడకుఁబోయిన జంఘాలుఁడు తిరిగి రాకుండుటకుఁ ప్రభావతి ఖిన్నహృదయయై తనపాలింటికి నక్షత్రకుఁడైన హాజీసుపయానము కావలసినదని తొందరపెట్టుచుండ నేమియుఁదోఁపక దిక్కులేని వారికిదిక్కు దేవుఁడేయని నమ్మి నాఁ డాపన్నురాలగు ద్రౌపది ప్రపన్నపారిజాతంబగు శ్రీకృష్ణుని ధ్యానించినట్లు తానును భగవంతునిగూర్చి యిట్లు మొఱయిడెను.

మ. జననంబందిన దాదిగా బహుళక ♦ ష్టంబుల్ నెతిన్ బొందుచున్
వనటన్ గుందుట దక్క నొక్కదినమున్ ♦ సౌఖ్యంబుగా నుండనై
తిని నాపుట్టినవేళ యెట్టిదొకొ! బ్రా ♦ తిన్ నేనె కాకెందఱేన్
గన నాకోసము బాము లొందెదరు భ ♦ క్తత్రాత సర్వేశ్వరా.

మ. నను మోహించినవారిలోన నొకఁడే ♦ న్నన్ దండ్రిఁ గోల్పోయి వె
న్కను దానున్ మృతిఁజెందె నింకొకఁడు తా ♦ గారాగృహావాసుఁడై
వెనుకష్టంబులు గుడ్చె దీనునిగతిన్ ♦ వేఱొండు కామాంధుఁడై
తన రాజ్యవ్యవహారముల్ విడిచె భ ♦ క్తత్రాత సర్వేశ్వరా.

మ. నవమాసంబులు మోసి కాంచి కరుణన్ ♦ న్నాపాడుమాతల్లి మ
క్కువతోఁ బెంచినతండ్రి నన్నెలిచి సి ♦ గ్గుల్ వొందుమాచేటి నా
దువియోగంబున కెట్లు తాళికదా ♦ దుఃఖార్తులై యక్కటా
తవులం బెప్పుడు శోకహేతువగు భ ♦ క్తత్రాత సర్వేశ్వరా.

మ. అకటా! నన్నుఁగ నెంచి బాజీసుతఁ బా ♦ పాభీకులై మ్లేచ్ఛసే
వకు లాస్థన్ గొనిపోయి నా రనుచుఁ ద ♦ ద్బంధుల్ గడున్ గుందుచుం
ద్రుకదా? యూపెయు నెంత దుఃఖపడునో ♦ దుర్మార్గుఁడౌ ఖానుఁ డు
రక నాశంబును జెందనే తెలియ నా ♦ క్తత్రాత సర్వేశ్వరా.

శా. ఇల్లున్ వాకిలిఁ బాసి నాకొఱకు నెం ♦ తేఁ గష్టముల్ చెందుచు
న్నాళ్ళన్ మ్లేచ్ఛులమధ్యనే మెలఁగుతం ♦ త్రజ్ఞుండు పూజారిపా
ట్లెల్లన్ లెక్కకువచ్చె? నాయనఋణం ♦ బే నెన్నిజన్మాలకేన్
నల్లిం డ్లిచ్చియుఁ దీర్చుకోఁగలనె? దీ ♦ నత్రాత సర్వేశ్వరా

మ. ఆకటా! రిత్తగ రేపు మా పనుచు స ♦ ప్తాహంబులన్ గడ్పితిన్
సకుఁ డేమంచు జవాబు వ్రాయునొకదా ♦ జంఘాలుఁ డీనాటి సూ
రికి విచ్చేసినజాడ గన్పడ దికన్ జో ♦ ప్పే ప్రమాణంబు త
ప్పక గొంపోవు హజీసు నన్ బలిమి వి ♦ శ్వత్రాత సర్వేశ్వరా.

మ. చనెనో మార్గముమధ్యఁ బట్టువడెనో ♦ జంఘాలుఁ డమ్మక్క లే
ఖను వీక్షించియు వచ్చునో ప్రియుఁ డశ ♦ క్యంబం చుపేక్షించునో!
కన నాభాగ్య మదెట్టులున్నదొ కదా ♦ కారుణ్యపూర్ణుండవై
నను రక్షింపఁగ రాదె యార్తిహర దీ ♦ నత్రాత సర్వేశ్వరా.

మ. కరి రక్షించితి తప్పుజేసినఖలున్ ♦ గాకాసురున్ గాచి తీ
వరి భ్రాతన్ దరిఁజేర్చినాఁడ వల ప్ర ♦ హ్లాదార్భకున్ బ్రోచినా
వరయన్ బాండవపత్నినేలి తిటు లో ♦ యయ్యన్ బెక్కుటన్ ప్రీతినై
పరిపాలించియుఁ బ్రోవరాదె నను వి ♦ శ్వత్రాత సర్వేశ్వరా.

శా. ఏలా! యిచ్చితి విట్టిరూప మిది నా ♦ కే యన్న నీకర్మ మీ
జాలిన్ లేకయె యుండుఁగాదె! యిసి నా ♦ సౌందర్యమూలంబునన్
నేలన్ గూలిరి చూడఁ గొందఱు కదున్ ♦ నిర్భాగ్యులై కొందఱున్
జాలన్ జిక్కులు వొందుచుండి రొగి శి ♦ ష్టత్రాత సర్వేశ్వరా.

మ. ఇల నే బన్నము లొందుచుంటి నని యిం ♦ తే నాత్మ లెక్కింప నా
వలనన్ జిక్కులు పెక్కు పెక్కులకు సం ♦ ప్రాప్తించుటం జేసి మి
క్కిలి చింతింతును నింక నెన్నటికి నేఁ ♦ గ్రేళ్లొప్ప మవ్వల్లభున్
గలియన్ వచ్చునొ యిట్లె మ్రగ్గుదునొ లో ♦ కత్రాత సర్వేశ్వరా.

మ. నలుకష్టాలకు రాముబన్నములకున్ ♦ దద్దారరమ్యాకృతుల్
తలపన్ హేతువు లయ్యె వారికిఁ దుదిన్ ♦ లాభించె నామప్రతి

స్త్రీలు సౌఖ్యంబును గాని మత్పతికి నా ♦ సౌందర్యమూలంబున
గ్గలుగన్ సిగ్గులె యంచుఁ దోఁచెడి విప ♦ న్న త్రాత సర్వేశ్వరా.

మ. బలవత్తంబుగఁ బన్నులన్ గొని ప్రజన్ ♦ బాధించుటేకాక వా
గలజాతిన్ జెడఁగొట్టి కాంతలను దు ♦ ర్మార్గక్రియాసక్తులై
కలయన్ జూచెడి నీచజాతులకు సౌ ♦ ఖ్యశ్రీలు చేకూరుటల్
కలిమాహాత్మ్యమె నిన్న నే మనుదు? భ ♦ క్తత్రాత సర్వేశ్వరా.

మ. కలికిన్ నీవు విధేయుఁడౌటయును దూ ♦ కర్మంబుగా నెంతు ము
న్నలకంసాదుల లోకకంటకుల శి ♦ క్షార్థంబు శిక్షింపవో
యిల ధర్మంబు లడంచి గోద్విజతతిన్ ♦ హింసించుదుర్మార్గులన్
నలియన్ జేయక యూరకుంటి విసి! దీ ♦ న త్రాత సర్వేశ్వరా.

మ. సవమున్ సాగవు తొంటివైకవడిని స ♦ స్యంబుల్ ప్రవర్ధిల్ల కు
న్నవి దాస్యంబున కిచ్చగింతురు ద్విజుల్ ♦ న్యాయంబు విద్వాంసులై
న [illegible]లోకింపరు నేఁడు ధర్మ మది కాం ♦ తారాలపాలాయె నిం
త విచారింప నికేమిచెప్పెదుఁ బ్రప ♦ న్న త్రాత సర్వేశ్వరా.

మ. వ్యవహారంబులు చిక్కు ముద్దు లిల శి ♦ ష్టాచారముల్ తగ్గె మా
నవు లోలిన్ దిగనారఁ జొచ్చి రవనీ ♦ నాథుల్ ధనాహర్త లౌ
చు విజృంభించిరి దిక్కులేక సుజనుల్ ♦ శుష్కించుచున్నారు తు
చ్ఛవిధేయుండవె? యూరకుండెదవు? వి ♦ శ్వత్రాత సర్వేశ్వరా.

మ. శ్రుతిగోబ్రాహ్మణహింసచేయుఖలులన్ ♦ క్షుద్రాత్ములన్ ద్రుంచి యా
శ్రితులన్ శిష్టులఁ బ్రోచు టాత్మవిధగాఁ ♦ జింతించి తత్కార్యసం
గతుఁ డైనట్టిశివాజికిన్ విజయమున్ ♦ గల్పించి బాలాజికిన్
పతిగాఁ గూర్పుము నన్ బ్రభావతిని శి ♦ ష్టత్రాత సర్వేశ్వరా.

అని యారీతిగాఁ బ్రభావతి భగవత్ప్రార్థనముచేయుచున్నతఱిఁ బకీరు వేసముతోనున్న పూజారి యాతురతతో నక్కడకరుదెంచి "అమ్మాయీ ! నీ గోష్టి సేతిలోఁబడినది. మనకష్టంబులు గట్టెక్కెననితోఁచెడిని!" అనిపల్కి

యూరకుండెను. తోడనే ప్రభావతియుఁ దనసందేశము ప్రియునకెఱింగించి కార్యము చక్కఁబెట్టుకొని జంఝూలుండు వచ్చియుండునని యూహించి మెల్లఁగా నిట్లనియె. "మహాత్మా! మన జంఝూలుండరుదెంచెనే? బాలాజి మనయాలోచనకు సమ్మతించెనే?" అనుటయు నాతండిట్లనియె. "బాలాజి యెవరికొఱకు సమ్మతించును? అతండు మన మనుకొన్నట్లు జఱుపనిశ్చయించి పయనమై వచ్చుచున్నాఁడట." అని పూజారి చెప్పుపలుకులు చెవినిఁబడినవెంటనే దిగ్గునలేచి పూజారిపాదంబులుపట్టుకొని సాష్టాంగనమస్కారంబుగావించి యానందబాష్పములచేఁ బాదంబులు గడిగి భక్తివిశ్వాసంబులు తెల్లంబుగానిట్లనియె. "స్వామీ! మీరను తెప్పకతంబున సంకటపయోరాశిఁ దరింపఁగల్గితిని. వేయిజన్మంబులెత్తియు మీ ఋణంబు దీర్చుకోఁ జాలుదునే?" అనిడగ్గుత్తికతోఁ బల్కుటయుఁ బూజారియు నాకన్యకను లేవనెత్తి సమయోచితముగాఁ బ్రసంగించి పదంపడి ముందునకు జఱిగింపవలసిన చర్యనుగూర్చి యోజించి తరువాతఁ బ్రభావతితో నిట్లు ముచ్చటింపఁ దొడంగెను.

పూజారి—అమ్మాయీ? ఈదినమే మనము విజాపురి విడుచుట మంచిది.

ప్రభా—అట్లే జఱిగింపవచ్చునుకాని మన మిచ్చటనుండి తప్పుకొన్న పిదప విశాలాక్షిగతి యేమగునో కదా? పాపము నన్ననుకొని యామెను దురుష్కులు తీసికొనివచ్చినది?

పూజారి—ఆ విషయమున మన భేతాళుండే తగిన శ్రద్ధతీసికొని పనిచేయుచున్నాఁడు.

ప్రభా—మనతోపాటు విశాలాక్షిని గొంపోవుటకు వీల్పడదా?

పూజారి—అది యెట్లగును? ఆమెను జంఝూరావే తోడ్కొనివచ్చును.

ప్రభా—అదియెట్లు పొసఁగును? లోగడ జంఝూరావు శివాజీవద్ద నుండ నొల్లకయే కదా యాయనమాట పాటింపక విజాపురికిఁ జేరుకొన్నది.

పూజారి— అతఁడు మనవిశాలాక్షిని మోహించియున్నాఁడు. జంఝూరరావు తానాకన్యకను శివాజికి నొప్పగింతుననియు నాయనసమ్మతినైనఁ దానిని బెండ్లాడనుంటిననియు భేతాళునితోఁ జెప్పినాఁడు. అది కాక విశాలాక్షితోఁగూడ నీవిధముననే వాక్రుచ్చెనఁట. ఆమె విడుదలపర్యంతము భేతాళు నిచ్చటనే యుంచివేయుదును. కాన నామె విషయములో నీవు విచారింపఁ బనిలేదు. మూఁడువంతులు మనము విశాలగడముఁ జేరుకొనక పూర్వమే విశాలాక్షి యాపురిఁ జేరుకో వచ్చును.

అని యీరీతి వారిరువురును బ్రసంగించుచుండఁగా ఖాంజహానుఁ డచ్చోటికరుదెంచి 'పక్కీర్జీ! మిమ్మొకసారి హాజీసుసాహేబు రావలసినదని చెప్పి నా'గని చెప్పి పూజారినిఁ దోడ్కొని వాఁ డచ్చోటు విడచిపోయెను.



# ముప్పదియేడవ ప్రకరణము.

---

హాజీసు—పకీర్జీ! సుల్తానువద్దనుండి నిన్ననే యిద్దఱుచారులు వచ్చినారు. ఇంతవిళంబమునకు సర్కారాగ్రహించుచున్నారనియు వెంటనే ప్రభావతిని దీసికోపోవలసినదనియు వారు చెప్పి తొందరపెట్టుచున్నారు. ఇంక మన మెట్లైనను జాగుచేయుట తగదు. ప్రభావతిని దీసికొని యీదినమే ప్రయాణమగుట మంచిది.

పూజారి—సర్కారింత తొందరపెట్టుచున్నపుడు మన మాలస్యము చేయుట కూడదని మే మెఱుంగకపోలేదు. కడుపునొప్పిచేఁ బ్రభావతి యిన్నాళ్లు బాధపడుచుంటఁ జేసి మన మాఁగవలసివచ్చినది. ఇప్పు డామెకుఁ గొంచెము నింపాదిగానున్నది కా—

హాజీసు—అట్లైన నీదినమే బయలుదేరిపోవుదము. ఆవచ్చిన చారులు సుల్తానువసించు స్థలమునకు మనరాజధానికి దగ్గరదారి యొకటికలదనియు నాదారినే తీసికో రావలసినదనియు సర్కారు సెలవిచ్చినారని నుడివినారు. ఇంతవాఁడ నైతినిగాని నేనా మార్గమెట్టిదో యెఱుంగను. అదికాక యీవచ్చినచారుల మెఱుఁగ నిదివఱ కెన్నఁడు జూచియుండలేదు. శివాజి పన్నునఁ గొందఱు టక్కరు లిచ్చోట నున్నారనియు వారు మనలను వంచించి యిచ్చటిసమాచారములు శివాజీకిఁ దెలియఁజేయుటయే కాక యాతని యానతిఁ గొన్నికార్యములు చక్కఁబెట్టుచున్నారనియు నొక వదంతి గలదు.

పకీరు—ఔను మేము నట్లే వినుచున్నాము. ఏవీ యాచారులు? వారితో నాల్గుమాటలు మాటలాడిన యన్నిసంగతులు తేలఁగలవు.

హాజీసు—అట్లయిన నిదిగో! వారిని రావించెదను. అని హాజీసు తనసేవకునిఁ బంపి వారి నచ్చోటికి రప్పించెను. పూజారి తదుపరి హాజీసునకు నమ్మ

కము పుట్టింపఁగోరి యావచ్చిన చారులను నాల్గుసంగతులడిగి తాను వారిని సుల్తానుభటులే యని రూఢిపఱచి వారిమాటలప్రకారము నడుచు కొంట లెస్సయని హాజీసునకు బోధించి యతనిని బయనమునకుఁబో సిద్ధముగా నుండవలసినదని హెచ్చరించెను. అటుపైఁ బూజారి హాజీసును వీడ్కొల్పి యాచారులనుదోడ్కొని యొక యేకాంతస్థలమునకుఁ బోయి వారితో నిట్లు ముచ్చటించెను.

పూజారి—భేతాళా! జంఘాలరావుతో మాటలాడితివా?

భేతాళ—విశాలాక్షిని దీసికొని విశాలగడకు నిన్ననే పోయినాఁడు. అతని వెంట నామిత్రు నొక్కనిఁ బంపినాఁడను.

పూజారి—బాలాజి మనమనుకొన్నట్లు వచ్చునో వేళకు రాఁజాలఁడో యని సంశ—

జంఘాలు—మీకు సంశయింపఁబనిలేదు. అతనితోఁ గొంతదారివఱకుఁ గలసియే వచ్చినారము.

పూజారి—అట్లైన మీరు మీప్రయాణసన్నాహములో నుండుఁడు.

అని వారినిబుత్తెంచి పూజారి ప్రభావతివద్దకుఁ బోయి యామెకు విశాలాక్షి విముక్తిసంగతియు భేతాళుఁడు జంఘాలుండును హాజీసుని వంచించిన తెఱంగును బ్రశంసించెను. ప్రభావతి విశాలాక్షి విముక్తి వీనులుచల్లఁగా విని సంతోషించి పకీరుతోపాటు ప్రయాణమునకు ద్వరపడుచుండెను.

ఇంతలో హాజీసు పనుపున బోయీలు రెండు పల్లకీలు మోసికొని కోట సింహద్వారము వద్దకు వచ్చుటయు నా సంగతిదెలిసికొని పూజారి ప్రభావతిని నిజచేటీ సమేతముగాఁ గోటవెలికిఁ దీసికొనివచ్చి యటఁదమకై యేర్పాటు కాఁబడిన యాదంతపుఁ బల్లకీటలో నొకదానిపైఁ బ్రభావతి నెక్కించి తాను మఱొక్కదానిపై నధిష్ఠించెను. ఇంతకుఁ బూర్వమే యచ్చటికి వచ్చి నిల్చినహాజీసు హయారూఢుండై తనరాణువను వెంటనిడికొని భేతాళ జంఘాలులు త్రోవమాపుచుండఁ బయనము సాగించెను.

అట్లు రెండు దినంబులు ప్రయాణముగడచిన పిదప హాజీసు ముఖ్యులొక్క విపినమార్గంబునఁబడి పోవుచుండిరి. ఆ రాత్రి వారికంటికేనైపుమాచి నను గట్టులుపుట్టలునుదక్క మఱియొండు కానఁబడమి సైనికులలోఁ గొందఱు తప్పు దారిని బోవుచున్నామనియుఁ గొందఱీదారినుండిపోవుట యేదో యొకయుపద్రవము తటస్థించుననియు నిట్లొకరితో నొకరు గుసగుసలాడికొనుచు గనియఁజొచ్చిరికాని యొక్కఁడును దన యభిప్రాయము హాజీసునకుఁ దెల్పఁడయ్యె. ఇట్లు సంశయాకుల చిత్తులై సైనికులెల్ల మెల్లగా నడచుచున్నసమయమున సహస్రకరుఁడు తనప్రచండకిరణములు నెఱపి యాతెరువరులఁ బీడింపఁ జొచ్చెను. అందువలననచ్చటివారికి కనేకులకు దాహము వేయుటచే నాచుట్టుప్రక్కల వాఁగుఁకొఱకు వెదకసాగిరి. అంతట హాజీసు మహారణ్యప్రదేశమున గుడారములఁ బఱపించి పూజారిముఖ్యులతోపాటు విశ్రమించుచుండెను. ఈగొడవలోఁ జడిచప్పుడుకాకుండ ముందునడచుచున్న భేతాళ జంఘాలులు సన్నసన్నఁగా జాఱిపోయి తామిదివఱ కేర్పాటుచేసికొన్న సంకేతస్థలమునకు జని యచ్చట వీరిరాకకై యెదురుచూచుచున్న బాలాజిని గలసికొని ప్రభావతిరాకను దెలియఁజేసిరి. బాలాజియు వెంటనే బయలు వెడలెను.

అటఁ బూజారియుఁ బ్రభావతియు బాలాజి యనుకొనినట్లువచ్చునో లేదోయని పరిపరివిధముల వగచుచు నుళికిపడుచుండిరి. ఆ రాత్రిఁ బ్రభావతికి వామనేత్రభుజంబు లదరఁజొచ్చెను. మఱియుఁ బెక్కుశుభశకునములు కాఁదొడంగెను. కాని యాశకునంబుల నమ్మికొని స్థైర్యముగల్గియుండఁజాలక తనబ్రతుకేమగునో యని దిగులొందుచు దశదిశలు తెప్పవాల్పక కలయఁ జూచుచుండెను.

ఇట్లొకగంటసేపు గడచినపిదపపశ్చిమదిగ్భాగమునుండి గొప్పసైన్యము దవుదవ్వున వచ్చుచున్నట్లు చప్పుడును నావెనక సైంధూళియు నచ్చటివారికెల్లరకు గోచరించెను. ప్రభావతి పూజారులావచ్చుచున్న సైన్యము బాలాజిదేయని సంతోషించిరి. హాజీ సా సైన్య మెవరిదో యెఱుంగఁగోరి భేతాళజంఘా

లులఁగేకలువేసి వేసారి వారినాచుట్టుప్రక్కల వెదకించెను. ఇంతలో నా సైన్యము కొంతదగ్గఱబడుటవలన నదివఱకే గుఱ్ఱపుదౌడులనుబట్టిమరాటసేనగా ననుమానించి కలవరపడుచున్న హాజీసునకు నందలి జెండాలు సరిగాఁ బొడకట్టెను. అంత నేమిచేయుటకుఁ దోపక యొక్కింతసేపు చిడుముడిపడి యామీఁదట దనసైనికులఁ బోరునకుఁ బురికొల్పి తాను దప్పుకొంటకు దారివెదకొనకిఁజొచ్చెను. వారు తమయవస్థ నింతకుమున్నె గుర్తెఱింగినవారౌట వలనఁ బ్రాణాశవిడచి మరాటసైనికులపైఁ గవిసి కలనుసల్పదొడంగుటయు నత్తఱి నిరువాఁగులవారికిఁ బోరుఘనసంబయ్యె. మరాటులధాటికి బత్తాను లొక్కగంటవఱకు నిలువరించిరికాని బాలాజి విజృంభించి లేళ్లపై సింగముఱికినట్లు తమసైనికులపైఁ బడిపెక్కండ్రనుక్కడంచుటఁ గనిపట్టి ధైర్యంబు సన్నగిల్ల హతశేషులు దిక్కులకుఁ బరుగిడఁజొచ్చిరి. ఇదిచూచి హాజీసు సదిమందిని వెంటఁదీసికొని ప్రాణములు దక్కించుకొన నచ్చోటు విడచి పాఱిపోయెను.

ఇట్లుశత్రువులను విదళించి బాలాజి పూజారినిగలసికొని సాష్టాంగనమస్కృతులుసల్పి తమ కతఁడుచేసిన మహోపకారంబుల కతనిని వేనోళ్లఁగొనియాడి పదంపడి ప్రభావతిని సమయానుగుణముగాఁ బల్కరించి వారినిదోడుకొని తిన్నగా విశాలగడకు నడచెను. అదివఱకే విశాలాక్షీసహితుండై విశాలగడకు విచ్చేసి శివాజి కటాక్షపాత్రుండైన జంఘూకరావు బాలాజి ముఖ్యలునగరికి విజయముచేయుతఱి సపరివారముగా నెదురేఁగి పూజారికి నంజలి ఘటియించి బాలాజినిఁ గౌఁగిలించికొని తాను విశాలాక్షిని విజాపురినుండితప్పించితీసికొని వచ్చినక్రమ మెఱింగించుచు వారిని పురిఁజేర్చెను. శివాజి యావర్తమానము తెలియఁజేసి ప్రతాపగడనుండి తనతల్లియగు జిజాభాయిని లలితాదేవీ రామోజీల నామఱునాటికి రావింపఁజేసెను. వారును బ్రభావతిఁ బొడగాంచి కౌఁగిలించుకొని యానందబాష్పముల జాఱవిడిచి తద్విముక్తికిఁ గారణకర్తలైన పూజారిబాలాజీలను విశేషముగాఁ బ్రశంసించి గౌరవించిరి. శివాజి పూజారిని బాలాజిని దనపట్టపుటేనిక పైనెక్కించి యూరేగించి తగురీతిని సత్కరించెను. ప్రభావతి తనజననులకును గారాపుచెలికత్తియగు మంజువా

ణికిని దాఁ బడినపాట్లెల్లయు నెఱింగించి పూజారిని గుటుంబసహితముగాఁ దమయింటికి రప్పించి తండ్రికిఁజెప్పి గొప్పవిందు గావించెను. అనంతరంబు శివాజి విశాలాక్షిని బాలాజిసమ్మతిపై జంఝూరరావున కిచ్చుటకు నిర్ణయించి ప్రభావతి విశాలాక్షులపెండ్లిండ్లొక్కసారి జరుప నిశ్చయించి ముహూర్తములఁబెట్టింప వలసినదని రామోజి ముఖ్యులకానతిచ్చి పదంపడి సుల్తాను విజాపురిలో లేనిసంగతిని దెలిసికొని యతండు తన యావద్బలంబులను దోడ్కొని తదీయరాజధానిమీఁదికి దాడివెడలెను.

# ముప్పదియెనిమిదవ ప్రకరణము.



అట సుల్తాను హాజీసుని విజాపురికిఁబంపి యచ్చటిజమీందారులను క్ర
మముగా వశపఱచుకొనుచుండెను. అంత వారముదినములు గడచిన పిదప నొ
క్కనాఁడు సుల్తానే కష్టాలుసిద్ధిని జంపించియుండునని తద్బంధుహితు లను
మానించి పెద్దసేనను గూర్చుకొని యతనిశిబిరమును హఠాత్తుగా ముట్టడించిరి.
అప్పటిలో సుల్తాను సైన్యములో సగము వేఱొకగ్రామమునకుఁ బోవుట
తటస్థించుటచేఁ జేసి తక్కిన సైనికులు వైరులను నిగ్రహించి పాఱఁదోలలేక తమప్ర
భువు పట్టువడునేమోయని యెక్కుడుపట్టుదలతో నరుల శిబిరములోనికిఁ
జొరనీయకుండ చాలంబు సల్పుఁజొచ్చిరి. ఆసమయమున దైవకృపవలన శహాజి
నిజసైన్యముతో నచ్చటికి విచ్చేసి పరులను దరిమి గెడపి సుల్తాను నాయుప
ద్రవమునుండి సంరక్షించెను. ఇట్లు ప్రాణదానంబుచేసిన యామరాటధీరుని
బహుశ్లాఘించి కరంబు గౌరవించి యనంతరమున నాతని నియోగించి యెల్లజ
మీందారులను వశవర్తులం జేసికొనుచుండెను. ఇట్టి యలజడిలోఁగూడ ప్రభా
వతి విషయమై మఱువక యొక్కొక్కెడ నాపె జాబుచదువుకొనుచు నందలి
మాటలఁ దియ్యందనమునకు నయ్యది విడువఁజాలక కండ్లకద్దుకొనుచు నొక్కొ
క్కప్పుడు ముద్దుపెట్టుకొంచు నెప్పుడా ముద్దులగుమ్మ వచ్చునోయనియు నెన్నఁ
డాచిలుకల కొలికినిఁ జేరి మనసార మాటలాడవచ్చునోయనియు నిట్లనేకవిధం
బులఁ గాముకులకు నైజమైన తెఱంగునఁ గలవరించుచు దినమొక్క మహా
యుగమువోలె గడపుచుండెను.

అట్లు పలాయితుండైన హాజీసు నాల్గైదునాళ్ళకు సుల్తానునిజేరుకొని పకీ
రుమోసముచేసిన విధంబును బాలాజీతన్నోడించి ప్రభావతిని పిడిపించి తీసి
కొనివెడలిన విషయమును శివాజీకి వాడిశావంతులులోఁబడిన వృత్తాంతము
ను సాంగదినెఱింగించిన విజాపురీశుఁడు విస్మయవిషాదములకులోనై చేయునదే

మియోఁదోపక యప్పటికిఁ గర్ణాటకమునం దల్లరులు బల్లారుటఁబట్టి శహాజిసహితముగా సేనలవెంటనిడుకొని నిజరాజధానినిఁ జేరుకొనెను.

పట్టువడిన ప్రభావతి వియోగంబునకుఁదోడు శివాజి విజయంబు సుల్తానుమనస్సునకు మఱింత ఖేదము గల్గించుటఁజేసి యాయన విజాపురికి విచ్చేసిన వారముదినములదాఁక వ్యాధిగ్రస్తునివోలె మంచముమీఁదనుండి కదలక ఆహారవ్యవహారములు వర్జించియొకవిధముగాఁ గడపుచుండెను.

ఇట్లుండ నొక్కనాఁ డిబ్రహీము పనివడి మహాతురతతో సత్వరముగా సుల్తానువద్దకుఁజనుదెంచి ప్రభువు నవస్థవిలోకించి తాను జెప్పఁదలచుకొన్న సంగతిచెప్పక తద్దుఃఖోపశమనమునకై యొక్కింతతడవు తగురీతిని సంభాషించి తదుపరివారుభయులిట్లు ప్రసంగింపఁజొచ్చిరి.

సుల్తాను—వజీర్! ఏమివిశేషములు? మనరాష్ట్రములోఁ బ్రతివ్యవహారము సానుకూలముగాఁ సాగుచున్నదా ?

ఇబ్రహీము—సర్కార్ ! మనరాష్ట్రవ్యవహారములకేమి కాని యొకగొప్పవిశేషమును జెప్పవచ్చితిని. సెలవైన—

సుల్తాను—ఏమీ ! శివాజి దండెత్తిరాఁడుకదా !

ఇబ్ర—నేఁ జెప్పఁదలచుకొన్నది మీరే యడిగినారు. అతఁడో సేతాజియో విజాపురిమీఁదికే యేతెంచుచున్నారని మన ఖాంజాహాను నిన్నరాత్రి వచ్చి నాకెఱిగించినాఁడు. ఇదిచెప్పుటకే యిటకు వచ్చినాను.

సుల్తాను—శివాజి విజాపురిమీఁదికి నెత్తివచ్చుట కతనివద్దనేమి బలమున్నది?

ఇబ్ర—లేకేమి ! శివాజిని పూర్వము శివాజియను కొంటిరా ? అఫ్జలాను నిబరిమార్చిన నాటనుండియు నతండు విశేషముగా సైన్యమును వృద్ధిచేయుచున్నాఁడు. లేనిచో ఘోరపురేను సబాంధవముగాఁ బరిమార్చుటకును శాంతవంతుని వశపఱచుకొంటకును శివాజి శక్తుండగునే? ప్రస్తుతమతనివద్ద నెంత్రబములన్నదో విన్నయించుట కెరికిని సాధ్యముకాకున్నది. అతండు రేపోమాపో రానున్నాఁడఁట.

సుల్తాను—అట్లైనఁ గొంత సేననిచ్చి నీవు మన హాజీసును బంపుము.

ఇబ్ర—ఉన్న సైనికుల నెల్లర నంపినచో నదియీఁదింగి మఱియొక దారినుండి వచ్చి యతండు పట్టణము ముట్టడించు నేమోయని భయము వేయుచున్నది. అదికాక హాజీసుని ప్రయాణము కమ్మంటకు వ్యవధికూడ చాలదు.

సుల్తాను—అట్లైన నేమి చేయుట యుక్తము?

ఇబ్ర—ఇప్పుడు సంధియే మంచిదని నాయభిప్రాయము. బొక్కసములో విత్తమాసన్న గిల్లినది. ఈనడుమ యుద్ధములవలన మన భటులా విశేషముగా నలిగియున్నారు. కావునఁ శివాజితోఁ గయ్యంబు పొసగించుట యిప్పటిలో నెంతమాత్రము శ్రేయస్కరము కాదు.

సుల్తాను—అట్లైన శహాజిని బిల్పింపుము. అతనితోఁ గలసి మాటలాడుదము.

ఇబ్ర—చిత్తము.

సుల్తాను—మాచిత్తము ప్రస్తుతము స్వస్థముగాలేదు. మధ్యాహ్నము శహాజిని దోడ్కొని రమ్ము.

అని సుల్తానిబ్రహీమును వీడ్కొల్పి యటుమీఁదటఁ దనకై తెచ్చినపదార్థములు భుజించి మంచముమీఁద నే పరుండి విచారించుచుండెను. ఇంతలో మధ్యాహ్నమగుటయు నచ్చటికి నిబ్రహీముశహాజులు రా వారితో నిట్లు సంభాషింపఁదొడంగెను.

సుల్తాను—శహాజీ! నీవు మాకొక యుపకారము చేయవలసియున్నది.

శహాజి—చిత్తము తమబోంట్లకు నుపకారము చేయవలసినంతటివాఁడనా?

సుల్తాను—రాజజనకుండవైన నిన్నుపకార మర్థించుట తగదా?

ఇబ్ర—శహాజీ! సర్కారభిప్రాయము నీవెఱింగియే యుందువు. అయినను జెప్పుచున్నాను వినుము. శివాజి నెట్లైనను సర్కారునకు విధేయునిగాఁ జేయవలెను.

శహాజి—నేను మీకు విధేయుఁడనైనప్పుడు నాపుత్రుండు మట్టుకు విధేయుండు కాకుండునా?

సుల్తాను—మాతండ్రిగారు నీయెడ సల్పిన నేరములను మనసులోఁ బెట్టుకోక మాకు నీవు నీపుత్రునితో సఖ్యము కుదుర్పవలెను.

శహాజి—అఫ్జలాను మంత్రాంగంబునఁజేసి మీజనకులు నన్నుహింసించిరే కాని వేఱొకటికాదు. వారుభయులు పోయిన పిమ్మట నాకాపిచారమేల యుండును? ఎఱుంగమి వారుచేసిన ద్రోహవలన నప్పుడే మఱచితిని. ఇంతకు మీరు నాయందు దయామతులై యీగడియవఱకున్నారు. అదియే నాకుఁ బదివేలు మీ రక్షించిన విషయములో నాయోపినంత ప్రయత్నించిచూచెదను.

ఇబ్ర—మొన్నను శిబిరములోనున్న సర్కారు సహాయమునుండి నీవు తప్పించినప్పటిగోలె వాడు నీయెడల నత్యంతస్నేహగౌరవములు గల్గియున్న సంగతి యెఱుంగుదువుగదా?

శహాజి—వజీర్సాహేబ్! మా శివాజికి సర్కారుపై నెన్నడును ద్రోహబుద్ధి లేదు. కాని మొగలాయీల నెల్లైన నడంపవలెనని మొదటినుండి యత్నము చేయుచున్నాఁడు. వానిశ్రేయస్సునకు సహింపఁజాలక యఫ్జలానుముఖ్యులు వానిని యవనాంతకుండనియు విజాపురరాజ్యనాశకుండనియు లేనిపోని నేరములుచాటించి వానియెడల నిక్కడివారికి నాగ్రహము కల్గించినారు. ఇన్నాళ్లును మీతిండి తిని యనుభవించిన తఱి మీకేమాత్ర ముపకారము చేయకుంటకు నేఁ గృతఘ్నుండనే? సర్వదా మీశ్రేయస్సు నభిలషించునన్ను మన్నించి నామాటలు పాటింప వేడుచున్నాను. సాహేబ్జీ! వినుఁడు. మావానికి గోబ్రాహ్మణులందు భక్తిమెండు. కావుననే శివాజిని మ్లేచ్ఛవిరోధియనియు బ్రాహ్మణపక్షపాతియనియు మన దర్బారుద్యోగస్థులు కొందఱు చాటుచువచ్చిరి. గోబ్రాహ్మణభక్తి వానికున్నంతమాత్రమున సర్కారుపైనను రాష్ట్రముపైనను వాఁడు ద్వేషభావమూని యున్నాఁడని చెప్పుట సమంజసమా? లోఁగడ నేనొకపర్యాయము మందలించిన తఱి నాతో శివాజి చెప్పినమాటలు వినుఁడు “నన్ను రాజద్రోహి

యని యే యొకకొందఱు చాటినంతమాత్రమున నాకు భయంబులేదు. నిజము నిలకడమీఁదఁ దెలియకపోదు. మొగలుమహాసముద్రము దక్కనును ముంచివేయకుండఁగ నాకట్టవలెననియే నాపరమోద్దేశము. కాని నాయుద్దేశము గ్రహింపక ధనమదాంధులగు దర్బారుసేవకులు నామీఁది కోపమున సాధువులగు గోద్విజాదులపైఁ గ్రౌర్యమును జూపుచున్నారు. అదికాక ప్రజలపైనను భూములపైనను బన్నులు రెట్టింపు చేయుచున్నారు. ఈలోపంబులు చక్కపఱచి నాదేశీయులను సంరక్షించుట నాకువిధియై యున్నది. ఎన్నాళ్లు సుల్తాను న్యాయము వంక నొరఁగఁడో యన్నాళ్లు నాయనకు నేను వశ్యుండను గాను. ప్రజారక్షణము రాజులగువారికి నుత్తమధర్మము. అద్దానిని సుల్తాను పాటిచేయనట్లు కనిపించుచున్నది. అందువలననే నేఁడిన్ని కలతలు పుట్టుటకుఁ గారణంబయ్యె."

అని యిట్లు శహాజి విన్నవించుచున్నవేళ నొకసర్దారటకు నేతెంచి సుల్తానుదిక్కు మొగంబై, "సర్కార్! నాతాజిసమేతముగా శివాజి తన ప్రచండాశ్వసైన్యమును దీసికొని రాజధాని పొలిమేర దాటివచ్చుచున్నాఁడు. ఒకపూట ప్రయాణములో రాజధానిఁ జేరఁగలఁడు. దేవరకియ్యది మనవి చేసికొనవచ్చి యుంటిని" అనివాఁడు చెప్పుమాట లాలించి సుల్తాను వికలమనస్కుఁడై వజీరుతో నిట్టులనియె.

సుల్తాను—ఇట్టి తరుణములో శివాజితో సంధిచేసి కొంటయే మేలని తోఁచెడిని.

ఇబ్ర— ఇతనికి బాసటయై మొగలులుకూడ వచ్చియుందురా యేమి? లేనిచో—

ఇబ్ర—అన్నట్లు జ్ఞాపకము వచ్చినది. ఔరంగజీ బన్నదమ్ములకు బొమ్మపెట్టి డిల్లీరాజ్యము స్వాధీనముచేసికొన్నాఁడఁట. అతనికి మనపైఁ గలచలవ యెఱుంగుదురుకదా! అతండు ప్రస్తుతము కార్యాంతరమగ్నుండై

యుంటఁజేసి శివాజిని బురికొల్పియుండవచ్చును గాని యిప్పటిలో మొగలులు మరాటులతోఁ గలసివచ్చియుండరు.

జాగీరుదారు—శివాజికి నొక్కరి ప్రేరేపణతోఁ బనియేమి? దర్బారులో ననేకులు వానిపక్షము చేరుచున్నారు. ఎఱుంగరా! నిన్నటిదాకఁ దలలో నాలుకవోలె మనలో మెలంగుచుండినజంఝూరరావు శివాజికాశ్రితుండై మనకు విరోధి యైనాఁడు.

సుల్తాను—ఏమీ జంఝూరరావు మననగరిలో లేడా? వీఁడుకూడఁ బంతోజిమార్గ మనుసరించెనా? విశాలాక్షిని దీసికొని యామరాత్యుండు పోలేదు కదా!

ఇబ్ర—ఇంకను నెఱుంగరా? మీరన్నట్లే కావించినాఁడు. నేను వానితో విశాలాక్షినిజనానాకు బంపవలసినదని చెప్పఁగా నాదొంగ పకీరు మొదట సమ్మతించియు నావెనుక సుల్తానువచ్చువఱకు నంతఃపురికి బంపవలదని నిర్బంధించినాఁడు. మొన్న మీహాజీసుకూడ నొకమాటు జంఝూరరావుతో విశాలాక్షిని బంపవలసినదని కోరఁగా నట్లేయని జెలుపుడుపెట్టి హాజీసుపక్కీర్లు బయలుదేఱిన దినముననో యాముందు దినముననో కాని విశాలాక్షిని దోడ్కొని రహస్యముగా రాజధాని విడిచి పాఱిపోయినాఁడు.

జాగిరుదారు—'ఇంటిగుట్టులంకకుఁజేటు' ననునట్లు మనలోని జంఝూరరావు ముఖ్యులు శివాజితోఁ జేరుటవలనఁ దలుపులు తెఱచినయిల్లువలె మన రాజ్యము శత్రుభేద్యమైనది.

ఇబ్ర—ప్రస్తుత మౌరంగజేబు మన జోలికి రాకపోయినను రేపో మాపో దక్కనుపైని దండెత్తక మానఁడు. ఔరంగజేబునకు శివాజి సహకారియైనచో మన రాష్ట్రమునకు గొప్ప ముప్పు తటస్థింపక మానదు.

సుల్తాను—కావుననే శివాజిసఖ్యముచేసికొంటకు నొడంబడితిమి. ప్రభావతిని మఱల మన కిచ్చుటకు సమ్మతించునా?

ఇబ్ర—ఇఁక ప్రభావతిమాట మఱచిపోవలెను. మొదట లాతరుణికి మీపై ననురాగము లేనట్లు తోఁచుచున్నది. ఇట్టి సంగతికి శివాజి సమ్మతించునని తోఁచదు.

సుల్తాను—శహాజీ! నీవుపోయి నీకుమారునితో సంధిమాటలాడి రావలసినది.

శహాజి—సర్కార్! ప్రజలపై ననురాగముతో వర్తించుటయు గోద్విజబాధిహింస కట్టిపెట్టుటయు, జనుల విన్నపములను పాటించుటయు ననునీతివిషయము లమలులోనికిఁ దీసికొనివత్తురేని ప్రాతపగలు దిగనాడి శివాజి మీకు సామంతుఁడగుటకు సందియము లేదు. ఇట్లు చనువున స్వతంత్రత తీసికొని చెప్పినందులకు నన్ను మన్నించునది.

సుల్తాను—ఈవిషయముల కేమి? అతండు మాతోఁ బొత్తుగూడెనేని యావత్కొంకణమును శివాజికి వంశపారంపరిగా నొసంగుదుము. ఇదికాక మారాజ్యము దోపిడిచేయింపక కాపాడెనే నేఁటేట మూఁడులక్షల రూప్యములు పేష్కసు చెల్లింతుము. దీనికి బదులు మొగలులు మాపై దండెత్తినప్పుడు మాకుఁ దోడ్పడుచుండవలెను.

ఇబ్ర—సర్కారు మూఁడులక్షలు చెల్లించుసంగతి నొక్కింత గోప్యముగా నుంచవలెను.

శహాజి—చిత్తము. ఇదిగో యీక్షణమే బయలుదేరుచున్నాను, మావాని నెట్లైనను నొడంబఱచి వచ్చినదారినే పోఁజేసెదను. నావెంట నెవరినైనను బంపఁ బ్రార్థితులు.

సుల్తాను—ఇబ్రహీము నీవు పోయెదవా ?

శహాజి—ఈమాత్రభాగ్యమునకు నిబ్రహీము రావలెనా? సమ్మతమైనచో ఖాంజహానుని బంపుడు. కార్యము చక్కపఱచుకొని త్వరలో వచ్చెదను.

అని సుల్తాను వజీర్లయానతిఁ బడసి ఖాంజహానుని వెంట నిడికొని తన సేనను దీసికొని శివాజిని గలసికొనఁబోయెను.



# ముప్పదితొమ్మిదవ ప్రకరణము.



బిజాపురిలో సుల్తాను లేఁడనునభిప్రాయముతో దండెత్తివచ్చుచున్న శివాజి త్రోవలో నతండు రాజధానికి మఱలి విచ్చేసినసంగతి దెలిసికొని తిరిగి పోవలె నని యాలోచించుచుండెను. అత్తఱి ఖాంజహానుఁడు మరాటనృపుని వద్దకు నేతెంచి సుల్తానుపనుపున సంధినిమిత్తమై శహాజి సకుటుంబపరివారముగాఁ బనుదెంచుచున్నసంగతి విన్నవింప నాతండు మహానందభరితుండై దండయాత్ర నిల్పుదలచేసి హయవేదండాందోళికాది రాజచిహ్నములతోఁ దండ్రి కెదురేఁగెను. తండ్రికొడుకులొకరినొకరుచూచుకొని బహుకాలమైనందున నాసమీపముననున్న యొక దేవళములో నుభయులు కలసికొనుట కేర్పాటు చేసికొనిరి. ముందుగా శివాజియచ్చోటికి విజయముచేసి గోక్షీరముతో దేవతకు భోగముగావించి తండ్రిరాకకై యెదురు చూచుచుండెను. అంత నొక్కింతసేపటికి భార్యయగు తుకాభాయిని పుత్రుఁడగు వెంకోజిని వెంటనిడికొని శహాజి కతిపయానుచరులతో నక్కడి కరుదెంచెను. తోడనే శివాజి తల్లిదండ్రులకు మ్రొక్కి తనకు నంజలిఘటించిన తమ్ముని గౌఁగిలించుకొని వారి యోగక్షేమంబులరసి పదంపడి భోగము గావింపఁబడిన పాలను నచ్చటివారి కెల్లరకు వినియోగింపఁజేసెను. అటుతరువాత శహాజి కుమారునిఁ జేరఁదీసి "తండ్రీ! నీవు భవానీదేవి వరప్రసాదంబున జనించినాఁడవు. దుష్టశిక్షణంబును శిష్టరక్షణమును నెఱపి పేరును బ్రతిష్ఠయు నార్జించితివి. సనాతనధర్మపునరుద్ధారకుండ వని ఖ్యాతివహించితివి. మఱియు మిత్రద్రోహియగు ఘోరపడేను భూమికి బలి వెట్టి నాబన్నంబు దీర్చితివి. నీకతంబున మనకులంబు పవిత్రంబయ్యె. నీవు స్వతంత్రరాజ్యము సంపాదించినందులకు నాకెంతయు సంతసమేకాని యింక ముందు నాకంఠములోఁ బ్రాణమున్నంతదాఁక నాయజమానుండగు బిజాపురీశునిపైఁ గత్తికట్టకుండ నుందునని బాసచేయుము. నీ కతండు సాలునకు

మూఁడులక్షుల ఫేష్కసు చెల్లించుటకు సిద్ధముగా నున్నాఁడు. అతనితోఁ జేరి యౌరంగజేబు పలోప్కకలు నివారింపవలెను. ఇందులకు నల్ల గోల్కొండ నవాబును నీకుఁ దోడ్పడఁగలఁడు.'' అని హితోపదేశముచేసిన జనకుని సంభాషణములకు మందహాసముచేసి యమ్మరాటకేసరి మెల్లగా నిట్లు వక్కాణించెను. “తండ్రీ! మీ రానతిచ్చినట్లు జఱుపుటకు సిద్ధముగా నున్నాఁడ. కాని గోబ్రాహ్మణహింస యవనులు తుదముట్ట విడువనిచో నేను సుల్తాను సఖ్యంబు చేయనొల్లను.'' నావుఁడు శహాజి కుమారకా ! గోబ్రాహ్మణహింస సుల్తాను తనరాజ్యములో నెవ్వఁడును జంపకుండ జేయునట్లు వాగ్దానంబుచేసినాఁడు. కావనామాటలు పాటించి దక్కనుప్రభువు లెల్లరితో మైత్రి నెఱపి యౌరంగజేబును జేబులో వేసికొనఁజూడుము. దాన నీతల్లియభీష్టము సాంతముగా నెఱవేర్పఁగల్గుదువు.'' అని యిట్లు నందనుని సమ్మతిపఱచి యతండు సుల్తానున కొసంగురత్నహారంబులును హయకుంజరంబులును ఖాంజహానునిచేతికిచ్చి తాను వెనుకనుండి వత్తు నని చెప్పి వానిని బుత్తెంచెను.

ఇట్లు సంధి పొసఁగినపిమ్మట శివాజి తండ్రినిదల్లిని బల్లకినెక్కించి తానాపక్కనుండి సవారిపట్టుకొని వెంకాజివెంట రాఁ బాదచారియై నడిచి నిజశిబిరమునకుఁబోయి తదనంతరంబున సేనలతో పాటువారినిఁ దోడ్కొని విశాలగడఁ జేరుకొని యట వారిని విశేషముగా గౌరవించెను. అటుపైని బస్తా పూనా ముఖ్యపట్టణములకుఁ దండ్రితో బుట్టువులను దల్లులను దోడుకొని యరిగి యాయాచోట్లఁ గల సన్నిహితబంధువులెల్లరతో మేలి విందాగగించుచు వెండియుఁ బ్రతాపగడలోనగు దుర్గంబులను నూత్న రాజమందిరములను మొదలగు తనరాజ్యవైభవముల వారికిఁ జూపించుచుఁ బెండ్లింటిముహూర్తము సమీపించుటెఱింగి విశాలగడకుఁ బోఁజూచెను. కాని పూజారి శివాజీముఖ్యులను దారిలోఁగలసికొని తులజాపురిలో దేవతాపునఃప్రతిష్ఠ జఱిగించుటకును నావెనుక నచ్చోటనే ప్రభావతీ విశాలాక్షుల వివాహంబులు జఱిగించుటకును బెద్దలు నిశ్చయించినారని తెల్పి వారిని వీలైనంత వేగముగా రావలసినదని చెప్పి తాను ముందుగాఁ దులజాపురికిఁ బోయెను.

ఇట్లు పూజారి చెప్పిపోయినపిమ్మట శివాజియు దదీయులును గ్రమముగా మజీలులు చేయుచుఁ దులజాపురి కభిముఖులై చనుదెంచుచుండిరి. ఒకనాటి ప్రయాణకాలమున మార్గమధ్యమున నొక్కింతదూరములో నొక పర్ణశాల గనఁబడెను. దాని కనతిదూరమున నొక్క జలాశయ ముండెను. ఆ రెంటికినడుమను జుట్టును సాలరసాలాది వివిధపాదపములు పుష్పఫలశోభితంబులై చూపఱకుఁ గన్పట్టుచుండెను. అచ్చటి కుజములను సరస్సులనాశ్రయించియున్న కోకిలశారికాది పతంగములు మనోహరంబుగా గానంబు చేయుచుండెను. చిత్రవిచిత్రంబులైన బర్హిణములును మృగములును గుములుగాఁ గూడి వింతవింత క్రీడలు సల్పుచుండెను. ఈ వేడుకల కనులపండువుగాఁజూచి శివాజి శహాజు లెవ్వరి దీయాశ్రమంబయియుండునో యని విచారించుచున్న సమయమున రెండులేళ్ళు పర్ణశాలనివాసి పంపిన ఛాత్రులవలెఁ జెంగుచెంగున వారిచెంతకు వచ్చి నిలచెను. బెదరక నిలచినయాలేళ్లను దండ్రికొడుకులు ముద్దులాడుచున్నతఱిఁ బర్ణశాలలోనుండి రామతారకమంత్రము వారికర్ణవీథిఁజొచ్చుటయు నావెంటనే యిరువురును లేచి యామృగయుగంబును దమవెంటరా నాసరసునకేఁగి యటఁ గరచరణములు ప్రక్షాళనముగావించుకొని యామీఁదటఁ బర్ణశాలకు నడచిరి. వీరిరాక దూరముననుండి కనిపట్టి యందలి యోగిశ్రేష్ఠుండు తనశిష్యుల వారికెదురుగాఁ బంపుటయు వారివలన నయ్యది తమగురునాశ్రమంబని శివాజి యెఱింగి యత్యంతోల్లాసితుఁడై ససంభ్రమముగా జనకునితో పాటుపోయి శ్రీరామదాస యోగీశ్వరుని దివ్యాంఘ్రులకుఁ బ్రణమిల్లి కుశలప్రశ్నగావించి యనంతరమున నాయుభయులు నిట్లు సంభాషింపఁ దొడంగిరి.

శివాజీ—స్వామీ! దేవర వారెప్పుడీప్రాంతమునకు వేంచేసినారు?

రామదాసు—ఓయీ! యవనులయల్లరలకు సైపఁజాలక మహాబలేశ్వరము విడచి యిచ్చోటికి వచ్చినారము. రామచంద్రకృపవలన నిచ్చటికరుదెంచిననాటనుంగోలెఁ బరులయొత్తిడిలేక నెమ్మదిగాఁ గాలక్షేపము చేయుచుంటిమి.

శహాజి—పూర్వమువలెఁ గాకింక నెచ్చటనుండినను మీకుఁ దురుష్కుల యొత్తిడికల్గనేరదు.

రామదాసు—శహాజీ! ఏమంత నిబ్బరముతోఁ జెప్పుచున్నావు—నిన్ను జూచి చాలకాలమైనది. తంజావూరునుండి యెన్నడీప్రాంతమున కరుదెంచినావు ?

శహాజి—ఇప్పటికప్పుడే తంజావూరువిడిచి యొక నెలదినములైనది. కాని కోంకణమునకువచ్చి యొకవారమై యుండును.

రామదాసు—మీరెక్కడికిఁ బోవుచు నిచ్చటనాఁగినారు.

శహాజి—తులజాపురికి వివాహార్థమై పోవుచున్నాము.

రామదాసు—అది యెవరి వివాహము ?

శివాజి—మన ప్రభావతి వివాహము.

రామదాసు—ప్రభావతి విజాపురిలోఁ జిక్కువడినదని వింటిని ఆమెయెట్లు తప్పించుకొని। రాఁగల్గినది ?

శివాజి—పూజారి పురుషకారమున.

రామదాసు—సుల్తాను మోహించినవనితను వేఱొక్కనికిచ్చి పెండ్లిచేయుట యపాయకరము కాదా ?

శివాజి—ఔనుగాని ప్రస్తుతము సుల్తాను మనకు సఖుండై యేర్పడినాఁడు. ఈకారణముచేతనే మాతండ్రిగారిందాక తురకల బాధయుండదనియుం తనిబ్బరముగాఁ జెప్పఁగల్గినారు.

రామదాసు—తక్కినసంగతులు వెనుకనుండి మాటలాడుకొనవచ్చును. మీ ప్రయాణమాపుచేయింపుడు. ఇచ్చట రెణ్ణాళ్లుండి మఱి పోవచ్చును.

అని వారిని బలవంతపెట్టి ప్రయాణమాపించి భోజనానంతరము రామదాసు శివాజివలన బాలాజి విడుదలయుఁ ప్రభావతిపట్టువడి తప్పించు

కొంటయు సుల్తాను తనతండ్రిని సంధికై పుత్తెంచుటయు లోనగుసంగతు లెల్లఁ దెలిసికొని పరమానందభరితుండై శహాజిముంగల శివాజిని బ్రశంసించి పదంపడి తండ్రికొడుకులడిగిన ధర్మంబులెల్ల మఱుగువెట్టకుండ వారికి నెఱింగించి రెండుదినంబులు జఱిగించెను. అంతలోఁ బూజారివద్దనుండి శివాజిముఖ్యులకు రమ్మని వర్తమానమువచ్చుటయు వారివేడుకోలున నాయోగిపుంగవుండును వారితోఁగలసి తులజాపురికిఁ బ్రయాణమాయెను.

---

# నలువదియవ ప్రకరణము.



నాడు ఖానుల మూలంబున నాశనమైన యాతులజాపురి దేవతా పునః ప్రతిష్ఠ జరుగవలసిన నాటిదినమ్మున బహుజనసంకీర్ణంబై గొప్పపట్టణమువలెం జూపట్టెను. అక్కడకుఁ బూజారిబంధువులేకాక మఱినానా ప్రభావతీ విశాలాక్షుల పరిణయంబుగా వలసి యుంటవలనఁ దదీయబంధువులును నాహ్వానముననుసరించి పురోహితాది పరివారజనంబును మఱియు శివాజిబాలాజుల హితులును జనుదెంచియుండిరి. శివాజియుఁ దదీయులును నాటి సాయంకాలమునకుఁ గాని రాఁజాలకపోయిరి. అయినను బూజారి బాలాజీకృష్ణాజులయాజ్ఞవడసి తులుజాభవానికి జలములతోడను దుగ్ధంబులతోడను నభిషేకంబుఁ గావించి మంత్రశాస్త్రజ్ఞులలో దక్షులగువారిని రావించి గుడమంత్రోచ్చారణముచే నద్దేవి నెప్పటియట్ల యాలయములో స్వస్థానమున స్థాపించి తదనుగుణంబగు ధూపహోమాదుల సంతృప్తిపఱచి రాత్రియగువఱకు నర్చింప సుగంధపుష్పములచే నాలోకమాతను దదేకదీక్షితుండై నిరాహారుండై పూజించుచుండెను. అప్పటికి శివాజి గురుజనకసోదరులతో నక్కడి కరుదెంచుటయు వారిరాక యల్లంత దూరముననుండి కనిపట్టుచున్న బాలాజీకృష్ణాజులు దిగ్గనలేచి వారిని సగౌరవముగా దేవళములోనికిం గొనిపోయిరి. పూజారి శివాజి ముఖ్యులగాంచి సముతానందంబు నొంది వారిని సైగలచే నుచితస్థలముల నాసీనులను గావించి పిమ్మట నొకగంటలోగా దేవీపూజలు సాంతముచేసెను.

ఇట్లు పూజ సమాప్తము కాఁగాఁ గోడనే కొందఱు కొన్నియును పోతులను బలివేయసమకట్టిరి. అది నివారింపఁజూచి యుద్బోధించుచుండును పరమవైష్ణవుండునగు రామదాసులేచి మేఘగంభీరమైన వాక్యములతో నిట్లు వాక్రుచ్చెను "అన్నలారా? మనహిందువులలోఁ గొన్నిమతంబుల వారికిఁ బశుహింస సాంప్రదాయమగుట నిశ్చయమే కాని యిది పండితులు సమ్మతింపరు

ప్రజను బాధించు జంతువులను జంపుట దోషములోనిదికాదని పెద్దలు చెప్పుదురు. కాని నోరులేనిగొఱ్ఱెలను మేకలను నెనుపోతులను జంపుట యదేటి ధర్మము? యజ్ఞకాలమున బశుహింస సల్పుట శ్రుతిసమ్మతమని వాదింతు రేమో యయ్యది యీకలికాలమునఁ బనికిరాదని పరాశరాదులు విధించినారు. ధర్మములలో నహింస యుత్తమధర్మమని పెద్దలు వక్కాణింతురు. తొల్లి ప్రహ్లాదనారదాదు లేజంతువులనుజంపి యంతవారైనారు? ఇంతకు మీరు భవాని కోరిక ప్రకారము ఖానుముఖ్యులను బరిమార్చి యామెయమ్మకుఁ బలివేసినారు. ఇంక నీహీనజంతుబలితోఁ గార్యమేమి? కావున నామాటలు పాటించి యీనాటి కోంకణసీమలోఁ బశుబలికట్టిపెట్టవలెను. అప్పుడుగదా మనము మహమ్మదీయులను గోవులను జంపరాదని బోధించుటకు మాన్పించుటకును దగినవారమగుదుము'' అని యమ్యోగిశిఖామణి బోధించిన సద్వాక్యము లచ్చటివారికి నచేకులకుఁ దృప్తికరముగా నుండవయ్యె. అయినను నాయన తమ గాజునకు దేశికుండౌటవలన నానాడు మాత్రము పశువులను బలి గావింపక పులగము మొదలగు భక్ష్యపదార్థములు దేవతకు నైవేద్యము పెట్టిరి. అటు పిమ్మటఁ బూజారి శివాజి దిక్కు మొగంబై ''ఓమహారాజా? నీమూలమున ఖానుఁడు ద్రుంగుటయు దాన నాశపథంబు కొనసాగుటయుఁ దటస్థించెను. నీయట్టి పరాక్రమనిధిని నేనెందును జూడలేదు. నీవలననే తులజామాత సూడుదీర్చినది. నీవలననే భారతీయులకు సుఖజీవనము గల్గినది నీవలననే యవనాదులు సాధువులై వర్తించుట సమకూడినది'' అని పూజారి యమ్మ రాటరాజు సగ్గించికాంచనమాల యొక్కటి తీసికొనివచ్చి యాయనకు సమర్పించి దేవి యుచ్ఛిష్టభక్ష్యంబు లచ్చట నెల్లరకు వినియోగించి యారేయి తానుబడిన కష్టములన్నియు సార్థకమునకు వచ్చెనని సంతోషించి భోజనానంతరమున నొక్కింతతడవు శివాజిబాలాజిముఖ్యులతో సుఖగోష్ఠి సల్పుచు నటుమీఁదటఁ దనగృహంబునకు నేఁగి హాయిగా గుండెలమీఁదఁ జేయివైచుకొని నిద్రింపసాగెను.

ఆమఱునాఁడు జాముర్రాత్రియున్న దనఁగా లేచి కొందఱు ముత్తైదు

వులు తులుజా దేవతాలయంబునకు కగిలియున్న కళ్యాణమంటపమును చూత పత్రసమన్వితతోరణంబులతోడను విచిత్రకుసుమమాలికలతోడను నఖండజ్యోతిర్యాగంబుతోడను నలంకరించి వివాహోపయోగమైన ద్రవ్యంబుల నటఁబొందుపఱచి తమకు నియమింపఁబడిన తక్కుఁ గార్యంబులు చక్కఁబఱచుచుండిరి. అంత సకలజనోల్లాసకరంబై ప్రభాతంబగుటయు నామండపంబుకడ మంగళవాద్యంబులు విశేషంబుగా వాయింపఁబడియె. అవియాలించి శివాజిమంత్రులు బురోహితులు సామంతులు పరిచారకులును వధూవరులు బంధువులును నాప్తులును వైదికులును బండితులును మఱియు తక్కిన పౌరులును వివాహమహోత్సవంబు వీక్షింప నొకరివెనుక నొకరు క్రమముగా నటకు నేతెంచిరి. ఈలోఁగాఁ బ్రభావతీబాలాజులకును విశాలాక్షీజంగ్ఘూగరావులకును దదీయులు మంగళాభిషేకంబులు గావించి యవ్వధూవరయుగంబునకు మేలైనయాభరణంబులఁ దైసేసి పట్టుపుట్టంబులఁ గట్టఁజేసి లగ్నము వేళ దప్పింపక వారిని వివాహవేదికకడకు నోలిఁ దీసికొనిపోయిరి. వెంటనే పురోహితులు ముందుగావచ్చిన మనబాలాజిజంర్ఘూనరావుల నట నమర్చఁబడిన చెరియొక పెండ్లిపీఁటపైఁ గూర్చుండఁజేసి శాలువులతోఁ దెర వేయించి యావెనుక "ముత్తైదువులతోడఁజను దెంచిన" ప్రభావతీవిశాలాక్షుల నాతెర కీవలఁ గూర్చుండఁబెట్టి యటకు విచ్చేసిన వైదికబృందములతోఁ గలసి వారొక్కింత సేపు మంత్రంబులను బఠించిరి. అటుతరువాత నాతెర వెడలించుటయు నావధూవరులు పరస్పరరూపరేఖావిలాసంబులకు మురియుచుఁ దమకోర్కులు నేటికి సఫలంబాఁగదా యని యుబ్బుచు వారు మనస్సు మదనున కధీనంబు చేసి పురోహితులకు హస్తము లర్పించి జంత్రపుబొమ్మలవలె వారు చేయించు భగవదారాధనాదులు చేయుచువచ్చిరి.

ఇంతలో నక్కడనున్న రామోజీ తనభార్య లలితాదేవి సువర్ణకలశంబుతో నిర్మలోదకంబులు వోయ బాలాజి పాదంబులుకడిగి సాలంకృతకన్యాదానంబుచేసి పరితుష్టుండయ్యె. అత్తటి లక్ష్మీబాయి దానట్లు కన్యాదానము చేసికొనుభాగ్యము తటస్థింపకుండెఁగదా యని యొకమూలకుఁ బోయి తనపై

ధవ్యావస్థను దలంచుకొని వెక్కి వెక్కి దుఃఖింపఁజొచ్చెను. అదిచూచి బాలాజియు విశాలాక్షియు మున్నగువారు కంటఁ దడిపెట్టుకొనిరి. అప్పుడందందఱునుకీర్తిశేషుండైన బాజిని స్మరణకుఁ దెచ్చుకొని "పాపమయ్యో! బాజిపరభుండిప్పు డెంతబాగుగా నుండియుండునని చింతించి విషాదంబుల పాలైరి. ఆమీఁదట లలితాదేవి లక్ష్మీబాయివద్దకుఁబోయి,తగురీతి నూరడించి శుభకార్యములందు నిట్లు దుఃఖించుట మంచిదికాదని చెప్పి యచ్చటివారినెల్ల నోదార్చెను. ఆలో బాలాజి పినతండ్రి జంఝూరరావు చరణంబులు గడిగి బాజిలేనిలోపంబు కొంతమట్టుకు దీర్చివేసెను. తదనంతరంబు బాలాజి ప్రభావతికిని జంఝూరరావు విశాలాక్షికిని మంత్రవాక్యములు బోరుకలంగ మంగళసూత్రములు గట్టి పదంపడి యానూత్నదంపతులజంట యొండొరులు ముత్తెపుసేసలు తలంబ్రాలుపోసికొనుచుఁ గొంతకాలము గడిపిరి. ఆవైభవమెల్ల నరయుచున్న యచ్చటివారిలోఁ గొందఱు బాలాజికంటెఁ బ్రభావతియే చక్కనిచుక్కయనియుఁ గొందఱు ప్రభావతికంటె బాలాజియే చక్కనివాఁడనియుఁ గొందఱు ప్రభావతీబాలాజుల ముంగల విశాలాక్షీజంఝూరరావుల సోయగంబు దివిటీలముందట దీపంబులవోలె నున్నదనియు మఱికొందఱు సంసారులకుఁ జక్కఁదనముతోఁ బనియేమున్నదనియు నిరూపించుచుండిరి.

ఇట్లు పరిణయవిధానంబులలో వైదికకాండ శతపకాలంబునకు సమాప్తంబగుటయు ననంతరంబ యానూత్నదంపతులజంట తులజామాతకు మ్రొక్కి పదంపడి పూజారికిని దక్కుంగల పెద్దలకును నమస్కారంబు గావించి యెల్లబంధువులతోఁగూడి యాదినంబు పంచభక్ష్యపరమాన్నంబులతో విందారగించి జరిగిన ముచ్చటలెల్లఁ జెప్పుకొనుచు నొక్కింతకాలము సుఖగోష్ఠి సల్పిరి. అటు తరువాత బాలాజి పూజారిని దదీయపుత్రకళత్రములను నూత్నవస్త్రంబులఁ గట్టించి వేలకొలంది విలువచేయు చంద్రహారముల రెంటిని సమర్పించి వారిని సంతుష్టులఁ జేసెను. మఱియు నచ్చటికి వచ్చినవారి నెల్లరను దగురీతి సత్కారంబులఁ దన్పి యానాడే శివాజి ముఖ్యులెల్లరతోఁగలసి విశాలగడకుఁ బయనమై పోయెను.

ఇట్లు వీరందఱు విశాలగడకుఁ జేరుకొన్న మూఁడవనాట రామోజి ముఖ్యులెల్ల దంపతీద్వయంబునకు సంధానమహోత్సవము జరిగింప సమకట్టి యానాఁడు సాయంతనముపడకమున్నే బాలాజి సౌధమందుగల రెండుమందిరములకు వలయు సింగారంబు గావింపఁజేసెను. మంజవాణి! ప్రభావతీ విశాక్షులకుఁ గూరులు దువ్వి రత్నకలితసువర్ణాభరణంబులఁ దగిన ముస్తీబుచేసి వారిని దీపాలువెలిగించిన జాములోఁగా నా సౌధంబునకుఁ దీసికొనివచ్చెను. అందలి రెండుసదనములకు మధ్యమునగల చావడిలో నప్పటికప్పుడే రామోజిప్రముఖులు బాలాజిజంఝూగరావులఁ దీసికొనివచ్చి కూర్చుండఁజేసి యాటపాటలతో వినోదించుచుండిరి. మదనబాణములకు దీటగు ప్రభావతీవిశాలాక్షులు వచ్చినపిమ్మట గంటసేపు తాణి జరిగించి మంజవాణీముఖదాసీజనంబునటనిల్పి రామోజియును దక్కినబంధువర్గంబులు మెల్లగా నటనుండి జాఱిరి. అటుపిమ్మట మంజవాణి ప్రభావతీ బాలాజుల నొకగదిలోను విశాలాక్షీ జంఝూగరావుల వేఱొకగదిలోనుఁ జేర్చి తక్కిన చెలికత్తియలతో నామేడడిగిచనె. అంత నాదంపతులు చిరకాల వియోగతాపంబునఁ గ్రాఁగియున్న దేహంబుల నిండ చందనాదు లలందుకొని మదనపరతంత్రులై తమయౌవ్వనంబు సార్థకపఱచుకొనిరి. అదిమొదలు వారు నానాఁట క్షీరోదకన్యాయమునఁ గలసి మెలసి గృహస్థాశ్రమమునకగుణంబగు వర్తనలమెలంగుచుఁ బుత్రపౌత్రాభివృద్ధిఁ జెంది వర్ధిల్లఁజొచ్చిరి.

శివాజియుఁ దనతండ్రిని గొన్నాళ్లు విశాలగడలోనిల్పి యతండుచెప్పిన హితబోధను బాటించి సుల్తానుతో మైత్రి వృద్ధిజేసికొనుచు జిజాభాయి రామదాసులయందు గురుభక్తిని వీడక బాలాజిజంఝూగరావులను కృష్ణాజితానాజిముఖప్రధానులను నాంతరంగికులనుగాఁ జేసికొంచు బ్రాహ్మణులకును దక్కంగల సాధువులకు నేవిధలోపంబులు గల్గనీయకుండఁ బ్రజారంజకుండై తనరాజ్యము రామరాజ్యముగాఁ బరిపాలించుచుండెను.

సమాప్తము.

# ఆంధ్రభాషాభివర్ధని ప్రచురములు.

దేశాభ్యుదయమున కావశ్యకమగు విషయములందెల్ల బరిశ్రమజరుగుచున్న యిక్కాలమున భాషాభివృద్ధి కగ్రస్థాన మిచ్చుట ప్రధానమై యున్నది. సంఘముయొక్క సర్వావస్థలయందును, దేశముయొక్క అన్ని భాగముల యందును, విజ్ఞానము ప్రచురింపఁజేయుటకు భాషాసేవయే ముఖ్యసాధనము. సనాతనాధునికేతిహాసములు. ప్రకృతిశాస్త్రములు, అన్యదేశాదర్శనికగ్రంథములు, మహాపురుషులజీవితములు, గణితశాస్త్రములు, రాజనీతిశాస్త్రములు, ఆర్థికశాస్త్రములు, వృత్తులును, పరిశ్రమలును, వాణిజ్యమును నడుపు విధమును దెల్పుగ్రంథములు, నవలలు, లేనిలోపమును ఆంధ్రభాషాభివర్ధనీసంఘము నివారింప బ్రయత్నించుచున్నది.

ఈ కంపెనీ మూలధనము రు. 10,000

# భారతధర్మదర్శనము.

నిర్మలదేశానురాగమునుఁ బ్రబోధించుపద్యకావ్యము సుప్రసిద్ధుండగు నొకయాధునికకవివరునిచే మృదుమధురముగ గానముచేయఁబడిన 109 పద్యము లిందుగలవు. వెల రు 0-2-0 శాశ్వతచందాదారులకు రు 0-1-6 మాత్రమే.

ఈ క్రిందిపద్యమునుబట్టి శైలియును, భావములును, గ్రహించనగును.

చ. మతములుపొచ్చినిల్లు జన మాన్యచరిత్రులు పుట్టినిల్లు న
ప్రతిమ దయాశమాదిగుణ రత్నసమృద్ధికి రోహణాద్రి శా
శ్వతనిరపాయ మోక్షఫల భాసురవల్లికి నాలవాలమై
యతులవిభూతిఁ బొల్చు విల నంబరో! నీసరిధన్యు లుందురే?

## పీష్వానారాయణరావువధ.

గ్రంథకర్త. వి. రామదాసుపంతులుగారు బి. ఎ. బి. ఎల్. హైకోర్టువకీలు. ద్వితీయముద్రణము మూఁడుచిత్రపటములుగలవు. వెల రు 0-2-0 చందాదారులకు రు 0-1-6.

# రామమోహనరాయలచారిత్రము

గ్రంథకర్త.—కొణకంచి, చక్రధరరావు పంతులుగారు.

నిర్మల బ్రహ్మజ్ఞాన ప్రభాకరోదయంబుఁ గావించి, అనాథలగు యువతులను బట్టి బలవంతముగ గాల్చివేయు సతియను భయంకరాచారంబు నడంచి తనమాతృభూమియగు భరతవర్షంబు నుద్ధరింప దత్పూర్వ మెన్నఁడు హిందువు లెవ్వరును వెళ్ళుటకు సాహసించనిఖండాంతరమున కనేకమాసములు మహార్ణవముపై బయన మొనర్చి యచట మనకొఱ కనేకయుపన్యాసము లిచ్చి కార్యవిజయము గాంచువఱకు బట్టువిడువక తనదేశమాతకొఱకు పాటుపడుచుండిన మహాపురుషుని పూజ్యచారిత్రము. 200 పుటలగ్రంథము పటములతో వెల రు 0-12-0. చందాదారులకు రు 0-8-0.



# స్వాతంత్ర్యదర్శనము

గ్రంథకర్త.

నుగ్గరాల, రామమూర్తిపంతులుగారు బి. ఏ. ఎల్. టి.

జాన్ స్టూ అర్టు మిల్లు అను ఆంగ్లేయపండితోత్తముని లిబర్టీ అను సుప్రసిద్ధ గ్రంథముయొక్క భాషాంతరీకరణము. మనోవాక్స్వాతంత్ర్యము, వ్యక్తిస్వాతంత్ర్యము, స్వాతంత్ర్యపరిమితి మొదలగు సాంఘికశాస్త్రసిద్ధాంతము లీగ్రంథమునందు చరిత్రోదంతములతోడ విమర్శింపఁబడినవి. పాశ్చాత్యవాఙ్మయమునం దుత్కృష్టగ్రంథముగ పరిగణింపఁబడుచున్న యీగ్రంథము సుబోధకముగ తెనిఁగింపఁబడినది. కాలికోకవరు 175 పుటలు. వెల రు 0-12-0, చందాదారులకు రు 0-7-0.



# మహారాష్ట్ర చరిత్ర

గ్రంథకర్త.—చిల్లరిగె, శ్రీనివాసరావు పంతులుగారు.

ఒకప్పుడు భరతఖండమున కాభరణముగానుండిన మహారాష్ట్ర సామ్రాజ్యసంపాదకులైన శివాజీ మహారాజు మున్నగు వీరుల సచ్చరిత్రము ప్రశస్తమైన యీ రాష్ట్రనిర్మాణముయొక్కయు, ప్రవర్తనముయొక్కయు, క్షీణదశయొక్కయు, కారణములు సహేతుకములుగ చర్చింపఁబడియున్నవి. శైలి సుబోధకమై ప్రస్తుతము మనదేశీయచరిత్ర పాఠకార్థులైనవారికీ మహారాష్ట్ర చరిత్ర సప్రమాణమైనదిగ నున్నది. మహారాష్ట్రనిర్మాణకర్తల దివ్యచరిత్రములె గాక, శివాజీ, శంభాజీ, రామదాసుస్వామి, అహల్యాబాయి, తారాబాయి, బాజీరావు, పీష్వానారాయణరావు మొదలగువారి 22 చిత్రపటములతోడను, భరతవర్షపు పెద్దపటముతోడను, అనేకకథావిశేషములతోడను, రాజనీతి విచారణలతోడను, నీగ్రంథము విరాజిల్లుచున్నది. సామాన్యచదువరులకు రంజకముగను, విమర్శకులకు కావలసినంత చరిత్రసామగ్రియు బొందుపరుపఁబడియున్నవి. 500 పుటలు, ప్రశస్తముగు కాలికోబైండు వెల రు 1-14-0, చందాదారులకు రు 1-4-0.



# ఆంగ్లేయరాజ్యాంగనిర్మాణచరిత్ర

గ్రంథకర్త.

మద్రాసు గవర్నమెంటు తెలుగుట్రాంసులేటరుగా రగు

గోటేటి, కనకరాజు పంతులుగారు బి. ఎ. బి. ఎల్.

ఇంగ్లాండుదేశీయుల రాజ్యపరిపాలన, నాగరికతయు, విపులముగ నిందు వర్ణింపఁబడియున్నది. ప్రాచీనవృత్తాంతము, విదేశరాజులపరిపాలనము, స్వాతంత్ర్యనిర్ణయ మహాశాసనము, నిరంకుశ ప్రభుత్వముసకు పార్లమెంటు

నకు పోరాటము, ప్రజాప్రభుత్వము, అమెరికాయుద్ధము, శిల్పకళల ప్రాభవము, పార్లమెంటు సంస్కారము, విక్టోరియామహారాజ్ఞి, కాలనీలు, హిందూదేశము స్వరాజ్యము మొదలగు విషయములు గలిగి సుబోధకమై యున్నది. శైలి మృదుమధురముగను, వర్ణనలు మిగుల రసవంతముగను, కథానుక్రమణిక హృద్యముగను నుండి చరిత్రకథనము కావ్యములకంటె నుత్కృష్టముగ చేయఁబడినది. ఇందు 6 చిత్రపటములు 2 దేశపటములును గలవు. 300 పుటలు, ప్రశస్తమగు కాలికోబైండు వెల రు 1-4-0, చందాదారులకు వెల రు 0-12-0.

---

# ఆరోగ్యశాస్త్రము

గ్రంథకర్త.—డాక్టరు, భో, పట్టాభిసీతారామయ్యగారు,
బి. ఏ. యం. బి. సి. యం.

ఈ క్రిందిసూత్రములను గమనింపుడు !

(1) ఆరోగ్యమును గాపాడుటకు వ్యాధిచికిత్సకన్న వ్యాధి నివారణమే శ్రేష్ఠతరమగు పరమసాధనము.

(2) దేహము వ్యాధులకు లోనగుటకు రెండులోపము లుండవలెను.

(i) దేహదౌర్బల్యము.

(ii) వ్యాధికారణములగు సూక్ష్మజీవులను, విషకరపదార్థములను, స్వారోగ్యరక్షణ విధానమును, గృహారోగ్య నిర్మాణమును, జక్కగ గమనించిన దేహదార్ఢ్యమును నిలుపుకొనగలము.

(iii) సూక్ష్మజీవు లాహార జలవాయువులగుండ దేహములోనికి ప్రవేశించి సాంక్రామికవ్యాధుల నుత్పన్నము సేయును.

ఆరోగ్యశాస్త్రమున నీయంశములన్నియు చర్చింపఁబడినవి.

---

మేనేజరు:—ఆంధ్రభాషాభివర్ధనీసంఘము. (లిమిటెడ్), మచిలీపట్నం.

"వాయు వను" శీర్షిక క్రింద వాయువునందుండు కల్మషములును వాయువు ప్రచారమును దానివలని ప్రయోజనములును, వాయువును శోధించు విధమును, వివరింపబడినవి.

"జల మను" శీర్షిక క్రింద పానీయజలమునకు మూలాధారములును, వానితారతమ్యములును, జలమునందుండు రసాయన కల్మషములును, సూక్ష్మజీవులును, జలమును శుభ్రపఱచు పద్ధతులను, శోధించువిధానమును తెలియఁజేయబడినవి.

"ఆహార మను" శీర్షిక క్రింద ఆహారవిధానము ఆహారాంశములు, దేహమునకు వానివలని ప్రయోజనములు, వానియందుండు కల్మషములును, కల్మషములను నివారించు విధమును, ఆహారద్రవ్యములను శోధించు నిర్ణయమును విరళింపఁబడినవి.

"గృహము లను" శీర్షిక క్రింద గృహముల నెట్టిస్థలములయందును, నెవ్విధమునను నేయేసూత్రములను గమనించియుం గట్టవలెనో యవన్నియు వర్ణింపఁబడినవి.

మఱియు చెత్త మొదలగు వ్యర్థపదార్థముల నెట్లు పరిష్కరింపవలసినదియు సాంక్రామికవ్యాధులను అనఁగా మశూచి విశూచిజాడ్యములు తాపజ్వరము, బొబ్బతెగులు, వానికారణములు, వానిని నివారించు పద్ధతులును, అనుదిన మారోగ్యరక్షణమునకు మనము గమనింపవలసిన సూత్రములను ప్రజాసంఖ్య ప్రతిసంవత్సరము నెట్లు హెచ్చునదియు భీమాకంపెనీలే నియామకముల పై నాధారపడి యున్నదియు, ఇంకను దినదినము నాచరింపవలసిన యనేక ధర్మములును సులభశైలిని సవిస్తరముగ రచింపఁబడిన ఈగ్రంథము వెల రు. 1-4-0, చందాదారులకు రు. 0-10-0.



మేనేజరు:—ఆంధ్రభాషాభివర్ధనీసంఘము. (లిమిటెడ్), మచిలీపట్నం.

# అశోకచరిత్ర

ఇందు బౌద్ధధర్మవిజృంభణకాలమున హిందూదేశౌన్నత్యమును, అశోకుని రాజ్యవైభవమును, బౌద్ధధర్మవ్యాపకమును మిగుల రమణీయముగ నీగ్రంథమునందు వర్ణింపఁబడినవి. అనేకశాసనములును అక్కడక్కడ చక్కని పర్వములును, 8 చిత్రపటములును, 1 అశోకుని రాజ్యమును దెలుపు హిందూదేశపెద్దపటమును గలవు. ప్రశస్తమయిన క్యాలికోబైండు చేయఁబడినది. 380 పుటలు 1-4-0, చందాదారులకు 0-13-0

# పునర్ముద్రణమందున్న గ్రంథములు

(1) అగ్బరుచరిత్ర. (2) వివేకానందస్వామిజీవితము. (3) సిక్కుల చరిత్ర. (4) విద్యాసాగరునిచరిత్ర.

# ముద్రణమందున్న గ్రంథములు

(1) చీనాచరిత్ర. (2) పశుశాస్త్రము. (3) జ్యోతిషశాస్త్రము. (4) విద్యారణ్యులవారిచరిత్ర.

# ముద్రింపబడవలసిన గ్రంథములు

ఆంధ్రచరిత్ర, అమెరికాచరిత్ర, జపాన్‌చరిత్ర, మహారాష్ట్రచరిత్ర 2-వ భాగము, ఔరంగజీబుచరిత్ర మొదలగునవి.

**N. B.** మా శాశ్వతచందాదారులకు 100 పుటలు పోస్టేజిగాక రు. 0-4-0 చొప్పున నిచ్చుచుందుము. రు. 0-4-0 ప్రవేశకట్నము చెల్లింపవలయును. దరఖాస్తులు చేయువారు వివరముగ విలాసము వ్రాయవలయును. చందాదారులను చేర్చు యేజంట్లకు మంచికమీషన్ యీయఁబడును.

మేనేజరు,

ఆంధ్రభాషాభివర్ధనీసంఘము. (లిమిటెడ్),

మచిలీపట్నం.

# విజ్ఞానచంద్రికాగ్రంథమాల

చింతాద్రిపేట, మద్రాసు.

ఇందు

సంవత్సరమునకు నాలుగుచొప్పున

దేశచరిత్రములు. ప్రకృతిశాస్త్రములు.

చిత్రవిమయిక నవలలు. మహాపురుషుల జీవితములు.

ఇంగ్లీషు ఉద్గ్రంథముల భాషాంతరీకరణములు

ప్రచురింపఁబడును.

ప్రతిగ్రంథము ఆయాశాస్త్రమునందు ప్రవీణులగువారిచే వ్రాయబడును.
ప్రతిగ్రంథము చక్కని పెక్కుబొమ్మలచే నొప్పుచుండును.
ప్రతిగ్రంథము నునుపైన దళసరికాగితములపై ముద్రింపబడును.
ప్రతిగ్రంథము క్యాలికో బైండు చేయబడి సుందరముగా నుండును.
ప్రతిగ్రంథములోని వచనశైలి మృదుమధురమై ఒప్పుచుండును.
ఈగ్రంథములను విద్వాంసులు పత్రికాధిపతులు మెచ్చియున్నారు.
ఈగ్రంథములవంటి గ్రంథములు తెలుగుభాషలో నింతవరకుఁ బ్రచురింపబడలేదు.
ఈగ్రంథములు శాశ్వతపు చందాదారులపద్ధతిని అమ్మబడును.
శాశ్వతపు చందాదారులు మాపుస్తకముల నన్నిటిని కొనవలెను.
శాశ్వతపు చందాదారులు పోస్టేజి బైండింగుచార్జీ లియ్యనక్కరలేదు.
శాశ్వతపు చందాదారులు పుస్తకముల కరీదుక్రింద ముందేమియు నియ్యనక్కరలేదు. పుస్తకములు తయారుకాగానే వి. పి. గా పంపబడును.
శాశ్వతపు చందాదారులకు 100 పేజీలకు పోస్టేజితో 0-4-0 చొప్పున పుస్తకముల కరీదు ఏర్పరుపబడును. ఇతరులకు పోస్టేజిగాక అ. 0-6-0లు.
శాశ్వతపు చందాదారులు వెనుకటిగ్రంథములు కావలసినయెడల 0-4-0లు. అక్కరలేనియెడల 1-0-0 ప్రవేశరుసుముక్రింద చెల్లించవలెను.

చిరునామా:—ఆ. లక్ష్మీపతి, బి.ఏ., ఎం.బి. సి.ఎం.,
మేనేజరు.

ప్రచురింపఁబడిన గ్రంథములు.

# హిందూ మహాయుగము

ఇది హిందూదేశ కథాసంగ్రహముయొక్క మొదటిభాగము మనపూర్వుల రాజ్య విస్తారంబును, అప్రతిమశౌర్యంబును, అకలంక స్వదేశభక్తియు తెలిసికొనగోరువారీగ్రంథము తప్పక చదువవలయును. అత్యంతపురాతనకాలమునుండి మహమ్మదీయుల దండయాత్రవరకుగల చరిత్రమంతయు సవిస్తరముగా వర్ణింపఁబడినది. గ్రంథకర్త, కే. వి. లక్ష్మణరావు ఎం. ఎ. మాచందాదారులకు పోస్టేజితో 0-11-0 ఇతరులకు పోస్టేజిగాక రు. 1-0-0



# రాణీసంయుక్త

జగద్విఖ్యాతమై, నాలుగు నాటకరచనలకు మార్గదర్శకమై శైలియందును, వర్ణనలయందును, కథాచమత్కారమునందును నిరుపమానమై పండితుల చేతను పామరులచేతను పొగడ్తగన్న ఈ అద్భుత నవలనుగురించి ఎంతవ్రాసినను తనివిదీరదు. దీనింజదివి యిందలి సారస్యమును పాఠకులే గ్రహింతురుగాక ! చందాదారులకు పోస్టేజితో 0-9-0 ఇతరులకు పోస్టేజిగాక 0-12-0 గ్రంథకర్త వేలాల సుబ్బారావుగారు.



# విమలాదేవి

ఇది విచిత్రమైన క్రొత్తనవల. రంగుపటములు కలిగియున్నది. రాజసింహునియొక్కయు అతని భార్యయగు విమలాదేవియొక్కయు, శౌర్యము, ధైర్యము, మతాభిమానము మొదలయిన విందు జక్కగ ప్రదర్శింపబడినవి. ఇందిరా దుర్గాదాసులరాజభక్తి, దేశరక్తి, ధర్మాసక్తి, గోలకొండలోనియక్కన్న మాదన్న గారి వైభవమును, వైకుంఠయోగిచేసిన యద్భుతకృత్యములును మిగుల

మేనేజరు:—విజ్ఞానచంద్రిక, చింతాద్రిపేట, మదరాసు.

రమణీయముగ వర్ణింపబడినవి. కథాసందర్భము (Plot) అత్యద్భుతము. వర్ణనలు అశ్రుతపూర్వములు. మా చందాదారులకు 0-13-0 ఇతరులకు 1-2-0 గ్రంథకర్త బాలకవి, భోగరాజు నారాయణమూర్తిగారు.



# కలరా

వాంతిభేది, విషూచి, గత్తర యని మనవారలు బిలుచు జాడ్యమునుగూర్చి యిందు సమగ్రముగ వ్రాయబడినది. చందాదారులకు 0-4-0 లు ఇతరులకు 0-6-0 గ్రంథకర్త వైద్యవిశారదులగు ఆ. లక్ష్మీపతి. బి. ఏ. ఎం. బి. సి. ఎం. గారు.



# ప్రకృతిశాస్త్రముల ప్రథమపాఠములు

ఇందు జంతుశాస్త్రము, వృక్షశాస్త్రము, శారీరశాస్త్రములను గురించిన కొద్ది యంశములు బాలురకు స్త్రీలకు తెలియునటుల వ్రాయబడినవి. చందాదారులకు 1-2-0 లు ఇతరులకు 1-10-0 లు గ్రంథకర్త శ్రీ. సీతారామయ్య బి. ఏ. ఎల్. టీ. గారు.



# భౌతికశాస్త్రము

400 పుటలు. 200 పటములు.

దీని నింగ్లీషులో ఫిజియాగ్రఫీ (Physiography) అందురు. ఇందు పదార్థవిజ్ఞాన, రసాయన, భూగర్భ, భౌతికభూగోళ, ఖగోళశాస్త్రములకు

గల పరస్పరసంబంధమును, ముఖ్యముగాభూమికిని, సృష్టియందలియితరపదార్థములకుగల సంబంధములును విపులముగను, విచిత్రముగను వర్ణింపఁబడినవి. ఇది శ్రీయుత మైనంపాటి నరసింహం బి. ఏ. ఎల్. టీ. గారిచే నెంతయు పరిశ్రమపూర్వకముగా వ్రాయబడినది. మాచందాదారులకు పోస్టేజితో రు. 1-0-0 ఇతరులకు పోస్టేజిగాక రు. 1-8-0



పునర్ముద్రణమగుచున్న గ్రంథములు.

ఆబ్రహాములింకను, జీవశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము.



# మహమ్మదీయ మహాయుగము

రెండవకూర్పు. (Mahammadan Period) క్యాలికోబైండు.

ఇందు ఆఱుప్రకరణములుగలవు:—1 ముసల్మానులయుత్పత్తి; వారిదేశమునకు వచ్చుట. 2 ఆఫ్ఘాన్ రాజులు. 3 మొగల్ ప్రభుత్వము. 4 దక్షిణములోని మహమ్మదీయరాజ్యములు. 5 రాజపుత్రులశౌర్యాగ్ని. 6 విజయనగర సామ్రాజ్యము.

కొందరు తలచినట్లు హిందూదేశము మహమ్మదీయులకు సులభముగా వశముకాలేదనియు, హిందువులు అభిమన్యునివలెనే యపరిమితపరాక్రమమును జూపి మోసమునకును, స్వామి ద్రోహమునకు లోనై యోడిపోయి రనియు నీగ్రంథమునందు సప్రమాణముగా జూపబడినది.

ఇందు శ్రీకృష్ణదేవరాయలు, పృథ్వీరాజు, రాణాప్రతాప్, అక్బరు మానసింగ్, నానక్ మొదలయిన మహాత్ములదివ్యమైన పటములు కలవు.

శ్రీయుత కె. వి. లక్ష్మణరావు. ఎం. ఏ. గారిచే రచింపబడినది.

చందాదారులకు పోస్టేజితో 1-8-0. ఇతరులకు పోస్టేజికాక. 1-12-0



మేనేజరు:—విజ్ఞానచంద్రిక, చింతాద్రిపేట, మదరాసు.

# ఆంధ్రుల చరిత్రము

ఇది ప్రథమభాగము. పౌరుషమునందును పాండిత్యాతిశయంబునందును, రాజ్యవిస్తారంబునందును పూర్వపు ఆంధ్రులు హిందూదేశములోని యితరదేశములవారికి దీసిపోవువారు కారని యీగ్రంథము సప్రమాణముగా సిద్ధాంతీకరించుచున్నది! ఇప్పటి యాంధ్రులవలెనే మన పూర్వపు టాంధ్రులుగూడ కూపమండూకములు యనుకొంటిరా? ఆంధ్రు లొకప్పుడు మగధసామ్రాజ్యమును, ఇంకొకప్పుడు మహారాష్ట్రమును, మఱియొకప్పుడు యవద్వీపమును, వేఱొకప్పుడు పాండ్యచోళదేశంబులనుజయించి రని మీరు కలనైన నెఱుంగుదురా? ఎఱుంగనియెడల ఈగ్రంథముం జదువుడు.

శ్రీయుత చిలుకూరి-వీరభద్రరావుగారిచే రచింపబడినది.

చందాదారులకు పోస్టేజితో 1-0-0

ఇతరులకు పోస్టేజితో 1-4-0

—oo✕oo—

# రసాయనశాస్త్రము

రెండవకూర్పు. (Chemistry) క్యాలికో బైండు.

**320 పుటలు-75 పటములు.**

మనపూర్వులు బంగారము చేయవలయునన్న కోరికచే ఈశాస్త్రమును అభ్యసించిరి. ఇప్పుడు ఇంగ్లీషువారు ఈశాస్త్రమును అభ్యసించి కోట్లకొలది ధనము సంపాదించుచున్నారు. ఇట్టిఘనమైనవిద్య మనవాండ్రకు తెలియకుట్టకు

ఈగ్రంథము చక్కనివచనశైలిని వ్రాయబడినది. జనులు లక్షాధీశులై దేశము ధనసంపన్నతతో తులతూగుటకు ఇట్టి పుస్తకములే యాధారములు. ఈ గ్రంథమునందు హిందూరసాయనశాస్త్రము (Hindu Chemistry.) యొక్క చరిత్రకూడ రసవంతముగ వ్రాయఁబడినది.

శ్రీయుత వేమూరి విశ్వనాథశర్మ ఎం. ఎ. గారిచే రచియింప బడినది.

చందాదారులకు పోస్టేజితో 0-13-0

ఇతరులకు పోస్టేజికాక 1-4-0



రావుబహదూరు కం. వీరేశలింగముగారి

# స్వీయచరిత్రము

ఇంగ్లీషుభాషలోమహనీయులస్వీయచరిత్రలు (Auto Biographies) పెక్కులున్నను తెలుఁగులో నేటివరకు నొక్కటియు లేకపోవుట గొప్ప లోపమనియుఁ దానినెట్లు తొలఁగింపనగుననియు మేము చింతించుచుండఁగా రావు బహద్దరు కందుకూరి-వీరేశలింగము పంతులుగారు తమస్వీయచరిత్రమును ప్రకటించు గౌరవము మాకుఁ గలుగఁజేసిరి. గద్యతిక్కనయైన ఈమహనీయునిగుఱించిగాని వారిగ్రంథములనుగుఱించిగాని మే మధికముగా వ్రాయుట కాగడాతో సూర్యునిఁ జూపించుటయే !

గర్వముగాని స్వాతిశయ భావముగాని యెంతమాత్రమును లేక,యున్నదియున్నట్లు యథార్థచరిత్రము ఇందుఁ జక్కనిభాషలో వ్రాయబడినది. ఈ చరిత్రముఁజూచి పంతులవారి విరోధులుగూడ తలయూచెదరని మానమ్మిక. మహనీయులపటము లనేకములుగలవు. నిజమైనచరిత్రయని అందరు మెచ్చుకొనియున్నారు. చందాదారులకు రూ 1-0-0 యితరులకు 1-8-0



మేనేజరు:—విజ్ఞానచంద్రిక, చింతాద్రిపేట, మదరాసు.

# తయారగుచున్న గ్రంథములు

గ్రంథము. కర్త.

౧. చంద్రగుప్తచక్రవర్తి,
శ్రీపరమహంస విద్యానందస్వామిగారు, బి. ఏ.

౨. ఆంధ్రులచరిత్రము, (౨-వ భాగము.)
చిలుకూరి - వీరభద్రరావుపంతులుగారు.

3. వ్యవసాయశాస్త్రము,
గోటేటి - జోగిరాజుపంతులుగారు.

౪. అర్థశాస్త్రము, (Political Economy)
సి. రామలింగారెడ్డి, ఎం. ఏ. గారు.

౫. మహారాష్ట్రవిజృంభణము,
కే. వి. లక్ష్మణరావుగారు, ఎం. ఏ.

౬. సద్వర్తనము, (Charctera)
కే. వి. లక్ష్మణరావు గారు, ఎం. ఏ.

౭. కళింగదేశచరిత్రము,
గురుజాడ. అప్పారావుగారు, బి. ఏ. బి. ఎల్.

౮. గ్లాడుస్టను జీవితము,
అ. కాశీశ్వరరావుగారు, బి. ఏ. బి. ఎల్.

౯. జంతుశాస్త్రము, (Zoology)
ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎమ్.

---

మేనేజరు:—విజ్ఞానచంద్రిక, చింతాద్రిపేట, మదరాసు.

# సా వి త్రి

ఇది హిందూదేశ స్త్రీలకు మహోపయోగమగునట్లుగా కాకినాడయందు శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబగారిచేఁ బ్రకటింపఁబడుచున్న మాసపత్త్రిక. ఇందు దేశాభివృద్ధికొఱకుఁ బాటువడు విద్యావంతులజీవితములు పటములు, పాతివ్రత్యము, సతీధర్మములు, గృహనిర్వాహకత్వము, శిశుపోషణము, చరిత్రాత్మకమైన స్త్రీలజీవితములు, పద్యగ్రంథములు, ప్రహసనములు, ఉపన్యాసములు, పాటలు మున్నగు పలువిషయము లిందుఁ బ్రచురింపఁబడుచుండును. విద్యాధికులగు స్త్రీలు, పురుషులుఁగూడ నీపత్త్రిక కుపవిలేఖరులుగ నున్నారు. విద్యనేర్చుకొనుచున్న చిన్నబాలికలకును, విద్యావతులగు స్త్రీలకును తక్కినయెల్లరకు నుపయోగించువిషయము లిందనేకములుండును. దీనిని ప్రతివారు చదువగోరి స్వల్పమగుచందా యేర్పరుపఁబడినది.

సంవత్సరమునకు పోస్టుఖర్చులతో రు 1-0-0 మాత్రమే.



# మా న వ సే వ

## మతసంఘపరిశ్రమ భాషావిషయములఁ

## జర్చించు సచిత్రమాసపత్రిక.

### రాజమహేంద్రవరము.

పత్రికాసంపాదకులు.—కందుల శ్రీమన్నారాయణ, నాళము కృష్ణారావు.

భూమండలమున మన భరతఖండము తక్క తక్కిన దేశములెల్ల నాగరికాగ్రగణ్యములై సమస్తసౌఖ్యములతోఁ దులతూగుచు భూలోకస్వర్గము లోయన భాసిల్లుచున్నవి. నిన్నమొన్నటివఱకును గన్నులుదెఱువని విదేశీయులు తమ గాఢనిద్రనుండి మేల్కాంచి యెక్కపెట్టిన మహోన్నతదశ నందుచున్నారు.

అనేక శతాబ్దములకు బూర్వమే లోకపూజ్యులగు మహార్షులచేతను, జగద్విఖ్యాతయశులగు చక్రవర్తులచేతను, దేశభక్తులగు ప్రజలచేతను ప్రకాశించుచు సకలలోకగురుపీఠము నధిష్ఠించిన మన భరతవర్షము నేడు కళాహీనమై యధఃపతిత మగుచున్నది.

అశేషశేముషీధురంధరులగు దేశబంధు లహోరాత్రములు శ్రమపడి సముపార్జించిన జ్యోతిశ్శాస్త్రము గగనకుసుమమైనది. చరకశుశ్రుతాది వైద్యశాస్త్రములు మందున కైన గానరాకున్నవి. విమానములు దివ్యులజేరినవి. భారతసామ్రాజ్యము పూజ్యమైనది. శిల్పములు స్వల్పములైనవి. చేపనులు చేజారిపోయినవి.

అజ్ఞానవ్యాధిగ్రస్తమై ప్రాణమాత్రావశిష్టమైయున్న మనదేశదేహమును సమయసముచితోపాయ సిద్ధౌషధసేవనంబున నారోగ్యభాగ్యయుక్తముగ జేయక కతిపయకాలము పేక్షించితిమేని యపాయము సంభవించును. కావున మన యార్యసన్మతమును సముద్ధరింపవలయును. మన యాచారముల సంస్కరించుకొనవలయును. ప్రకృతిశాస్త్రముల బలపరచుకొనవలయును. సారస్వతము నుజ్జీవింపజేయవలయును.

ఇవ్విధమున మానవసేవ సేయవలయుననియె యీ 'మానవసేవ'ను నెలకొల్పినారము. మానవసేవయే దేశసేవయు, దేశసేవయే యీశ్వరసేవయు గావున దీనిం జేపట్టి మీపట్టివలెఁ బోషించుభారము మీపయిం బెట్టినారము.

64 పుటలు గలిగి చిత్రపటశోభితమై విలసిల్లు నీపత్రిక సర్వజనసులభముగ నుండునట్లు సంవత్సరమునకు రు 3 లు మాత్రమె చందా నేర్పరచినారము. అభిమానులకు రు 5 లు పోషకులకు రు 10 లు రాజపోషకులయాదరము వారియనుగ్రహాధీనము.

# స్వధర్మ ప్రకాశిని

ఈ పత్రిక ప్రతిమాసము శుద్ధనవమియందు ప్రకటింపబడుచుండును. ఇందు ప్రధానముగ మతవిషయములును, భాషావిషయికములగు సంస్కృత న్యాయములును, సుభాషితములును, సంస్కృతకవుల చరిత్రలును మొదలగునవి ప్రకటింపబడుచుండును. చందా సంవత్సరమునకు రు 1-8-0

మేనేజరు "స్వధర్మప్రకాశిని"
6. సుంకువారి అగ్రహారం, S. C. మదరాసు.



ప్రతులు తక్కువ. త్వరపడుడు.

# శ్రీ కలాభిలాషక కావ్యమాలిక

ఇందు, భాషాభివృద్ధికి సాధనములగు కావ్యనాటకాదులు, నిఘంటు వ్యాకరణాదులు, శాస్త్రిచరిత్రాదులు ప్రకటితములగును.

ఇందలి పుస్తకములన్నియుం గొననొప్పుకొనువారు శాశ్వతపుచందాదారులు. పుస్తకములు పంపినపుడు వెలయిచ్చి పుచ్చుకొనుటయేకాని, ముందే చందా యియ్యనక్కఱలేదు. ప్రవేశపురుసుము రు 0-4-0 ఇది దరఖాస్తుతో పంపవలెను.

క్రౌనుసైజుగ్రంథములు అంచెకూలిగాక ౧౦౦ పుటలకు 0-4-0 చొప్పునను డెమ్మిసైజువి ౧౦౦ పుటలకు 0-6-0 చొప్పునను చందాదారులకిచ్చెదము.

రు ౧౦౦ లకు తక్కువకాని ధనసాహాయ్యముచేయువారు నిత్యపోషకులు. రు ౨౫ లకు తక్కువకాని ధనసాహాయ్యముచేయువారు నిత్యసహాయకులు. వారికి మాకావ్యమాలికా పుస్తకములన్నియు నిచ్చుచు వారిపేరు ప్రతిపుస్తకమందును ప్రచురపఱుతుము.

## బ హు మా న ము లు.

౧౫ గురు చందాదారులను చేర్చువారికి మాకావ్యమాలికాపుస్తకము లన్నియును, ౪ గురిని చేర్చినవారికి కోరినపుస్తక మొకటియును బహుమానముగా ఇచ్చెదము.

## అ చ్చు ప డి న పు స్త క ము లు.

| అంచెకూలిగాక. | పైవారికి. | చందాదారులకు. |
|---|---|---|
| తెలుఁగుసంధ్యావందనము. | 0-2-0 | 0-1-6 |
| మానవవిధి, (సంవాదము). | 0-0-6 | 0-0-3 |
| కన్యకాంబికావిజయము, (నాటకము.) | 0-8-0 | 0-6-0 |
| బిల్హణీయము, (నాటకము.) | 0-8-0 | 0-6-0 |
| పారిజాతాపహరణము, (నాటకము.) | 0-8-0 | 0-6-0 |

విశాఖపట్టణము 1911 సం.

మారేపల్లి. రామచంద్రశాస్త్రి.
శ్రీకళాభిలాషకసమాజాధిపతి.



# ఆంధ్ర ప్రచారిణీ గ్రంథనిలయము.

తణుకు, కృష్ణాజిల్లా.

ఆనరరీసంపాదకుఁడు.

అయ్యగారినారాయణమూర్తిగారు బి. ఎ. బి. ఎల్,

ఆనరరీప్రెసిడెంటు

కొవ్వూరిచంద్రారెడ్డిగారు

ఆంధ్రమహాజనులారా!

ఈనిలయమునుండి భాషాభివృద్ధికరంబులును, చరిత్రబోధకములునగు నవలలు రెండుమాసముల కొకటిచొప్పున వెలువడుచుండును. అప్పుడప్పుడు

చరిత్రములుకూడఁ బ్రకటింపఁబడుచుండును. ఇందు శాశ్వతచందాదారులుగాఁ జేరువారికి డెమ్మీ సైజు 100 పుటలుగల గ్రంథము పోస్టేజిసహా రు 0-6-0 లకు మాత్రమే మంచిబైండుతోఁ బంపఁబడుచుండును. ఇతరులకు పోస్టేజిగాక రు 0-8-0 ల కీయఁబడును. ఇందు శాశ్వతచందాదారులుగాఁ జేరువారు ప్రవేశ కట్నముక్రింద రు 0-2-0 లు పంపుచు నీక్రింది దరఖాస్తుఫారమును పూర్తిచేసి గాని, వేరేజాబు వ్రాసి గాని నిలయమునకుఁ బంపవలయును. ఇందు ప్రప్రథమమున బంకించంద్రచటోపాధ్యాయ విరచితమగు దుర్గేశనందినియను 240-పేజీలుగల నవల వెలువడినది. ఇది యిదివఱ కాఱుభాషలలోనికి పరివర్తన మగుటవలననే దీనిప్రాశస్త్యము వెల్లడియగుచున్నది. శాశ్వతచందాదారులకు రు 0-12-0 ఇతరులకు రు 1-0-0

మా ద్వితీయగ్రంథము 10 రోజులలో వెలువడును. మా ప్రకటనములో రెండవగ్రంథము వసుమతీవసంతము. (మహారాష్ట్రరాజ్యస్థాపనము) అను నవల జూన్ నెలలో వెలువడును. జూలై నెలాఖరులలోగా చందాదారులగు వారికి బంకించంద్రుని యుగళాంగుళీయకము అను నవల బహుమానముగ నిచ్చెదము.

మనోహరకథాకల్పితములగు నవలలు నీతిదాయకంబులును భాషాభివృద్ధికరంబులు నగుటచేఁ జదువరులను భాషాభిరుచిగల్గించి శాస్త్రిపురాణాది గ్రంథములంజదివి తెలియఁదగినజ్ఞానాభివృద్ధినిగల్గించుటకు కారణములై యుండునను నుద్దేశముతో మే మీయుద్యమమునకుఁ బూనుకొంటిమి.

భాషాభిమానులగు నాంధ్రమహాజనులందఱును మాకుఁ దగినప్రోత్సాహమొసంగి యీనిలయము నుద్ధరించెదరు గాక!

# ఆంధ్రప్రచారిణీ కార్యస్థానమున వెలకుదొరకు గ్రంథములు.

| నాటకములు.— | రు. | అ. | పై. |
|---|---|---|---|
| సతీసంయుక్త | 0 | 14 | 0 |
| శ్రీయాచశూరేంద్రవిజయము | 0 | 10 | 0 |
| ధనాభిరామము | 0 | 8 | 0 |
| తారాశశాంకవిజయము | 0 | 10 | 0 |
| సువర్ణమాల | 0 | 8 | 0 |
| నావల్సు.— | | | |
| సురస | 0 | 8 | 0 |
| రాధారాణి | 0 | 4 | 0 |
| చిత్రకథాసుధాలహరి (పద్యములో) | 0 | 6 | 0 |
| రుక్మిణీపరిణయము | 0 | 6 | 0 |
| చంద్రసేనవిజయము | 0 | 2 | 0 |
| స్త్రీవ్రతకథలు ప్రథమభాగము | 0 | 6 | 0 |
| స్త్రీవ్రతకథలు ద్వితీయభాగము | 0 | 6 | 0 |

వలయువారు సెక్రెటెరీ,

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.

తెనాలి, కృష్ణాజిల్లా.

(అని వ్రాయుఁడు.)

శ్రీః

# శ్రీమదాంధ్ర వచన భాగవతము.

బ్రహ్మశ్రీ,
శతఘంటము. వేంకటరంగశాస్త్రిగారిచే

విరచితము.

సంస్కృత శ్రీమద్భాగవతమునకు సరిగా సలక్షణమైన తెనుఁగుభాషను వచనముగా రచియింపఁబడిన యీగ్రంథమును మేము ముద్రించి ప్రచురించుచున్నాము.

ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థస్కంధములసంపుటము.
వెల పోస్టేజిగాక రూ. 0-2-0

పంచమషష్ఠసప్తమాష్టమనవమస్కంధములసంపుటము.
వెల పోస్టేజిగాక రూ. 0-2-0

దశమైకాదశద్వాదశస్కంధములసంపుటము
వెల పోస్టేజిగాక రూ. 2-0-0

గ్రంథము మొత్తమునకు పోస్టేజిగాక రూ. 0-6-0

ప్రతులు త్వరలో చెల్లుచున్నవి గనుక వలయువారు త్వరలో వ్రాయవలయును.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
323. తండియార్పేట,
192. ఎస్ప్లనేడ్, } చెన్నపురి.

బ్రాంచీ:—రాజమండ్రి.

## ఈ క్రిందిగ్రంథములు చక్కఁగా మంచికాగితముమీఁద అచ్చొత్తింపఁబడియున్నవి.

### సంస్కృతగ్రంథములు.

| | | |
|---|---|---|
| బాలరామాయణము, సటీక | 0 | 2 |
| సుందరకాండము, మూలము | 0 | 12 |
| డిటో ఆంధ్రతాత్పర్యము | 1 | 4 |
| భగవద్గీతలు, టీకాతాత్పర్యసహితము, నూతనముద్రితము | 1 | 8 |
| భగవద్గీతలు, మూలము | 0 | 4 |
| డిటో ఆంధ్రతాత్పర్యసహితము | 1 | 0 |
| అధ్యాత్మరామాయణమూలము | 0 | 12 |
| ఉత్తరగీత, సటీక | 0 | 6 |
| కాలామృతము, సటీక | 0 | 12 |
| ముహూర్తదర్పణము, సటీక | 0 | 8 |
| నక్షత్రచూడామణి | 0 | 4 |
| అమరము, సటీక | 0 | 14 |
| డిటో మూలము, చక్కనిప్రతి | 0 | 6 |
| విష్ణుసహస్రనామము వగైరా | 0 | 6 |
| లలితాసహస్రనామము వగైరా | 0 | 8 |
| రామసహస్రనామస్తోత్రము, నామావళీసహితము | 0 | 4 |
| లక్ష్మీసహస్రనామస్తోత్రము, నామావళీసహితము | 0 | 3 |
| శివసహస్రనామస్తోత్రము, నామావళీసహితము | 0 | 3 |
| ఆంజనేయసహస్రనామస్తోత్రము, నామావళీసహితము | 0 | 3 |
| సూర్యనమస్కారము | 0 | 1 |
| దేవతార్చన, చిన్నసైజు | 0 | 1 |
| రుద్రంవగైరాలు | 0 | 2 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధము | 0 | 4 |
| దేవీస్తోత్రకదంబము, చిన్నసైజు | 0 | 4 |
| పరమేశ్వరస్తోత్రకదంబము | 0 | 6 |
| దేవీమానసికపూజ, చిన్నసైజు | 0 | 1 |
| దేవీసప్తశతి | 0 | 5 |
| నీతిశాస్త్రము, సటీక, చిన్నసైజు | 0 | 2 |
| సంధ్యావందనము, సటీక | 0 | 4 |
| ఋగ్వేదాహ్నికము, సటీక | 0 | 2 |
| నానార్థరత్నమాల, సటీక | 0 | 12 |
| ప్రతిపదాంధ్ర టీకాతాత్పర్యసహిత సుందరకాండము | 8 | 0 |
| మణిత్రయి, సటీక | 0 | 6 |
| మహాన్యాసము, చిన్నసైజు | 0 | 5 |
| ఆత్మబోధము, సటీక | 0 | 4 |
| హరిమీడేస్తోత్రము, సటీక | 0 | 3 |
| పుష్పబాణవిలాసము, సవ్యాఖ్యానము | 0 | 2 |
| రామకర్ణామృతము, ఆంధ్రపద్యతాత్పర్యసహితము | 1 | 4 |
| భర్తృహరి | 0 | 12 |

### ఆంధ్రగ్రంథములు.

| | | |
|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, | | |
| మొదటివాల్యము | 2 | 0 |
| రెండవవాల్యము | 2 | 0 |
| మూడవవాల్యము | 2 | 0 |
| భాస్కరరామాయణము | 2 | 8 |
| రంగనాథరామాయణము | 2 | 8 |
| ఆముక్తమాల్యద, సటీక | 2 | 8 |

| | | |
|---|---|---|
| వసుచరిత్రము, క్రొత్తకూర్పు | 2 | 8 |
| అప్పకవీయము, చక్కనికూర్పు | 1 | 6 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక | 0 | 6 |
| ఆంధ్రభాషాభూషణము | 0 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికా సహితము, కాలికోబైండు | 0 | 12 |
| సులక్షణసారము, సటీక | 0 | 8 |
| పారిజాతాపహరణము | 0 | 4 |
| హంసవింశతి, (పద్యము) | 0 | 10 |
| శృంగారనైషధము | 0 | 10 |
| నరసభూపాలీయము | 0 | 8 |
| రంగారాయచరిత్రము | 0 | 8 |
| విజయవిలాసము | 0 | 4 |
| రసికజనమనోభిరామము | 0 | 8 |
| నీలాసుందరీపరిణయము | 0 | 4 |
| వేమనపద్యములు, చక్కనిప్రతి | 0 | 4 |
| డిటో బ్రౌనుదొర ఇంగ్లీషుతో | 1 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంక రాఘవపాండవీయము, సటీక | 1 | 8 |
| కళాపూర్ణోదయము, | 1 | 8 |
| శ్రీకాళహస్తీశ్వరశతకము, ధూర్జటికవిది | 0 | 2 |
| సుమతిశతకము, సటీక | 0 | 2 |
| చంద్రశేఖరశతకము | 0 | 1 |
| కలువాయిశతకము | 0 | 2 |
| భాస్కరశతకము, సటీక | 0 | 3 |
| మాతృశతకము | 0 | 1 |
| మదాలస, నవల | 0 | 10 |
| పంచతంత్రము, వచనము | 0 | 6 |
| సుజనరంజని, నవల | 0 | 6 |
| ఆనందమఠ, నవల | 0 | 12 |
| కాంగ్రెస్సు ఉపన్యాసములు | 0 | 1 |
| రామకృష్ణ పరమహంసచరిత్ర | 0 | 2 |
| వివేకానందస్వామి గారిజీవితము | 0 | 1 |
| శ్రీబాలగంగాధరతిలక్కుచరిత్ర | 0 | 2 |
| దాదాభాయినౌరోజీచరిత్ర | 0 | 1 |
| ఆనిబిసెంటుచరిత్ర, ప్రతిమతో | 0 | 1 |
| శంకరాచార్యచరిత్ర, ప్రతిమతో | 0 | 2 |
| ఐవన్హో, అద్భుతమైన నవల | 0 | 6 |
| భోగినీదండకము | 0 | 1 |
| రామలింగేశశతకము | 0 | 2 |
| మానసబోధశతకము, తాత్పర్యము | 0 | 2 |
| రామాభ్యుదయము | 1 | 4 |

ఇవి మొదలగు సంస్కృతాంధ్రగ్రంథములు అనేకములు మాయొద్ద నున్నవి. క్యాటలాగులు కోరినవారికి పంపుదుము.

మాముద్రాక్షరశాలయం దితరుల అచ్చుపనులు చక్కగ చేయఁబడును.

ఇంగ్లీషు జాబుపనులు వగైరాలు చాలా అందముగ చేసియివ్వగలము.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

328. తండియారుపేట,<br>
192. ఎస్ప్లనేడ్, } చెన్నపురి.

బ్రాంచీ:— రాజమండ్రి.